# భారతి

## సచిత్ర మాస పత్రిక




అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య



సంపుటము ౯. భా. ౨.

ఆంధ్రపత్రికా ముద్రాలయము-మద్రాసు.

౧౯౩౨

# భారతి — నవమ సంపుటము — భా. ౨.

## వ్యాసముల అకారాది సూచి

ప

# భారతి—నవమ సంపుటము—భా. ౨.

## వ్యాసకర్తల అకారాది సూచి

# భారతి – నవమ సంపుటము – భా. ౨.

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి

సం.


విషయసూచిక

# చిత్రములు



---



పెండ్లి మెరవడి

బ్లాకులు చేసినవారు: శ్రీ దొంతంశెట్టి పాసారావుగారు, ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి. చిత్రకారుడు: శ్రీ పొట్లూరి హనుమంతరావుగారు, వినుకొండ.




చెన్నపట్టణము, జూలై ౧౯౩౨

సంపుటము ౯ ఆంగీరస సంవత్సరము, ఆషాఢమాసము సంఖ్య ౭

## క్రీస్తు

జి. జాషువ కవిగారు

నినువెన్నాడి, నభంబునం దమలకాంతిన్ జిమ్ము నక్షత్రమున్
గని రాజన్యులు తల్లడిల్ల, మరియా గర్భంబునం బుట్టి, బొ
ట్టనఁ ద్రేవ్ లేకుచు బేతలేముపురిఁ గోష్ఠంబందుఁ బన్నుండు, చ
క్కని బాలా, యెవరయ్య నీవు? పరలోకం బింపున ర్తించెదేన్.

తొలి, నీదర్శన మిచ్చి గొల్లలకు, చేతోమోదమున్ గూర్చి, జ్ఞా
నుల రావించి, పసిండికానుకల సందోహంబు చేసంది, యె
ద్దులకొట్టంబునఁ దొట్టిలో నొకదరిద్రుంబోలి నిద్రించు, ము
ద్దులబిడ్డా, యెవరయ్య నీవు? మొరసెన్ ద్యోవీథిఁ దూర్యధ్వనుల్.

పరమంబైన విశుద్ధవర్తన మదంభ ప్రేమయున్ దాల్మియున్
మరియాకన్యకుఁ జెట్టిపాపఁడు బలెన్ జన్మించె నంచున్, బహూ

త్కార మన్యోన్యము ముచ్చటించుకొనుచందం బొప్ప 'సంభా' యటం
చఱచెం బుచ్ఛము లూఁచి, నీకెలఁకులం దాలాన (?) సంబద్ధమై.

ఒక చెంపగొట్ట వేరొక చెంపఁ జూపించి పరమశాంతము స్పష్టపరచునాఁడు
పరుల నిన్నుంబోలి భావించి మన్నించి ప్రేమపుష్పము సమర్పించునాఁడు
పేదసుంకరియింట విందులో భుజియించి సమదృష్టిమహిమంబు చాటునాఁడు
శుభ్రాంశుకమున శిష్యులపాదముల నద్ది నమ్రభావము నుర్వి నాటునాఁడు
నీవు నిలిచిన పున్నెంపు నేలమీఁద-చిరునగవుమీఱ మొలిచిన గఱికపోఁచ,
యెండిపోలేదు నేఁడు; శ్రీయేసునాథ!-వచ్చిపోవయ్య మాయింటివఱకు నేఁడు.

ఏ దేశంబున నీసుబోధనలు వాహిన్యాకృతిందాల్చి, నా
నా దేశంబుల విస్తరించి, భవకాండజ్వాల చల్లార్చెనో!
ఆ దేశంబె త్వదీయరక్తనదులం దాప్లావముంజేసె, నిం
దేదో, వేదరహస్య మున్నయది తండ్రీ! క్రీస్తు, మృత్యుంజయా!

కలుషం బల్లెపుఁబోటు నీయెడమప్రక్కన్ దాకఁ, గ్రొన్నెత్తురుల్
గురిసెన్ గుండెలనుండి, నీ వపు "డనుంగుందండ్రి! నీబిడ్డలన్
కరుణింపన్ దగు"నంచుఁ బల్కిన యనూనంబైన నీయోర్మికిన్
ధరణీధ్రంబులు బద్ధలై కరఁగలేదా? ప్రొద్దు చల్లారదా?

'సాలొమోను' గుడికుడ్యములఁ బ్రతిధ్వనియించు భవదీయబాల్యవిద్వజ్జయంబు
'గాలలీ'యసముద్ర కల్లోలశక్తిని గద్దించు నీ యధికారరేఖ
శవకదంబములకు జవసత్వముల నిచ్చి బ్రదికించు నీదివ్య వాఙ్మహత్తు
జలరాశిమీఁద స్వేచ్ఛావిహార మొనర్చి యలరు నీ పాదచిహ్నముల వరుస
చెప్పి చూపించి మా 'పలస్తీను'భూమి-పొంగిపోవుచునున్న దిప్పుడునుగూడ
ప్రేమతత్త్వంబు రూపించి విశ్వములను-కౌఁగిలించిన నిన్ను నేఁ గౌఁగిలింతు.

# గ్రంథరచన

మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు (కవితాసమితి)

ప్రపంచము పుట్టి ఎంతోకాలమైనది. ఎన్నో యుగములు కడచినవి. ఎన్నో రాజ్యములును సామ్రాజ్యములును వెలసినవి; అడుగంటిపోయినవి. ఎందఱో జ్ఞానులును, భక్తులును, శాస్త్రజ్ఞులును, మహాయోధులును, దేశాభిమానులును, పరోపకారపరాయణులును బయలుదేఱి, తమ తెలివితేటలచేతను, మంచి పనులచేతను లోకమును బాగుచేయ ప్రయత్నించి, కొంతవఱకు బాగుచేసినారు; గతించినారు. తరువాత, ఎన్నో క్రొత్తరాజ్యములును, సామ్రాజ్యములును తలలెత్తి, ఇప్పుడు వెలయుచున్నవి. ప్రాతవియు కొన్ని మరల పైకి లేచుచున్నవి. లోకోపకారకములగు సత్ప్రయత్నములు అనేకములు జరుగుచున్నవి.

అయిన, పూర్వుల అనుభవముగాని— ఇప్పటివారి అనుభవముగాని, పూర్వుల బుద్ధివిశేషఫలములుగాని— ఇప్పటివారి బుద్ధివిశేషఫలములుగాని మనకు తెలియుట ఎట్లు? ఎంతకాలమో శ్రమపడి సమకూర్చిన జ్ఞానధనము మనకు ఒక్కసారియే అబ్బుట ఎట్లు? ఇప్పుడున్న పండితులవల్లనే స్వయముగా జ్ఞానము గడింప వీలు సరిగా లేకున్నప్పుడు గతించిన పూర్వుల జ్ఞానము వారివల్లనే సంపాదించుకొనుటకు అసలే వీలులేదుకదా! ఇక, సాధనాంతరములు ఏమైన ఉన్నవా? లేవా? దైవానుగ్రహమున లేకపోలేదు; ఉన్నవి. అవి బుద్ధిమంతులగు పూర్వులే కనిపెట్టినారు. వారు తమ జ్ఞానము తమతోడను— తమతోడివారితోడను నశించిపోక స్థిరముగా ఉండునట్లు చేయుటకై వ్రాత కనిపెట్టినారు. ఆ వ్రాతరూపమున తమ జ్ఞానము తమకాలపువారి మేలుకొఱకును— తరువాతవారి మేలుకొఱకును నిలుచునట్లు చేసినారు. తరువాత బుద్ధిమంతులుకూడ అటులే చేయ మొదలుపెట్టినారు; చేయుచున్నారు. వ్రాతరూపమున వెలయుచున్న జ్ఞానపుగనులే గ్రంథములు; అక్షరాత్మకములగు ఈ గ్రంథములే నిజముగా అక్షరములయి లోకజ్ఞానము కలిగించు ప్రబలసాధనములు. ఈసాధనములవల్లనే ఎందఱో తాము బాగుపడి— తోడివారిని బాగుచేయుటకు తగిన స్థితిలోనికి వచ్చినారు; వచ్చుచున్నారు. (గ్రంథములకే కావ్యములు అని మఱిఒక పేరు). అందుచేత గ్రంథరచన అత్యావశ్యకము. పెక్కుమాటలేల? గ్రంథరచనయే లేకున్న మనలోకము ఇప్పటి ఉన్నతస్థితిలోనైన ఉండియుండదు. ఇది శిలాక్షరము.

## గ్రంథరచన అనగా ఏమి?

గ్రంథములు చేయుటయే గ్రంథరచన. గ్రంథములుచేయుట అని చెప్పుటచేత, ఒక గ్రంథము చూచి దానికి మఱిఒక ప్రతి వ్రాయుట గ్రంథరచనకాదు. అయిన, మఱి ఏమి? స్వభావసిద్ధములగు సంగతులుగాని— అనుభవసిద్ధములగు సంగతులుగాని— శాస్త్రసిద్ధములగు సంగతులుగాని— ఆయాకాలములయందు జరిగిన సంగతులుగాని— అనుభవమునుబట్టి బుద్ధివిశేషములచే కల్పించిన సంగతులుగాని— పైతరగతులలో కొన్నికొన్ని తీసికొని కలిపిన సంగతులుగాని ఒకదానితో ఒకటి సంబంధము కలిగిఉండునటుల— చక్కని భాషలో — మనసు కరగించునట్టి ఒప్పిదమగు శైలిని — జ్ఞానము కలిగించియో — నీతి బోధించియో— ఆనందము కలిగించుటకు సహజశక్తిచేత స్వయముగా కూర్చివ్రాయుటయే గ్రంథములు చేయుట. వైలక్షణములు కల ఒకభాషలోని గ్రంథములను వేరొక భాషలోనికి తెచ్చుటయును గ్రంథరచనగానే ఎన్నికకాంచుచున్నది. గ్రంథరచనకే కవిత్వము అని మఱి ఒకపేరు.

పైసంగతులనుబట్టి గ్రంథరచనకు (౧) సహజమగు కవితాశక్తి (౨) మంచి ప్రపంచజ్ఞానము (3) చక్కని భాషాజ్ఞానము (౪) తగినంత శైలిజ్ఞానము— అను నాలుగు సాధనములు ప్రధానములు— అని తట్టును. ఇందులో కవితాశక్తి కావ్యలక్ష్మికి ప్రాణము. ప్రపంచజ్ఞానము

శరీరము – భావ వాహనము – శైలి వస్త్రాద్యలంకారము – అని చెప్పవచ్చును. కాన గ్రంథరచన చేయగోరువారికి ఈసాధనములనుగూర్చి కొంతవఱకైనను తెలిసికొనుట ముఖ్యము. కాబట్టి ఒక్కొక్కటిగా తీసికొని వీనినిగూర్చి సంగ్రహముగా చర్చించి చూడనగును.

## 1. కవితాశక్తి

ఆయాగుణములు మనకు పూర్వవాసనవలన వచ్చునట్లే కవితాశక్తియు పూర్వవాసనవల్లనే వచ్చును. పూర్వవాసన హెచ్చయిన కొలదిని కవితాశక్తియు హెచ్చగును. కొందఱు మహాకవులును – కొందఱు సాధారణకవులును అగుటకు కారణము పూర్వవాసనయందలి హెచ్చుతగ్గుల భేదమే. కవితాశక్తితో సంబంధించిన పూర్వవాసన ఏమియు లేనిచో కవితాశక్తి అబ్బనే అబ్బదు. మహాపండితులు కొందఱు నాలుగుముక్కలు కూడ కూర్పజాలకపోవుటయే ఇందుకు తార్కాణము.

అందుచేతనే పెద్దలు, ఋషుల అంశము లేనివారు కవులు కానేరరని చెప్పిరి. కవితాశక్తి సామాన్యపుభాగ్యము కాదు. దానితో సమానమగు భాగ్యము మఱియొకటి లేదనియే చెప్పనగును. రాజర్షి భర్తృహరి, అందుచేతనేకదా 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్' అని అనుభవముచేత చెప్పినాడు. చూచితిరా, సుకవిత ఉన్న రాజ్యముకూడ అక్కఱలేదట! కాబట్టి దైవానుగ్రహమున కవితాశక్తి అబ్బినవారు అది సరిగా వాడుకచేసి అందువలన తాము మేలుపొంది, లోకమునకు మేలుచేయ యత్నింపవలె. ధారాజలము కాలువలమూలమున పండ్లచెట్ల పాదులకు చేర్చి, అవి ఫలించునట్లొనర్చి, ఆ ఫలము లనుభవించి సుఖపడుటకు అవకాశము కలిగించు విధమున, సహజమగు కవితాధారను లోకజ్ఞానమూలమున సద్విషయములకు చేర్చి, వానిఫలము లనుభవించి లోకులు సుఖపడుటకు అవకాశము కలిగింపవలెగాని ఉప్పుపఱ్ఱలలోచేరి వ్యర్థమగు ధారాజలమువలె కవితాధార దుర్విషయములలో చేరి వ్యర్థమగునట్లు చేయరాదు. ప్రయత్నించి కవితాశక్తి అంకురించునట్లుకూడ జేసికొననగును.

ఎండకాలమున భూమిలో అణగియుండు విత్తనమువలెను, వేరువలెను, దుంపవలెను కవితాశక్తి చిన్నతనమున కవుల మనస్సున అణగియుండును. తొలుకరివానలు పడి భూమి నానినపిదప మొలకెత్తు విత్తనము మొదలగువానివలె కవితాశక్తియు అక్షరజ్ఞానము కలిగి, సత్కావ్యములు (మంచిగ్రంథములు) చదువ మొదలుపెట్టినపిమ్మట బయలుపడును. కాలమునకు వానలు సరిగా కురియుచుండినయెడల మొలకెత్తిన మొక్క నవనవలాడుచు పెరిగి, పూచియో, కాచియో, పండియో లోకులకు మేలుచేయునటుల కవితాశక్తియు క్రమక్రమముగా సద్గ్రంథములు చదువుచేతను, సృష్టివిచిత్రములను కనిపెట్టుచుండుటచేతను జ్ఞానమభివృద్ధిపొందినకొలదిని మనోహరముగా దినదినాభివృద్ధినొంది, పురాణరూపముననో, ప్రబంధరూపముననో, నాటకరూపముననో, నవలరూపముననో, మఱి ఏదో తరగతి గ్రంథరూపముననో వెలువడి, లోకులకు మేలు చేయజాలును.

కాని, లోకమునకు సరిగా మేలుచేయుటకు తగియుండు కవిత్వమునకు కొన్ని సంస్కారములు కావలయును. సంస్కారములేని కవిత్వము అడవివంటిది. అడవిలో పండ్లచెట్లును ఉండును; ముండ్లచెట్లును ఉండును. పూలమొక్కలును ఉండును; ముండ్లమొక్కలును ఉండును. పూలపొదలును ఉండును; ముండ్లపొదలును ఉండును. ముండ్లమొక్కలు మొదలగునవి ఉండిననేమి? వానిజోలి మన కెందుకు? అని అనుకొనుటకు వీలులేదు. అడవిలోనికి అసలే వెళ్లకపోయిన ఏమియును భయము లేదుగాని, వెళ్లితిమా వానిజోలి మన కక్కఱలేదనుకొన్నను వానికి మనజోలి తప్పక కావలసియుండును. అడవిలో కాలుపెట్టునప్పటికి అవి తమప్రభావము కనబఱుప మొదలుపెట్టును. పువ్వులకొఱకుగాని, కాయలకొఱకుగాని, పండ్లకొఱకుగాని ఆశపడినవారికి ముండ్లముద్ర తాతాచార్యులుగారి ముద్రయే. ముండ్లమొక్కలు మొదలగునవి పూలమొక్కలు మొదలగువానితో కలసిమెలసి ఉండుటయే ఈయవస్థకు కారణము. ఇందువల్ల తేలినదేమి? అడవివల్ల లోకమునకు మేలుతోపాటు కీడును కలుగును. ఇట్లే సంస్కారము

లేని కవిత్వమున అక్కడక్కడ గుణములు ఉన్నను వానితోపాటు దోషములును కలసిఉండునుగావున మేలుతోపాటు కీడును కలుగును. దోషములే హెచ్చయిన ఇక చెప్పవలసిన దేమున్నది? "సిరి అంటదుగాని చీడ అంటును" అనుసామెత ఎవరికి తెలియదు? నీతి పట్టుపడుట దుర్లభముగాని దుర్నీతి పట్టుపడుట సులభము. చక్కని భాష స్వాధీనము కాదుకాని పాడు భాష సులువుగా స్వాధీన మగును; కాదు, స్వాధీనము చేసికొనును. దురభ్యాసములు పట్టుపడుట సుకరముగాని వదలుట దుష్కరము. కాన, సంస్కారములేని కవిత్వమువల్ల తుదకు మేలుకంటే కీడే హెచ్చుగా కలుగును. కాబట్టి, కవిత్వము అడవివంటిదిగాక పూలతోటవంటిది కావలయును. సంస్కారములు పొందిన కవిత్వము పూలతోటవలెనే ఉండును. కవిత్వము కళలలో ఒకటి; పూలతోట వేయుటయును కళలలోనే చేరును. రెండింటియందును మనుష్యుల బుద్ధి వాడుక కావలె. రెండింటివల్లను పొందదలచు ఫలము ఆనందమే. పూలతోటలో నేల అంతయు చదునుచేసి— బాటలువేసి, తోటమాలి ఆయాపట్ల పూలమొక్కలును— పండ్లచెట్లను వేసి— పూలపొదరిండ్లు కట్టి— తీగెలు ప్రాకించి— తగిన దోహదములు చేసి— పూచునవి పూచునట్లును— కాచునవి కాచునట్లును చేసి, సమస్తేంద్రియములకును ఆనందము సమకూర్చును. పనికిమాలిన గడ్డిగాదములుగాని— బాధించు ముండ్లచెట్లుగాని పూలతోటయందు పొడకట్టవు. అట్లే సంస్కారములు పొందిన కవిత్వమందు— గ్రంథరచనయందు— స్వభావసిద్ధములయి మృదుమధురములగు శబ్దములును— గంభీరములగు అర్థములును— కల్పనలును— నీతులును— ఆదర్శములును— ఉచితములగు రసములును— గుణములును కానవచ్చుచు మనస్సు కరగించి— ఆనందమున తేల్చునుగాని, స్వభావసిద్ధములుగాక వెంటనే మొగము మొత్తించు చెవి కింపుగాని మోటమాటలును— సాంకేతికపదములును— చొప్పదంటు అర్థములును— కల్పనలును— దుర్నీతులును— దురాదర్శనములును— ఔచిత్యమును పాటింపమిచే అసహ్యకరములగు రసములును— దోషములును కానరావు.

కవిత్వసాధనములలో కవితాశక్తి మొదటిదిగాన దీనికే మొదట సంస్కారము కావలసియుండును. దీని సంస్కారము ప్రారంభమైనచో తక్కిన సాధనములకును సంస్కారము ప్రారంభమయినట్లే. ఏమందురా? కవిత్వసాధనము లన్నియును బీరకాయపీచువలె ఒండొంటితో సంబంధము కలిగిఉండునవికాని— "నీళ్లకు నీళ్లు, ప్రసాదమునకు ప్రసాదము" అనినటుల దేని కది వేరై సంబంధము లేకుండునవి కావు. కవిత్వఫలవృక్షమునకు కవితాశక్తి వేరు — ప్రపంచజ్ఞానము. ప్రాను — భాష కొమ్మలచుత్తము — శైలి పూవులును, పండ్లును— అని చెప్పనగును. కవిత్వతత్త్వము కరతలామలకము చేసికొనగోరువారు ఈఅంశము మనస్సున గుర్తుగా ఉంచుకొననగును.

మన శరీరమున వాయువునకు ఊపిరితిత్తులును, రక్తమునకు గుండెలును ముఖ్యస్థానము లగునట్లు కవితాశక్తికి కవిత్వములో ఆలోచనభాగము ముఖ్యస్థానము. ఏవిషయమును గూర్చిగాని ఆలోచించుట గాలి ప్రోగుచేయుటవంటిది. మంచిగాలితోపాటు చెడుగాలులును కలిసిఉండునుగాన కీడు కలుగకుండుటకు వానిని విడదీయవలెను. చెడుగాలులను మంచిగాలినుండి విడదీయుట కష్టమగు పని అని వేరే చెప్పనక్కఱలేదు. ఇట్లే ఆలోచన చేయునపుడు మంచితలపులతోపాటు చెడుతలపులును వచ్చును. అవి విడదీయవలె. చెడుతలపులు వేరుపురుగులవంటివి. కవితాశక్తి కవిత్వవృక్షమునకు వేరు; అట్టిచో చెడుతలపువేరుపురుగులను తీసివేయకున్న కవితావృక్షము ఏపుతగ్గి, చచ్చునుగాని, ఎదిగి, ఫలింపదు. చెడుతలపులు లేకుండునటుల చేసి మంచితలపులు మాత్రము నిలుపుటయే కవితాశక్తికి చేయవలసిన సంస్కారము. ఇట్లు సంస్కారముపొందిన కవితాశక్తి నిర్మలమగు చల్లగాలివలెను, ఏపుగా నెదిగి ఫలించు చెట్టువలెను కీడు రవంతయు కలిగింపక, మేలే చేసి, ఆనందమున తేల్చును.

కవితాశక్తి వృద్ధిపొందుటకు సాధనములు ఏమి? (౧) చక్కగా ఆలోచించుట, (౨) సృష్టిచిత్రములను సరిగా కనిపెట్టుట, (3) మంచిగ్రంథములు చదువుట,

అనుమూడును కవితాశక్తిని వృద్ధిపొందించు ముఖ్యసాధనములని చెప్పవచ్చును. ఈసాధనము లన్నియు ఒకదానితోనొకటి సంబంధము కలిగిఉన్నప్పుడే కవితాశక్తి బాగుగా అభివృద్ధిపొందునుగాని ప్రత్యేకముగా ఒక్కొక్కటియే ముఖ్యముగా తీసికొనునప్పుడు అట్టి అభివృద్ధి కలుగదు. అందులో గ్రంథములు చదువుటవలన కలిగిన జ్ఞానమే ముఖ్యముగా చేసికొని గ్రంథరచన చేసినయెడల పాడినదేపాటగా ఆయా గ్రంథములలోని సంగతులే మరల చెప్పుట తటస్థించును. ఇది వ్రాసినవారికి వ్యర్థప్రయాసము; చదువువారికి వ్యర్థమగు కాలక్షేపము. ఇక మూల గ్రంథములలోని అంశములు సరిగా గ్రహింపక వ్రాసినయెడల విపరీతజ్ఞానము కలిగి, కీడుకూడ కలుగును. అంశములు సరిగా గ్రహించినను, భావస్వాధీనమైనది కాకున్నను, మంచిశైలి పట్టుపడకున్నను రసపుష్టి చెడును. అందుచేత కవితాశక్తి వృద్ధిపొందకపోవుటయే కాక తగ్గికూడ తగ్గిపోవును. కాన, ఉభయభాషాపాండిత్యము గలవాడే తర్జుమాచేయుటకు పూనుకొననగును. గ్రంథములు చదువుటతోపాటు సృష్టిచిత్రములు సరిగా కనిపెట్టుచు స్వయముగా ఆలోచించుచుండినయెడల జ్ఞానము వృద్ధిపొంది, దానితోపాటు కవితాశక్తియు చక్కగా వృద్ధిపొందును.

మంచిగ్రంథములు చదువుట మొదట ప్రారంభింపవలయును. దానితోపాటు ఆయావిషయములను గూర్చి అవకాశ మున్నపుడెల్ల సృష్టి చిత్రములను కనిపెట్టుటయునుకూడ మొదలుపెట్టవలెను. ఇట్టిస్థితిలో చెప్పు కవిత్వము సాధారణకవిత్వము. ఇది కవిత్వమునకు బాల్యావస్థ. పైగ్రంథములలోని అంశమునే ఆధారముగా గల కవిత్వము పోతపాలబిడ్డ. సహజమగు తల్లిపాలతో పెరుగు బిడ్డకు ఉండు శరీరపటుత్వముగాని, ఉత్సాహముగాని, కళాకాంతులుగాని, ఆకర్షణశక్తిగాని పోతపాలబిడ్డకు నుండకపోవచ్చును. పాలబిడ్డను నుంకుట వట్టిది.

ప్రపంచమునకు పరాత్పరుడే తండ్రి; పరాత్పరుడే తల్లి. అట్లే, కవితాలక్ష్మికి కవియే తండ్రి; కవియే తల్లి. అమృతము తఱవగా పుట్టిన అమృతము లక్ష్మికి ఆహారమైనట్లు కవిహృదయమును తఱవగా పుట్టు మంచితలపులే కవితాలక్ష్మి పెరిగి, ఎప్పుడును నిండు జవ్వనమున ఉండుటకు త్రాగుపాలు. పలుపలుకు లేల? మంచితలపుపాలే కవితాలక్ష్మికి సహజమగు ఆహారము. లోకజ్ఞానము కలిగినపిమ్మట చక్కగా ఆలోచించుచుండుటవల్లను, మంచి గ్రంథములు చదువుటవల్లను, పెద్దలతో కలసి మెలసి ఉండుటవల్లను మంచి తలపులు పుట్టును. మంచితలపులే ఆధారముగా చేసికొని చెప్పు కవిత్వమే మంచికవిత్వము. ఇదే భర్తృహరి చెప్పిన 'సుకవిత', ఇదే కవిత్వమునకు యౌవనావస్థ. దేవతలు ఎప్పటికిని త్రిదశులే అయినట్లు మంచి కవిత్వమునకు ఎప్పటికిని యౌవనావస్థయే. ఈ అవస్థలోనికి వచ్చిన కవిత్వము ఎన్నాళ్లకైనను చెక్కుచెదరదు; ఎక్కడనైన గౌరవమునకు పాత్రమగును; ఎవరికైనను మనసు కరగించును; ఉత్సాహము పెంచును; మేలు కలిగించును; మేలు చేయించును; అందఱిని ఆనందమున- సాధారణపు ఆనందమున కాదు- బ్రహ్మానందమున తేల్చును. కాబట్టి గ్రంథరచన చేయు అభిలాష గలవారు ఇట్టి కవితాశక్తిని సంపాదింప ప్రయత్నింతురుగాక!

## ప్రపంచ జ్ఞానము

జ్ఞానము కలిగించి, అందువలన ఆనందము కలిగించుట కవిత్వధర్మము. కావున కవిత్వము చెప్పదలచువారికి ప్రపంచజ్ఞానము అత్యావశ్యకము. (౧) ప్రపంచమును స్వయముగా కనిపెట్టుట, (౨) పెద్దలవలన తెలిసికొనుట, (3) మంచిగ్రంథములు చదువుట అను మూడు సాధనములవలన ముఖ్యముగా ప్రపంచజ్ఞానము కలుగును.

## ప్రపంచజ్ఞానము సంపాదించుట ఎట్లు?

మనకు జ్ఞానేంద్రియములు ఉన్నందుకు ఫలము అవి సరిగా వాడుకచేయుటయే. లోభికి ధనము ఉన్నను దానివలన ఫలము కలుగనటుల తెలివితక్కువవారికి జ్ఞానేంద్రియము లున్నను ఫలముమాత్రము కలుగదు. ✔ కన్ను చెవి-అను రెండును జ్ఞానేంద్రియములలో ముఖ్యములయినను, తెలివితక్కువవారు అవికూడ సరిగా వాడుకచేయరు. కనుగ్రుడ్డి, వినుచెవుడు-అను సామెత అట్టి వారినిబట్టియే వచ్చినది. సృష్టిచిత్రములు చూచి-వాని

విశేషములను కనిపెట్టి- జ్ఞానాభివృద్ధి చేసికొని- సర్వేశ్వరుని మహిమ తెలిసికొని- ఆనందించి- అట్టి ఆనందము తోడివారికి పంచిపెట్టుటయే కన్నులున్నందుకు ఫలము. ఆయాధ్వనులు విని- వాని విశేషములు కనిపెట్టియు, ముక్కున్నందుకు ఆయావాసనలు మూర్కొని- వాని విశేషములు కనిపెట్టియు, చర్మము ఉన్నందుకు ఆయావస్తువులను తాకి- వాని విశేషములు కనిపెట్టియు జ్ఞానము అభివృద్ధిచేసికొనుచుండవలెను. ఇట్లు జ్ఞానాభివృద్ధి చేసికొనుచు- మన మానందించుచు- అట్టి ఆనందము మన తోడివారికి పంచిపెట్టుచుండవలెను. ఈ ఆనందము పంచిపెట్టినకొలదిని పెరుగునదే కాని తఱుగునది కాదు.

అయినను ప్రపంచమంతయు స్వయముగా కనిపెట్టుట ఎవరికిగాని దుర్లభము. ప్రపంచమున లెక్కలేని లోకములు గలవు. మన పూర్వులు లోకములు పదునాలుగుగా ఎన్నినారు. చంద్రమండలాదులును లోకములుగానే ఎన్నిక చెందినవి. అంగారకమండలము మన భూమండలమువంటిది కావచ్చునని ఈనడుమనే పరిశోధకులు కనిపెట్టిరి. మన 'కుజ' శబ్దము వీరి పరిశోధనముల కేమైన ఆధారమయినదేమో! మన భూలోకమును గూర్చియే మనకు ఇప్పటికిని పూర్తిగా తెలియదు. భూలోకపుమాట ఎందుకు? మన దేశమునుగూర్చికాని- అంతదాక అక్కఱలేదు- మన రాష్ట్రమునుగూర్చికాని- అదియును వదలివేయుదము- మన జిల్లానుగూర్చిగాని- అంతయు అవసరములేదు- మన తాలూకానుగూర్చికాని- అదియును వద్దు- తుదకు మన మున్న ఊరినిగూర్చికాని మనకు పూర్తిగా తెలియనప్పుడు, "ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గాని కెక్కునా" అని అన్నిలోకములనుగూర్చియు పూర్తిగా తెలియుట ఎట్లు? అనేకలోకములనుగూర్చి మనుష్యులలో ఎవరికిని ఇంకను ఏమియును తెలియదు. పురాణాదులలో ప్రత్యక్షములుగాని కొన్ని లోకములనుగూర్చి కానవచ్చు సంగతులు నిజములో కావో తెలిసికొనుటకు ఆధారములు ఏమియును కానరావు. సూర్యాదిలోకములనుగూర్చి మిడిమిడిజ్ఞానముమాత్రము కలదు. భూలోకమునుగూర్చి కొంతవఱకు స్పష్టముగు జ్ఞానము కలిగినది. కాని ఇదియును ఆయా ప్రకృతిశాస్త్రములు అభిమానముగా చదివినవారికే. ఒక శాస్త్రము బాగా తెలిసినవారికి మఱి ఒక శాస్త్రము బాగుగా తెలియుట అరిది. అనేకశాస్త్రములు పూర్తిగా తెలిసికొనుటకు మన ఆయుస్సు చాలదు. దీనికితోడు "దుర్భిక్షలో అధికమాస" మన్నట్లు మనుష్యుల కందఱికిని భాష ఒకటికాదు. ఎన్నో భాషలు ఉన్నవి. ప్రతిభాషలోను అన్నిశాస్త్రములును లేవు. అందుచేత శాస్త్రజ్ఞానము సంపాదింపవలెనను కొన్న పెక్కు భాషలు నేర్చుకొనవలె. తల్లిభాషయే సరిగా నేర్చుకొనలేనివారికి పైభాషలు నేర్చుకొనుట సులభమా? దీనికి ఎంతో కాలము పట్టును. ఇంతేకాక జ్ఞానసంపాదనమునకు ధనలోపము- యోగ్యతాలోపము- సంసారబాధలు మొదలగు అడ్డులు కూడ ఎన్నో ఉన్నవి. అందుచేత, ప్రపంచజ్ఞానమంతయు పూర్తిగా సంపాదింపగలుగుట ఎవరికిగాని అందని మ్రానిపండు. అయినను మనచేత నగునంతవఱకు ప్రయత్నించి ప్రపంచజ్ఞానము సమకూర్చుకొనవలె.

ఇదివఱకు యుగయుగములనుండి పూర్వులు సంపాదించినట్టియు ఇప్పటివారు సంపాదించినట్టియు ప్రపంచజ్ఞానము గ్రంథరూపమున సిద్ధముగా ఉన్నది. కాబట్టి గ్రంథములు చదివి మనము మొదట ప్రపంచజ్ఞానము సంపాదింపవలయును. ఆజ్ఞానము పునాదిగా చేసికొని దానిమీద స్వయముగా కనిపెట్టుట- పెద్దలవలన తెలిసికొనుట- అను సాధనములతో కవితాభవనము కట్టవలయును. ఇందుకు పూనుకొను మనవారికి- ఆంధ్రులకు- స్వభాష చక్కగా వచ్చియుండవలె; మన రాజభాష ఇంగ్లీషుకూడ దానిలో గ్రంథరచనకు గాకున్నను జ్ఞానసంపాదనమునకైనను తగినట్టు రావలె. సంస్కృతము కూడ అటులే వచ్చియుండవలె. ఈ మూడుభాషలును వచ్చి వానియందలి గ్రంథములు చదివి జ్ఞానము సంపాదించుకొని, సృష్టిచిత్రములను వీలగునంతవఱకు స్వయముగా కనిపెట్టుచు తెలియని సంగతులు పెద్దలవలన తెలిసికొనుచు కృషిచేసినయెడల తగినంత ప్రపంచజ్ఞానము కలుగును. అప్పుడు ఆయా విషయములనుగూర్చి బాగు

గా తెలియును. అందుచేత గ్రంథరచనకు పూనుకొనుటకు అర్హత కలుగును.

అన్ని విషయములనుగూర్చియు అందఱికిని తెలిసి ఉండుట కష్టము గాన, ఎవరికి ఏవిషయములందు ఎక్కువ ఆసక్తి ఉండునో వారు ఆవిషయములనుగూర్చి సాధ్యమగునంతవఱకు తెలిసికొన ప్రయత్నింపవలయును. అటుల బాగుగా తెలిసిన విషయములనుగూర్చియే గ్రంథరచన చేయవలెను. అటుచేసినచో, ఆగ్రంథములు వ్రాసినవారికిని ఆనందదాయకములు గాకమానవు. కాన గ్రంథరచనయందాసక్తిగలవారు మంచి ప్రపంచజ్ఞానము సంపాదించుటకై శ్రద్ధ వహింపనగును.

## భాషా జ్ఞానము

ప్రపంచజ్ఞానము కలిగినంతమాత్రమున గ్రంథరచన సాధ్యముకాదు. ఏభాషయందు గ్రంథరచన చేయదలతుమో ఆభాషయందు మంచిపాండిత్యముండవలయును. అందుకు నిఘంటుజ్ఞానమును, వ్యాకరణజ్ఞానమును ఆవశ్యకములు. అంతేకాదు; అలంకారశాస్త్రమును, ఛందశ్శాస్త్రమును తెలిసిఉండవలె. భాషలోని ప్రమాణగ్రంథములు చదువవలె. అప్పటికి భాష కొంతవఱకు స్వాధీనమగును. గ్రంథరచనకు అవకాశము కలుగును. కావున భాషాజ్ఞానము గ్రంథరచనకు ముఖ్యము. భాషాజ్ఞానము లేనియెడల మనస్సున ఎన్ని మంచితలపులున్నను అవి దరిద్రునికోరికలవలెనే లోలోన అణగి జీర్ణముకావలసినవేకాని క్రియారూపమును పొందజాలవు. ఇక చక్కని భాషాజ్ఞానము ఉన్నయెడల ధనవంతుని కోరికలు మేడలుగానో, మిద్దెలుగానో, కోటలుగానో, తోటలుగానో, ఇక మఱి ఏరూపుననో పరిణమించి ఆనందము కలిగించువిధమున మనస్సులోని మంచి తలంపు లన్నియు పురాణములుగానో, ప్రబంధములుగానో, నాటకములుగానో, నవలలుగానో, చరిత్రములుగానో, శాస్త్రములుగానో, ఇక మఱియొకరూపముననో మాఱి కర్తలకును, లోకులకునుగూడ ఆనందము కలిగించును.

## ఆంధ్రభాషాజ్ఞానము అభివృద్ధిచేసికొనుటఎట్లు?

ఒండొంటితోకలసి అర్థమిచ్చు శబ్దములసమూహమే భాష. కాన, ఆంధ్రభాషాజ్ఞానము కావలయుననిన మొదట ఆంధ్రశబ్దజ్ఞానము ఉండవలయును. అనగా గ్రంథరచనకు పనికివచ్చు ఆంధ్రశబ్దములన్నియును గ్రంథరచన చేయగోరువారికి తెలిసిఉండవలెను. ఇందుకు నిఘంటువులు చదువవలయును. ఇదేమి బాధ? ఇంగ్లీషుభాషాజ్ఞానము సంపాదించుటకు ఇట్టిఏర్పాటు అవసరములేదే! అని ఇంగ్లీషు చదువుకొనిన మనవారు అనవచ్చును. కాని, భాషాస్వభావములు వేఱుగా నుండునుగాన భాషాజ్ఞానము సంపాదించు పద్ధతులును వానిననుసరించి కొంతవఱకు వేఱుగా ఉండకతప్పదు. ఇంగ్లీషులో సాధారణముగా పదములు సంధికి లోనుగావు. తెలుగులో కొంతవరకు సహజముగానే పదములు సంధికి లోనగును. అందుచేత పదముల సహజరూపము మాఱును. దీనికితోడు మొదటినుండియు మొన్నమొన్నటివఱకును తెలుగులో వచనరచనకంటె పద్యరచనయే హెచ్చుగా కానవచ్చుచున్నది. పద్యరచనలో ఛందోనియమములనుబట్టి సంధి మఱింత ముదిరినది. అందుచేత మన గ్రంథములలో సహజమగు శబ్దస్వరూపము చాలవఱకు తెలియరాదు. కాన ఇంగ్లీషు గ్రంథములలో ఆభాషాస్వభావమునుబట్టి సాధారణముగా సహజరూపములతో ఉండు పదములకు తెలియనప్పుడు అకారాదినిఘంటువులలో అర్థము చూచుకొని భాషాజ్ఞానము క్రమక్రమముగా అభివృద్ధిచేసికొనునంత సులువు మనభాషయందు లేదు. కాబట్టి కంఠస్థమగునట్లు పద్యరూపమున ఉన్న నిఘంటువులు వల్లింపలేకపోయినను మనస్సునకు శబ్దస్వరూపము తట్టి ఉండునంతవఱకైనను ఆంధ్రనామసంగ్రహము— ఆంధ్రభాషార్ణవము— సాంబనిఘంటువు— వేంకటేశాంధ్రము— మొదలగు నిఘంటువులు చదువుట అవసరము. ఇందులో పదవిభాగముతోడను— అర్థముతోడను ఉన్న నిఘంటువులు ముందు చదువవలయును. ఇట్లు చదివినయెడల శబ్దజ్ఞానముతోనుపాటు పర్యాయపదజ్ఞానమును కలుగును. ఇట్టి జ్ఞానము లక్ష్మీనారాయణీయము—అను అకారాది నిఘంటువువల్లనుకూడ కలుగును. గావున ఆయాపద్యనిఘం

టువులు చదువుటకు బద్ధకించువారు ఈ అకారాదినిఘంటువు తెలియనిపదము వచ్చినపుడెల్ల చూచుచుండవలయును. సంస్కృత సమశబ్దజ్ఞానముకొఱకును, సమాసజ్ఞానముకొఱకును 'అమరకోశము' చదువవనగును. ఇక సాధారణముగా ఎప్పుడును వాడుక చేయవలసిన అకారాది నిఘంటువు 'శబ్దరత్నాకరము.' ఇందువలన సామాన్యముగా తెలుగు గ్రంథములయందు వాడుకగు అన్నిశబ్దముల మొదటిస్వరూపమును తెలియును. శబ్దార్థజ్ఞానము బాగుగా సంపాదింపదలచువారు ఓపికపట్టి శబ్దరత్నాకరము మొదటినుండియు చివరవఱకును ఎన్నిపర్యాయములు తిరుగవేసిన అంత మంచిది. ఇట్లు శబ్దజ్ఞానమును దానితోపాటు అర్థజ్ఞానమును సంపాదించకొనవలెను. ఈశబ్దార్థజ్ఞానము, భారత భాగవత రామాయణాదిగ్రంథములు వీలగునపుడెల్ల చదువుచు మనుచరిత్ర, ఆముక్తమాల్యద, రాఘవపాండవీయము మొదలగు ప్రబంధములు వ్యాఖ్యానములతో చక్కగా చదివినయెడల బాగుగా బలపడును.

కాని, ఇంతతో భాషాజ్ఞానము పూర్తికాదు. నిఘంటువులు చదువుటవల్ల శబ్దముల మొదటిరూపములే బాగుగా తెలియును. భారతాదిగ్రంథములు చదువుటవలన ఆయాశబ్దములు పొందు వివిధరూపములు పొడకట్టును గాని ఆవివిధరూపములనుగూర్చిన జ్ఞానము సరిగా పట్టువడదు. ఈవివిధరూపముల జ్ఞానము గ్రంథరచనకు అత్యావశ్యకము. ఇది వెంకయ్యవ్యాకరణము, బాలవ్యాకరణము, ప్రౌఢవ్యాకరణము మొదలగు వ్యాకరణములు స్వయంకృషితోపాటు గురుసాహాయ్యముకూడ పొంది చదివినగాని కలుగదు. వచనగ్రంథరచన చేయువారికైనను వ్యాకరణజ్ఞానము తప్పక ఉండవలయును. ఇంతేకాదు. తెలుగున గ్రంథములు రచించువారికి ఆంధ్రవ్యాకరణజ్ఞానమేకాక, సంస్కృతపదములును, సమాసములును తెలుగున వాడకతప్పదుగావున సంస్కృత వ్యాకరణజ్ఞానము కొంతవఱకైనను ఉండితీఱవలయును. ఇందుకుకూడ స్వయంకృషితోపాటు గురుసాహాయ్యము కావలయును. ఇంగ్లీషువచ్చినవారు ఇంగ్లీషులో సిద్ధాంతకౌముది ననుసరించి వ్రాసిన 'ఖేలు(?)సంస్కృతవ్యాకరణము' చదువవనగును.

పద్యకవిత్వము చెప్పదలచువారు ఛందోజ్ఞానమును సంపాదించుటకు సులక్షణసారము, అప్పకవీయము చక్కగా చదువవలయును. ఇది స్వయముగా చదువుకొనుచు తెలియనిచోట్ల పెద్దల నడిగి తెలిసికొనవలయును.

కావ్యలక్షణములు, దోషములు, మొదలగు వానిని గూర్చి జ్ఞానము సంపాదించుటకు నరసభూపాలీయము మొదలగు గ్రంథములు చదువవలెను.

ఇటుల నిఘంటుజ్ఞానమును, వ్యాకరణజ్ఞానము, ఛందోజ్ఞానమును, కావ్యలక్షణాదిజ్ఞానమును సంపాదించినయెడల భాషాజ్ఞానము సమకూడును. కాబట్టి గ్రంథరచన చేయగోరువారు పైని వివరించినవిధమున చక్కని భాషాజ్ఞానము సంపాదింపవలె.

సంస్కృతగ్రంథములను తెలుగులోనికి తేదలచువారికి సంస్కృతమున మంచి జ్ఞానము సంపాదించుట ఆవశ్యకము. సంస్కృతకావ్యములు కొన్నియు, నాటకములు కొన్నియు, తెలుగుటీకలతో ఉన్న భగవద్గీతలు మొదలగు తక్కిన గ్రంథములు కొన్నియు చదివినయెడల సాహిత్యజ్ఞానము కలుగును. రామాయణాదిగ్రంథములకును, రఘువంశాదికావ్యములకు కొంతవఱకును తెలుగున వ్యాఖ్యానములు ఉండుటచేతను స్వయంకృషి చేసి సంస్కృతమున సాహిత్యము సంపాదించుటకు సదుపాయ మేర్పడినదిగాన గ్రంథరచన చేయగోరువారు దీనివలన సంస్కృతభాషాజ్ఞానము సంపాదించుకొనవలెను. అవసరమని తోచిన సంస్కృతగ్రంథములను తెలుగులోనికి మార్చవనగును.

ఇక ప్రకృతిశాస్త్రజ్ఞానము, చరిత్రజ్ఞానము మొదలగు పలురకముల జ్ఞానము సంపాదించుటకును, అట్టి జ్ఞానము ఇంగ్లీషురాని మన ఆంధ్రసోదరులకు సమకూర్చుటకును ఇంగ్లీషులో తగినంత అర్థజ్ఞానము కలుగువఱకును గ్రంథరచన చేయగోరువారు కృషిచేయవలెను.

ఇట్లు ఆంధ్రభాషయందును, సంస్కృతభాషయందును, ఇంగ్లీషుభాషయందును తగినంత జ్ఞానము

కలిగినగాని మనభాషయందు చక్కగా గ్రంథములు చేయుటకు శక్తి కలుగదు.

మఱియొక మాట. ఏభాషయందు గ్రంథములు రచింతుమో ఆభాషయందు అభిమానము ఉండవలయును. లేనిచో భాషాస్వభావము పోయి భాష చెడును. ఆంధ్రగ్రంథములు రచించువారికి ఆంధ్రభాషయందే రచనాకాలమందైనను అభిమానము ఉండవలె; ఆంధ్రభాషాస్వభావమును బాగుగా పాటింపవలె. కాని సంస్కృతము అభిమానముగా చదివినట్టియు, ఇంగ్లీషు అభిమానముగా చదివినట్టియు మనవారు కొందఱు ఆభాషల సంప్రదాయములు తెలుగుగ్రంథరచనలోనికి తెచ్చి, ఆంధ్రభాషకు సహజముకాని కావ్యరచన చేయుటవలన మన భాషస్వభావము చెడి, తెలుగుపదములతో కూడి ఉన్నను ఆభాష తెలుగుభాషమాత్రము కాకుండుట తటస్థించుచున్నది. ఇట్టి భాషాసాంకర్యము గల గ్రంథములు ఎన్నటికిని సద్గ్రంథములుగా ఎన్నికకు రానేరవు.

భాషాజ్ఞానము బాగుగా ఉన్నవారే గ్రంథరచన చేయుటకు అర్హులు. అర్హులువ్రాసిన గ్రంథములే స్థిరముగా నిలుచును. అవే మేలుకలిగించి, ఆనందము సమకూర్పగలుగును. కాబట్టి తెలుగున గ్రంథరచన చేసి తోడివారికి మేలుచేయవలయునను ఉత్సాహముగల మనవారు భాషాభిమానము కనబఱుపవలయును; చక్కని భాషాజ్ఞానము సంపాదింప ప్రయత్నింపవలయును.

## శైలిజ్ఞానము

కవితాశక్తి ఉన్నగాని ఏ విషయమును గూర్చిగాని ఆలోచనయే సాగదు. ప్రపంచజ్ఞానము ఉన్నగాని ఏవిషయమునుగూర్చికాని సరిగా వ్రాయుటకు అవకాశము కలుగదు. భాషాజ్ఞానము ఉన్నగాని ఏవిషయమును గూర్చికాని దోషములు లేకుండ గ్రంథరచనచేయుటకు వీలులేదు. కవితాశక్తియు, ప్రపంచజ్ఞానమును, భాషాజ్ఞానమును ఉండి గ్రంథరచన చేసినను శైలి తగినదికాని యెడల గ్రంథము జనరంజకము కాజాలదు. జనరంజకముగాని గ్రంథము నిష్ఫలము.

కావ్యలక్ష్మికి శైలి ఐదువతనము. గ్రంథమునకు శైలిలోపము కలిగినయెడల, "అన్నియును ఉన్నవికాని ఐదువతనముమాత్రమే లేదు" అను సామెత దానియెడల సార్థకమగును. ఐదువతనములేని స్త్రీ రాణింపనట్లే శైలి లోపముగల గ్రంథము రాణింపదు. శబ్దములు సుశబ్దములు కావచ్చును; అర్థములు సరిగానే ఉండవచ్చును; భావములు మంచివే కావచ్చును; దోషములు లేకపోవచ్చును; పాండిత్య ప్రకర్షము కానరావచ్చును. కాని ఇవన్నియు గ్రంథమునకు వన్నె తేజాలవు. వన్నె తేగలది శైలియే. శైలిలోపములేని గ్రంథము రసవంతమై మనస్సు కరగించి, ఆనందమున ఓలలాడింప జాలును. శైలిలోపముచేత వన్నెకు రాకపోయిన గ్రంథములు మనభాషలో కొన్ని ఉన్నవి. వానిస్థితియే శైలి గ్రంథరచనకు ఎంత ప్రధానమో డంకామీద దెబ్బవేసి చాటుచున్నవి. కాన, గ్రంథములు రచింప బూనుకొనువారికి శైలిజ్ఞానము అత్యావశ్యకము.

## శైలిఅనగా ఏమి?

ఆయాసంగతులు చక్కగా మనస్సున కెక్కునట్లు గ్రంథము వ్రాయువిధమే శైలి. కావ్యలక్ష్మికి శైలి ఐదువతనమని ఇదివఱకే అనుకొన్నాము. అయిన, ఐదువతనమునకు ఐదువన్నెలు ఉన్నవి; శైలికికూడ ఐదువన్నెలు ఉండవలెనే? అవి ఏవి?— అని అడుగవచ్చును. వన్నెలులేకున్న శైలి గ్రంథమునకు వన్నె తెచ్చునది ఎట్లగును? (౧) రసములు, (౨) వృత్తులు, (౩) పాకములు, (౪) గుణములు, (౫) అలంకారములు- అనునవే శైలితో సంబంధించిన వన్నెలు. ఇవే మనస్సు కరగింపజాలిన గ్రంథరచనాసాధనములు. ఈవన్నెలతో కూడిన భాషలో గ్రంథము వ్రాయువిధమే శైలి. మనస్సు బాగుగా కరగింపజాలిన శైలియే మంచిశైలి.

## మంచిశైలి పట్టుబడుట ఎట్లు?

తగినంత కవితాశక్తి సహజముగానే ఉన్నవారికి ఆశక్తివల్లనే మంచిశైలి వచ్చును; కాని అట్టిశక్తిలేనివారు మంచిశైలి పట్టుపడునట్లు చేసికొనుటకు మంచిశైలిలో వ్రాసిన గ్రంథములు పలుసారులు

చదువవలెను. ఈవిషయమున ఇంతకంటె మఱి ఒక సాధనము లేదు. కావున గ్రంథరచనకు పూనుకొన దలచువారు భారతము మొదలగు మంచి శైలిలో వ్రాసిన గ్రంథములు వీలగునపుడెల్ల చదువవలెను. ఇటుల చదువుటవల్ల సహజకవితాశక్తి వృద్ధిఅయి దానితోపాటు మంచిశైలియు పట్టుపడును. శైలి జ్ఞానముకొఱకు గ్రంథములు చదువుచున్నప్పుడు తక్కిన విషయములమీదకంటె గ్రంథశైలియందే దృష్టి ఉంచవలెను.

సాధారణముగా శైలి, సులభశైలి, కఠినశైలి- అని రెండువిధములు. వీనిలో కఠినశైలి భాషాజ్ఞానమును పరీక్షింపవలసిన పెద్దపరీక్షలకు చదువువారికొఱకు ఉద్దేశించి వ్రాయుగ్రంథములయందే వాడుకచేయవలెనుగాని తక్కినగ్రంథములలో వాడుకచేయరాదు. కావున సాధారణముగా గ్రంథరచనయందు అవలంబింపవలసిన శైలి సులభశైలియే. సులభశైలిని వ్రాసిన గ్రంథములే పలువురకు మేలుకలిగించును; ఆనందము సమకూర్చును. కాబట్టి గ్రంథరచన చేయువారు సులభశైలిని వ్రాయుటకే ప్రయత్నింపవలెను.

అమ్మో! గ్రంథరచనకు ఇంత కష్టపడవలెనా ? అని మనవారు కొందఱు-కవితాశక్తి కొంతఅబ్బినంత మాత్రమున ప్రపంచజ్ఞానముగాని, భాషాజ్ఞానముగాని, శైలిజ్ఞానముగాని సరిగా సంపాదింపకయే గ్రంథరచనకు సిద్ధపడువారు-అనుకవచ్చును. భర్తృహరి చెప్పిన సుకవితాసామ్రాజ్యమును-దానివలన బ్రహ్మానందమును పొంద దలచువారు, తాము బాగుచేయదలచువారు తక్కినవిషయములలోవలెనే ఈగ్రంథరచనవిషయములోకూడ కష్టపడవలె. కష్టపడకున్నయెడల ఫలము కలుగదు. కవితాసామ్రాజ్యముగాని, బ్రహ్మానందముగాని అక్కఱలేనివారు కష్టపడనక్కరలేదు. కష్టపడుటకు మొదలుపెట్టినయెడల కష్టము కష్టమనిపింపదు. క్రమక్రమముగా సుఖముగా మాఱును. సుఖమే అగును. కావున క్రొత్తగా గ్రంథరచన చేయువారు తాము వ్రాసిన గ్రంథములు తోడివారికి మేలుచేయగలిగి స్థిరముగా ఉండుటకు అన్నివిధములగు జ్ఞానమును సరిగా కలుగవలయును తమ వ్రాతలు గ్రంథసాహాయ్యమువల్లను, పండితులసాహాయ్యమువల్లను చక్కబఱుచుకొనవలెను. చక్కబఱుచుకున్నగ్రంథములనె ప్రచురింపవలెను. ధననష్టమును, అపకీర్తియును, వ్యర్థప్రయాసమును, మనఃక్లేశమును కలుగకుండ జాగ్రత్తపడవలెను. మంచిగ్రంథములు చేయుటకు తగిన జ్ఞానము సంపాదించి, కవితాసామ్రాజ్యసుఖము లనుభవించి తాము బ్రహ్మానందమున తేలి, తోడివారిని బ్రహ్మానందమున తేల్పవలెను.

ఇప్పటికి గ్రంథరచనను గూర్చియు, గ్రంథరచనా సాధనములను గూర్చియు సంగ్రహముగా తెలుపనైనది. కావున, గ్రంథరచన చేయగోరు మనవారు తమకు సహజముగా వచ్చిన కవితాశక్తిని అభివృద్ధిచేసికొని సృష్టిచిత్రములను స్వయముగా కనిపెట్టుచు, మంచి గ్రంథములను చదువుచు ప్రపంచజ్ఞానము చక్కగా సంపాదించి స్వభాషలోని లక్ష్యలక్షణగ్రంథములను సంస్కృతాంగ్లేయభాషలలోని మనకు పనికివచ్చు గ్రంథములును చక్కగా చదివి, భాషాజ్ఞానము బాగుగా గడించి, స్వభాషలోని మంచిగ్రంథములు పలుమాఱు చదివి, ఇంపగు శైలి పట్టుపడునట్లు చేసికొని, ఉత్తమగ్రంథములు వ్రాసి తాము మేలుపొంది తోడివారికి మేలు కలిగింతురుగాక! ఆంధ్రవాఙ్మయమునకు వన్నె తెచ్చెదరుగాక!

---

# హరిస్తవము

కవిశేఖర వడ్డాది సుబ్బరాయుఁడు గారు,

శ్రీ నర్థించి కుచేలుఁ, డుగ్రభవవార్థిం దాఁటఁ బ్రహ్లాదుఁడున్,
మాన త్రాణము గోరి ద్రోవది, సరోమధ్యంబునన్ నక్రబా
ధానిర్ముక్తి భేంద్రుఁడుం, గొలిచి, లబ్ధస్వార్థులైనట్టి త
చ్ఛ్రీనారాయణ పాదపద్మముల మచ్చిత్తంబు హత్తించెదన్.

గరుడ స్కంధమునందు, సింధుతనయా కాంతోరు దేశంబునం,
దురగాధీశుని భోగమందును మహా యోగీంద్ర చేతంబులన్
గరిమం గాంచి, విరించి హస్త బలిరక్షస్స్వామి మస్తస్థలా
భరణంబైన పదారవిందము, మనపద్మంబుఁ బొందించెదన్.

శ్రీ మహిళామణీ నిలయసీమల మించు నఖర్వగర్వముం
దామర లొందినం దొడలఁ దత్సతి దాలిచి మెత్త నొత్తుటన్
వేమఱుఁగుల్గఁ దత్స్థితికిఁ బేర్మిఁ దనర్చెడివాని, భక్తచిం
తామణులన్ భజింపుము సదా హరి యంఘ్రుల నంతరంగమా!

తామరసద్యుతిన్ నఖసుధారుచి నోరిచి, నీరజంబులై
కోమల తారుణత్వములు గూరి, తొలంగి మలీమసాళికిన్,
వ్యోమ నదీమరందఝరి యుప్పతిలన్ నెలవైన భక్తచిం
తామణులన్ భజింపుము సదా హరియంఘ్రుల నంతరంగమా!

తా ముపమానమానమును దామరసంబులు దక్కి వేనిపై
వేమఱు వ్రాలుఁ బ్రత్యహము, వృత్తరమాకుచ కుట్మల స్ఫుర
చ్ఛ్రీమదవాసితంబు, లఘుసింధురకేసరు లవ్వి భక్తచిం
తామణు లంచుఁ గొల్వుము సదా హరి యంఘ్రుల నంతరంగమా!

గ్రుక్కెఁడు చేతిపాల్ శిశుతఁ గ్రోలి, యొసంగితి మోక్షసంపదన్
రక్కసి; కారగించి మధురంబగు గుప్పెఁడు నివ్వరముక్కలన్
మిక్కిలి బీద బాఁపనికి మేటిసిరుల్ ఘటియించి తీవు నీ
చక్కికి వచ్చినన్ సములు శత్రులు మిత్రు లయారె! శ్రీహరీ!

---

# కొన్ని కవిసమయములు

సాహిత్యవిద్యా ప్రవీణ, బులుసు వేంకటరమణయ్య గారు

"అపారే కావ్యసంసారే కవి రేకః ప్రజాపతిః,
యథాఽస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే."

విద్వాంసులకుఁగాని విద్యార్థులకుఁగాని యీ మీఁది సూక్తి నూతనము కానేఱదు. బ్రహ్మకంటెఁ గవిబ్రహ్మయే యుత్కృష్టుఁడనియు, నఘటన ఘటనా సమర్థుఁడనియు మన మందఱ మంగీకరింపవలసియే యున్నది. కవిబ్రహ్మసృష్టి చాల విచిత్రమైనది. విరించి యొకవస్తువును సృజించి దానిని మఱియొకరీతిని మార్చ సమర్థుఁడు కాఁడు. కాని కవియో తన యిచ్చవచ్చిన రీతిని వస్తువులను, స్వభావములను మార్చివేయుచుండును. కవి నిర్మాణమునకుఁ గారణకలాప మనావశ్యకము. బ్రహ్మ పద్మములనే పరిమళయుక్తములుగ నొనర్చును. కాని కవి తలంచినచో రాతిపద్మములును నిర్గంధసుమములై, పరిమళములేనివైనను బరిమళించును. కవిసృష్టిలో దుఃఖములేదు. విచారములేదు. విరించి మధురాహ్లాదిప్రదసములనే యొసంగును; కాని కవి సమానాస్వాదముకల నవరసములను నిబంధించును. కావుననే మమ్మటుఁడు

"నియతికృత నియమరహితాం,
హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్,
నవరసరుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతి." 1

అని కవివాక్కును వినుతించియున్నాఁడు. అభినవగుప్తుఁడును

"అపూర్వం యద్వస్తు ప్రథయతి వినా కారణకలాం
జగద్గ్రావప్రఖ్యం నిజరసభరాత్ సారయతిచ,
క్రమాత్ప్రఖ్యోపాఖ్యాప్రసరసుభగం భాసయతి త
త్సరస్వత్యా స్తత్త్వం కవిసహృదయాఖ్యం విజయ
[తాత్." 2

అని కవిసహృదయుల నుగ్గడించియున్నాఁడు.

పరమేష్ఠి యొనర్చిన సృష్టిని దారుమారుచేయుట కొక్క కవికిఁదప్ప వేఱొకనికి సామర్థ్యము లేదు. కాని యట్లు తారుమారుచేయుమాత్రమునఁ గవిసృష్టి యుత్కృష్టమైనదని చెప్ప సాహసింపము. పద్మమునందలి సౌరభమును సౌరభశూన్యమగు వస్త్వంతరమున కంటఁగట్టినను, దన కవితాశక్తిచే నావస్తువును బరిమళింపఁజేయువాఁడే కవి. ఇట్లే వికాసాదులయెడలఁగూడ నూహింపవలెను. పుష్పధర్మమగు వికాసమును జిఱునవ్వునం దారోపించినను, గవి స్మితమును వికసింపఁజేయవలెను. అట్లొనర్పఁజాలనియతఁడు కవియనిపించుకొనఁడు. అతని కవిత్వ మొకకవిత్వమును గాదు.

మన ప్రాచీనకవీశ్వరులు మీఁదిరీతిని దమ కవితాసామర్థ్యమున నొకవస్తువుయొక్క ధర్మమును మఱియొకచోట నారోపించి, ఆవస్తువున కాధర్మము సహజమైయే యుండవచ్చునను భ్రాంతినిగూడఁగొల్పి దిగంతవిశ్రాంతమగు యశమును గడించియున్నారు.

ప్రకృతిసిద్ధములగు పదార్థములు కవిలోకముచేఁ దారుమారుచేయఁబడి, పరాత్పరుఁడగు విరించి నిర్మాణమున నున్నను లేనివానిలోనే జమయైపోయినవి. ఈరీతిగఁ గవిబ్రహ్మఘాటికి విరించి తాళఁజాలక యోడిపోయెను. విరించిసృష్టిలో నుండియుఁ గవినిర్మితియందు లేని విషయములు మీఁదిరూపముననే బయలుదేరియున్నవి.

1. మమ్మటుని కావ్యప్రకాశము. పుట 1

2. అభినవగుప్తుని లోచనము. ధ్వన్యాలోకవ్యాఖ్య. పుట 1.

కవి యట్లు స్వతంత్రించి నూతనసృష్టిని జేసియున్నంతమాత్రమున దాని నాదరించుటకుఁ గారణముచూపకపోయినచో లోకు లంగీకరింపరు. కావునఁ [1]కవిసమయము లన్నియు యుక్తిబద్ధములేగాని యుక్తిదూరములు మాత్రము కావని మన మూహించుచున్నాము. ఇదివఱకుఁ గొన్ని ప్రాచీనగ్రంథములలో లక్ష్యపూర్వకముగఁ గొన్ని కవిసమయములు నిరూపింపఁబడియున్నవి. కాని కవిలోకమున నట్లు మాఱిపోవుటకును, మాఱిపోయి ప్రసిద్ధములుకూడ నగుటకునుగల కారణములుమాత్ర మాగ్రంథములందు వివరింపఁబడియుండలేదు. కావున సూక్ష్మముగఁ గొన్ని కవిసమయములమాత్ర మిట వివరించెదను కవిసృష్టియందుఁ గలిగిన ప్రకృతిపరిణామములకుఁ గల హేతువులను సూచించుటమాత్రమే యిందలి ముఖ్యోద్దేశము.

రాజశేఖరమహాకవి రచియించిన [2]కావ్యమీమాంసయందుఁ గొన్ని కవిసమయములను నిరూపించుసందర్భమున వానికిఁ గల్గ కారణము నిరూపింపఁబడియున్నది. రాజశేఖరుని యావచనమునుబట్టి చూచినచోఁ గవులు దేశాంతరములను, ద్వీపాంతరములను దిరిగి యాయాదేశములందలి విషయములను వర్ణించుటంబట్టియు, నావర్ణనములు తద్దితరదేశవాసులకు వింతగఁ గన్పడుటంబట్టియు నిట్టికవిసమయము లేర్పడినవని యతని యభిప్రాయమని తోఁచుచున్నది. కావునఁ గవుల వర్ణనములలో నసత్యవిషయము లుండవని యొకవిధమగు లక్షణము కవిసమయమునకుఁ దేలును.

కాని తొలుత నిరూపించిన విషయమునుబట్టియు, విరించినిర్మాణముకంటెఁ గవినిర్మితి చాల విలక్షణముగనున్నదని ప్రాచీనాలంకారికులుకూడ నంగీకరించుటంబట్టియుఁ గవినిర్మాణము యథార్థమైనది కాదనియు, నట్లయ్యును గవిశక్తిచే యథార్థమైనట్లే గోచరించునని యు మనము తప్పక యొప్పుకొనవలసియున్నది.

మాటకు, ఒకటి రెండువిషయములఁ దీసికొని చర్చింతము. అవి రాజశేఖరుని లక్షణమునకు సరిపడియున్నవో లేవో సహృదయులే తెలిసికొనఁగలరు.

౧. నదులయందు పద్మోత్పలాదు లుండునని కవిసమయము. వస్తుతత్త్వమునకు సామాన్యముగ దేశభేదమునుబట్టికాని కాలభేదమునుబట్టికాని పూర్తియగు మార్పు కలుగదు. చెఱకుమొక్కయును, అది పెరుగని మఱియొక దేశమున నాటినచో నది పెరుగకపోవచ్చును; లేదా చావవచ్చును. కాని తన తీపిగుణమును విడిచి పుల్లనగాని, చేదునుగాని గ్రహించుట లేదు. ఆరీతిగనే నీటికిఁ బల్లపునేలకుఁ బాఱు స్వభావమే కాలమునను, ఏదేశమునను గూడ మాఱదు. అన్నినదులలోని జలమును సర్వదా ప్రవహించుచునేయుండును. కావున నదులయందు తామరదుంపలుకాని, కలువదుంపలుకాని నిలిచి, జిగిబిగిగ నల్లుకొని పుష్పింపఁజాలవు. ఈ సంగతి యెవ్వరికిని క్రొత్త కాదు. ఒకనదిలోఁ బద్మము లుండుటయు మఱియొకదానిలో లేకపోవుటయు నెప్పుడును బొసఁగనేరదు. కావున దేశభేదమునుబట్టి పద్మోత్పలాదులు నదులయం దుండునని, నిశ్చయింప నవకాశము లేదు.

౨. కీర్తి తెల్లనిదనియు, నపకీర్తి నల్లనిదనియు వర్ణింతురు. కీర్తిగాని, యపకీర్తిగాని, సత్యముగాని, యిట్టివి మూర్తపదార్థములు కావు. ఇవి మానవదృగ్గోచరములు. కావున నివి యేదేశమునందును, ఏకాలమునందును నల్లగాఁగాని, తెల్లగాఁగాని యుండుట పొసఁగదు. కావున నిట్టివి కవికల్పితములేకాని బ్రహ్మచే

1. కవిసమయ మనఁగాఁ గవి సంకేతితము; లోకమునందుఁగాక కావ్యములందే ప్రసిద్ధమగు కొన్ని ప్రకృతిపరిణామములు.

2. పూర్వేహి విద్వాంసః సహస్రశాఖం సాంగంచ వేద మవగాహ్య, శాస్త్రాణి చావబుధ్య, దేశాన్తరాణి ద్వీపాన్తరాణిచ పరిభ్రమ్య, యా నర్థా నుపలభ్య ప్రణీతవన్త స్తేషాం దేశకాలాంతరవశేన అన్యథాత్వేఽపి తథాత్వే నోపనిబంధో యః స కవిసమయః. కవిసమయశబ్ద శ్చాయం మూల మపశ్యద్భిః ప్రయోగమాత్రదర్శిభిః ప్రయుక్తో రూఢశ్చ. [కావ్యమీమాంసా; చతుర్దశోఽధ్యాయః.]

సృజింపఁబడి, మన దేశమునందుఁ గానరాకున్నను దేశాంతరములం దుండునని యనుకొన వలనుపడదు.

కవిసమయముల నన్నింటిని మనము మూఁడు తరగతులలోనికి విభజింపవచ్చును: లేని వస్తువుల నున్నట్లు వర్ణించుట యొకటి, ఉన్నవస్తువులను లేనట్లు వర్ణించుట యొకటి, కొన్ని కొన్నింటియందే యుండునని నియమించుట యొకటి.

లేనివస్తువుల నున్నట్లు వర్ణించుటకుఁ గల కారణములు:

(i) నదులందుఁ బద్మోత్పలములను వర్ణించుట.

నదులందలి నీరు సర్వదా పాఱుచుండును. కావున నందు కమలకందములు నిలిచి పుష్పించుటకు వీలులేదు. అందుచే నదులం దవి యున్నట్లు వర్ణించుట ప్రకృతివిరుద్ధమే యైయున్నది. కాని వేసవికాలమునందు నీరు పాఱక ఒక్కచోట నీరు నిలుచుట కలదు. అట్టి సమయములలో నందు కందములు నిలిచి పుష్పింప నవకాశము కలదు. ఎవ్వరేని కవి యట్టినదిని వర్ణించుసమయమున దక్కిన వర్ణనములతోఁబాటు పద్మములనుగూడ వర్ణింపవచ్చును. ఆవర్ణనము ననుసరించి తక్కినకవు లందఱును గాలభేదము పాటింపక నదులలోఁ బద్మములు, నుత్పలములు నున్నట్లు వర్ణింప మొదలిడియుండవచ్చును. కావున నిట్టివర్ణనము నిర్మూలమని మాత్రము చెప్పుటకు వలనుపడదు.

(ii) పర్వతసామాన్యమున బంగార మున్నట్లు వర్ణించుట కలదు.

స్వర్ణము గనులనుండియే తీయుదురు. గనులు పర్వతములయందే త్రవ్వఁబడుచుండుట అందఱెఱింగిన విషయమే. బంగారు ప్రతిపర్వతమునందును దొరకదు. ఏదో యొక్కొక్కపర్వతమునందే దొఱకును. అట్టిపర్వతమును వర్ణించుసందర్భమున "ఈపర్వతము బంగారునకుఁ బుట్టినిల్లని కవులు వర్ణింపసాగిరి. అట్టి వర్ణనము నిబంధింపఁబడిన పద్యమునఁ బర్వతవిశేషవాచకపద ముండకపోవచ్చును. అట్టిదాని ననుసరించి తక్కిన కొందఱుకవులు పర్వతసామాన్యమున సువర్ణము లభించునేమోయని భ్రమపడి స్థలదేశభేదములను గుర్తింపక యట్లు వర్ణించియుండవచ్చును. కావున నిట్టి వర్ణనములుకూడ సమూలము లనియే యెంచవలెను.

ఉన్నవికూడ లేనట్లు వర్ణించుటకుఁ గల కారణములు:

(iii) చందనవృక్షమునఁ బుష్పములు, ఫలములు లేకుండునట్లు కవిసమయము.

వర్ణనములు వస్తుస్వభావనిబద్ధములైయే యుండును గాని విరుద్ధములుగ నుండఁజాలవు. ఉత్తమములగు పుష్పఫలజాతులు కల యుద్యానాదులను వర్ణించు నవసరమున్న గవి వానివాని గుణముల ననుసరించియే వర్ణింపదొరకొనును. గులాబిమొక్కను వర్ణించునపుడు దాని పువ్వుయొక్క సౌందర్యము, నది నించు సౌరభ్యమును వర్ణించును గాని తక్కినవానిని వర్ణింప దొరకొనునా? అట్లే మామిడిచెట్లను వర్ణించునపుడు ఫలభారనమ్రతను, ఫలమాధుర్యమును వర్ణించునుగాని మామిడిపువ్వును వర్ణించునా? ఆ రీతిగనే చందనవృక్షమును వర్ణింపఁ బ్రారంభించుసరికి ఆవృక్షముయొక్క సౌరభ్యమే కవి నాకర్షించివేసినది. గులాబికిఁ బువ్వువలెను, మామిడికి ఫలమువలెను, మంచిగందపుచెట్టునకు మ్రానికే ముఖ్యమైయున్నది. చందనేతరములగు వృక్షజాతులకు ఫలపుష్పములవల్లనే సార్థకత, గౌరవము కలుగవలసియున్నవి. కాని చందనమునకుఁ బరాధీనత లేనందున నవి యప్రధానములై మ్రానే ప్రధాన మయినది. కావునఁ గవులకుఁ దద్వృక్షప్రయోజనముకొఱకు పువ్వులవఱకును, ఫలములవఱకును బో నవసరము లేకపోయినది. కావునఁ గవులు వానిని వర్ణింపమానిరి. గతానుగతికన్యాయమున నాసంప్రదాయము స్థిరపడఁగాఁ జందనమున ఫలపుష్పములు లేనట్లర్థము తేలి యంతటినుండియు నావాదుకయే కవిలోకమునఁ బ్రబలిపోయినది.

(iv) శుక్లపక్షమునందుఁ జీఁకటియు, బహుళపక్షమునందు వెన్నెలయు నున్నను లేకుండునట్లే వర్ణించుట కవిసమయసిద్ధమైయున్నది.

న్యాయమునుబట్టి శుక్లకృష్ణపక్షముల రెండింటి యందును వెన్నెల, చీఁకటి సమానములుగనే యుండును. శుక్లపక్షమున షష్ఠి, సప్తములు మొదలుకొని వెన్నెల బాగుగ నుండును. కృష్ణపక్షములందుఁగూడ నేకాదశివఱకును దెల్లవాఱుజామున వెన్నెల బాగుగనే యుండును. శుక్లపక్షమునందలి తొలిదినములందును, కృష్ణపక్షమునందలి చివఱిదినములందును గాఢమగు చీఁకటియే యుండును.

కాని శుక్లపక్షమునందుఁ జంద్రికకుఁ గారణభూతుఁడగు చంద్రుఁడు దినదినాభివృద్ధిని బొందుచుఁ బ్రజలకధికాహ్లాదమును గూర్చుచుండును. అభివృద్ధిని బొందుచున్నవాఁడు తొలుత దయనీయస్థితియందున్నను బ్రజలనాకర్షించును. బహుళపక్షమునఁ దొలుతఁ జంద్రుఁడు సమృద్ధుఁడైనను గ్రమక్రమముగ క్షీణించుచుండుటచే శోచనీయుఁ డగును. గొప్ప ధనవంతుఁడైనను దుర్వ్యసనములకు లోనై క్షీణించువానిని జనులు హీనముగఁ జూచెదరుకదా! కావున నీయభివృద్ధి క్షీణతలంబట్టియే— ప్రజల యాదరానాదరములంబట్టియే శుక్లపక్షమునఁ జీఁకటి లేకపోవుటయుఁ, గృష్ణపక్షమున వెన్నెల లేకపోవుటయు సంభవించెను.

ఇంక మఱొకవిషయము. మనకుఁ జంద్రుఁడు కనుపింపని శుక్లపాడ్యమినుండియుఁ జంద్రుఁడు సాయంకాలముననే యుదయించి యంతటినుండియు - మ్యునిసిపల్ సంఘమువారి దీపములవలెఁ - గొంతరాత్రివఱకును వెన్నెలనిచ్చియస్తమించును. కావున నావెన్నెల యెంతటిదైనను లెక్కలోనికివచ్చును. లోకులు మెలఁకువగనున్నంతవఱకును శుక్లపక్షమున వెన్నెల సామాన్యముగ నుండును. ఇఁక బహుళపక్షమున నన్ననో, దినదినమును జంద్రోదయమే! రెండేసిగడియలు వెనుకఁబడి తెల్లవాఱువఱకును వెన్నెలయుండును. కావున జనులు నిద్రించినవెనుకనెంతటి వెన్నెల కాచిన నెవ్వరి కుపయోగము! కావున నిరుపయోగమగు నావెన్నెల వెన్నెలలో జమయైయుండకపోయెను. కాఁగాఁ బ్రజలు పరుండువఱకును జీకటియే యుండుటచేఁ గృష్ణపక్షమునఁ జీకటియేగాని వెన్నెల యున్నట్లు కవులచే వర్ణింపఁబడకపోయెను.

(v) మల్లెమొగ్గ లెఱ్ఱగనున్నను, తామరమొగ్గ లాకుపచ్చని రంగు కలిగియున్నను వానినట్లు వర్ణింపక తెల్లగ, నెఱ్ఱగనే యున్నట్లు వర్ణించుట కలదు.

మల్లెపువ్వు మిక్కిలి తెల్లగానుండి కాంతిని నల్గడల వెల్లివిరియుచుండును. కాని యది మొగ్గగా నున్నపుడట్లు తెల్లగాఁగాక యెఱ్ఱగనే యుండును. అనఁగా నంతటియెఱ్ఱగ నుండదు. అట్లయినను గవులు దానిని తెల్లగ నున్నట్లే వర్ణింతురు. పుష్పము తెల్లగనే యుండుటంబట్టియుఁ, తత్కారణరూపమగు కుట్మలమును గూడఁ దెల్లఁగనేయున్నట్లు వర్ణించుట దోసముకాదని వారి తలఁపైయుండవలెను. కుట్మలమునకును బుష్పమునకు నభేదమును బాటించుటయే యిందలి కారణము. కొలఁదిగ యెఱుపురంగున్నను దానిని లెక్కింపక పోవుట యనుచితము కాదు. ఇట్లే కమలము రక్తవర్ణము గలిగియేయుండును. కాని ముకుళావస్థయందది యాకుపచ్చవన్నె కలిగియుండును. మీఁదిరీతినే కవులు కమలముకుళమునకుఁ గల వర్ణమును బాటింపక యెఱ్ఱగ నున్నట్లే వర్ణింతురు. తొంటివలెనే కార్యకారణములకు భేదమును బాటింపకపోవుటయే కవులు తాదృశరీతిని వర్ణించుటకుఁ గల కారణమని సహృదయులూహింపకపోరు.

కొన్ని వస్తువులు కొన్నింటియందే యుండునని నియమించుటకుఁ గల కారణములు.—

(vi) సముద్రమునందే మొసలి యుండునట్లును, మలయాద్రియందే మంచిగందపుఁజెట్లున్నట్లును, తామ్రపర్ణినదియందే ముత్యములు దొరకునట్లును, హిమాలయపర్వతములందే భూర్జ మున్నట్లును కవిసమయము.

మొసళ్లు సముద్రమునందేకాక పెద్దపెద్ద నదులందును, సరస్సులయందునుగూడ నుండును. మలయపర్వతముననేకాక తక్కినచోట్లఁగూడ చందనవృక్షము లుండకపోలేదు. తామ్రపర్ణియందేకాక సముద్రమునందును ముత్తియములు దొరకును. అట్లయినను కవు లాయాపదార్థము లాయావానియందే యుండునని నియమించి నట్లు వర్ణించియున్నారు.

తక్కినచోట్లయందాయా వస్తువులు లభింపవచ్చును. కాని యెచ్చటెచ్చట నవి విరివిగ లభించుచుండునో యాలోచించి వాని పుష్కలతను గారణముగాఁ గొని కవులట్లు వర్ణించియుందురు. మఱియుఁ దక్కిన స్థలములయందీ పదార్థములు లభ్యము లగుచున్నను, ప్రశస్తము లగునవి మాత్ర మచ్చటచ్చటనే లభింపఁగలవని కవుల యాశయమైయుండును. భూసారమునుబట్టి కొన్ని పదార్థములు కొన్నిటియందే ప్రశస్తముగఁ బెరుగుననుట నందఱెఱుంగుదురు. అందువనే "వినా మలయ మన్యత్ర చందనం న ప్రరోహతి" (చందనవృక్షము మలయపర్వతమును విడిచి తక్కినచోట నుత్పన్నము కానేఱదు.) అనుసూక్తి ప్రసిద్ధమైయున్నది.

(vii) వసంతకాలమునందే కోకిల కూయునట్లు కవిసమయసిద్ధమగు ప్రతీతి.

కోయిల వసంతసమయమునందేకాక తక్కినకాలములందుఁగూడఁ గూయక యూరకయుండునది కాదు. కాని వసంతకాలమే దాని కున్మాదజనక మగుటచేత నాకాలమునందలి యఱపే యింపైనది, సార్థకమైనది. ఎవనినైనను సంగీతవిద్వాంసుని అతని యిష్టములేని సమయమున నిర్బంధించి పాడించినచో నంతటి రసవత్తరముగ నుండదు. అతఁడే కోరి స్వేచ్ఛగఁ బాడినచో నది యెంతయు వీనులకు విందొనర్చును. అట్లే కోయిల స్వేచ్ఛగ గానముచేయు సమయము వసంతము. కావున నాకాలమునందే కోకిల గానముచేయునట్లును, దక్కిన కాలమునందలి గానము నిష్ఫలమగుటచే గానముగనే బరిగణింపఁబడనట్లును గవులు వర్ణించుచున్నారు. మఱియు నందఱికిని గామోద్రేకము వసంతసమయమునందే కలుగుచుండును. కోకిలస్వరము కామోద్దీపకము. తక్కినసమయములందుఁ గోకిలరుత మేమియుఁ బనిచేయకపోఁగా నది లెక్కలోనికి రాలేదు. ఒకవేళ యది యత్కించిత్కార్యకారియైనను జనులకుఁ గామోద్రేకము గలుగుటకది కాలముకానందున నేవిధముననైన నది నిష్ఫలమనియే యొప్పుకొనవలెను.

వసంతకాలమునందలి కోయిలయఱపే సార్థకమగుటచేఁగాక కోకిలములకుఁ గల భేద మాకాలముననే దెలియఁగలదని "వసంతకాలే సంప్రాప్తే కాకః కాకః, పికః పికః" అనుసూక్తి (తక్కినకాలమునఁ గాకకోకిలము లొక్కరీతిగనే యుండుటంబట్టి భేదము నెఱుంగుట దుర్ఘటము. కాని వసంతకాలమున వానివాని యఱపులఁ బట్టి భేదము సుగ్రాహ్యము.) చాటుచున్నది.

ఈరీతిని గొన్ని కవిసమయములనే దిఙ్మాత్రముగఁ జూపి యట్టి ప్రతీతులు కలుగుటకుఁ గల కారణములను సూక్ష్మరూపముగనే దెల్పితిని. ఈరీతిగనే సహృదయులు కవిసమయములయందలి యథార్థమును గుర్తించి యవి యన్నియును యుక్తియుక్తములేగాని నిర్మూలములని యెంచకుందురు గాక!

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయువలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

—మేనేజరు, 'భారతి.'

తెఱచాటు                                        శ్రీ సముద్రాల వెంకటరాఘవాచార్యులుగారు

కలగనినట్టి చాడ్పున నగాధరసాతలగోచరంబులౌ
వెలుగులు తోచి నాహృదయవీథులలో ననుజేరబిల్చు; మం
జులనవమాధురీ మహితశోభనగీతికలేవొ సాధురీ
తుల నను బల్కరించినటు దోచి యడంగును నాయెడందనే.

కులుకుమిటారి తమ్మిపువు క్రోవులబాంగులువారు క్రొత్తతే
నెలు కలకండతో మెదిపి నిగ్గులు తేర్చిన పానకమ్ము జొ
బ్బిలక కరుళ్లుగట్టు; స్మృతివీథులలో ననుభూతపూర్వమై
పొలుచు పసందుమొగ్గదొడి పూయకయట్టులె నిల్చిపోయెడున్.

మధుర మధుర రసంబులు మలచుకొన్న-లలితసురభిళాజ్ఞాతసత్ఫలములేవొ
చూపుదరి నిల్చి పుడికి పుచ్చుకొనులోనె-కరగిపోవునేటికొ వడగండ్లవోలె.

జగము మాయయదలంచు పొగమంచు బాడగాంచి నామనం బేటికో నవసిపోవు
తమకమ్ము పెరియించు నెమిలిపించెముగాంచి కనుదోయియేటికో కలతజెందు
గుండెలు కరగించు కోయిలపాటలో బసగాంచి నాచెవి కొసర జూచు
నిలువెల్ల బూయుమల్లెల గాంచి కేల్దోయి కులుకుచు నేటికో కోయబోవు
కాలుకదలక చేరాకకాన లేక-మనసు పాల్పోక లోలోన మరగిపోవు
నేకతం బిటు లేటికో యేమికాంచి-కలగునో దాని యంతరంగమున మనసు?

అదియేదో అతిలోకదుర్లభ మహీయఃప్రేమసామ్రాజ్య సం
పద నాలోకముజేసి తన్మధురభావంబెల్ల వర్ణింప నో
పదు నాచిత్తము; తావకీన కరుణాపాంగప్రసారంబుచే
నది విస్పష్టముచేయు మింక తెర పాయంజేసి తేజోమయీ!

ఎన్నాళ్లీ తెఱచాటునాటకము దేవీ! యిర్వురు న్నిట్టులే
తెన్నుం దీరుపులేక యాడుటలు నాందీశ్లోకమే పాడుకొం
చు న్నాట్యంబొనరింప బూనిన సదస్యుల్ తీవ్రవైరాశ్య సం
పన్నుల్ గోపము సేతురంచు ననుకోవా యేమి నీలోపలన్?

---

# సోమపాళెపు దేవాలయ చిత్రములు



౧. చెన్నరాయస్వామి దేవాలయము

# కం. వీరేశలింగకవి—నవలలు

టే. కామేశ్వరరావుగారు

## ౫. సత్యరాజాపూర్వదేశయాత్రలు

'సత్యరాజాపూర్వదేశయాత్రలు' అను ఈగ్రంథాన్ని గురించి వీరేశలింగకవి యిలాగ రాస్తున్నాడు:

1891-వ సంవత్సరమునందు స్త్రీల విషయమున మనవారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరీతిని సత్యరాజాపూర్వదేశయాత్రలయొక్క ప్రథమభాగమును రచించి ప్రకటించితిని. నే నింగ్లీషున 'గల్లివర్సు ట్రావెల్సు' చదివినప్పుడు వ్యాజరూపమున మనలోని దురాచారములను, మూఢవిశ్వాసములను పరోక్షముగా ప్రదర్శించునట్టి పుస్తకమును నాలుగు భాగములుగా జేయవలెనని బుద్ధిపుట్టి మొదట నీభాగమును జేసితిని.........ఈభాగమును సాధారణముగా ఆడుమళయాళమని వాడుదురు. జ్యోతిశ్శాస్త్రములోని జాతకభాగముయొక్కయు, ముహూర్తభాగముయొక్కయు నవిశ్వసనీయతను పరోక్షముగా దెలుపుటకయి పయిపట్ల లంకాయాత్రయను రెండవభాగమునుగూడ జేసి ప్రకటించితిని గాని మూడునాలుగు భాగములను జేయలేదు."

(కం. వీ. స్వీ. చ. రెం. ౧౮౩, ౧౮౪ పుటలు.)

ఈవాక్యాలవల్ల మనకు తేటపడేదేమంటే - ఇదొక వ్యాజరూపముగా రచించబడ్డ కావ్యము అనగా ఇదొక నిందాకావ్య (Satire) మనీ, ఇది గలివరుయాత్రలను ఇంగ్లీషు గ్రంథంవల్ల స్ఫురించబడి రాయబడిందనీ. ఆంగ్లగ్రంథంలాగే యిదికూడా నాలుగుభాగాలుగా రాయతలపెట్టబడింది. కాని కవి రెండు భాగాలనుమాత్రమే రాసి పూరుకున్నాడు. తక్కిన రెండుభాగాలలోను యేయేవిషయాలనుగురించి రాయదలచుకున్నాడో మనకు తెలియజెప్పలేదు. కాని అవికూడ మనలోని దురాచారాలను, మూఢవిశ్వాసాలను పరోక్షంగా ప్రదర్శించేటట్లు రాయనుద్దేశించినట్లు గామాత్రం చెప్పి పూరుకున్నాడు. ఈచెప్పబడ్డ కొద్దిమాటలవల్ల మన మాభాగములలోని అంశా లేమైయుంటాయో గ్రహించలేము.

గ్రంథకర్త రచించిన రెండుభాగాల సంగతి యేమంటే—మొదటిభాగానికి జనులచే ఆడుమళయాళమని పేరుపెట్టబడింది. రెండోభాగంపేరు లంకాయాత్ర, లేక లంకాద్వీపం. ఆడమళయాళంలో స్త్రీలవిషయమై మనవారు చేసిన అన్యాయాలు నిందించబడ్డాయి. లంకాద్వీపంలో జ్యోతిశ్శాస్త్రాదులు నిందించబడ్డాయి.

'సత్యరాజాపూర్వదేశయాత్ర' లేజాతికి చెందిన గ్రంథమో మొదట తెలుసుకోవలసివుంది. ప్రతిసాహిత్యగ్రంథాన్ని రెండువర్గాల కింద జేర్చవచ్చు. రసలక్షణాన్నిబట్టి వొకవర్గంలోను, బాహ్యలక్షణాలనుబట్టి మరొకవర్గంలోను జేర్చవచ్చు. అ దేలాగంటే, హాస్యగ్రంథాలు—ప్రహసనాలైనా,నవలలైనా, కథలైనా, వ్యాసాలైనా—ఒకటేజాతి అంటే

హాస్యజాతిగ్రంథాలని రసలక్షణవర్గంకింద జేరుతాయి. రసలక్షణవర్గంలో అనేకజాతు లున్నాయి. హాస్యగ్రంథజాతి, విలాసగ్రంథజాతి (Romances), విషాదగ్రంథజాతి (Tragedies) మొదలైనవి. అదేమోస్తరుగా బాహ్యలక్షణాలనుబట్టి గ్రంథాలు బాహ్యలక్షణవర్గం కింద వివిధజాతుల్లో జేరుతాయి. పైన జెప్పబడ్డ హాస్యజాతిగ్రంథాలన్నీ ఈవర్గంకింద తమ బాహ్యలక్షణాలనుబట్టి అనేక జాతులలో జేరుతాయి - అనగా నాటకాలు, నవలలు, కథలు, వ్యాసాలు అని వివిధజాతులుగా విభజించబడుతాయి. ప్రకృతగ్రంథమైన సత్యరాజాపూర్వదేశయాత్రల విషయమేమంటే: ఈగ్రంథం రసలక్షణాన్నిబట్టి రసలక్షణవర్గంలో వొకజాతిఅయిన హాస్యకావ్యాల్లో జేరుతుంది. నింద హాస్యంలో ఒక విభంగనుక—ఈగ్రంథ మొక వచననిందా కావ్యం. ఈగ్రంథమే దానికిగల బాహ్యలక్షణాలనుబట్టి బాహ్యలక్షణవర్గంలోని జాతులైన కథజాతిలోనో, నవలజాతిలోనో జేరుతుంది. దీనిలాంటిదే అయిన ఆంగ్లగ్రంథమగు గలివరుయాత్రలు ఆంగ్లవిమర్శకులచే కథజాతిలోగాక నవలజాతిలో జేర్చబడింది. అందుచేత ఈగ్రంథంకూడా నవలజాతిలో జేరుతుంది. కనుకే యిది నవలజాతికి చెందిన కావ్యమని మొదట చెప్పేను.

(i) ఆడుమళయాళము

ఈగ్రంథభాగం 'స్త్రీలవిషయమై మనవారు చేసిన అన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరూపముగా' అనగా నిందారూపంగా వ్రాయబడింది. ఈభాగంలో గలివరుయాత్రల అనుకరణ యేమీ లేదు. ఆంగ్లగ్రంథంలో యిటువంటి భాగం లేదు. ఈభాగం కేవలం కవియొక్క స్వకపోలకల్పితమే. ఈరచనకు కారణం గ్రంథకర్తే చెప్పివున్నాడు. హిందూ స్త్రీల విషయమై మగవారు చేసిన అన్యాయాలకు మితిలేదు. ఆవిషయమై గ్రంథంలో తడవబడ్డ అంశాలు చాలా వున్నాయి. అందులో ముఖ్యమైనవి కొన్ని—స్త్రీస్వాతంత్ర్యహీనత, స్త్రీవిద్య లేమి, నోములు, బాల్యవివాహాలు, నిర్బంధవైధవ్యం మొదలైనవి. ఈభాగంలో సందర్భవశంగా అనేకమైన విషయాలు చిత్రించబడ్డాయి. అవేవంటే—సంస్కర్తలకు గలిగే ప్రతిబంధకాలు, బహిష్కారణాలు, వింతమతాచార్యులు, కపటసంస్కర్తలు, సభలు, వాదనలు, శాస్త్రులలోని లోపాలు, జ్యోతిశ్శాస్త్రమం దధికవిశ్వాసం మొదలైనవి. స్త్రీల విషయమై చేయబడిన అన్యాయాలకు ముఖ్యకారణాలు — ఒకటి, విపరీతధర్మశాస్త్రులు. రెండు, విమర్శజ్ఞానం లేక ప్రజ లాధర్మశాస్త్రుల ననుసరించడం. పైన పేర్కొబడ్డ అన్యాయా లనాదిగా వస్తున్నాయి. అనేకశతాబ్దా లీమోస్తరుగా గడిచిపోయేయి. కాని జరిగిన శతాబ్దంలో కొంతమంది మహనీయులు సరియైన తాత్త్వికయోచనవల్ల, కొంతవరకు విదేశవాఙ్మయసంపర్కంవల్ల సంఘంలోని మాంద్యాన్ని గ్రహించి దాని నిర్మూలనకై తమజీవితాలను

ధారహోయ నిశ్చయించుకుని కృషిచేసేరు. ఆప్రకారంగా వారు స్వలాభాపేక్షలేక చేసిన కృషికి ఫలితంగా దేశంలో విమర్శశక్తి నాటుకుంది. ఇంతకాలంవరకు కళ్లుతెరుచుకునే యిటువంటి దుర్మార్గాలు చేస్తున్నామా అని జనులాశ్చర్యపడసాగేరు. అయినా మంచి యెప్పుడూ నిరంతరాయంగా వ్యాపించదు. అందరి మనస్సులలోను పాతుకునిపోయివున్న దుర్మార్గాన్ని నిర్మూలంచెయ్యడం వొకంతట గాని జరగదు. పైవిధంగా కొంతమంది దేశశ్రేయోభిలాషులు సంస్కరణ చేస్తూవుంటే, దేశంలో మరొకరకమైన దేశభక్తు లుదయించి సంఘంలో యెలాంటి మార్పు అంగీకరించక మన దేశంలో యేరకమైన అన్యాయాలు అనాచారాలు లేవనీ, శాస్త్రవిహితమైన ధర్మా లెలాగ వున్నాసరే ఆదరణపాత్రాలనీ ఆచరణపాత్రాలనీ, ప్రజలు ఆధునికనాగరికతావిమోహితులు కాకూడదనీ, సంఘంలో వొకవేళ లోపా లున్నా ఆలోపాలను ధ్వంసంచేస్తే మన జాతీయత పోతుందనీ యింకా అనేకవిధాలుగా ప్రజలకు బోధచెయ్యడం మొదలుపెట్టేరు. ఈపక్షం వారి వాదన న్యాయదృష్టి ధర్మదృష్టిగల యెవ్వరికీ రుచించదని వేరే చెప్పనక్కర్లేదు. ఆమోస్తరుగా సంస్కారపక్షానికి పూర్వాచారపక్షమని ఒక ప్రతిభటపక్షం యేర్పడింది. ఈరెండుపక్షాలవారికి నిరంతరవాగ్యుద్ధం జరుగుతూవుంటుంది. అయినా సంస్కారపక్షవర్తులు అన్ని కష్టనష్టాలకు వోర్చి కేవలం జాత్యభివృద్ధే తమ అభివృద్ధిగాను, జాతిసుఖమే తమ సుఖంగాను, జాతిస్వేచ్ఛే తమ స్వేచ్ఛగాను చూసుకుని దేశసేవే తమకు మోక్షమనుకుని కృతనిశ్చయులై పాటుపడడంవల్ల ఈసంస్కర్తలకు దైవబలంగూడా తోడయింది. అందుచేత క్రమక్రమంగా దేశంలోని దోషాలు, మూర్ఖత్వం నశించి వాటిస్థానంలో జ్ఞానం, విమర్శశక్తి నాటుకుంటున్నాయి.

ఈనవలకర్తఅయిన వీరేశలింగంగారు తమ జీవితాన్ని సంపూర్ణంగా బలిదానం చేసి ఆంధ్రజనుల్లోవున్న అనేకదురాచారాలను, చెడునమ్మకాలను ధ్వంసంచెయ్య ప్రయత్నించేరు. ఈయన జనులకు నేరుగా వుపన్యసించి దేశంలో సంస్కారసంఘాలను, సమాజాలను స్థాపించేరు. ఆమోస్తరుగా వుపన్యాసకధర్మంగా వుపన్యాసాలిచ్చి సంస్కరణకు పాటుపడ్డారు. కాని యేసంస్కరణలోనైనా వొక్క వుపన్యాసకులకే గాక కవులకుకూడ స్థానముంది. కవిఅయినవాడు అనేకరకములైన స్వకపోలకల్పితరచనలవల్ల సంస్కరణకు తోడుపడవచ్చు. వీరేశలింగంగారు వుపన్యాసకమూర్తిత్వంలో (Personality) వుపన్యాసాలిచ్చి సంఘాలను, సమాజాలను స్థాపించేరు. ఇంక కవిమూర్తిత్వంలో వారు చేసిన దేమంటే అనేకరకములైన నాటకాలు, ప్రహసనాలు, నవలలు, కథలు రాసి వాటిమూలకంగా జనులయొక్క అభిప్రాయాలను, సాంప్రదాయాలను మార్చచూచేరు. ప్రస్తుతగ్రంథ

మాత్రగతిలో చేరిందే. కనుక యీకావ్యోద్దేశం సంఘసంస్కరణ.

ఈకథానాయకుడి పేరు సత్యరాజు. ఇతడు మొదట తనచరిత్ర చెప్పుకుని, తర్వాత తన ప్రయాణకథను, అటుతర్వాత దేశ వృత్తాంతాన్ని చెప్తాడు.

సత్యరాజు పరమపూర్వాచారికుడు. వీనిలో లేని లక్షణాలు పూర్వాచారికులలో లేవు, పూర్వాచారికులలో లేని లక్షణాలు వీనిలో లేవు. అందరిపూర్వాచారికులలాగే ఇతడు ధర్మశాస్త్రబద్ధుడై ప్రవర్తించ నిశ్చయించుకుంటాడు. వీనికి ధర్మశాస్త్రబుద్ధేగాని స్వబుద్ధి లేదు. స్వంత యోచన అంతకుముందే లేదు. ఎక్కడైనా యేవిషయమైనా శాస్త్ర విరుద్ధంగా జరిగినట్లు తన కనుభవంలోకి వచ్చినా 'లేదు, లేదు, కాదు, కాద'ని వాదిస్తాడు గాని నిజ మంగీకరించడు. ఆస్థితిలో వీనిని బ్రహ్మఅయినా వొప్పించలేడు. సత్యరాజు ద్వైతి. అందుచేత ప్రపంచంలో వున్న మతాలలోకెల్లా ద్వైతమే వుత్కృష్టమైనదనీ, తక్కిన మతాలన్నీ గర్హ్యమైనవనీ తలుస్తాడు. పరమతసహనమంటె వీనికి తెలియనే తెలియదు. సాంఘికఅన్యాయాలన్నీ న్యాయాలనీ, వాటిరక్షణకోసం తాను పుట్టేడనీ యితని వూహా. సత్యరాజు తన జన్మమంతా వొక సత్యపరీక్షఅని, సత్యసంరక్షణే తన వుద్యోగమని భావిస్తాడు. కాని నిజం చూడబోతే అత డసత్యమేగాని సత్య మెరుగడు. వక్రచింతనేగాని సవ్యచింతనే యెరుగడు. వీనికి ప్రపంచకజ్ఞాన మున్నట్టుగా కథలో మన కెక్కడా కనబడదు. అయినా వీనికున్న అహంభావం, ఆత్మస్తుతి, పరనింద మరొక పురుషుడి కుండబోవు.

ఈకథానాయకుడికి చిన్ననాడు చదువంటలేదు. పెద్దయినపిదప కొన్నాళ్లిదో చిన్న వుద్యోగం చేసి భార్య చనిపోగా, తాను అప్పులపాలైపోగా యింకా అనేకపరిస్థితులవల్ల వైరాగ్యం పొంది విరాగియై తీర్థయాత్రలు చెయ్యా లనుకుంటాడు. కాని నిజంగా అంతరంగవైరాగ్యం లేనందువల్ల రాగాలు తగ్గక దివ్యక్షేత్రాల మాట అటుంచి మొట్టమొదట ఆడమళయాళానికి యాత్రచేసి ఒక్క మొగపురుగైనా లేని ఆదేశంలో కొన్నాళ్లు నివసించి అటుతర్వాత మరేదైనా యాత్ర చేయ సంకల్పించుకుని ప్రయాణమౌతాడు. మార్గంలో శాస్త్రనిషిద్ధములైన అనేకపనులు బుద్ధిపూర్వకంగా చేస్తూ ప్రాయశ్చిత్తాలనబడే వింతవిరుగుళ్లు సేవిస్తూ ఆడమళయాళం జేరుకుంటాడు. ఆదేశానికి జేరకముందు దారిలో ఒక ఎరవవాడి చేతిలో తన డబ్బునంచి పెట్టి అది వాడెత్తుకుపోగా జ్ఞానవంతుడుకాబట్టి బ్రాహ్మడికి దానంచేసే ననుకుని సంతోషిస్తాడు.

సత్యరాజు ఆడమళయాళం చేరేడు. ఆదేశంలో దిక్కులు యెంతో విచిత్రంగా నిర్ణయిస్తాడు. అక్కడ కొన్నాళ్లుండి అన్ని సంగతులు తెలుసుకుని ఆదేశంలోని ఆడవాళ్లు మొగవాళ్లకు చేస్తూవున్న అన్యాయాలకు

చాలా దుఃఖించి వారి విముక్తిసాధనం, వెతుకుతూ, అక్కడి విదేశప్రభుత్వంవారు ఆ దేశపు పురుషులయొక్క స్వాతంత్ర్యంకోసం పాటుపడుతున్నారని విని హర్షించి తానుకూడ వారికి చెయ్యగలిగినంత సహాయం చెయ్యదలచుకుంటాడు. ఆడమళయాళంలో అన్యాయాలు మొగవాళ్లకి జరుగుతున్నాయేఅని సత్యరాజు విచారించేడు గాని అవన్నీ మన దేశపు ఆడవారిపట్ల జరగవలసినవే అనీ, దోషాలు కావనీ, మన దేశసంప్రదాయాలకవి కొన్ని తోడుపడుతాయనీ, మళ్లీ తాను స్వదేశానికి వచ్చినప్పుడు తనవారికి ఆడవాళ్లకు ముక్కుకొయ్యడం, ఆడవాళ్లను బోనులలో నుంచడం మొదలైనవి కొన్ని బోధించి స్థాపించి స్త్రీలు స్వేచ్ఛగలిగి చెడిపోకుండా వుండేటట్లు జాగ్రత్తపడాలని అనుకుంటాడు. ఆడమళయాళంలో సత్యరాజు అనేకరకాలైన అనుభవాలు పొందేడుగాని యేం ప్రయోజనం! అవి వాని మూర్ఖత్వాన్ని మరింత హెచ్చుచేసేయి; జ్ఞానాంకురాన్ని పుట్టించలేదు.

సత్యరాజు తిరిగి మన దేశానికి వచ్చి అందరిజనులకు కొన్నివిషయాలు రహస్యంగా చెప్పుద్దేశించి ‘అయ్యా! మావూరికి పిక్కెట్టిప్పించం’ అన్నట్లుగా "మీరు కానిచీటిమీద నా కుత్తరము వ్రాసినపక్షమున నా యిప్పటి వాసస్థానాదులను మీకు వివరముగా దెలిపెదను" అని ప్రకటిస్తాడు.

ఇదొక నిందారచనకదా! నిందారచనను గురించిన విమర్శ తక్కిన రచనలను గురించి వున్నట్టుగా వుండదు. నిందారచనయొక్క తత్వంమాత్రం తేటపరచి వూరుకోవాలిగాని కావ్యవస్తువును, అందలి తబిశీళ్లను విమర్శించకూడదు. ఏలనంటే, నిందాగ్రంథంలో వున్న అంశాలయొక్క అర్థంగాక వాటి పరార్థాన్ని గ్రహించాలి. కనుక చదువరి తాను చదువుతూన్న అంశాలను తారుమారు చేసి అర్థంచేసుకుంటూ వుండాలి. ఈలక్షణాల చేత నిందాకావ్యం తక్కిన కల్పనాకావ్యాల వంటిది కాదు. కనుక తక్కినవాటిని విమర్శించినట్టుగా నిందాకావ్యాన్ని విమర్శించకూడదన్నాను. అన్నిటిలోకంటె నిందాకావ్యంలో ధ్వని యెక్కువ. అందుచేతే అన్నికావ్యాలలోకి నిందాకావ్యం వుత్తమంగా గణించబడుతూంది. నిందయొక్క శక్తిని గురించి వేరే చెప్పనక్కర్లేదు. ఏసంఘంలోనైనా, లేక యేవ్యక్తిలోనైన వున్న విచిత్రప్రకృతిని ధ్వంసంచెయ్యాలంటే నిందాపద్ధతి శ్రేష్ఠం. దానియొక్క శక్తి అటువంటిది. కాని నిందారచన బహుకష్టం. ఆపనిని ప్రజ్ఞావంతుడు జయప్రదంగా చెయ్యవలసిందేకాని ప్రజ్ఞాహీనుడు లేక బాలగ్రంథకర్త చెయ్యబోతే నిస్సారమై దోషయుక్తమై బెడిసికొడుతుంది. అనేకప్రతిభావంతులుకాబట్టే వీరేశలింగంగారీకావ్యాన్ని అనన్యసామాన్యంగాను, అశేషజయప్రదంగాను నెరవేర్చ కలిగేరు.

ఈనవలలోని భాంగీఫిండీపాత్రలో వీరేశలింగంగారు తమ సంస్కారవిషయకాను

భవాలు కొన్ని పెట్టివున్నారు. ఈ గ్రంథంలో వున్న కల్పన, చతురతనుగురించి వేరే చెప్పనక్కర్లేదు. గ్రంథకర్తయొక్క అద్వితీయ ప్రజ్ఞ ప్రతివాక్యంలోను స్పష్టమౌతూంది. శైలినిగురించి యేమంటే—మొత్తంమీద శైలి గ్రాంథికం. భాష సరళం. ఈ శైలిలో వొక్క పొల్లుమాటైన కనబడదు. అంతజిగి వుంది. దీనిలోని వొకమాటను తీసివేస్తే దానికి జోడు మాట వొకక్క శైలి చెడుతుంది. అట్టి పదవిన్యాసంతో భాసిల్లుతూంది యీ శైలి. కవికి 'గద్యతిక్కన' బిరుదు సార్థకమైంది. కాని శైలిలో వేగ ముండదు. మందప్రవాహం-గాలికి నెమ్మదిగా కదిలే సరోవర ప్రవాహంలాగ వుంటుందిగాని స్వాతంత్రించి వేగంగా ప్రవహించే నదిలాగ వుండదు. గ్రంథంలో అక్కడక్కడ వ్యావహారికం ప్రయోగించబడింది. సత్యరాజుయొక్క కొన్ని సంభాషణలో వ్యావహారికభాషే వుపయోగించబడింది. దీనినిగురించి ముందే చెప్పివున్నానుకదా.

### (ii) లంకాద్వీపము

'లంకాద్వీపం' సత్యరాజాపూర్వదేశ యాత్రలలో రెండోభాగం.

"ఈభాగంలో జ్యోతిశ్శాస్త్రములోని జాతక భాగముయొక్కయు, ముహూర్తభాగముయొక్కయు నవిశ్వసనీయతను పరోక్షముగా దెలుపుటకయి షయిపట్ల లంకాయాత్రయను నీరెండవభాగమునుగూడ జేసి ప్రకటించితిని"

(కం. వీ. స్వీ. చ. రెం. ౧౮౩-వ పుట.)

అని వీరేశలింగంగారు రాసేరు. అనగా ఈ భాగంలోని ముఖ్యోద్దేశం జ్యోతిషాన్ని నిందించడం అన్నమాట. ఇంతేకాదు, కవి చెప్ప మరచినాడుగాని మరొక ముఖ్యాంశంకూడా కనబడుతూంది. దానిని ముందు చెప్తాను.

ఆంగ్లరచయితఅయిన స్విఫ్ట్ రాసిన "గలివరుయాత్రలు"లో లంకాద్వీపం వంటి యాత్రాభాగ మొకటి వుంది. దానిపేరు బ్రాబ్‌డింగ్‌నాగ్‌యాత్ర. వీరేశలింగకవి పై యాత్రలోని అంశాల నొకటిరెంటి ననుకరించేరు. అనుకరణ అంతకంటె హెచ్చుగా లేదు. ఈ రెండు భాగాలలోను వున్న సమానాంశాలను మొదట చెప్పి తర్వాత సామ్యాంశాలను చెప్తాను. సమానాంశా లేవంటే—గలివర్ యొక్క యజమానిలాగే సత్యరాజు యొక్క యజమానికూడా సత్యరాజును ప్రదర్శించి ధనం సంపాదిస్తాడు. గలివరును వొక కోతి యెత్తుకుపోతుంది. అలాగే సత్యరాజును కూడా వొకకోతి యెత్తుకుపోతుంది. సామ్యాంశా లేవంటే—గలివరు యెలుకతో పెద్దయుద్ధం చేస్తాడు; సత్యరాజు మేకపిల్లతో గొప్పయుద్ధం చేస్తాడు. గలివరు పాలగిన్నెలో పడి రక్షించబడుతాడు; సత్యరాజుకూడా ఒకచెట్టుపాదులో వున్న నీటిలో పడి రక్షించబడుతాడు. గలివరు కందిరీగలతో పెద్దయుద్ధం చేస్తాడు; సత్యరాజు నల్లితో ఘోరయుద్ధం చేస్తాడు. ఈవిధంగా సామ్యాంశాలు కొన్ని వున్నాయి. కథలు కొంత

వరకు ఒకేమోస్తరుగా వున్నాయిగనుక మూలగ్రంథంలోని కొన్నికొన్ని భావాలు 'లంకాద్వీపం' లోకి దొర్లివుండడం సహజం. ఈభాగాలను రాయడంలో యీయిద్దరి గ్రంథకర్తల వుద్దేశాలు వేరు. బ్రాబ్‌డింగ్ నాగ్‌యాత్రను రాయడంలో స్విఫ్ట్‌యొక్క వుద్దేశం ఆకాలంలోని ఐరోపా రాజకీయస్థితులను నిందించడమే. వీరేశలింగంగారు తమ భాగంలో మూడుపనులను చేసేరు. ఒకటి, పూర్వాచారికులను నిందించడం. రెండు జ్యోతిశ్శాస్త్రాన్ని నిందించడం. మూడు హిందూపురాణాలను వికటం చెయ్యడం (Parodying). ఇట్టిమూడులక్షణాలతోను ఈకావ్యభాగం అసమానంగా వుంది.

సత్యరాజుయొక్క పూర్వాచారికత్వం వెనుకే చెప్పబడింది. ఈతనికి ధర్మసందేహ మెన్నడూ లేదు. తాను చేసే పనికి వొకవేళ శాస్త్రాధారం లేకపోయినా సందేహించకుండా ఆవిషయమైన కొత్తసూత్ర మొకటి శాస్త్రాల్లో చొప్పించివేస్తానంటాడు. అతని సత్యాఃరత్వ మటువంటిది. ఈ భాగంలో సందర్భవశంగా సామాన్యజనుల స్వభావం నిరూపించబడింది. లంకావాసులచేత సత్యరాజు దేవుడుగా చూడబడుతాడు. అనేకమైన దక్షిణాలు నైవేద్యాలు పుచ్చుకుంటాడు. ఆఆదాయంవల్ల అతను గాకపోయినా అతని యజమానుడు బాగుపడ్డాడు. ఇతన్ని వాల ఖిల్యమహర్షి అని అనేకమంది నిర్ధారణచేసి అనేకప్రశ్నలతో వస్తారు. వాళ్లందరికి తనకు గల దివ్యదృష్టిని సాచి జవాబులు చెప్తాడు. ఆచెప్పినవాటిలో మూడువంతులు తప్పిపోగా దానికి వారి అవిశ్వాసమే కారణ మంటాడు. జనులలోని అజ్ఞానం ఈరీతిగాను యింకా అనేకరీతులుగాను చిత్రించబడింది.

లంకాద్వీపంలో అంతా రాక్షసులు కదా, రాక్షసులలోకూడా పరివర్తన ప్రారంభ మయింది. అక్కడకూడా ఆసమకాలీనమాళంలో లాగే రెండుపక్షాలేర్పడ్డాయి. ఒకటి నవనాగరికపక్షం; రెండోది పూర్వాచారపక్షం. పూర్వాచారపక్షంవర్తులు తరతరాలనుంచీ వస్తూన్న ఆచారాలను, విశ్వాసాలను విమర్శించకూడదనీ, వాటిలో యెన్నడూ లోపాలుండవనీ అంటారు ప్రతిపక్షంవారైన నాగరికపక్షవర్తులు పూర్వాచారాలను, విశ్వాసాలను విమర్శించి మంచివైతే అవలంబించాలనీ చెడ్డవైతే త్యజించాలనీ, భగవంతుడిచ్చిన జ్ఞానాన్ని కొంతవరకు వుపయోగించాలనీ, విదేశాచారాలైనా మంచివాటిని సంశయించకుండా పరిగ్రహించాలనీ అంటారు. ఈ యుభయపక్షవర్తులకు ముఖ్యంగా దేనినిగురించి కలహం వచ్చిందంటే జ్యోతిశ్శాస్త్రాన్ని గురించి. పూర్వాచారపక్షంవారు జ్యోతిశ్శాస్త్రాన్ని యేమాత్రం సంశయించకుండా అనుసరించాలంటారు. ప్రతిపక్షవర్తులు జ్యోతిశ్శాస్త్రఫలాఫలాలు గుడ్డేటుగా కనబడుతున్నాయనీ, ఏవొక్కతీరు పద్ధతి వాటిలో కనబడడం లేదనీ, అందుచేత జ్యోతిశ్శాస్త్రంలో తమకు విశ్వాసం లేదనీ అంటారు.

ఈరెండుపక్షవాదులకు తరచుగా వాక్కలహాలు జరుగుతూవుంటాయి. సామాన్యరాక్షసులు సంస్కారపక్షాన్నే ఆదరించడం మొదలు పెట్టేరు. సత్యరాజుకు జ్యోతిషంలో సంశయ రహితమైనవిశ్వాస ముందికాబట్టి పూర్వాచారికులవైపు జేరుతాడు. అతనికీ, పూర్వాచారికుడైన అతనియజమానుడికీ జ్యోతిషమునుగురించి అనేకసంభాషణలు జరుగుతాయి. రాక్షసజ్యోతిషం హిందూజ్యోతిషం నుంచి భేదిస్తుంది. కాని సత్యరాజుమాత్రం ప్రాణభీతిచేత రాక్షసశాస్త్రాన్ని విమర్శించక రాక్షసశాస్త్రం బహుపరిపూర్ణమైనదనీ, దోషరహితమైనదనీ చెప్తాడు. పాపం! ఈమోస్తరుగా తన సత్యపరత్వానికి తీరని కళంకమొకటి తెచ్చిపెట్టుకున్నాడు. సామాన్యంగా జ్యోతిష దత్తఫలాలు తప్పిపోతూవుండడం చూసి సత్యరాజు, జ్యోతిషం పని ముహూర్తాలు నిశ్చయించడమేకాని దుష్ఫలప్రాప్తి తప్పించడం కాదనీ, జ్యోతిషానికి పార్వతీశాపముండడమే పైదోషానికి కారణమనీ పలికి జ్యోతిశ్శాస్త్రం నిర్దోషమైన శాస్త్రమని నిర్ధారణచేస్తాడు.

ఈభాగంలో గ్రంథకర్తచేత జ్యోతిషంవల్ల జనులకు యెటువంటి నష్టాలు గలుగుతున్నాయో తెలుపబడివుంది. దుష్ఫలములనిచ్చే యీశాస్త్రమందలి విశ్వాసంవల్ల ప్రజలలో పురుషకారం స్వబుద్ధీ నాశనమౌతున్నాయి. అందుచేత అనేకరీతులుగా జ్యోతిషమీభాగంలో నిందించబడింది.

ఇంక పురాణకావ్యాలెట్లు వికటించ (వికటంచేయ) బడ్డాయంటే — పురాణాలలో వున్నటువంటి అలోక-అసహజమైన అంశాలు, అతివిచిత్రాలైన వుపాఖ్యానాలు యేయితర గ్రంథాలలోను వుండవు. ఈవిపరీతములనన్నిటినీ నమ్మడం పూర్వాచారికుల లక్షణం. ఏవిషయమైన యెంత నమ్మతగనిదిగా వున్నా వారు మారుప్రశ్న వేయక 'ఆకాలంలో చెట్లకు పక్షులకు మనుష్యభాష వచ్చుతక్కినవాటి మాట చెప్పే దేమిటంటారు.' ఈరకమైన అజ్ఞానాన్ని నివారించడానికే యీభాగంలో పురాణాలు వికటించబడ్డాయి. సత్యరాజు అచ్చపు పూర్వాచారికుడుకదా! ఇతడు తనకూ మేకపిల్లకూ జరిగిన యుద్ధాన్ని అనగా ఛాగశాబక బ్రాహ్మణకుమారకసమూపాఖ్యానాన్ని చదివితే సమస్తపాపాలు హరిస్తాయంటాడు. ఇట్లే పాపాలను హరించే మరికొన్ని వుపాఖ్యానాలుకూడా గ్రంథంలో వున్నాయి.

పురాణగ్రంథాలలోని రాక్షసులు కామరూపులుకదా. వీరిదైన యీగుణం గ్రంథంలో బహువిచిత్రంగా చిత్రించబడింది. లంకావాసులు కామరూపు లవడంచేత వారి న్యాయస్థానాలలో తీర్పుచెప్పేవారు జ్యోతిష్కులుగాని న్యాయాధికార్లు కాదు. ఈవిచారణ లధికహాసజనకంగాను విచిత్రంగాను వున్నాయి. సత్యరాజును ఒకరాక్షసస్త్రీ వలచింది. వీళ్లిద్దరి సంభాషణలు అతివిచిత్రం-వినోదం. ఔచితితప్పని హాస్యంతో యీ

ఘట్టం అద్భుతంగా వుంది. ఈ మోస్తరుగా యింకాఅనేకమోస్తర్లుగా పురాణాలు వికటించబడ్డాయి.

"లంకాక్షేపం" కొంతవరకు వికట కావ్యమని అన్నానుకదా. అసలు వికటరచనలయొక్క వుద్దేశ మేమిటి? ప్రయోజన మేమిటి? గ్రంథకర్తలు తమ గ్రంథాలలో అనేకమైన లోపాలు చేస్తారు. ఆలోపాలను ఆగ్రంథములశైలి ననుకరిస్తూ బైటపెట్టడమే వికటరచనల ఉద్దేశం. ఆలాగు చెయ్యడంవల్ల ఆగ్రంథకర్తలు తమ గ్రంథాలలోని ఆలోపాలను సవరించుకోవడం వాటిని ముందెప్పుడు మరల ఆచరించకపోవడం జరుగుతుంది. కనుక వికటరచన లెప్పుడూ సమకాలికగ్రంథాల మీదే వుంటాయి. కాని ప్రకృతగ్రంథంలో యెన్నడో రచించబడ్డ పురాణాలు వికటించబడ్డాయి. దీనివల్ల పురాణకర్తల కేం ప్రయోజనం? వారు తమ తప్పులను తెలుసుకోగలరా లేక సవరించుకోగలరా! దీనివల్ల పురాణకర్తలకు తెలియబోయే దేమీ లేదు. కాని యీరచనయొక్క వుద్దేశం పురాణకర్తలకు వారి లోపాల నెత్తిచూపడం కాదు. వాటిని చదివేటటువంటి మనకు మనం చేసే తప్పులను తెలియజేయడం. పురాణకావ్యాలను మన మెంత అజ్ఞానంగాను అక్రమంగాను విశ్వసిస్తున్నామో అందరికీ తెలిసిన విషయమే. ఆరకమైన పురాణపఠనవిధానాన్ని మార్చడానికే కవి ఈవికటకావ్యం రాసేడు. ఈ కావ్యంలో పురాణశైలినిగాక పురాణాంశలను అనుకరించడంవల్ల యీరచన మనను నిర్దేశించి చేయబడిందేకదా. ఆమోస్తరుగా పురాణకావ్యాలు వికటించబడ్డాయి.

పైన జెప్పబడ్డ విధంగా ఈగ్రంథంలో నింద, వికటం కూడ కనబడుతున్నాయి. నిందాకావ్యపదార్థాన్ని దూరంనుంచి చూసి గ్రహించవలసిందేగాని ముట్టిచూడకూడదని ముందే చెప్పేను. ఆవిషయమై యింక హెచ్చు చెప్పనక్కర్లేదు. నిందాగ్రంథం అన్నిగ్రంథాల లాగ సులభంగా అర్థమవదని ఈక్రింది విచిత్రాంశంవల్ల మనం భ్రమపడవచ్చు.

"దీనిని మనవా రద్భుతపడి చదువదొడగిరి. మనలో నింగ్లీషు రానివారనేకులు కల్పితకథకును, సత్యచరిత్రకును భేదము కనిపెట్టలేకున్నారు. ఈపుస్తకము ప్రకటింపబడినప్పుడు సత్యరాజనునతడు నిజముగానేయున్నాడనియు, నిజముగానే యతడీయాత్రలు చేసినాడనియు భ్రమపడి యాతనికి వ్రాసి తాము స్వయముగా నెక్కువ వివరముల దెలిసికోవలెనన్న యభిలాషముతో నాతనికి వ్రాయవలసిన యుత్తరముయొక్క పైవిలాసమును దెలుపవలసినదని బహుస్థలములనుండి నాకు లేఖలు వ్రాసిరి."

(కం. వీ. స్వీ. చ. రెం. ౧౮3-వ పుట.)

జనులీమోస్తరుగా భ్రమపడ్డారంటే మన మాశ్చర్యపడవలసింది లేదు. సామాన్యజనుల మనస్సు పురాణాలమనస్సు. వారెంతసేపు మోక్షమిస్తాయని, పుణ్యం తెస్తాయని, పాపాలు హరిస్తాయని, ఒక్కపురాణాలను ఆలకిస్తారుగాని అంతకంటె మరొక సాహిత్యగ్రంథాన్ని యేజన్మలోను వినరు. అందుచేత

వారి మనస్సులు లోకాతీతవిషయాలను అసహజాంశాలను మనమనస్సులు యథార్థ విషయాలను నమ్మినట్టుగా నమ్ముతాయి. కనుకే యీసత్యరాజుయాత్రలు నిజమని, యింకా యెక్కువ వివరాలు తెలిసికోవాలని అభిలాషపడి గ్రంథకర్తకు లేఖలు రాసేరు. జనులయొక్క ఈరకమైన అజ్ఞానం విద్యాబోధవల్ల పోవలసిందేకాని మరొకమోస్తరుగా పోదు. అయినా గ్రంథకర్త యీగ్రంథాని కొక చిన్న వుపోద్ఘాతం రాసివుంటే యిలాంటి భ్రమ పామరులకు కలిగివుండేది కాదు. ఉపోద్ఘాతాని కంతటి ప్రభావ ముంది.

ఈకథాకల్పనయొక్క గొప్పతనాన్ని గురించి, కవియొక్క పాండిత్యసామర్థ్యాలను గురించి వేరే చెప్పనక్కర్లేదు.

సత్యరాజు వొక హాస్యపాత్ర. స్విఫ్ట్ రాసిన గలివర్ మాత్రం సామాన్యుడేగాని హాస్యపాత్ర కాదు. సత్యరాజుయొక్క మాటలలోను, తలపులలోను మనకు విశేషహాస్యం కనబడుతుంది. అతడుమట్టుకు తాను విశేష గంభీరంతోను, సత్యసంధతతోను పనులు చేస్తున్నా ననుకుంటాడు. సత్యరాజుయొక్క పాత్రపోషణ దోషరహితంగా వుంది. నిందాహాస్య। మెప్పుడు తేటహాస్యంలాగ నిర్మలమైనది కాదు. కాని నిందాహాస్యం తేటహాస్యంకంటె యెక్కువ లోతైనది. సత్యరాజొకహాస్యపాత్రకదా. మనవాఙ్మయంలో హాస్యగ్రంథాలు విశేషంగా లేవు. హాస్యరసంగల కొన్ని గ్రంథా లున్నా, హాస్యపాత్రలు గల గ్రంథాలు తక్కువ. 'సాక్షి' లో వొకటిరెండు హాస్యపాత్ర లున్నాయి. చి. లక్ష్మనరసింహకవిగారి 'గణపతి' హాస్యపాత్ర. మొ. నరసింహశాస్త్రిగారిచే రచింపబడ్డ 'బారిష్టరుపార్వతీశం' హాస్యపాత్ర. ఇట్లు హాస్యపాత్రలు గల గ్రంథాలుకొన్ని తెలుగులోవున్నాయి — నాటకాల సంగతి ప్రహసనాలసంగతి యిక్కడ చెప్పడంలేదు. ఒక్కవచనకావ్యాల సంగతే చెప్తున్నాను.

తెలుగువాఙ్మయంలో నిందారచనలు చాల తక్కువ. 'సాక్షి' వ్యాసాలలో కొన్ని నిందావ్యాసా లున్నాయి. ఇతరగ్రంథకర్తల రచనల్లో చిన్నచిన్న నిందాభాగాలు కనబడుతున్నాయి. కాని పెద్ద నిందాగ్రంథాలు లేవు. ఇటీవల వొక చిన్ననిందాకావ్యం ప్రకటించబడింది. శ్రీవరహాగిరిభగీరథిగారిచే రచించబడ్డ 'భావనాప్రపంచ'* మొక నిందాకావ్యం. ఈచిన్నరచనలో సాక్షిశైలి అనుకరించబడింది. అయితేయేమి తీక్ష్ణమైన నిందతో యీరచన శ్లాఘాపాత్రంగా వుంది.

శ్రీవీరేశలింగంగారు పెద్దనవలలు రెండు, చిన్ననవల ఒకటి రాసేరుగదా! నైపుణ్యం

* ఈగ్రంథం వలయువారు: వరహాగిరి బాలత్రిపురసుందరరావు, జగ్గంపేట, పెద్దాపురముతాలూకా, తూర్పుగోదావరిజిల్లా అని రాయాలి.

చేత, ప్రాశస్త్యంవల్ల సత్యరాజాపూర్వదేశ యాత్ర లీనవలలు మూడిటిలోకి వుత్తమ మైనది. మొత్తంమీద వీరి అన్ని వచన ప్రబంధాలలోకి యిదే వుత్తమమైన గ్రంథం.

(ఈనవలను ముద్రాపకులు విచిత్రము లైన చిత్రపటాలతో ముద్రింపించి చదువరు లకు ఆకర్షకంగాను, ఆనందదాయకంగాను వుండేటట్లు ప్రకటిస్తారని తలస్తున్నాను.)

---

## భారతి

'కవిరాజ హంస'

శ్రీలిమ్మని కోరకయే
　పాలిమ్మని వెంటనంటి ప్రార్థింపకయే
లాలించి బిడ్డవలె నను
బాలింపఁగఁజాలు పొలఁతి భారతి దలఁతున్.

నెలబాలుఁడు తలపూవఁట!
తెలిబాలుఁడు కొమరుఁడంట! తెలిదామరలో
పలిబాలుఁడు పెనిమిటి యఁట!
తెలిచెలియఁట తాను! భారతికి జేజేజే!!!

కాంతుఁడెన్న హిరణ్యగర్భుఁ డౌటనె కదా
　శుద్ధసువర్ణవిస్ఫూర్తి వైతి,
సుతులెన్న వరభాగవతు లౌటనే కదా
　నామసంకీర్తనానంద వైతి,
చెలులెన్న సత్పద శ్రీలౌటనే కదా
　పరమార్థ తత్త్వసంపన్న వైతి,
ప్రకృతులెన్న మనోజ్ఞ సుకృతులౌటనెకదా
　నిత్యనిర్మలకీర్తినిలయ వైతి,
అమృతమయ సత్యవాణి వీవగుటనె కద
లోకపావనారంభ సుశ్లోక వైతి
నిగమమంత్రార్థమూర్తి వీవగుటనెకద
భారతీ! విశ్వమంగళాధార వైతి—

జ్ఞానసాగర కన్యకాజ్ఞప్తి నుంచు
పలుకుఁబలుకున నమృతంబుఁ జిలికికొంచు
జడజగతికెల్లఁ జైతన్యశక్తినించు
భారతీ! నీకిదే నమస్కార మమ్మ!

కవినగుచు రాజునగుచును
వివరింపఁగ హంసనగుచు విద్యార్ణవ సం
భవసుకృతి నలంకృతిగతి
దివి భువి మెచ్చంగ భారతిని సేవింతున్.

---

# తిక్కన*

శ్రీ రాజా పార్థసారథిరాయణింగారు, పానగల్లు రాజావారు

తిక్కన్నవంటి మహనీయులు అన్నిదేశములందును అన్నికాలములందును గలుగుచుండువారు కారు. ఏదోయొకదేశమున నెప్పుడో యొకప్పు డాదేశము భాగ్యవశమునఁ గలుగుచుందురు. అట్లరిదిగఁ గలిగిన యా మహాపురుషులను వారి మహిమాతిశయములను నెఱింగిన వారు, వారి యనంతరమున, వారిని స్మరణమునకుఁ దెచ్చుటకై తగుసత్కార్యముల ననేకవిధములఁ గావించుచుందురు. కొందఱు అట్టివారి పేర స్థిరముగ నుండునట్లు వనతటాకాదుల నిర్మింతురు. కొందఱు లోహశిలామయాదులగు వారి రూపములఁ గావించి బహిరంగప్రదేశముల స్థాపించి జనులకు వారియందు జ్ఞాపకము కలుగునట్లు చేయుదురు. మఱికొందఱు ప్రతిసంవత్సరమును వారి జయంతుల నడుపుచు నామహానుభావుల చర్యల నుగ్గడించుచు వారి యూహలను, భావములను, నుద్దేశములను ప్రచురించి కీర్తించి స్మరించుచుందురు.

మన మిప్పుడు సమావేశమైనది యీకడపటి పద్ధతి నవలంబించి తిక్కనజయంతియుత్సవము చేయుటకే. ఈయుత్సవములను స్థిరముగ నెఱవేర్పఁగలుగుదుమేని తక్కిన యన్నిపద్ధతులకన్న నిది యుత్కృష్టమైనదని తలంపఁదగుము. ఆసత్పురుషుల పేరుల స్థిరపఱచుట మాత్రమే వీని యుద్దేశముగాదు. వారి యాశయములను, చారిత్రములను జనుల మనముల నాటునట్లు స్మరణమునకుఁ దెచ్చుటచేత వారి నాదర్శముగ నిడికొని యట్టి కార్యములకుఁ గొందఱినైనఁ బురికొల్పఁజాలుట వాని ముఖ్యఫలము. కొంతకాలమునకు వనతటాకాదులు నామావశిష్టములు కావచ్చును. లోహశిలామయాదులగు రూపములు రూపావశిష్టములు కావచ్చును. జయంతు లట్టివికావు. ఆయుత్సవకాలములందు వారి చర్యల నెల్లడించుచు వారి యుత్కృష్టతను జేరినవారి మనస్సుల ముప్పిరిగొనునట్లు చేసి వారియందుఁ గొందఱినైన నా మహనీయుల చరిత్రములఁ గొంతవఱకైన ననుకరింప నుత్సాహపరిపూర్ణులఁ గావించును. ఈతిక్కనజయంత్యుత్సవము లిట్టివిగా భావించెద. ఇప్పు డిక్కడఁ గూడియుండు పండితులలోఁ దిక్కన సంగతులు చక్కఁగ నెఱింగి విచారించినవారు ఆయన గుణాతిశయములను, భావములను, ఆయన సాధించిన మహాకార్యములను నుత్సాహసమన్వితముగ వర్ణించుటవలన వినువారి మనస్సుల నాకర్షించి వారి భావముల నాసత్పురుషునియందును, నాయనచర్యలయందును లయింపఁజేసి వారి భావముల కొకవిధమైన యౌన్నత్యమును, గాంభీర్యమును గలిగించి శుభకార్యములకుఁ బూనఁ బురికొల్పుట చిత్రముగాదు. అది యలవడినయెడల నీజయంతి ఫలవంతమైన దనఁదగును.

ఈకాలమున సామాన్యముగ నిట్టిజయంతుల జరుపునప్పుడు తదుత్సవమూలపురుషుని చిత్తరువుమ ప్రదర్శించుట సంప్రదాయము. చేరినవారి చిత్తముల నాకర్షించుటకీ చిత్తరువులు నిరుపమాన సాధకములుగానుండును. అయిన నీయెడ మనకట్టి సాధక మసాధ్యము. మన తిక్కనకాలమున నిట్టిచిత్తరువులు - యథారూపములగు చిత్తరువులు లిఖించుట - యెక్కువ వాడుక లేకుండినది. తిక్కనచిత్తరువట్టిది మనకు లభించినదికాదు. కనుక నట్టి ప్రదర్శనమునకు వీలులేదాయె. ఇఁక వాగ్రూపమైనచిత్తరువైననున్నదా యన్న నదియు యథారూపమైనది లేదనవలసియున్నది. అప్పటి దేశకాల సన్నివేశమును బట్టి తిక్కన్నను యథారూపముగ నెవరుగాని వర్ణించియుండ లేదు. అలనాఁటి దేశమునుప్యాదికవర్ణనము లన్నియుఁ ప్రాయికముగ సంప్రదాయానుసారముగు నత్యుత్కర్షణములును, బదసౌందర్యప్రధానములునునై శ్రుతిరంజకము

---

* ఇది నెల్లూరు ప్రొగ్రెసివ యూనియనువారు జరిపిన తిక్కన జయంతిమహోత్సవము (౨౨-3-30) నాటి యధ్యక్షోపన్యాసము.

లుగామాత్ర ముండునవేకాని చదువరుల మనస్సులందు భావములఁ బుట్టించునవి కాకయుండు. కవి తన చిత్తమున నేదేని రూపము నిడుకొని దానిని తన భావచక్షువుచే నిరంతరము చూచును యథారూపముగఁ దన భాషాకౌశల్య మేర్పడ వర్ణించి చదువరుల చిత్తములందు నైతము దనమనస్సునందు నెలకొనియున్న భావమును నట్లె రూపుదాల్చినరీతిఁ బ్రతిబింబింపఁజేయునట్లు వర్ణించుట లేదు. కాఁబట్టి వర్ణనము లన్నియు నించుమించుగ నొక్క తీరుననే యుండును. పదభేదము లుండునే కాని వస్తుభేద మేర్పడనేరదు. మనుష్యుల వరించిన నొక్కొక్కనికిని సాముద్రికశాస్త్రమునందుఁ జెప్పఁబడినలక్షణము లన్నియు నింపియుండవలెను. రాముఁడైన నేమి, భీముఁడైన నేమి బాహువు లుండిన నాజానుబాహువులే; నేత్రము లుండిన నాకర్ణాంతనేత్రములే. ఇట్టి వర్ణనములవలనఁ జదువరుల కేమియూహలు పుట్టఁగలవు? నిజముగ నాకర్ణాంత నేత్రము లున్నట్లు పురుషు నొకని భావించి చూడుఁడు: ఎంత వికృతరూపముగ నుండును? అయిననేమి? అది కవిసమయసిద్ధము, సంప్రదాయసమ్మతము. వర్ణితపురుషుని నిజరూప మెట్టిదో చదువరులకు గోచరించెనాయను నాలోచన లేకపోయె. పదములు చకచకమని సొంపుగ శబ్దించునవి చేరియుండినఁజాలును. వనమును వర్ణింపఁబూనిన నిఘంటువులోని లతాగుల్మవృక్షనామముల నిష్టమువచ్చినన్నిటిని జేర్చి యక్షరసామ్యము గలవానినెల్లఁ జెవికింపగున ట్లొక్కటఁ గూర్చినఁజాలును. అది నైమిశారణ్యమైనఁ గావచ్చును, ద్వైతవనమైనను గావచ్చును. ఇట్లనుటచే సమానవర్ణములుగల పదములను వినియోగింపఁగూడదని నాతలంపుగాదు. అవి సార్థకములుగను, భావప్రేరకములుగను, బింబప్రతిబింబజనకములుగను నుండుట ప్రధానముగ నుండవలెనని నాయాశయము. మన యాంధ్రభాష కప్పు డీదురవస్థ పొసఁగియుండుటకుఁ గారణ మిట్లూహించెద. కవిత్రయముతోడనే యాంధ్రవాఙ్మయము పొడమినదని నేను భావింపఁజాలను. అది యసంభవము. మొట్టమొదటినుండి యుండిన యాంధ్రవాఙ్మయము ప్రాథమికాంధ్రకవులు స్వతంత్రముగ రచియించియుండిన కావ్యములు నేకారణముచేతనో కవిత్రయమునకుఁ జాలకాలముమునుపే నశించి విస్మృతములై యుండినవి. నన్నయగారు నాంధ్రవాఙ్మయమును బునరుజ్జీవనము చేయవలసినవారైరి. ఆంధ్రభాషామాత తన యాకారసంతాన మంతయు నంతమందిన కారణముచేత సంస్కృతమునుండి స్వీకారము చేసికొనవలసివచ్చినది. కాఁబట్టి యప్పటివాఙ్మయకర్తలు సంస్కృతగ్రంథముల నాంధ్రీకరించుటే ప్రధానముగ భావించిరి. అందును ముఖ్యములు పురాణములు. సామాన్యముగఁ బురాణకాలమునాఁటి పురుషులను బురాణములలోఁ బ్రస్తావింపఁబడిన ప్రదేశములనుమాత్రమే వర్ణించుటకుఁ బ్రసక్తియయ్యెఁ గాన కవులు తమ సమకాలికులనుగాని, సమీపకాలము వారినిగాని, తాము చూచి యనుభవించిన స్థలవిశేషములనుగాని వర్ణించుట తటస్థింపదయ్యె. ఒకవేళ నరుదుగ నట్లు తటస్థించినను నప్పు డేర్పడియుండిన కవిసంప్రదాయము ననుసరించి పూర్వరీతినే వర్ణింపవలసినవారైరి. అట్లగుటచేత నప్పటి వర్ణనములనుబట్టి తిక్కనరూప మిట్టిదని నిర్ణయించుట కష్టమైనది.

శ్రీ జంగము కోటకృష్ణరావుగారీవిషయమునఁ గొంత ప్రయత్నించి చర్చించినారు. కేతన, తిక్కనను గురించి దశకుమారచరిత్రమునందు వ్రాసిన పద్యముల నుదాహరించినారుగాని అవియును గేవలము నప్పటి కవిసంప్రదాయసిద్ధములైన వర్ణనములుగానే కన్పట్టుచున్నవి. మఱియు "వాహినీపతిత్వమున కున్నతకాయులే యర్హులనుట ప్రసిద్ధముకాబట్టి తిక్కన కేవల కుబ్జుండుగాక మనుజసామాన్యమైన శరీరపరిమాణంబు గలిగియుండెననుట స్పష్టమగుచున్నది" అనియును కృష్ణరావుగారు వ్రాసియున్నారు. ఇందుఁ బూర్వపక్షము చక్కఁగా నున్నదిగాని సిద్ధాంతమాత్రము సంకుచితమైనది. సేనాపతియని చెప్పుటచేతఁ దిక్కన కుబ్జుఁడు కాకపోవుటే కాక దృఢదీర్ఘకాయుండనియు, "మనుజసామాన్యమైన శరీరపరిమాణంబు" కన్న మిగిలినవాఁడనియుఁగూడ నూహింపఁదగియున్నది. ఆకాలపు సేనాపతిత్వ మిప్పటివంటిది గాదు. ఇప్పుడు సేనాని యనిమొనకు దూరమునఁ గూరుచుండి తన నేరుపుచే సేనలఁ ద్రిప్పుచుండును.

అప్పుడు చమూపతి దట్టమగు యుద్ధములో మొట్టమొదట నిలిచి తన దేహబలముచేతను, బుద్ధిబలముచేతను వైరివీరుల నోడించుచుఁ దనవారి కుత్సాహము పుట్టించుచుఁ బోరుసలుపఁజాలు శూరుఁడుగా నుండవలసియుండెను. అట్టి శూరుఁడు దృఢదీర్ఘకాయుఁడుగా నుండకతీరదు. కనుక మనతిక్కనయు ఘనదీర్ఘకాయుఁడుగానే యుండియుండవలెను. కేవలము యుద్ధవీరుఁడేకాక సైన్యపతియగుటచేత నీతనికిఁ దదంగములగు నితర విశేషములుగూడ నుండియుండవలెను. సేనలకుఁ దనయందుఁ బ్రీతియు, భక్తియు, విశ్వాసమును బుట్టించు శక్తిసామర్థ్యము లుండవలెను. లేనియెడ సైనికులు స్వాధీనులుగా నుండరు. కనుకఁ దిక్కన జనవశీకరణచణమగు వీక్షణము గలవాఁడును, దేజోవంతుఁడును, బ్రియదర్శియునుగా నుండెననియు నూహింపఁదగియున్నది. ఈయన స్వరూపమును గుఱించి యింతకన్న నెక్కువ చెప్పఁజాలము.

ఈయన వంశానుక్రమణికను గాలనిర్ణయమును జరిత్రమును గుఱించి పలుగురు పలుతెఱంగులఁ బలుమారు చర్చించియున్నారు. ఆ విషయమును మరల నేను విచారింపఁబూనలేదు. ఈయనయందు మనకందఱకు నింతటి గౌరవమును, బ్రీతియుఁ గలిగించుటకుఁ గారణమైన యీతని గుణాతిశయములను, బూజనీయములగు నాదర్శములను, ననన్యసామాన్యములగు చర్యలను గొంతవఱకు దెలుపఁదగును.

తిక్కన మనుమసిద్ధిరాజునకు సేనాపతిమాత్రమే కాక మంత్రిగాఁగూడ నైయుండెనను చరిత్రమువలన నెఱుఁగుచున్నాము. ఇతఁ డితరులతోటిపాటి మంత్రి గాఁడు. సేవచేసి పొట్టపోసికొనుటకై మనుమసిద్ధియొద్ద మంత్రిగాఁ జేరినవాఁడు కాఁడనుట యీయన కావించిన యసదృశకార్యములవలన స్పష్టమగుచున్నది. ప్రభువైశ్వర్యవంతుఁడై ప్రబలియుండు కాలమునందు భృత్యులెందఱైనఁ జేరియుందురు. పదవి యున్నంతవఱకు మిత్రులకుఁ గొఱంతయుండదు. అది తొలఁగిన నెంతమంది మిత్రులు, భృత్యులు నిలుతురోయనునది సంశయము. కష్టకాలమున నాదుకొనువా రరిది. అమానుల్లా రాజుగా నున్నప్పు డాయన నెంతమందియో యాశ్రయించి కొలుచుచుండిరి. ఆయన కాపదవి తొలఁగినవెనుక నాయనకై యెందఱు పాటుపడుచున్నారో చూచుచున్నాము. ఆయన మరల రాజుగా వచ్చినంతట నప్పు డెంతమంది మిత్రులమని వత్తురో! మంత్రులకుఁ గొఱంత యుండదు. మన తిక్కన్న యట్టిమంత్రిగాఁడు. మనుమసిద్ధి రాజ్యము గోల్పోయినప్పుడు తిక్కన యతనిని విడిచినవాఁడుగాఁడు. తిరిగి యాయనకు రాజ్యమును రాఁబట్టి యీయ సమకట్టి కాకతీయవంశ్యుఁడగు గణపతిదేవరాజు నాశ్రయించి యాయన ననేకవిధముల మెప్పించి యాయన ప్రబల సాహాయ్యమున మనుమసిద్ధికి యథాపూర్వముగ రాజ్యము సిద్ధింపఁజేసినాఁడు. తిక్కనయు నితరులవలె స్వార్థపరుఁడై యుండినంతట నితఁడు గణపతిదేవరాజుదగ్గఱఁ దన యోగ్యతచేఁ దాను సంపాదించిన పలుకుబడిని స్వోపయోగము చేసికొని యెంతధనమార్జించుకొని యుండఁగూడదు! అంతయును స్వామికార్యమునకు వినియోగించెను. ఎంతటి స్వార్థత్యాగము! ఎంతటి విశ్వాసము! ఎంతటిరాజభక్తి! తిక్కన్న మనుమసిద్ధికిఁ గేవలామాత్యమాత్రుఁడుగాక యాప్తుఁడును, నాపద్బాంధవుఁడు నైత మనుట స్పష్టముగాదా!

వీ రిరువురకును గేవలస్వామిభృత్యసంబంధము మాత్ర ముండినదిగాదు. వా రిద్దఱును మామయు నల్లుఁడువరుసతోఁ బిలుచుకొనుచుండిరి. వ్యావహారిక సంబంధముమాత్రే ముండువారి కిట్టివరుసలతో వ్యవహరించుకొనుటలు పొసఁగనేరవు. ఈచన వుండఁజాలదు. తిక్కన మనుమసిద్ధికిఁ బ్రాణమిత్రుఁడును, నర్మసచివుఁడుగాను నుండెను.

"ఏ నిన్ను మామయనియెదు-
దీనికిఁ దగనిమ్ము భారతీకన్యక నా
కీనర్హుఁడ వగుదనినను
భూనాయకు పలుకుచిత్తమున కింపగుడున్."

అని మనుమసిద్ధి తిక్కనకృతిని దన కంకితముసేయుమని వేఁడుకొనినట్లు తిక్కన్న ముచ్చటగా ముద్దులొలుకు పలుకులతోఁ జెప్పియున్నాఁడు. ఈపద్యమును జనుచఁ

గనే వారిద్దఱును గన్నులెదుట నిలిచి ముచ్చటించుకొనుచుండునట్లు చదువరుల మానసరంగమునఁ గన్పట్టక మానరు. మనుమసిద్ధి వినయముతోను, జనవుతోను మనసుం గఱంగించునట్లు వేఁడుకొనుచున్నట్లును, తిక్కన్న చిఱునగవుతో సమ్మతిని సూచించుచున్నట్లును గాన్పింతురు. ఇట్లు కవి తనమనసునఁ బొందు భావములను జదువరుల మనసులందు నద్దమునందువలె యథామాత్రముగాఁ బ్రతిబింబింపఁజేయఁగలిగినఁగదా కవి యనఁదగును. ఇట్టిసామర్థ్యము తిక్కన కెక్కువ కలదు. ఇట్టి కవికృతి నంకితముపొందిన మనుమసిద్ధి సుకృతి యనుట కేమి సందియము? ఈధన్యత మనుమసిద్ధికి సిద్ధింపఁజేయనెంచియే తిక్కన తన నిర్వచనోత్తరరామాయణకృతిని మనుమసిద్ధి కంకితముచేసెను. దీనికి మనుమసిద్ధియందలి ప్రీతియే హేతువుగాని ధనకాంక్ష కారణము కానేరదు. తిక్కన యాగర్భశ్రీమంతుఁడు. న్యూనమైన కార్యము చేసియైన ధనమును గడింపవలసిన యవసరమున్నవాఁడు కాఁడు. తనకాయకష్టముచేత మనుమసిద్ధికి లాభము నొడఁగూర్చినవాఁడేగాని యాయనవలన ధనము నార్జింప నాతనిచెంతఁ జేరినవాఁడు కాఁడు. కేవలము పొట్టపూటకైన ధనకాంక్షచే శుల్కముఁగొని తనకృతిని నరాధముల కంకితము చేసిన నది నింద్యముగానోపు! కష్టములలో మునింగియున్న యొౕస్యునిం గని వానిం గరుణించి కాపాడి తేల్చి పెంచి పెద్దవానిని చేసి తన ప్రీతిపరిణామముగా గాదిలిహాతు నిచ్చి పరిణయము గావించు నుదారునితీరునఁ దిక్కన తనకృతిని మనుమసిద్ధి కంకితముచేసినది న్యూనమగునా? దివ్యమగు కరుణకారణముగాఁ జేసిన యంకితమది నరాంకితమైననేమి? వానరాంకితమైననేమి? ప్రేమయన సామాన్యమైన గుణము గాదు, గుణములలో నన్నింటిలో నుత్తమగుణము; దైవస్వభావముగలది. అట్టి ప్రేమకారణమైన కార్యము గౌరవలోపము గావింపఁజాలదు. తిక్కన తనకృతిని మనుమసిద్ధి కంకితముచేసిన దాయనయాధిక్యమున కొకవంకఁ దెచ్చినదిగా నెంచఁగూడదు.

తిక్కన లౌకికవ్యవహారములలోఁ బరిపూర్ణప్రవేశము గలవాఁడయ్యు వైదికవిద్యాభ్యాసము నాచరించుటయు చేసినవాఁడు కాఁడు. సంపూర్ణముగ వేదాధ్యయనము చేసినాఁడు. మఱివైదికాచారములం దాసక్తికలిగినవాఁడగుటకుఁ దాను గ్రతువులఁ జేసి సోమయాజియగుటే నిదర్శనము. ఇతరవిద్యలయందునుఁ బ్రవీణుఁడై విద్యాదయితేం డను పేరుఁ జెప్పుకొనినాఁడు; ఆంధ్రమునందును నసదృశజ్ఞానము సంపాదించినాఁడు. ఉభయభాషాప్రవీణుఁడు; ఆంధ్రకవిత్వవిశారదుఁడు. ఇతఁ డింత గొప్పవాఁడయ్యు గర్వము లేనివాఁడు. "బుధారాధనవిరాజి" అని చెప్పికొనియున్నాఁడు. ఈతని యీవినయవిధేయాదిసద్గుణము లీయనఘునతని వన్నెఁదెచ్చి మఱింత మెఱుఁగు పెట్టినవై నవి.

లౌకికవ్యవహారములలో నిట్లు నిమగ్నుఁడైయుండిన యీతిక్కనకుఁ గవియై కావ్యముల రచియింప నవకాశ మెట్లుఁ గలిగెనని సామాన్యముగ సందేహము గలుగును. లౌకికానుభవము చక్కఁగఁ గలిగి సుఖదుఃఖముల గాఢముగా ననుభవించువారికే తీవ్రమగు భావములు గలిగి వారి మనస్సుల నెక్కువగఁ గలియఁబెట్టును; దట్టముగ నూహలఁ బుట్టించును. అట్టిస్థితియే స్వభావమగు కవిత్వమునకుఁ బుట్టినిల్లు. నెమ్మదిగ నింటఁ గూరుచుండి కాలము నొక్కవిధముగఁ గడపుచుండువారికి గాఢములగుభావము లుద్భవించుట కవకాశ మెక్కువ యుండదు. అట్టివారి కవిత్వము కేవలము వాక్పూరితము పరభావానుకరణమునుగా నుండునేకాని యనుభవజనితభావప్రేరితము కాకుండుటచే జీవకళ లేనిదిగా నుండును. కవి తా ననుభవింపని భావముల వర్ణించు టెట్లు? కవిమనసు రసావేశపూరితమైనప్పుడే కవిత్వాంకురమున కవకాశము కలుగును. క్రౌంచమిథునమం దొక్కదాని నిషాదుఁడు వధించుటయు మిగిలినది వియోగదుఃఖభారమును భరింపఁజాలక పరితపించుటయుఁ జూచిన వాల్మీకి మనస్సు కఱఁగి నీరై కరుణారసపూరితమైయుండి లోన నడఁపరానిభావ మయత్నముగా ఛందోబద్ధమైన వాక్యరూపమున బయల్వెడలె. అదియేగా కావ్యరాజమగు రామాయణమున కారంభము! అయిన ఋషియగు వాల్మీకికి లౌకికానుభవ మెక్కడి దందురేమో? వాల్మీకి జన్మతో మహర్షియును గాఁడు. అతనియందు దైవావేశ

ముండెననుట కాయనకావ్యమే నిదర్శనము. అదటుండ, వాల్మీకి కెప్పుడును లోకానుభవములు లేకయే యుండెననియుఁ జెప్పఁజాలము. తిక్కనకుఁ గలిగిన లోకజ్ఞానమును, గాఢానుభవములును నాయన కవిత్వమునకుఁ గారణమును నాధారమును సాహాయ్యమును నైనవి. ఏదేశమునందుఁగాని నది క్లేశములేక స్తిమితమై యుండుకాలమునఁ గవులు ప్రబలి కావ్యముల రచించు టరిది. అట్టియెడ దేశజనుల కాయిక సుఖములఁ జెందు నితర కళలే యెక్కువ వ్యాపించుచుండును; ఇయ్యది యలంఘ్యమగు లోకస్వభావమనుట దేశచరిత్రము లెఱిఁగినవారి కందఱకు విదితము. దేశమునందు ప్రబలములగు మార్పులు గలుగుచు నది మిక్కిలి యాందోళనమును జెందుచుండు కాలమున నందలి సమర్థులగు జను లుత్సాహసమన్వితులై యుండ నూహలు మెండుకొని ఘనకార్యములు కావింప వారి కవకాశ మెక్కువ చిక్కును. అట్టిఘన కార్యములఁ గాంచి యనుభవించువారి మనస్సులు తీవ్రభావోద్రిక్తములై యుండ మనసునిండి పొరలుచుండు నాభావములు బయల్వెడలఁ జూచుతఱి నవి వారిని గవిత్వమునకు దొరకొనఁ బురికొల్పును. తిక్కన కాలమునందు మనదేశ మీస్థితిలో నుండినది. దేశమునందు స్థిరస్థాపితమైన ప్రబలరాజ్య మొండును నెలకొనియుండమి చిన్నచిన్న రాజ్యము లనేకము లేర్పడి పరస్పర కలహములు మెండై దేశమంతట యుద్ధములతో నిండి కల్లోలముల పాలై యుండెను. తిక్కన మొదలగు సుత్సాహపూరిత స్వభావులగు ఘనులకు వారివారి యోగ్యతలకును, సామర్థ్యములకును, స్వభావములకును నమవగు మేలిపనులు సలిపి యశము గడింప నదనుగలిగినది. ఇట్లు తనంతటఁ గలిగిన యవకాశమును విడువక తిక్కన్న లోకోపకారకములగు ననేకకార్యములఁ గావించి ఘనత గడించినాఁడు. తన ప్రభువును, ప్రాణమిత్రుఁడును నగు మనుమసిద్ధికై యెన్నియో కయ్యములఁ గావించినాఁడు; గెలుపుఁ గొన్నాఁడు; ఓటమి ననుభవించినాఁడు; రాజ్యమును గోలుపోయిన తనరాజునకు రాజ్యమును మరల సంపాదించియిచ్చి యాయన కృతజ్ఞతకుఁ బాత్రుఁడైనాఁడు; ఈడులేని యీయన్ని యనుభవములకు ననుగుణమగు పర్యవసానముగ ననదృశమగు కవిత్వకౌశలమును గడించి లోకోత్తరములగు కావ్యముల రచించి తన కీర్తిని స్థిరముగ భూమిపై స్థాపించినాఁడు.

ఈ కల్లోలకాలమందుఁ బరిపరివిధములైన యనుభవములచేతఁ బ్రముఖితమైన తిక్కన మన సెన్నియో యపరిమితములగు తీవ్రభావములకు భాజనమై మితిలేని యాందోళనమును జెందియుండవలెను. ఇటువంటి గాఢానుభవములు వాని ప్రబలప్రభావము నాయనమనసున స్థిరముగ ముద్రించియుండకపోవు. ఇకార్యములను దలపోసినప్పుడెల్ల మనసున నావేశముపొంగి పొరలుచుండును. వానిని వర్ణించి చెప్పునప్పు డది వినువారి మనసులందును నట్టియావేశమును బుట్టింపక తప్పదు. ఇదియేకదా సహజమైన కవిత్వము! ఇట్టి సందర్భములుండఁ దిక్కనకుఁ గవిత్వము పట్టుపడుట స్వభావసిద్ధము.

ఇవ్విధమునఁ గవిత్వమున కాయత్తమైన చిత్తముతోఁ దిక్కన ఘనకావ్యరచన కుపక్రమించుతరుణమున నాంధ్రవాఙ్మయము సంస్కృతపురాణాంధ్రీకరణఘట్టమును దాఁటియుండలేదు. కాఁబట్టి తిక్కనయును దన మున్నింటికవుల ననుగమించుచుఁ బురాణాంధ్రీకరణమునకే మొనకొనవలసివచ్చె. సందర్భవశమున నిట్లు తలపెట్టినను దిక్కనకు స్వభావసిద్ధమయిన స్వతంత్రకవిత్వశక్తి యాయనను విడువదాయెను. ఆయన రచించిన యాంధ్రీకరణములు నామమునకుమాత్రము భాషాంతరీకరణములేగాని నిజముగ స్వతంత్రకావ్యములనియే చెప్పవలసియున్నది. సంస్కృతభారతాదుల పురాణగాథలనుమాత్రము గ్రహించి వానిని దన మనోవృత్తి ననుసరించి యిష్టముచొప్పున మార్చుచుఁ దన స్వతంత్రకవిత్వకౌశలమును దన కృతులయందు నిరాటంకముగాఁ జూపియున్నాఁడు. ఈయనరచన పెక్కుచోటుల మాతృకకన్న మనోజ్ఞముగ నున్నది. ఈనిర్బంధము సైతము పెట్టుకొనక స్వతంత్రకావ్యములకే పూనుకొనియుండిన నవి యింకెంత మనోజ్ఞతరములుగ నుండెడివో యూహింపఁజాలము.

సోమపాలెపు దేవాలయ చిత్రములు



౪. విమానము



3. రథాకారమునందు నొక గుడి



౫. దేవాలయము వెనుక గల చిన్న గుడిలోని
లక్ష్మీ నారాయణ విగ్రహము



౬. చామరగ్రాహిణి

తిక్కనభారతాంధ్రీకరణమును దలపెట్టుట కాయనకు నన్నయభట్టారకునియం దుండిన యపరిమిత గౌరవముగూడఁ గొంతకారణమైయుండనోపు. అట్లు మొదలుపెట్టినవాఁడు నన్నయ కాకుండినను, నన్నయయందుఁ దిక్కన కంతటి గౌరవభావము లేకుండినను, పూర్వరచితమగు నల్పభాగమును గమనింపక దాని నవులఁ ద్రోసి తిక్కన తానే మొదటినుండి తెనిఁగించియుండును. తిక్కన యట్లు చేసియుండిన నన్నయభట్టారకరచితభారతభాగ మడుగునఁ బడిపోయియుండును. ఉదారస్వభావుఁడగు తిక్కన కది సహింపలేదు. అట్లడఁపకపోవుటయేకాక దాని నుద్ధరించుటకూడఁ దన పనిగాఁ బూనినాఁడు. కనుకనే తనకృతిని నన్నయ్యకృతి కనుబంధముగాఁ జేసి యంతయు నొక్కటికావించినాఁడు. అట్లయిన నన్నయ యరణ్యపర్వములో విడిచినచోటునుండి యారంభింపక తిక్కనవిరాటపర్వమునుండి ప్రారంభించుటకుఁ గారణ మేమయ్యుండును? నన్నయభట్టరణ్యపర్వము నాంధ్రీకరించుచుండి మతిభ్రమణముఁ జెంది మరణించినాఁడు. ఆయరణ్యమునందుఁ బ్రవేశించినఁ దానునట్లే మతిచెడి మడియుననుభీతిచేతఁ దిక్కన యరణ్యపర్వముజోలికిఁ బోవక విరాటపర్వమునుండి ప్రారంభించినాఁడని కొంద ఱందురు. ఇది కేవల మసమంజసము. తన చావునకుసైతము జంకక వైరివీరులతోడఁ బోరాడి జయమును గొనఁజాలిన తిక్కనవంటి శూరుఁ డిట్టి క్షుద్రభావములకు లోనైనాఁడనుట భావ్యముగాదు. నన్నయభట్టరణ్యపర్వమును బూర్ణముగ నాంధ్రీకరించియుండెననియుఁ దిక్కనకాలమున నది సమగ్రముగనే యుండియుండుననియుఁ గాఁబట్టియే తిక్కన విరాటపర్వముతో నారంభించియుండుననియుఁ దిక్కనయనంతరము నెఱ్ఱాప్రగడకుముందే యీయరణ్యపర్వములోని యంతిమభాగము ప్రక్షిప్తమైయుండుననియు నాకారణమున నెఱ్ఱాప్రగడ యీయరణ్యపర్వశేషమును బూరించి గ్రంథమును గొఱంతలేకుండఁ జేసియుండవచ్చుననియు జంగముకోటకృష్ణరావుగారు సమర్థింపఁ బ్రయత్నించియున్నారు. (ఆంధ్రపత్రిక. ౧౯౧౧-వ సం॥పు సంచిక)

అదియు నేనమ్మఁజాలను. నన్నయభట్టారకకృతి సామాన్యమైనది గాదు. అట్టికృతి కొక్కప్రతియే యుండెననుట యసంగతము. ఎన్నియో ప్రతు లేర్పడియుండక తీఱదు. అన్ని ప్రతులలో నేకవిధముగ నేకభాగము లేకుండు టెట్లు తటస్థించును? మాతృకలో లేకుండిననే యట్లుండనోపు. కనుక నన్నయభట్టాభాగము నాంధ్రీకరింపలేదనియే భావింపఁదగియున్నది.

ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొందియుండెనం
దాదిదొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు
దక్షతన్

అని తిక్కన వ్రాసినందుచేతనే నన్నయభట్టరణ్యపర్వమును బూర్ణముగ రచించినాఁడని నిర్ధారణచేయుటకు లేదు. నిల్చిన భాగ మల్పమును, గావించిన భాగము చాలవిపులము నైయుండుటచేత నల్పావశిష్టమైనదానిని గణింపక మూఁడుపర్వములు చేసెనని సామాన్యముగఁ జెప్పియుండవచ్చును. ఇఁకఁ దిక్కన యాముక్కను విడిచి విరాటపర్వముతో నారంభించినందుకుఁ గారణాంతర ముండవలెను. ఎవ్వరుగాని గొప్పదగు కావ్యమును రచింపఁబూనినవారు మొదలునుండి యెత్తుకొని స్వవిషయమును వివరించు నవతారిక దాని ముఖవచనముగ ముందుంచుట సహజము. ఏదైనఁ బ్రబలకారణముచేత నట్లు మొదటనుండి యెత్తుకొనలేకపోయిన నేదేని యొక్కఘట్టముతో నారంభింతురేగాని యొకభాగాంతమున నారంభించుటకు మనసు పుట్టదు. విరాటపర్వమిట్టి యొక్కస్ఫుటమైన ఘట్టము, అవతారికతో నారంభించుటకుఁ దగినఘట్టము. విరాటపర్వమునందలి తిక్కన యవతారికయే దానిని ఋజువుపఱచుచున్నది. తిక్కన యరణ్యపర్వశేషముతో నారంభించి యీయవతారిక నందుఁ బొందుపఱచిన నదియెంత యసందర్భముగా నుండును? కాఁబట్టి తిక్కన తన కావ్యమును విరాటపర్వముతో నారంభించి చివరవఱకుఁ జాగించి యావల నన్నయభట్టు విడిచిన యరణ్యపర్వశేషమును దెనిఁగించి కావ్యమును సంపూర్ణముగావింప సమకట్టి యారంభించి

యుండవలెను. విధివశమున నది కొనసాగకపోవుటచేత నరణ్యపర్వశేషము కొఱఁతగా నిలుచుటయు దానిని నెఱ్ఱాప్రగడ పూరించుటయుఁ దటస్థమైనది. ఇట్లని సహజముగ నూహింపఁదగియున్నది. ఈసందర్భములఁబట్టి నన్నయభట్టరణ్యపర్వము బూర్తిగా నాంధ్రీకరించినాఁడనికాని, కేవలము మరణభీతిచేతఁ దిక్కన యరణ్యపర్వశేషమును విడిచినాఁడనిగాని యనుకొనరాదు.

తిక్కన తన నిర్వచనోత్తరరామాయణమునందును, రామనిర్యాణమును విడిచియున్నాఁడు. దీనికిని మరణభీతియే కారణమని కొందఱు చెప్పుదురు. అట్లయినఁ గృష్ణనిర్యాణమును జెప్పుట కేల భయపడలేదు? "మరణమును జెప్పుట కిష్టములేకుండుటయు, భయపడుటయుఁ గొండటి విషయముననే యుండును" అని వీరేశలింగముగారు చెప్పుచున్నారు. ఈకొందఱనునది మిక్కిలి యస్ఫుటముగా నున్నది. కృష్ణుని విషయములో లేని భయము రాముని విషయములోనేల కలిగె? అన్నిటికిని నిర్హేతుకముగాని భీతి సిద్ధాంతమును దెచ్చిపెట్టుట యుక్తముగాదు. రామనిర్యాణ మత్యంతచింతాకరమగుటేకాక యది గ్రంథాంతము నగుచున్నది. గ్రంథముల దుఃఖాంతముగా నిలుపుట కనేకులు సహింపరు. రామనిర్యాణమును దిక్కన విడిచిపెట్టుట కిదియే కారణముగా నుండవలెను.

మును వాకొనిన సమయసందర్భవశమునఁ దిక్కన పురాణాంధ్రీకరణములకుఁ బూనుకొనినను వానిని బ్రతిపదాంధ్రీకరణములుగ నొనరింపక యందలి విషయములను గ్రహించి స్వతంత్రకావ్యములుగానే రచియించియున్నాఁడు. సంస్కృతముననే మహాభారత మెంతగ్రంథ మెంతగాఁ బెరిఁగినది మన మెఱిఁగియేయున్నాము. ఎంత విషయము మాఱినది; మొదటలేని గాథ లెన్ని వెనుకలోనఁ జేరినవి; ముందుండిన కథ లెన్ని మఱుఁగువడినవి? ఇట్లుండ నడఁపరాని యపరిమితస్వతంత్రకవిత్వకౌశలము గల కవులు వానిని భాషాంతరీకరింపఁదొడఁగినపుడు వారు ప్రతిపదటీకను ఛందోబద్ధవాక్యములఁ గావించుపాటివారుగాక తమతమ స్వభావముల ననుసరించి తమ భావముల నందుఁ బొందుపఱుప నవకాశము గొని కావ్యముల రచించుట చిత్రముగాదు. శతఘంటము వేంకటరంగశాస్త్రిగారు ఆంధ్రపత్రిక ౧౯౧౧ సంవత్సరపు సంవత్సరసంచికలో వ్రాసినట్లు "సంస్కృతమున నున్నదట్లు తెలిఁగించినమాత్రన కవిత్వమునకుఁ జమత్కారంబు గలుగదు. విశేషించి యిప్పురాణేతిహాసాదుల యాంధ్రీకరణంబునెడ నన్వయించు. మఱి కవి తన బుద్ధికౌశలమున రసవంతములగు కల్పనలమర్చి కూర్చిన రచనావిశేషమునఁ జమత్కారచాతుర్యంబు లేపారెను. అట్టి రచనాచాతుర్యము తిక్కనసోమయాజికిఁ గుదిరినట్లు లితరుల కమరినదిగాదు." ఈచాతుర్యమతనిసొమ్ము. కనుక నీవిషయమునఁ దిక్కనయు నన్నయాదు లట్లనీపథకమునే యవలంబించినాఁడు. రసపోషణమున కుచితమని తోఁచినవిధమునఁ గథలను, వర్ణనములను బెంచినాఁడు, కుదించినాఁడు. అసందర్భములని తా భావించిన కథలనే కొన్నింటిం దొలఁగించినాఁడు. లక్షకెక్కుడుగ నున్న మహాభారతమును నందు నైదింట నొక్కపాలుకుఁ దక్కువచేసినాఁడు.

ఇట్లు చేయుటలో మహాభారతమున మిక్కిలి విపులముగానున్న శ్రీ భగవద్గీతలను గుదించి ౧౬౧ మొదలు ౨౩౦ వఱకు ౬౦ పద్యములలో నిముడించినాఁడు. విషయమునుమాత్రము విడువలేదు. ఇందు భావముల నేమి మార్పలేదు. యుక్తమని తోఁచిన సందర్భముల యథామాతృకగా నాంధ్రీకరించియున్నాఁడు. కొన్నిచోట్ల భావములను మాతృకలో నున్నదానికన్న నింపుగాఁ దెనుఁగున వర్ణించియున్నాఁడు. ఇట్లుండ వీరేశలింగము పంతులుగారు "భగవద్గీతలు, ఉత్తరగీతలు మొదలయినవానిని తెలిగింపనేలేదు." అని వ్రాసి మరల శ్రీ భగవద్గీతలోని మొదటి కడపటి శ్లోకములకుఁ దిక్కన రచించిన తెనుఁగుపద్యముల నుదాహరించి "అనియు తెలిఁగించి నడుమ నాలుగైదుపద్యములు వేయుట గ్రంథము నాంధ్రీకరించుట కానేరదు" అనియు వ్రాసినారు. తిక్కన భారతమును బ్రతిపద టీకగా భాషాంతరీకరించినవాఁడు కాఁడు. అట్లుచేసియుండిన నాంధ్రభారతముగూడ నొక్కలక్షకెక్కువ గ్రంథమై యుండవలెనుగదా! అంతటిని గుదించినట్లే గీతలనుగూడఁ గుదిం

చినాఁడు. నడుమ నాలుగైదుపద్యములతో ముగింప లేదు: ఒం గద్యపద్యములలో విషయమును విడిచిపెట్టకుండ భగవద్గీతాసారమునంతయుఁ దెనుఁగునకుఁ దెచ్చియున్నాఁడు. యుక్తమని తోఁచినచోటుల మూలమునందలి సమాసములనుసైత మట్లే తెనుఁగునం దిముడ్చినాఁడు. కొన్నిసందర్భముల మూలముకన్న రసవంతముగ దెనుఁగుఁ జేసియున్నాఁడు.

క. వైరమున నులిచి త్రెంపక
　కారాకులు ద్రుల్లినట్లు కర్మములెల్లం
　దారపెడఁబాయవలయుట
　సారక్రమం దెలియఁజెప్పె. శౌరి యతనికిన్.

ఇది యెంత మనోహరముగానున్నది. మరలఁ బంతులుగారిట్లు వ్రాసినారు. "ఇది గుహ్యమైన యోగశాస్త్రమనియో యుద్ధమధ్యమున శత్రువు లెదుట నుండఁగా పదునెనిమిది యధ్యాయములు గల మహాగ్రంథమును గృష్ణుఁ డర్జునునకుఁ జెప్పెననుట విశ్వాసయోగ్యముగా నుండదని భావించియో, తిక్కన భగవద్గీతలను దెనిఁగింపఁ డయ్యెను." తిక్కనభగవద్గీతలను దెనిఁగింపడయ్యెనని నిర్ధారణచేయుచు వీరేశలింగముగారు దానికిఁ గారణము లారయుచున్నారు. గుహ్యమైన యోగశాస్త్రమనుట యొక కారణముగా నుండనోపునని గూఢముగాఁ బంతులుగారు చెప్పిరి. అట్టి యోగశాస్త్రమును దెనుఁగున రచించిన స్త్రీశూద్రాద్యనర్హులు దానిఁ జదివి తెలిసికొనుటచేఁ బాతకము వాటిల్లునను భీతిచేతఁ దిక్కన దానిని విడిచెనని వ్యక్తముగాఁ జెప్పు ఘనులును గలరు. మొదటికి దేవభాషగాని తెలుఁగునకు దానిఁ దెచ్చుటే తప్పని చెప్పు దిట్టలుగూడ నుండవచ్చును. వీరెవ రేమనుకొనినను దిక్కన నేరనివారి కెఱుఁగఁజెప్పుటదెట్టిదైనను నేరమగునని విరమించునంతటి మూర్ఖుఁడు గాఁడు. ఇంతటికిని దిక్కన భగవద్గీతలను విడిచియుండ లేదు. గాన నీ హేతువాదములకే యవకాశములేదు. యుద్ధమధ్యమున నంతవిపులముగాఁ జెప్పుట రసోచితము గాదని తిక్కన భగవద్గీతలను దక్కిన భాగముకన్నఁ గొంత యెక్కువగా సంగ్రహించియుండిన నుండవచ్చుననిమాత్ర మూహింపఁదగియున్నది.

క. తెలుఁగు కవిత్వము చెప్పం
　దలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడి మా
　టలు గొని వడులుం బ్రాసం
　బులు నిలుపక యొగిని బులిమి పుచ్చుట చదువే.

అని తిక్కన నిర్వచనోత్తరరామాయణమునఁ జెప్పినాఁడు. మఱియు:—

క. లలిత పదహృద్యపద్యం
　బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
　యలఁతి యలఁతి తునియలుగా
　హల సంధించిన విధంబు నమరఁగవలయున్.

అనియుఁ జెప్పియున్నాఁడు. ఇతఁడు గణయతిప్రాసములకై కష్టపడి పదములను గూర్చి పెంచువాఁడుగాని, పదములు చెటపటమని పామరరంజకముగ నుండుటకును, దన సంస్కృత పాండిత్యమును బ్రచురించుటకును దీర్ఘసమాసములను బ్రయత్నపూర్వకముగ సంధించువాఁడుగాని కాఁడు. ఈయనకవిత్వమున భావము ప్రధానము. పదముల ననుసరించి యర్థమును, నర్థము ననుసరించి భావములను ద్రిప్పుకొనువాఁడు కాఁడు. తిక్కనకు భాష వశముగాని భాషకుఁ దిక్కన వశుఁడుగాఁడు. తన మనసున నాటియుండు భావములను గుఱిగా నుంచుకొని వానిని వర్ణించుటకుఁ బదములకై వెదకికొనవలసిన యక్కఱలేక సమయోచితముగఁ దమంతఁ దాము పొరలి వచ్చు ముద్దు పలుకులతో విను వారి మనసులందు యథారూపముగా వానిని ప్రతిబింబింపఁజేయఁగల కవిత్వపటుత్వ మీతనికి మెండుగాఁ గలదు. అట్టి కవిత్వమేగదా సుకవిత్వము. అట్లుకాక యనుభవప్రేరితముగాని తన మనసు భావశూన్యమై యుండఁగా నొరులు ప్రయోగించియుండు సమాసములను గైకొనియో నిఘంటువులనుండి పదముల సంగ్రహించియో, కష్టపడి కూర్చు కవిత్వము కేవలము శుకవిద్య యనియే చెప్పవలసియుండును. అట్లని పదములఁ జేర్చుటలో వాని శ్రావ్యతను గణింపకయే కూర్చుచోఁ గవి

త్వము కొంత వైదికముగా నేర్పడును. భావములకు భంగము వాటిల్లనీయకుండ, నర్థమునకు లోపము పొసంగనీయకుండఁ బదముల శ్రావ్యతనుగూడ గణించి ప్రయోగించినచో స్వర్ణమునకు సౌరభము గలిగించునట్లు కవిత్వము మఱింత మనోహరముగా నుండును. అట్టి సామర్థ్యము గలిగినవాఁడు మన తిక్కన.

---

# కవి నిర్వేదము

శ్రీ శేషాద్రిరమణకవులు

౧

విస్మృత చరిత్రవాహినీ వీచికలకు
నెలమి నెదురీఁదు కాకతీయుల పవిత్ర
శాసన శిలాదికంబులఁ జదివి చదివి
యెంతకాలంబు విలపింతు నింకఁ దండ్రి!

కాకతీయాంధ్ర భూపాల కంఠగళిత
భవ్యముక్తాఫలంబు లెప్పట్ల వెదకి
భారతీ కంఠమౌక్తికహార మింక
నెన్నినాళ్లకు నేరచియింతుఁ దండ్రి!

ప్రోవుజేసితి కాకతి భూమిపాల
పుణ్యదేహాభిరామమౌ బూదియెల్లఁ
బ్రాణసుభజిల్కు రూపనిర్మాణమింక
నెన్నఁ డొనరింతునో తోఁచదేల తండ్రి!

దిశలఁ బ్రసరించి ప్రసరించి దీప్తినొంది
కాలగర్భాంతరితమైన కాకతీయ
కీర్తి దీపికనెట్లు వెల్గింతు? నెట్లు
గాఢతర తామసీ రాత్రి గడచుఁ దండ్రి!

ఈ శిలాశకలంబులు నీ ప్రచండ
గండశిల లింకపై నెంతకాల మేను
వెదకి వేసారవలయు నుద్విగ్నమతికి
నెప్పటికి శాంతి; తెలియరాదేల తండ్రి!

౨

విలయ తాండవ సంతోష వివశుఁడైన
ధూర్జటి కృశాను దృగ్రోచి దొరలె నేమొ
ప్రళయవేళా భయంకర ప్రబలమేఘ
పటలి నిర్ఘాతసంతతుల్ పడలె నేమొ

చండభానుండు సర్వదిఙ్మండలముల
నిండుకొన నాతపజ్వాల నెఱపెనేమొ
మహిత సంవర్తవాయు సంఘాతులకతన
పృథ్వి నీరేణువై శోభ విడిచెనేమొ

కాలపురుషుండు శూన్యజగత్ప్రదేశ
మాసపడ సర్వనాశనం బాయెనేమొ
అక్కటా! యాంధ్రసామ్రాజ్యమందుఁ బూర్వ
విభవ చిహ్నంబులేని కాన్పింపవెందు

భోగ భాగ్యాభిరామంబు భూమిపాల
మకుటమణిగణ భాసుర మందిరాంగ
ణంబయిన పుణ్యభూమిలో నాఁటిశోభ
నేఁటి కెచ్చోటనేని గాన్పింపదకట!

శిల్పము నశించె, సత్కావ్య జీవనంబు
తొలఁగెఁ, గళలందు విస్మృతి యలముకొనియె
అతుల దారిద్ర్య సంక్షుభితాంధ్రజాతి
కేల యీ ప్రళయముగూర్చి తీవు తండ్రి!

---

# విజయవిలాస వ్యాఖ్యానవిధానము

ఆంధ్రవిశారద, తాపీ ధర్మారావుగారు

✂

విజయవిలాస కావ్యమునందుఁ గల ప్రధానఘట్టములు మూఁడనియు, నందు ద్వితీయంబు చిత్రాంగదాఘట్టమనియుఁ బాఠకు లెఱుంగునదియ. ఈఘట్టమునం దర్జునుఁడు తన హృదయోద్గతములగు భావములను మఱుఁగుపఱచుట కెంతయేని ప్రయత్నము నొనరించినట్టులఁ జేమకూరకవి విరచించెను. వనవిహారలాలసయయి నిజమందిరమున కేఁగుచుండిన చిత్రాంగదను గాంచి యాచెలువవృత్తాంతము నెఱుఁగుదలంపున "కన్నెంటె విశారదా?" యనిమాత్రము సూచ్చరించెను. ఈప్రశ్నమునందుఁ గల భావము గభీరము. త్రాఁజూచు కాంత సుందరాంగి. అయినంతమాత్రమున వాంఛల కవకాశము గలుగునా? వివాహానర్హ యగునేమో? నాగరకతాముద్రవు లోటు గలుగునేమో? అను సంశయము దీనఁ బొడకట్టునుగదా!

అర్జునున కన్నివిధముల నీడగువాఁడు విశారదుఁడు 'కన్నెంటే'యని యడిగినదానికి 'ఔను, చూచితిని; ఎంతసుందరముగ నున్నది!"యని యుగ్గడించి యూరకొనక;

"మలయధ్వజబాహుజను
త్తిలకుని గారాబుఁబట్టి, చిత్రాంగద పే
రలఘుకులశీలగుణములు
గల దీకన్య యని చెప్పఁగా వింటె నృపా!"

అని యాసుందరి రాజకాంతయగుటయు, సద్గుణగరిష్ఠ యగుటయు, నింకను గన్యగనే—అవివాహితగనే—యుండుటయు నెఱింగించెను. అప్పుడైన నర్జునుఁడు బయలుపడెనా? లేదు.

......"ఈనృపాలకునితో నెయ్యఁ
బొనరింపవలయు నేఁ డి
ట్లవనిసుండుద"మంచు

పలికెను. చేయఁగోరినది 'నెయ్యము,' వియ్యము గాదు. ప్రాధాన్యము నృపాలునియందుగాని తత్సుతయందు గాదు. భావము నెట్లు మఱుఁగుపెట్టెనో కాంచుఁడు. ఆవనమున నుండుటం జేసి యర్జునున 'కంతంత వలపు మీఱిపోవుచుండెను. విశ్వమంతయు ననురాగమయమయియే గన్పట్టెను. గాలిని గదలు నంభోజదళములు పద్మిని వెల్లురాయని 'రా, రా'యని పిల్చు నంగుళుల వలెనే యర్జునునికిఁ దోఁచెను.

"హావభావపరిణామవిదుండు విశారదుండు" పార్థుని హృదయవిధానమును గ్రహింపకుండ నుండునా? కాని, నిష్కృష్టముగ నేమనఁగలఁడు?

......శకునమ్ములు మంచివయ్యె; వే
రావల శోభనోత్సవప
రంపర లిప్పుడు మాకుఁ డంచు

నెత్తావుల దీవులై తనరు తామరమొగ్గలు రెండు కానుకగా నిచ్చెను. ఇది సాభిప్రాయమే యగునో కాదో గాని యర్జునుఁడు

అదియు నొక శకునంబుగా నధిపుఁ డంది
చేతి కందిచ్చినట్లనె చేకుఱంగఁ
గలదు వలిగబ్బిగుబ్బెతచెలిమి యనుచు
నాత్మలో నెంచి, యాభావ మపనయించి,

'నెలయుదయించునప్పుడల నీరజముల్ కుముదంబు తాను రేల్'అని కంజములమీఁదను, కలువలమీఁదను బెట్టి 'కందుకసూట'లాడఁజొచ్చెను. విశారదుఁడు కిరీటికిం గల శ్లేషచాతురిని, అవహిత్థాప్రౌఢిని మెచ్చుకొనుచుండెను. అంతియేకాని విశారదున కర్జునుఁడు దాఁగనుచున్న యవస్థ నెఱుఁగఁజేయలేదు. తదుపరి

విధుచక్రచకోరులను బురంద్రే
త్రోణసుర్ధరు నంపె సేకలు శుకపికశారీ

మధులిట్టులు మలయానిల
మధులిట్టులు తనదు ధైర్యమహిమఁ గలంపన్.

తేయంతయు 'నయారె! చిత్రాంగదసాటిజోటి కలదా?' యని మెచ్చు కిరీటి మాటికిన్. తన విశారదునకయిన నెఱుంగఁజేయమిని హృదయభారము తగ్గదు. కంటికి నిదుర యబ్బదు.

ఈకరణిఁ దలంచుచు నా
లీకనిభానన నెద న్నిలిపి రేగడపెన్;
లే కెటుల నిద్ర వచ్చున్
రేకను నయ్యొదిద నెదను నిల్పినదాఁకన్.

అని కవియే వక్కాణించియున్నాఁడు. పైపద్యము నెంబడినే వెంకటరాజకవి యొక్క చిన్నపద్యమును జక్కఁగఁజెప్పెను.

అపుడు నృపుఁడు ప్రఫుల్లనవాంబుజ ప్ర
సన్నముఖుఁడయి మలయధ్వజక్షితీశ
కమలహితునకు మామకాగమనవార్తఁ
దెలుపుమంచు విశారదుఁ బిలిచి పనిచె.

పద్యము చిన్నదియే యయినను నిందలి భావముమాత్రము గభీరమని వ్యాఖ్యాత లందఱు నంగీకరించిరి. వ్యాఖ్యాతలే యననేల? అర్జునుఁ డవలంబించిన యవహిత్థను గుర్తింపఁగలిగిన పాఠకులును, జేమసూరకవి కడుంగడుఁ బాటించు స్వభావాది వర్ణనౌచితిని రుచిచూచిన విమర్శకులును నీపద్యము గంభీరభావ బంధురమయి యుండక తప్పదని సిద్ధాంతము చేయక మానరుగదా! ఇట్టి చక్కని పద్యమును బూర్వవ్యాఖ్యాత లెట్లు పరిగణించిరో పరిశీలించుట ముదావహము గాకమానదు.

అందగ్రగణ్యులగు జూలూరి అప్పయ్యపంతులు గారు తొలుదొల్త నిందలి స్వారస్యములు గుర్తింపఁ గొంత ప్రయత్నించి యిట్లువ్రాసిరి. ఈపద్యమునఁ బాఠభేదములు లేవు.—

"అపుడు=ఆసమయమునందు, నృపుడు=అర్జునుడు, ప్రఫుల్లనవాంబుజ ప్రసన్నముఖుడయి=వికసించినటువంటిన్ని నూతనమైనటువంటిన్ని కమలమువలెనే తేటగల ముఖము గలవాడై, మలయధ్వజక్షితీశ కమలహితునకు=మలయధ్వజుడనే పేరుగల్గిన రాజమార్తాండునకు అనగా రాజశ్రేష్ఠునికి, మామకాగమనవార్త=మాయొక్క రాకడ వర్తమానము, తెలుపుమనుచు=తెలియజెయ్యమని విశారదుబిలిచి పనిచె=విశారదుణ్ణి పిలిపించి పంపించెను.

మామకాగమనవార్త అన్నచోట మామకు ఆగమనవార్త అనికూడా చమత్కారము విచారించవలెను."

అని వ్రాసిరి.

ఈపద్యమునకు వేదము వేంకటరాయశాస్త్రిగారు వ్యాఖ్యానమును వ్రాయుచు నిట్లు లోసఁగిరి.—

"ప్రఫుల్ల నవ అంబుజ ప్రసన్నముఖుఁడు=వికసించిన నూతన కమలమువలెనే తేటగల ముఖముగలవాఁడు; క్షితీశకమలహితునకున్=రాజసూర్యునకు (కమలహితుఁడనఁగా సూర్యుఁడు—ఇట నీపదము శ్లేషార్థగోచరము. ఇతఁడు అంబుజ ప్రసన్నముఖుఁడుగాన అంబుజహితునివంటి వాఁడయిన మలయధ్వజుఁడు ఇతనికి మిత్రుఁడై యితనికార్యమును నెఱవేర్చునని హృదయము) మామక=నాదయిన, ఆగమన=రాకయొక్క, వార్తన్=వృత్తాంతమును

(మామకున్ ఆగమనవార్త...తనకూఁతును నాకిచ్చి వివాహముచేయుమని ఆయనను అడుగుము అని చమత్కారము)."

పై రెండు వ్యాఖ్యానములయందును స్ఫుటతరాక్షరములఁ జూపిన భాగములనుబట్టి 'మామకాగమనవార్త' యను పదంబుల నర్జునుని వివాహవాంఛ గర్భితముగ నున్నదని యందఱు నెఱుంగఁగలరు. తన భావగోపనము నింత చక్కఁగఁ బోషించికొనుచువచ్చిన యర్జునుఁడీపట్టున వివాహాభిలాషను నిగూఢముగ నుంచుననుటయు సమంజసమేయగును. కాని నిగూఢార్థమును సాధించుట యెట్లు? దీనఁగల కష్టమును గుర్తించియే కాఁబోలు,

జూలూరివారు 'మామకు ఆగమనవార్త' యని సూచించి 'అనికూడా చమత్కారము విచారించవలెను' అని వ్రాసిరి. ఈ వాక్యమునందలి 'విచారించవలెను' అనునది 'ఇంకను యోజించి నిశ్చయింపవలయును' అనునర్థమునఁ బ్రయుక్తమయి యుండినచో వారతులుగా నొకను నెట్టి నిశ్చయమును జేయలేదనియు నాలోచన కొక విధానమును మాత్రము సూచించిరనియు నెన్నఁదగును. అప్పుడు వాదే కలుగదు. అటుఁగాక జూలూరివారు 'విచారించవలెను' అని శాసించిరనినచో, వారి నిశ్చయమునకును వేంకటరాయశాస్త్రిగారి సిద్ధాంతమునకును భేదముండదు. అట్లయిన వాదున కీరెండువ్యాఖ్యానములు నొక్క లక్ష్యముగనే పరిగణితములు గాఁగలవు.

వేంకటరాయశాస్త్రిగారు చమత్కారమని చూపిన యర్థ మిట్లున్నది.—

'మామకున్ ఆగమనవార్త...తనకూఁతును నాకిచ్చి వివాహముచేయుమని ఆయనను అడుగుము అని.'

ఇచట 'మామకాగమనవార్త' యను పదములను 'మామకున్, ఆగమనవార్త' అని పదవిభజన నొనరించిరి. ఈవిభజనను బట్టి యాయా భాగములకుఁ గల యర్థములను నిర్వచించి, యావెనుక నేదియో యొకశక్తివలన నాయర్థములను సాగించి, దానఁ దా మగ్గడించిన చమత్కారమును సాధించుట వ్యాఖ్యాతలకు ధర్మమగునుగదా! కావున 'మామకున్' అనుపదమున కొక యర్థమును జెప్పి 'ఆగమనవార్తకు' నట్టులనే యొసఁగి యీరెంటి మేళనమున యౌగికముగనో లక్షణవలననో మఱి యేయితరవిధముననో పైఁజెప్పిన చమత్కారార్థమున కనువగునట్టుల నర్జునుని వాంఛను దేటపర్చవలయును. 'మామకున్' అన మామగారికి 'ఆగమనవార్త' అన రాకయొక్క వృత్తాంతము అనియేగదా మన మర్థమును జెప్పవలసియుండును. "మామగారికి (నా)రాకయొక్క వార్తను దెల్పు"మని చెప్పినయంతమాత్రమున వారు రచించిన చమత్కారార్థ మెట్లు సిద్ధింపఁగలదు? పైయర్థమున కెట్టి శక్తినిచ్చినఁ 'దనకూఁతును నాకిచ్చి వివాహముచేయుమని ఆయనను అడుగుము' అని కాఁగలదు? ఈవిభజనయందు 'ఆగమనవార్త' యనుపదముల కెట్టి విశేషార్థమును గల్పింపఁజాలముగదా! ఇంక మిగిలినది 'మామకున్' అనునదియే. దీని శక్తివలననే వారొసఁగిన చమత్కారార్థ మంతయు సిద్ధింపవలయును. ఇది యెంతవఱకు సాధ్యమగునో సహృదయు లెఱుంగఁగలరు.

'మామకున్' అని భావించుటకు మలయధ్వజుఁ డంతకుఁబూర్వమే మామయయియుండవలయునుగదా! అయినచో నిప్పుడు వివాహాభ్యర్థనమున నేమి స్వారస్య ముండును? అర్జునునకును, మలయధ్వజునకును నింతకుమును పే 'యల్లుఁడుమామ' వరుసయున్న యట్టుల నెఱుఁగముగదా! మలయధ్వజుని కూఁతును వివాహ మాడఁగోరినయంత మాత్రమున నాతని 'మామ'గా నిర్దేశించుట పాడియా? అందున నుత్తమకులసంజాతుఁడును, ధర్మజు ననుఁగుఁ దమ్ముఁడును నగు నర్జునునకు? అట్లు నిర్దేశించి 'మామకున్' అని ప్రయోగించిన యనంతరము విశారదునకుఁ గర్తవ్య మెట్టుల గోచరింపఁగలదు? చేమకూరకవి తన పాత్రల సభ్యత్వము నావంతయుఁ గోలుపోవుట కిచ్చగించునట్టిఁడుగాఁడు. గుణపోషణమున నత్యంతజాగరూకతఁ గలిగియుండును.

"అలఘుకులశీలగుణములు
గల దీకన్య......"

అని యెఱిఁగినయంతవఱకు నెట్టి యభిలాషకును దావు నొసఁగని యర్జునుఁ డిచ్చటఁ గూఁతు నీయుమని కోరఁబోవునాతని 'మామ' యని నిర్దేశించినట్లు కవి యుగ్గడించునా? సభ్యావర్తనవిశారదు లిట్టివ్రాఁతల నంగీకరింతురా? కావున నీవ్యాఖ్యానము దుష్టమనకతప్పినది గాదు.

ఇట్లు పదవిభజనము నొనరించి యర్థమునకు సౌష్ఠవలోపమును, నర్జునపాత్రకు సభ్యతాలోపమును గలిగించుటకన్న నీపద్యమునందు 'మామ' యను శబ్దము శ్రుతిగోచర మగుచున్నదిగావున వివాహవాంఛయో, భవిష్యత్సంబంధమో ధ్వనించుచున్నదియనుట లెస్సయగును. అట్లయినచో నెవ్వరికి నెట్టి విప్రతిపత్తియు నుండదు.

'ఆకీతిని సంతసింపవలసినదేనా లేక మఱియేదయిన నధికతరార్థమిం దిమిడియున్నదా' యని యారయందగును. మన వేంకటకవి యంతయలంతుల సంతసించువాఁడుగాఁడను మహావిశ్వాసముతోడ నే నిట్లు విభజనమొనరింప సాహసించితిని:—

"మామ కాఁగ మనవార్తఁ దెల్పుమని."

అనఁగా "మామ యగునట్లు మన వృత్తాంతమును దెలియఁ జేయు"మని విశారదున కాదేశము నొసఁగెనని చమత్కారార్థమగును. మామకాఁగ = మామయగునట్లు లన (మామ యగుటకుఁ) గూఁతును వివాహమున నిచ్చునట్లు లని యర్థము సుగమమేయగును. దీనియందు కిరీటి హృదయమునందలి యభిలాష యర్థాంతరమునఁ జక్కఁగ స్ఫురింపకతప్పదు. అవహిత్థాసంపోషణమున కిట్టి యవాంతరమును లేదు. పైపెచ్చు దీన నింకొక్క యర్థగౌరవముం దోఁచును. విశారదుఁడు తమ వార్తను దెల్పిన, దానికి ఫలితమున మలయధ్వజుఁడు 'మామ' కావలయును (కూఁతు నర్జునున కిచ్చి వివాహము చేయవలయును). అనఁ గార్యభార మంతయు విశారదునిపై నర్జునుఁ డిడుచున్నాఁ డనుటగదా! "విశారదా నీవు మన యాధిక్యము నాతని కెట్టులఁ దెలియఁ జేయుదువో యోజించికొనుము. నీవు చెప్పిన వార్తలను విని మలయధ్వజుఁడు నాకుఁ దన కూఁతునిచ్చి మామ కావలయునుసుమా!" అని యర్జునుఁ డీపదములవలన నిగూఢముగ విశారదుని నభ్యర్థించెనని తేటయగును. ఈ పల్కులవలన విశారదునకుఁ దాఁ జేయుమన్న కార్యగౌరవము ప్రస్ఫుటమగును. *

ఇట్లుత్సాహకారణముగఁ గనవచ్చుచున్న యీ యర్థమునకు బాధకము లేమేని కలవా యని వితర్కించుట లగ్గగును గాదా! 'మామయగునట్లు' అను నర్థము వలయుచో 'మామకాఁగ' నని యర్థానుస్వార యుతము రూపముండవలయునుగదా, దాని నెట్లు సమర్థించుట? యనవచ్చును. కాని యావాద మావంతయు బాధింపఁజాలదని తజ్ఞు లెఱుంగఁగలరు. శ్లేషయం దర్ధానుస్వారంబునకుఁ బాటింపు లేదు. దీనికై ద్వితీయాచార్యుఁ డొక్క కారికనుగూడ నిర్మించెను.—

"శ్లేషే సఖండనిర్బిందోర్విశ్లేషణం క్వచిన్మతమ్."

దీనినిఁబట్టి శ్లేషార్థమం దొకానొకచోట ఖండబిందువుతోఁ గూడినట్టియుఁ గూడనట్టియు శబ్దముల కైక్యము సమ్మతమే యగునని తేటకాఁగలదు. చూఁడుఁడు:—

పొలసి తటిల్లి తాంగిజిగి
సూపు వెలుంగులచేఁ గలన్వనుల్

* ఈ యర్థమును నేను 1925 లో శ్రీయుత పండ్రంగి రామారావుగారి సంపాదకత్వమున బెజవాడనుండి వెలువడుచుండిన 'పుష్కరిణి' పత్రికయందుఁ బ్రచురించి యుండుటు నాంధ్రపండితు లెఱింగియే యుందురు. ఆపుష్కరిణి సంచిక నొక్కదాని నప్పుడు మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారికిఁగూడ నంపితి. వారు నుదారబుద్ధిని దాని నంగీకరించి చమత్కారప్రకటనమునందలి సూక్ష్మబుద్ధినిఁ గొంత ప్రశంసించిరని మిత్రముఖంబున విను భాగ్యము నాకు లభించెను.

మొన్న మొన్నను బ్రసంగవశంబున నీపద్యమునకు నే నొనరించిన వ్యాఖ్యానమును విని అవధానిశిరోమణి బిరుదాంకితులగు మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యవరేణ్యులు

..................................

..................................

అవురా! మెచ్చితి 'మామకాగమనవార్తా'శ్లేష స్థలంబందు నీ
వివృతిన్; బొంగితి నీగు చాతురికిఁ దాపీ ధర్మరాయాహ్వయా!

యని తమ యామోదంబును బ్రకటించి నన్ను ధన్యు నొనరించిరి. పాఠ్యగ్రంథముగఁ బాఠశాలలందు దీనిఁ జెప్పవలసిన పండితులు కొందఱీయర్థమునే యుగ్గడించుచుఁ బరోక్షమునఁ దమ యామోదమును నాకొసంగుటచేతం గూడ నేను కృతకృత్యుఁడ నగుచున్నాఁడను.

గల కలకంఠులం గదిమి
　　గాటపునెమ్మి నటింప హంసకం
బులు జడియం బయోధరస
　　మున్నతి భంగురమధ్యపుష్కరాం
చల మఱదోఁపఁగా నరిగెఁ
　　జారుఘన ప్రతిసీరచెంతకున్.

ఇచ్చట 'వెలుంగులచేఁ కలధ్వనుల్' అనుచో నర్ధానుస్వారముండునుగాని 'వెలుంగులచేఁ గల (=కంఠ)ధ్వనుల్' అనునెడ నర్ధానుస్వార ముండదు. అయినను శ్లేషరచనయం దీస్వాతంత్ర్యము కవులకు ప్రసాదితమే యగును. అట్లులనే 'మామక + ఆగమన + వార్త' అనుచోట నక్కఱగాని యర్ధానుస్వారము 'మామ + కాఁగ + మన + వార్త' యనుచోఁ గో అవసవచ్చునుగదా! కావున నీ యర్ధానుస్వార ప్రతిబంధకము నిరాకృతము.

ఒక్కయర్జునుని వివాహసందర్భమున సభ్యర్థనంబున 'మనవార్త' యని బహువచనసూచన యేల? యని శంకింపవచ్చును. ఆర్ష వివాహములు మనలో వరునిగుణాధిక్యముమీఁదనే జరుగవనియు నాతని కుటుంబగౌరవాతిశయముల విమర్శపైఁగూడ విశేషముగ నాధారపడియుండుననియు వేఱుగ నుడువఁబనిలేదు. కావుననే చిత్రాంగదనుగూర్చి విశారదుఁడు.

'అలఘుకులశీలగుణములు గల దీకన్య'

యని కులమునుగూడ నుగ్గడించెను. ఈకారణమున నర్జునుని గుణగణములను వర్ణించినంతమాత్రమునఁ గార్యము తీఱదు. కావున నావంశము నందలి యాధిక్య మంతయు నుగ్గడింపఁదగునని భావము. కురువంశము, పాండురాజు, ధర్మరాజాదులు నందఱును నీ'మన' యనుపదమునం దిమిడియున్నారు.

ఇంతియ కాదు; 'మన' యనునది తెలుఁగువారలకుఁ గాణాచియగు జాతీయము, మహానందప్రదము. సాధారణముగఁ దెలుంగుబిడ్డ 'మన', 'మా' యనియే యనునుగాని 'నా' యని యనఁడు. తమిళసోదరుఁడు 'ఎన్ తాయార్', 'ఎన్ వీడు' అని పలుకుచోట్ల నాంధ్రుఁడనువాఁడు 'మాయమ్మ', 'మాయిల్లు' అనియే యనును గాని యేకవచనమును వాడఁడు. తనతల్లికి తా నొక్కఁడే పుత్రుఁడయినను 'మాయమ్మ' యనియే పలుకు తెలుఁగుబిడ్డజాతీయతను బాగుగ కైవస మొనరించుకొనిన చేమకూరకవి యర్జునుని నట్లుగాక యింకెట్టుల మాటలాడనిచ్చును ?

'మనవార్తఁ దెల్పు'

మని యీసందర్భమున ననుటయే యర్హము. కావున నీయాక్షేపణయుఁ బరాస్తమగుచున్నది.

భావగోపనాయత్తచిత్తుఁడగు నర్జునుఁ డుద్దేశించిన గభీరార్థ మేమన:—

మలయధ్వజక్షితీశకమలహితునకు మనవార్తఁ దెల్పుము. ఎట్లు దెల్పవలయును ? ఆతఁడు మామయగునట్లు—'మామ కాఁగ మనవార్తఁ దెల్పుము.'

ఇంత చక్కనిచమత్కారము నిండుఁ బొందుపఱిచినంతటితోఁ గవి యుత్సాహము సంతృప్తినందెనా? యనిన లేదనియే పలుకవలయును. అర్జునుఁడు, 'ప్రఫుల్లనవాంబుజప్రసన్నముఖుఁడు'; మలయధ్వజుఁ డన్ననో 'క్షితీశకమలహితుఁడు'. ఈపదములనే కవి యీయిరువురకును గలుగఁబోవు సంబంధమును సూచించినవాఁడని వేదము వేంకటరాయశాస్త్రిగారు చూపిన స్వారస్యము ముదావహమే యగును. కాని, యొక్కప్రశ్నకుమాత్రమవకాశము కలుగుచున్నది. ఈమాత్రపు సంబంధమును సూచింపనేకవి 'నవాంబుజప్రసన్నముఖ' తయు నీ'కమలహిత' త్వమును బద్యమునఁ జొన్పినాఁడనిన నయ్యది కవికొక గౌరవగుణముగాని ప్రమదకారణముగాని కానేరదుగదా! ఈకల్పన లెట్లు ప్రస్తుతము లగుచున్నయవి? ఈస్ఫురణ నెట్లు సమర్థింపనగును? అని శోధించినఁగాని దీని గుణము తేటపడదు.

కథాసన్నివేశము నించుక యవధరింపుఁడు. చిత్రాంగదపై విరాళిని నర్జునుఁడు రేయంతయు నిదురలేకయ కడపెను.

'లేకెటుల నిద్రవచ్చున్
.... రేకగు నయ్యువిద నెదను నిల్పినదాఁకన్.'

ఆరాత్రియంతయు నాతఁ డెంతటఁ దెల్లవారు నెంతట విశారదునిఁ బనిచి వివాహప్రయత్నము నారంభింతుననియే తహతహ పడుచుండునుగదా! ఆనిశాని మేషంబు లన్నియు నన్నియుగంబులుగఁ గానవచ్చుచుండును; పాపము, కిరీటికి! అంతయాత్రమున నర్జునుఁ డున్న సమయంబునఁ దెల్లవారెను. సూర్యోదయానంతరము తన కార్యక్రమమున కుపక్రమించుచున్నవాఁ డర్జునుఁడు. సూర్యోదయమనినను, చంద్రోదయమనినను మన ప్రబంధకవుల కెంత యుబలాటమో యిటఁ దడవఁబనిలేదు. పద్యముపై పద్యమును బేర్చి, యుత్ప్రేక్షపై నుత్ప్రేక్షను దొంతరబెట్టుట కట్టివియేగదా గట్టిపట్టులు! కాని యాయుబలాటమునకు మనకవి యావంతయు లోఁబడవలేదు. ఏల? ప్రధానపాత్రయగు నర్జునుని యాందోళనమును, నుద్దిష్టకార్యాచరణత్వరయుఁ జక్కఁగఁ బ్రదర్శించుటకే యని గట్టిగాఁ జెప్పవలయుఁగదా! పాత్ర తహతహలాడుచు నిముసంబులు కల్పములయట్లు పరిగణించుచుండఁ; దెల్లవారకమునుపే విశారదుని 'పిలిచి' పనుప నుత్సహించుచుండ, కవి సూర్యోదయవర్ణనచాతురినిఁ జూపుట రసపోషకము గాదనియే వేంకటకవి యీ యుద్యమమువంకకుఁ బోలేదు. అంతియకాదు. "అంత సూర్యోదయ మయ్యెను" అనియయిన నుడువలేదు.

'లేకటుల నిద్రవచ్చున్
రేకగు నయ్యెడిద నెదను నిల్పినదాఁకన్'

అనుపద్యమును వ్రాసి దానివెనువెంటనే

'అపుడు నృపుఁడు ప్రఫుల్లనవాంబుజప్ర
సన్నముఖుఁడయి.........'

అని యీపద్యము నందికొనెను. ఇంతకన్న నర్జునుని యాత్రము నెవ్వరు వర్ణింపఁగలరు. కవియెంత యుచితజ్ఞుఁడు! ఆంధ్రప్రబంధకవిని సూర్యోదయవర్ణనను గూడఁ జేయనీయని యీయాత్ర మెంత యధికమో చదువరులకుఁ దెలుపుట కింతకన్నఁ జమత్కారమార్గముండునా? రాత్రియంతయు నుద్యమోపక్రమణమునకు నవకాశము గలుగకుండెను. కావుననే యెప్పుడు వేగునను తహతహ. తెల్లవారఁగానే విశారదుని బంపి ప్రారంభము నొనర్పవచ్చును. కావుననే వేగునంత నర్జునుని ముఖపద్మము ప్రసన్నతను గాంచెను. ఊహలను గార్యాచరణమునఁ బెట్టు నవకాశ మబ్బుటయే సంతోషకారణముగదా! ఇయ్యదియే అంబుజప్రసన్నతాసాదృశ్యమునకు సమర్థనము.

అయినచో మనకవి కథావిషయకాలప్రకటనము నొనరింపలేదని యనవలసివచ్చునుగదా యందురేమో! పనిలేదు. ప్రఫుల్లనవాంబుజంబులును, కమలహితుఁడును బ్రత్యక్షముగఁ గానవచ్చుచుండ నింక వేఱుగఁ గాలప్రకటనము నొనరింపవలయునా? నవాంబుజ మన నప్పుడే వికసించు పద్మము! నవాంబుజము నుగ్గడించునెడల సూర్యోదయముగాక మరేకాలము పాఠకునకు దృగ్గోచరమగును? ఈరెండు తూలికాస్పర్శలవలనను గవి సూర్యోదయపటమును వర్ణించి కనులయెదుటఁ బెట్టెను. వర్ణనయను మిషతోఁ గాలయాపనము నొనర్చి యర్జునునాతురమును కుంఠీభూత మొనరింపలేదు. కవి ధన్యుఁడే గదా!

అర్జును ముఖమునందు ప్రఫుల్లనవాంబుజప్రసన్నత నారోపించినందుననే మలయధ్వజునియందు క్షితీశకమలహితత్వము నాపాదించెను. కమలహితత్వము 'శ్లేషార్థగోచర'మని ససందేహముగ నంగీకరింపఁబనిలేదు. వాగనుశాసనుం డాదిపర్వంబున

రాజమహేంద్రకవీంద్రస
మాజసురక్ష్మాజ రాజమార్తాండధరి
త్రీజననుతచారిత్ర వి
రాజితగుణరత్న రాజరాజనరేంద్రా.

అని నుడివియున్నాఁడు. మార్తాండుఁడే కమలహితుఁడు కావున నియ్యది శ్లేషవాచకమే యగును.

రసము గలుగుపట్టుల నింత జాగరూకత రచించు చేమకూరవాని గ్రంథమును మన మెంత శ్రద్ధాళువులమయి పరిశీలించి పఠింపవలయునో తనుదాఁ దెలియఁగలదు.

# తుమ్ములు



# తారాశశాంకము

(బుధాభ్యుదయము)

గర్భాం అప్పారావుగారు, బి. ఏ., బి. ఇడి.,

"త్రిలోకముల కెల్ల మిన్నయై వెలుంగు నీత్రిదివంబు సకలభోగముల కునికిపట్టు. ముజ్జగములందలి సుందరీమణుల యందమును బరిహసించుకొనజాలు నిచ్చటి యప్సరోగణ సౌందర్యము. ఇందు శృంగారనిలయంబయి వెలయు నందనవనంబు. అమరావతీపురంబు తనకు రాజధానిగా నేలు దిక్పాలకనికరపరివృతుండయి పురందరుండు. అట్టి సురవరునకు మంత్రోపదేశతత్పరుండగు మన్మనోహరుండు వాచస్పతి—వాచస్పతి—ఆవాగ్వధూటిని నేను. పతి నా కామహానుభావుడు.

'మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతాం, కీర్తిః శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా.'

"ప్రళయకాలమున సర్వము నాశము చేయు మృత్యువును నేను. ఉత్పత్తివస్తువులకు నుత్పత్తిస్థానము నేను. స్త్రీలయందు కీర్తి, లక్ష్మి, వాక్కు, తెలివి, బుద్ధి, ధైర్యము, ఓర్పు నేను." ఏమి యామహానుభావునకు నాయందలి గౌరవము! అతండు నామూలమున గలిగిన 'వాచస్పతి, గీష్పతి, బృహస్పతి మున్నగు' నామములచేతనే పరిగణింపబడునుగాని స్వతంత్రనామ మెయ్యదియుఁ బ్రకటింప నియ్యకొనడు. అవును, సర్వవస్తుజాలము నాసాయమున పేరెన్నికగన్నది. వస్తుగుణములు నావలననే విశదీకరింపబడుచున్నవి. సకలశాస్త్రములు హృద్గతభావములు నావలన వెల్లడియగుచున్నవి. నేను లేనిచో సృష్టియంతయు నశించును. సృష్టికి మూలము భావము. తద్భావము శాశ్వతముగా ప్రకాశింపజేయుదానను నేను. అక్షరమును నేను. నాకు నాశము లేదు. నేను నక్షత్రనామమున వెలయుచున్నాను. మత్పథంబుననే సూర్యచంద్రులు తిరిగెదరు. వారి నడతలు నామూలమున గుర్తింపబడును.

"నక్షత్రాణా మహం శశీ"
(తారలలో చంద్రుడను నేనే.)

తారను నేనే. చంద్రుడను నేనే. అట్టిచో నాయందు బతి కెందులకీయీర్ష్య? సకలసురసేవితంబయి మత్పతి కత్యంతధీయుక్తుల నొసంగు సోమరసంబు నే ననుభవింప వీలు పడదట! పూర్వము విశ్వవార యనునామె ఋత్విక్స్థిర మలంకరించెను. స్వార్థపరులు, నిర్వ్యాళువులు నగు మతగురువులు స్త్రీ లట్టిస్థాన మలంకరింప ననర్హులని యిట్లే స్త్రీలకుఁ గల హక్కులను తొలగించిరి. తొల్లి అపాల యను కాంత యింద్రునిగూర్చి మంత్రములు రచించి తానే సోమరస మాతనికి సమర్పిం

చెను. పురుషులు స్వార్థపరులయి స్త్రీల నెంత చులకనగా జూచుచున్నారు? సోమరస సంప్రాప్తి నా కెట్లు కలుగకుండునో చూచెద గాక. మదీయప్రాణనాయకుండు యాగ మొనరింప నేగియుండుట శుభసూచకము. ఇదియ తగిన యదను. తన కత్యంతప్రియ శిష్యుడు చంద్రు డింట నున్నవాడు. సోమ రసాధినేతయై యున్నవా డాసోముడు. సకల సురానీకముల సోమరసప్రదానమున సంతు ష్టుల జేయు సుధాకరుండు, చిన్ననాటనుండి యు గడు గారాబమున బెంచిన నేను కోరగ నాకోర్కి కొనసాగింపకపోడు. అడిగెదగాక."

"కుమారా! సోమా! ఎం దేగెను?– చూచెద. ఆ! వచ్చుచున్నాడు. ఓహో ఏమి యీతని లావణ్యము? ముఖమున జ్ఞాన కళ లుట్టిపడుచున్నవే! సోమరసపానముననే యింద్రాది దేవతులు దేవర్షు లనంతప్రజ్ఞావంతు లగుచుండ సోమరసమూర్తియగు నీతని దైహికమానసికశక్తులు వర్ణింప నెవరితరము? కవు లెంద రీతని వర్ణించిరికారు! కవియగు శుక్రాచార్యుండు నీతని కళలకు భ్రమించి తా నొక చుక్కయై యీచుక్కల జేని రాజత్వ మంగీకరించెను.

"కుమారా! చంద్రా!"

"ఏమమ్మా! ఇదే వచ్చుచున్నాడ. ఏమియాజ్ఞ?"

"ఏమి వినయమోయి! తండ్రీ! ఏమి వినయము! నీతలిదండ్రులు ధన్యులు. మేమును ధన్యులము. నిన్ను కనుటమాత్రము వారి వంతుకాని, నిన్ను చిన్ననాటనుండి బెంచు టచే మాకు గుమారులులేని లోటు పోగొట్టి తివి. నిన్నొండు కోరెదను. నెరవేర్చి పితౄ ణము దీర్చికొమ్ము. మీగురువు లింట లేరు. ఇదియ సమయము."

"తల్లీ! ఏమ ట్లనుచున్నావు! కోరుట యేమి? ఆజ్ఞాపించుము. శిరసావహించి యొనరించెద."

"వెనుదీయవుగదా –"

"ఎంతమాట తల్లీ! నీవు నాయెడజూపిన వాత్సల్యమున కింకొకరీతి బ్రవర్తించిన కృత ఘ్నుడ నౌదును. నీకోర్కి కొనసాగుట కీదేహమైన నర్పించెద. అందుకొరకై నా దేహము దినదినము క్షీణింపనిమ్ము."

"అంతవాడవేనోయి నాయనా, అంత వాడవే. నీదేహము క్షీణించుట కే నొప్పు కొనియెదనా? అంతపని జరుగు ననుకొంద ము. దేహ మనిత్యము. ని న్నొం డర్థించెద."

"అర్థించు టేల నమ్మా! ఆజ్ఞాపిం చుము."

"చంద్రా! సోమరాజా! పురుషు లీర్ష్యాళువులుసుమా!"

"కానిమ్ము. నే నాకోటిలో చేరను."

"చేరవనియే ని న్నొండు కోరుచున్నా ను. ఎందరు మరున్నాగమణులు నిన్నాశ్ర యింప జూచుచున్నారు. నీవు వారి కగమ్యు

డవు. అందుచే వారు హతాశులై యున్నవారలు. నే నొక్కతె నాగమ్యస్థాన మొందఁ గలనను ధైర్యము వహించియున్నదాన. తోడ్పడు భారము నీది. శిష్యులలో నీ వగ్రగణ్యుడవని సురగురుండు నిన్ను సోమ రసాధిదేవతగా నొసఱ్చెను. గురునాజ్ఞ దప్పక దేవత లంద అందుల కంగీకరించియున్నారు. అయిన స్త్రీలోకము తద్రుచి యనుభవించుట కభ్యంతరమేమి ?"

"నీవే చెప్పితివి 'పురుషు లీర్ష్యాళువు'లని"

"అయినచో నీరుచి ననుభవింప నేను గూడ నన ర్హనేనా ?"

"నారుచి యేమి ?"

"నీరుచికాక మరేమి ? సోమరసంబు నీయందు మూ ర్తీభవించియున్నది. చల్లనై, యద్వితీయతేజోవంతమై నీరుచి ప్రకాశించు చున్నది. ఆరుచి నా కనుగ్రహించి జ్ఞాన కౌమారాభ్యుదయము ప్రసాదించుము."

"అమ్మా ! విషమస్థితిలో ముంచుచున్నావు. నీకోరినయది సులభసాధ్య మనుకొంటిని. మద్గురునాజ్ఞ నతిక్రమింపవలసివచ్చును. గురుద్రోహి నగుదును. గురువు నీకును బూజనీయుడు. భర్తృనాజ్ఞ నతిక్రమింతువే! పతిని దైవముకంటె నెక్కుడుగా జూడవలెను. తుచ్ఛసౌఖ్యములకు లోఁగి యనుచిత మొన రింతువా ? నన్నొనరింపు మనియెదవా ?"

"తండ్రీ! తుచ్ఛసౌఖ్యమా యిది? దైహికబలమునకంటె సోమపానము మానసిక శక్తికై యెక్కుడుగా దోడ్పడుచున్నది. ఇందులకు దాక్షిణ్యము నీవ. అనంతము, నద్వితీయము నగు బ్రహ్మజ్ఞానము నాకు గలిగించి నీకీర్తికాంతను నీవలెనే ప్రకాశింపజేయుము."

"జననీ! ఏల యిట్టి కోరిక కోరు చున్నావు. ఇయ్యది యకార్యము. అకార్యమునకు నియోగించుట న్యాయమా ?"

"అనుచితకార్యమా యిది ? జ్ఞానవంతుడవు. సర్వశాస్త్రవేత్తవు. సంపూర్ణకళాభిజ్ఞుండవు. గురువునొద్ద నేర్చినది మక్కికిమక్కి యాచరణలో బెట్టక స్వతంత్రమార్గ మవలంబించి కార్యాకార్యముల నెఱిగి గురు వాచరించు విషయము సరిగా లేనపుడు దాని వీడి నీబుద్ధిచే దానిని యుక్తాయుక్తాచరణలో నుంచుము. 'అయ్యది గురుహృదయమునకు భిన్నముగా నుండినను విశాలహృదయముతో దానిని సర్వజనోపయుక్త మగునట్లు ప్రయోగించుట మోక్షహేతువు. ఇప్పటి మన యేలిక యింద్రుడు. మంత్రి మీగురువు. దిక్పాలుర ప్రభుత్వకోటిలో జేరినవారు. వీరందఱు స్వార్థ పరులు. సురలు స్వర్లోకప్రజలు కావున వారికి పరస్పరాభిమానము లుండుట సహజము. అయినను వీరిలో వీరికి పరస్పరభేదములు లేకపోలేదు. స్వార్థపరులై యధికారప్రాబల్యమున తమ పక్షమువారి నెందఱ శాసింప లేదు ; శపింపలేదు ? నీ వెఱుగవా ? తమకు సరియగు సేనాధిపతిని యత్నించుటలో నీ మేనల్లుని మారుని నియోగించి శివునిచే దగ్ధ

మగునట్లు చేయలేదా యీ ప్రభువగు నింద్రుఁడు ? సోమపానము కొంద రెవరోకాని యంద అనుభవింపరాదట ! ముఖ్యముగా నింద్రుని కందఱు దానిని సమర్పించవలెనట ! .........
....................................... అనేక విధయజ్ఞములు వారిచే జేయించి హవిర్భాగములు వీ రనుభవింపవలెనట ! అందు మహాత్ము లెవరైన బ్రహ్మమును బొందుటకు తపం బొనరింప యత్నింతురేని వారి తపంబులు చెఱుప రంభాదుల నియోగించి విఘ్న మొన రింతురు. వీరికి గల స్వాతంత్ర్యము, హక్కులు వారికి వలదట ! సేవచేయుట వారు. పాటు పడుట వారు. కష్టముల కోర్చుట వారు. వీరి దోషములు వారు నిరూపింతురేని దండనకు పాలగుటయు వారే. భోగము లనుభవించుట వీరు. చూడుము స్వార్థపరత్వ మెంత యావ రించియున్నదో వారిని. అదియే విడువు మని నిన్ను కోరుచున్నదానను. దానిని నిర్మూలము చేయుము. సమవర్తివై ప్రవర్తించుటకు యత్నించుము. ....................................
........... ఈ యాత్మంభరుల మార్గమున కవరోధము కల్గించుము. సమవర్తి వైనచో నీ రాజత్వము సర్వత్ర యంగీకరింపఁబడును.

“ తల్లియుఁ దండ్రియుంబలెను
 దా నిడుమల్ పడిన్యైన లోకులన్
జల్లగనేలు కోపమును
 ద్మ్నెపుఁడు చూపఁడు సూర్యునాతపం
బెల్ల భరించి లోనడఁచి
 యింతయుఁ జందురుఁ డట్టివేడుముల్
చల్లక కూర్చు లోకులకుఁ
 జల్లఁదనంబును లోకబాంధవా!”
అను వాక్యము సార్థకము చేయుము.

“ జననీ ! నీ చెప్పిన యర్థము పరమార్థము. నీ యాజ్ఞానుసారినై ప్రవర్తించెదను. అయిన నొక్క సందియ మున్నది. గురుశాపమునకు భయ మొందుచున్నాడను. ఆతఁ డీ విషయ మెఱింగి శపింపకమానడు.”

“ ధీరోదాత్తుడవు నీకు శాపభీతియా ? నీ వొనరింపబోవు సత్కార్యమునకు వా రవినీతులై శాపదండన నీకు విధించిరేని వారి నిరంకుశాధికారము వెల్లడియగును. నీ కేమి కొఱంత ? అబలాజనమును నసహాయులను నుద్ధరింప నీ కాయమును త్యజింపుము. యశఃకాయుడవు కమ్ము. నేను వాగ్దేవిని; నామాట వమ్ముకాదు. నీతో నైక్య మయ్యెద. నా సాహాయ్యమున నీకు గురువుతో వాదము జరుగునపుడు జయము కలుగుగాక !”

“ సరియే ! ఇదిగో ! కొనుము. సోమరసపాన మొనరింపుము. ”

“ ఆహా ! ఏమి దీని యద్భుతశక్తి ? కుమారా ! చంద్ర ! ధన్యము నా జన్మము. ”

“ అమ్మా ! గురువులవారు వచ్చుచున్నారు. ఎదురేగి క్షేమ మరసెద. నీ విందే యుండుము.”

..........................................

..........................................

"జననీ! అన్నంత మైనది. నీయం దేదో తేజస్సు తాండవమాడుచున్నట్లు వారికి దృగ్గోచర మైనదట! వృత్తాంత మంతయు నెఱింగిరి. వెంటనే యీస్థలము వీడుమని నన్నుగూర్చి పలికిరి. నన్ను రాజయక్ష్మ పీడించునని నుడివిరి."

"అయ్యది మనకు జయావహము. నేను నిన్ననుసరించెద. నాకు నీవలన గలిగిన జ్ఞానము త్రిజగంబుల వెలయ బుధనామధేయమున వెల్లడించి త్రికాలవేదియు, త్రిమూర్త్యాత్మకుండు నగు సూర్యసన్నిధిని విడిచెద. మోహాంధకారభేదన మొనరించు నుషఃకాలమున సూర్యాంకస్థితుండయి మన పున్నెములపంట బుధుండు వెలుంగుచుండును. నీవును కృష్ణపక్షమున నాత్మయజ్ఞ మొనరించియా పక్షాంతమున సూర్యుని గలిసి బుధుని లాలించుచు బ్రహ్మమును బొందగలవు. అట్టి సమయములందే నా యంశము బాలసూర్యకాంతి నలరారుచు రోహిణీరూపమున నచ్చట నొప్పుచుండును. నీవు రోహిణీప్రియుండ వగుదువు. బుధుడు రౌహిణేయ నామమున సౌమ్యుడై విరాజిల్లును. ఇట్టి యద్వితీయ వైభవము గాంచి గురుడును పశ్చాత్తాప మొంది మన మార్గ మనుసరించును. తారాపథ మనుగమింపని గ్రహము లెవ్వి? నీ వా తారల మధ్య విహార మొనరించుచుండుట గుర్తించి యే మానవు లితరగ్రహసంచారమును గుర్తింపగలుగుదురు! నీవు సన్మార్గవర్తివి.



౭. ఆయుధపాణి యగు నంతఃపురపాలిక, ఒకనాయకుడు



౮. కృష్ణప్పనాయకుడు కూర్చుండు చోటు



౯. కల్యాణమంటపములోని ఒకస్తంభము

# ఆంధ్రవిజ్ఞానసర్వస్వము

---

శ్రీ పరమేశ్వరానుగ్రహమునను, ఆంధ్రమహాజనుల సహాయాదరణమునను ఆంధ్రవిజ్ఞానసర్వస్వము ప్రథమసంపుటము ముద్రితమయినది. శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగా రారంభించిన ఈమహాకార్యము సఫలమగుటకు వారి యకాలమరణమును అస్మదాదుల యల సత్వమును దేశపరిస్థితులును ప్రతిబంధకము లయినవి. లక్ష్మణరావుగారు విజ్ఞానసర్వస్వము నారంభించి ౨౦ సంవత్సరములు గతించినవి. ఈకాలమునందు ప్రపంచమునం దపారమైన విజ్ఞానవికాసవ్యాపనములు గలిగినవి. విజ్ఞానసర్వస్వములకు మాతృకమైన "ఎన్సైక్లోపీడియా బ్రిటానికా" ౧౪-వ ముద్రణము ముగిసినది. మహారాష్ట్రమునందును, హిందీయందును, నితర దేశభాషలందును విశ్వకోశములు వెలువడినవి. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము దేశభాషావిశ్వకోశము లందు చిరకాలము క్రితమే ప్రారంభింపబడినను నిప్పటికిని నారంభదశయందే యుండుట సంతాప కరము. ఇట్టిస్థితి ఆంధ్రుల ప్రతిష్ఠకు కలంకదాయక మనుట యతిశయోక్తి గాజాలదు.

అనేక కారణములవలనను నాల్గవసంపుటము నారంభించుటకు బదులు తిరిగి మొదట నుండియును పునర్ముద్రణ మవసరమైనది. నూతనప్రథమసంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతి యందు ౬౦౧ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అద్వైతము" వరకునుగల విషయము గలదు. జులైమాసమునందు ప్రథమసంపుటము నాంధ్రలోకమునకు సమర్పించుట కేర్పాటులు జరుగుచున్నవి. భగవదనుగ్రహమువలన నీప్రయత్నము సఫలమగునని నమ్ముచున్నాము.

రెండుమూడు సంపుటముల ముద్రణము జులైమాసమునం దారంభము గా నున్నది. రెండవ సంపుటమునందు 'అన' నుండి 'ఆ' వరకును, మూడవ సంపుటమునందు 'ఆంధ్ర'విషయమును నుండును. ఈవిషయములకు సంబంధించినవిషయ మపారముగ గలదు. ఆంధ్రవిజ్ఞానసర్వస్వమునకు ముఖ్యప్రయోజన మాంధ్రవిజ్ఞానము నితర విజ్ఞానములతో పాటు చేర్చుటయై యున్నది. ఈప్రయోజనమును సమగ్రముగను సమకూర్చుట కాంధ్రమహాజనుల సహాయప్రోత్సాహములు సకలవిధముల నత్యంతావసరములు. రెండు మూడు సంపుటముల లోని విషయవిభాగములకు సంబంధించిన స్థలములు, జీవితములు, కవులు, గ్రంథకర్తలు, గ్రంథములు మొదలగువానిని గురించి అనగా 'అన' మొదలు 'ఆ' వరకు వ్యాసములను వెంటనే వ్రాసిపంపి మాయుద్యమమును సఫలముచేయుట కాంధ్రమహాజనులను ప్రార్థించు చున్నాము.

పండిత సహాయమునను, నపారసాధనసంపదలమూలమునను, సాధ్యము గాదగిన కార్యము సామాన్యులు తలపెట్టుట సాహసమును, ననాలోచితమును అయినను నాంధ్ర మహాజనులసహాయమున నీప్రయత్నము సఫలము గాగల దని నమ్ముచు యథాశక్తిని సహా యము చేయుటకు వేడుచున్నాము.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వసంఘముపక్షమున

కా. నాగేశ్వరరావు.

[వైశాఖసంచికనుండి అనువృత్తము]

## ౧౩

ఒకొక్క చుక్కయే ఆకాశవేదిక కెక్కి జపించుటకుఁ గాఁబోలుఁ గూరుచుండెను. వెలుఁగును చీఁకటియు కుస్తీ పట్టుటకు చేతులు చేతులు కలుపుకొనుచుండెను గాని ప్రాణాయామము చేయఁదొడఁగెను.

సోమమ్మ కిపుడు తులసికోటయే కోట. ఆమె యందు గూరుచుండి జపము చేయుచుండెను. ఆజపమంతయు వసుమతి.

ఆమె అసలు జపమును, వసుమతి-జపమును ముగించి నామపారాయణ మొనరించుకొనుచుండెను.

వసుమతి యింటిపనులలో మునిఁగి తేలుచుండెను. అపుడు వాసుదేవరావుభార్య రాధయు, వాసుదేవరావును వచ్చిరి.

రాధ వడివడిగా వసుమతికడ కరిగి చేతనున్న పత్రిక యెత్తి 'సంతోషవార్త తెచ్చిన దానికేమి యీయఁగలవు?' అని ప్రశ్నించెను.

'సంతోషముకన్న మిన్న యగున దేదేని యున్నచో దాని నీఁగలను' అని వసుమతి యనెను.

'మేలు' అని రాధ కౌఁగిలిగొని వసుమతి నంబరు చూపెను. వసుమతి చూచెను.

'తనతండ్రి చూడకయే గతించె'నని కాఁబోలు, ఒక నిట్టూరుపు విడిచెను.

ఈప్రసంగ మాలకించుచున్న సోమమ్మ మోము వికసించి వెంటనే ముకుళించెను. వాసుదేవరావు సోమమ్మకడకు వెళ్లి కూరుచుండెను.

'నాయనా! ఇది ప్యాసగుటకన్న తప్పిపోయినచో నేను చాల సంతసించియుందును' అని సోమమ్మ యనెను. వాసుదేవరావు మౌనముద్రనే ప్రత్యుత్తరముగాఁ జేసెను.

రాధ సమీపించి 'ఏమిటండీ అత్తగారూ! వసుమతి యనఁగనే మీమాటలనుండి కారము రాలును!' అనియెను.

'కారము లేనిదే పాకము రుచింపదు, రాధా! కూరుచుండుము' అని రాధకుఁ జెప్పి సోమమ్మ వాసుదేవరావుదెసఁ జూచి 'నాయనా! నీధర్మసోదరి కొకదారిఁ జూపవా' అని సోమమ్మ యనెను.

'బాబయ్యగారు పోవుటవలననే ఆబరువు నాపైఁ బడినది' అని వాసుదేవరావు లోపల ననుకొనియెను.

'మే మిరువురమును వెళ్లి ముకుద్రాడు వోసి అల్లుని ఇచటికిఁ దీసికొనివత్తుము' అని రాధ యనెను.

'ఓహో! ఆగిత్తకు త్రాడుపోయుటకు ముక్కులు లేవు, కొమ్ములును లేవు' అని వాసుదేవరా వనెను.

సోమమ్మ కొంచెముసవ్వి 'నాయనా! నీవు వెళ్లి మాటలాడి ముహూర్తము పెట్టు కొని రావలయును' అనెను.

వాసుదేవరావు సమాధానము చెప్పక ముందే వసుమతి యచటికి వచ్చి 'నేనే అచటికి వెళ్లఁగలను' అనెను.

ఈమాటతో వాసుదేవరావునకుఁ గాని, రాధకుఁగాని ప్రత్యుత్తరము చెప్పవలసిన అక్కఱ తీరిపోయెను. ఆ మఱునాఁడే వసుమతి అత్తింటికి పయనమెత్తెను.

వీరవెంకమ్మ అహోబలునకు వడ్డించి గ్రామమునందలి నాలుగిండ్లును పెత్తనము చేయును. పెత్తనము ముగించి చెఱువునకుఁ బోయి రెండుబిందెల మంచినీళ్లు ఎత్తుకొని వచ్చును. అప్పటి కహోబలుని సాపాటులో సాఁబా లగును. అతఁ డన్నమును పెఱుగగు నటులు నమలును; పెఱుగును నీరగునటులు నమలును; నీ రావిరి యగునటులు నమలును. అతఁ డేకాగ్రతతో భుజించును. భుజించు నపుడు నమలుటతక్క నింకొకటి యెఱుఁగఁడు. నమలుచు నమలుచు రుచిలోని యానంద మనుభవించును. 'అన్నం బ్రహ్మేతి వ్యజానాత్.'

అతఁడు ప్రతిముద్దకు 'గోవింద' అనును. ముద్దముద్దకు బిస్మిల్లా.'

అభిఘారమునకుఁగాక అతనికి నేతితో మఱి పనిలేదు. అతనికి పోగపు అక్కఱలేదు. శాకముల నిజరసమునెడ నతఁ డభిజ్ఞుఁడు. అతనికి వండఁబడునది చేబియ్యము.

అతఁ డారోగ్యప్రకాశిక చదివికొనిగాని, జలవైద్యము తెలిసికొనిగాని ప్రకృతివైద్య మెఱిఁగికొనిగాని యీమార్గ మవలంబింపలేదు. ఇది యంతయు అతనితోడనే పుట్టెను.

వసుమతి యత్తింట నడుగిడిన దాహార వేళ. వసుమతి తలుపులు తెఱచెను. 'ఎవరు వారు?' అని తన్నెవరును ప్రశ్నింపలేదు. వసుమతి సూటిగా వంటయింటిలోని కేఁగెను. వసుమతి యహోబలుని జూచెను. అహోబలుఁడు వసుమతిని జూచెను. వసుమతి తల వంచుకొని యెదురుగా నున్న గదిలోనికిఁ జని తలు పోరగా వేసికొని తలుపుచాటున నిలువఁబడెను. అహోబలుని ముఖమున సాయంతనసమయమునందలి యాకాశచ్ఛాయలు కొన్ని వడివడిగా నడచెను. క్రమముగా నతని మోము పరిమ్లాన మాయెను. అతఁడు పీఁట మీఁదినుండి రివ్వున లేచి దొడ్డిలోనికి వెళ్లెను. అతఁడు ముఖమును కాలుసేతులను కడుగుకొనుట వసుమతిచెవికిఁ దాఁకుచునే యుండెను. అతఁడు మఱి లోనికి రాలేదు.

వసుమతి లోలోపలఁ గొంచెము నవ్వుకొని, దొడ్డిలోనికి వెళ్లి కాలుసేతులు కడుగుకొని వచ్చి గదిలో చక్కఁగాఁ గూరుచుండెను.

పెత్తనము ముగించి బిందె బుజమునఁ బెట్టుకొని వీరవెంకమ్మ వచ్చెను. వాకిలి తెఱచియుండెను. 'ఇంతవడిగా భోజనమయినదా?' అని అనుకొని ఆశ్చర్యపడి ఆమె వడివడిగా లోనికి వచ్చెను. పీఁట ఖాళీ. విస్తరిలోని యన్నము పిసమేని తఱుగలేదు. 'నాయనా? నాయనా?' అని పిలిచెను. సమాధి లేదు. దొడ్డిలోని కేఁగి చూచెను. శూన్యము. ఆమె వెంటనే లోనికి వచ్చెను.

గదిలోనుండి వసుమతి యెదురువచ్చి అత్తగారికి నమస్కరించెను. వీరవెంకమ్మ తెల్లఁబోయెను. కొంతసేపటికి 'అబ్బాయి గదిలో నున్నాఁడా?' అని యడిగెను.

ఈ ప్రశ్నచే వసుమతికి నగవును, ఏడుపును వచ్చెనుగాని వాని నడఁచుకొని మిన్నకుండెను.

వీరవెంకమ్మ గదిలో తొంగి చూచి వాకిటిలోనికిఁ బోవుచుండెను. అపుడు వసుమతి యిటు లనెను: 'వారు భుజించుచుండఁగా నే నింటిలోని కడు గిడితిని. వారు లేచి పోయిరి. ఈ పుణ్యము నాది.'

వీరవెంకమ్మ మఱి మాటాడక లోనికి వచ్చెను. వా రిరువురును మౌనము వహించిరి. మౌనమే వారి యిరువురకును అర్థభాషణ మొనరించెను.

వీరవెంకమ్మ కుమారునికొఱకు చూచి చూచి విసివి తుదకు మౌనమునువదలి 'నూతికడకు వెళ్లి స్నానము చేసి రమ్ము; నీకు అన్నము పెట్టెదను' అని కోడలితో ననెను. వసుమతి స్నానమునకుఁ బోయెను.

'మగనిని వెడలనడిచి తిండి తినుటకే యిది వచ్చినటు లున్నది' అని వీరవెంకమ్మ యనుకొనెను. కాని వసుమతి స్నానము చేసి వచ్చి 'అత్తా! నేఁడు నేను భుజింపను. మీరు లేచి భుజింపుఁడు' అనెను.

'సరి, కొడుకును వెడలఁ గొట్టుకొని మూఁడుకాళ్ల ముదుసలిని నేను భుజింపనిచో లోకమునకుఁ గొఱఁత రాదు.' అని వీరవెంకమ్మ వంటయింటి తలుపులు మూసివేసెను.

'మీరు భుజింపనిచో నామీఁద ఒట్టు' అని వసుమతి యనెను.

'ఒట్టుగానే యున్నది. మీయొట్టులతోఁ తిట్టులతో నాకుఁ బనిలేదు.' అని వీరవెంకమ్మ కొడుకును వెతుకుకొనుటకు గ్రామములోనికిఁ బోయెను.

వసుమతి లోలోపల నవ్వుకొని చెఱఁగు బఱచికొని శయనించెను.

వెతకి వెతకి వేసారి వీరవెంకమ్మ యింటికి వచ్చెను. వారును వీరును వసుమతినిజూడ వచ్చిరి. 'కోడ లడుగు పెట్టి కొడుకును వెళ్లఁగొట్టె' నని కొంద ఱాడిరి. 'గుఱ్ఱమంత పెండ్లా మింటికి రాఁగా కాళ్లసవారీ చేసినాఁ'డని కొంద ఱనిరి. ఎవరికిఁ దోఁచిన మాటలు వారు విసిరి పెద్దలందఱును దయచేసిరి. 'అహా! బలునిదే తప్పని పిన్న లని నిష్కర్షించిరి.

వసుమతి మూఁడునాళ్లు ప్రతీక్షించెను. అహోబలుఁడు రాలేదు. మఱిమూఁణ్ణాళ్లు చూచెను. రాలేదు. ఈరీతిగా ఒక నెల దాఁటెను. రాలేదు. వసుమతి పుట్టింటి కేఁగ స్థిరసంకల్పము చేసికొనెను. ఒకనాఁ డత్తగారితో నిటు లనెను—'కోడలు వచ్చి అత్తగారిచే నిట్టుపాసములు చేయించెను. కొడుకును వెడలఁగొట్టెను. నాకిఁక సెలవు. నామీఁద తమకు దయగాని, ప్రేమగాని కలుగుచో వార్త పంపుఁడు. పంపినవెంటనే రాగలను.'

వీరవెంకమ్మ మాట చెప్పలేదు. వసుమతి భూమిమీఁదికి వంగి నమస్కరించి రైలుసకు వెళ్లిపోయెను. వసుమతి ఇంటికి వెళ్లిన నెలకు అహోబలుఁడు ఇంటికి వచ్చెను. వసుమతి యింటికిఁ జేరఁగనే సోమమ్మ 'అల్లుఁడు రాలేదా ?' అనెను. 'నన్ను జూడఁగనే ఆయన గ్రామాంతరము లేచిపోయెను.' అని వసుమతి యనెను. 'ఏమొగముతో నింటికి వచ్చితివి' అని సోమమ్మ యనెను. 'నామొగముతోనే నే నింటికి వచ్చితిని. నా కిసుమంతయు చింత లేదు. నాకొఱకు నీకుఁ జింతింపఁబని లేదు. అమ్మా! నేనే నీకు కొడుకనయి పుట్టియున్నచో నీ విటు లనఁ గలుగుదువా ?' అని వసుమతి యనియెను. 'పుట్టలేదుకావుననే యిటు లనవలసి వచ్చినది' అని సోమమ్మ యనెను. 'నేఁటినుండి నన్ను కొడుకుగా భావింపుము' అని వసుమతి యనెను. సోమమ్మ కనులవెంట జలజల నీ రురిలెను. వసుమతి వారించి జరిగిన కథయంతయు నెఱుకపఱిచెను.

అటుపిమ్మట సోమమ్మ యేమియు ఆర్భాటము చేయలేదు. కూఁతురు నగ లడుగఁగా 'ఎందులకు' అనిగాని 'ఇవి యెంత వెలచేయును ?' అని గాని ప్రశ్నింపలేదు. తనకూఁతుమాట తానే వినుచోఁ దనకూఁతురు తనతపస్సునకడ్డము కాదని తలపోసెను.

వసుమతి ఇల్లుఅమ్మి ఒకానొక అదృష్ట దేవత సాహాయ్యమును నమ్మి ఇంటర్మీడియేటు చదువుటకు చెన్నపట్టణము ప్రవేశించెను.

## ౧౪

గ్రామములలో సామాన్యముగా ఒక జట్టు మనుష్యులు, లేక కొన్ని జట్టుల మనుష్యు లుందురు. బహుళముగా వారు తంజావూరు సత్రమునకు తగినవారు. వారికి ఈలోకముతో కంటె పరలోకముతో నెక్కువ పని. అదృష్ట దేవతమీఁదనే వారి నమ్మకము. వారి కేపని యెడలను క్రమ నియమములు లేవు—యదృచ్ఛాసృష్టివాదులు. వారికి ముడ్డి నిలువదు-పరిణామవాదులు. వారినాలుకకు పగ్గములు లేవు—స్వాతంత్ర్యవాదులు. తమలోఁ దమకు ఐక్యము లేదు—'జీవః ప్రతిక్షణం భిన్న'—వాదులు.

ఆజట్టులో ఒకనాఁ డొకనికి లోకులలో నొకనిమీఁద కర్మము చాలక కోపమువచ్చెను. వెంటనే అందఱకును కోపము వచ్చెను. అట్టితఱి వారిలో వారికి మితియు మేరయు లేని ఐక్యము! ఆరీతిగనే ఒకనిమీఁద అకారణముగా గౌరవము కలిగెనా వాఁడు బ్రహ్మరథముమీఁద ఊరేఁగవలసినదే—చిత్తస్వైరత!

ఆ గ్రామమునఁ గల ఇట్టి జట్టులో ఒకఁడొకానొక శుభ ముహూర్తమున 'ఓ బిళంగారు చాలా దొడ్డవారు రా' అనెను. వెంటనే మఱియొకఁడు 'ఛాలా దొడ్డ బాబురా' అనెను. ఇంకొకఁడు 'ఛాలా యేమిటిరా? ఛాలాఛాలా దొడ్డబాబురా' అనెను. అందఱును గలిసి 'ఓ బిళంగారికి జే' అని ముమ్మాఱఱచిరి.

అహోబలుఁడీబ్రహ్మరథమునుండి పడిపోననుకొనెను. అతఁడొకనాఁడొక చిన్నసభ చేసి ఆ గ్రామమునకు తపాలాకచేరీ, రోడ్డు, సహకార—సంఘము, వ్యవసాయ-పరిశోధన-క్షేత్రము, చిత్రకళామందిరము, రామభజనాలయము: ఇవి యావశ్యకము లని ఉపన్యసించెను. పెద్దకారువారు పెడగనే యుండిరి కాని జట్టులోనివా రెల్లరును అన్నివిషయములను అంగీకరించిరి.

ఆయూరికి రైలుస్టేషను కలదు. తపాలాకచేరి లేకపోవుట తప్పు కాదా? దానికి వెంటనే అహోబలుని చేవ్రాలతోడను అయిదాఱువందల నిశానీలతోడను కూడుకొనిన అర్జీలు తామరతంపరగా నడచెను. తనిఖీలమీఁద తనిఖీలు జరిగినపిమ్మట 'ఎక్స్‌పెరిమెంటల్ టపాకచేరి' శాంక్షన్ చేయఁబడెను.

వెంటనే అహోబలుఁడు పెట్టెఁడు కేటలాగులు సంపాదించెను. కొన్నిఁటిని కొనియెను. దినమునకు రెండురూపాయల కార్డ్లు కొని దుకాణాదారులతో వ్యవహారము సాగించెను. క్రొత్తక్రొత్తవార్తాపత్రికలకు చందాదా రాయెను. అతనికి కొన్ని వీ. పీ. లు, బుక్ పోస్టులు దిగఁదొడఁగెను.

ఎక్స్‌పెరిమెంటల్ టపా పెట్టఁబడిన నాఁటినుండియు ఆజట్టువారికేకాక గ్రామములో ప్రతివానికిఁగూడ అహోబలుఁ డనిన అమ్మాయనిపించెను. దానితో నహోబలుఁ డుత్సాహముఁబడసి రోడ్డుకు ప్రయత్నింపఁబూనుకొనియెను. రైలుప్రక్కనుండి జనరల్ రోడ్డు పోవుచునే యుండెను. ఇఁక గ్రామమునకు సంబంధము లేకుండుట ఒకయధిక్షేపము కాదా? కావున అహోబలుఁ డహోరాత్రములు దానికి తిరుగాడెను. అతని రాకపోకలవలననే మునిముందుగా ఆదారి యంతయు రోడ్డయిపోయెను.

ప్రెసిడెంటుకు వోట్లు ఇప్పించుటయు, రోడ్డుకగు వ్యయమున సగము భరించుటయు సంభవించుచో ఈప్రయత్నము నెఱవేఱు సూచనలు కానిపించెను. అహోబలుఁడు ఇందుల కంగీకరించెను. రోడ్డుపని ఆరంభ మాయెను.

ఈరోడ్డు పడుటవలన గ్రామస్థుల కహోబలుఁ డొక పురాణపురుషుఁ డాయెను. ఇది వఱ కెవ రింతపని చేసిరి? భగీరథుఁడే గంగను తెచ్చెను; అహోబలుఁడే రోడ్డు తెచ్చెను.

దీనికల దన్నిన దింకొకటి—సహకార సంఘము! ఈసంఘము కుబేరుని నిధి; అహోబలుఁడు బలిచక్రవర్తి!

గ్రామస్థులలో ప్రతివాఁడును ఏఁబది మొదలుకొని ఏనూటివఱకును ఉచితముగా తీసికొనిపోయినటులు తీసుకొనిపోయిరి. ఆఱు నెలలు తిరుగకమును పే అందఱకును సహకార సంఘమనిన పులినిజూచినంత పూర్ణానురాగ మేర్పడెను. తమ తమ-ఆస్తులతోపాటు తమ తమ బంధుగుల ఆస్తియు తమతమకొఱకు తాకట్టు. ఒకళ్లొకళ్ల జుట్టులకు ముడి. ఈధనము తమ కొసఁగిన దొకానొక యదృష్ట దేవత. దానికి గవర్న మెంటు గార్డియన్ !

ఇటుమీఁద నింకొక వింత—వ్యవసాయ-పరిశోధన-క్షేత్రము! దీనికిఁగాను అహోబలుఁడు పదియెకరముల క్షేత్ర మిచ్చెను. దీనిలో నాలుగెకరములు చెట్లు వేసి క్రొత్తరకముల యెరువులతో పోషించి వాని పెరుగుతలను క్రిమికీటకములను జాడ్యారోగ్యములను పరీక్షించుటకును, ఇంకొక నాలుగెకరముల ఖండములో పల్లపుసాగును విదేశదోహదముతో పెంచి పరీక్షించుటకును, మిగిలిన రెండె కరములను బీడుగా నుంచి అందు ఆఁబోతులను అచ్చుపోసి తిరుపతివేంకటేశ్వరులపేర విసర్జించుటకును ఏర్పాటు చేయఁబడెను.

ఈయేర్పా టెల్లరకును అక్కజము గొలిపెను. ఇరుగు పొరుగు ఊళ్ల వారికి ఆ క్షేత్రము క్షేత్రమే యాయెను. ఆదారిని బోవునపుడు రైలుతలుపొకటియు మూయఁబడియుండలేదు. ‘ బసవశాల ’ అని వ్రాయఁబడిన బోర్డుమీఁది అక్షరములు అందఱను ఆకర్షించుచుండెను.

ఇంకొక తమాషా—చిత్రశాల. అతఁడు కొన్ని చిత్తరువులను సంపాదించెను. అవి యన్నియు ‘ మేము అనుకృతములము కాము’ అని వాచారుచున్నటు లుండెను. అహోబలుఁడు చిత్రించిన పురుషచిత్రములు కొన్ని కలవు. అవి స్వతంత్రములు. వానిలోకొన్నిఁట ఆంధ్రోపాధ్యాయుఁడును, కొన్నిఁట పూర్ణచంద్రరావును మఱికొందఱు సహోధ్యాయులును గోచరించుచుందురు. స్త్రీ చిత్రములన్నిఁటికిని వసుమతి యధిదేవత.

స్త్రీలకును పురుషులకును ఆచిత్రశాల దేవాలయము లేని కొఱఁతను దీర్చెను.

ఇంకొకటి భజన మందిరము! దీనికి గ్రామమునందలి రైతు లందఱును సంకల్పశుద్ధిగా రాయి త్రోలిరి; సున్నము తెచ్చిరి; ఇసుక గొని వచ్చిరి; గానుగాడిరి. సున్నపు వెలయు, కట్టుకూలియు అహోబలునిది.

ఈ భజన మందిరమున జానపదులు తనను బరివేష్టింపఁగా మృదుమధురమగు కంఠముతో అహోబలుఁడు రామదాసు కీర్తనలను, తూము నరసింహదాసు కీర్తనలను, తరంగములను పాడి వారిచేత పాడించును.

ఆజట్టులో నొకఁడు మద్దెల నేర్చికొనెను. వాని జూచి మఱియొకఁడు నేర్చుకొనెను. అందఱును నేర్చికొనిరి. క్రమనియమములను పాటించి వారు సాధించిన దీ మద్దెలదరువులో ముక్తాయింపులు మూఁడు !

భజనమందిరమునం దహోబలుం డింకొక్కనాఁడు రామకార్యము సాధించిన వీరాంజనేయుం డగును. వెంటనే వసుమతి గుఱుతు దగులును.

అతఁడు వెంటనే అశ్రువులు రాల్చుచు శబరి యగును.

'ఒరేయ్! మన ఓబళంగారికే దేముఁడు కనఁబడతాఁడురా' అని బడిలోని బాలుఁ డొకఁడు మఱియొకని చెవిలోఁ జెప్పెను. 'ఒరేయ్! ఆయనకు కనఁబడుతుంటే నేను చూసాను రా, అప్పుడే-ఆయన కళ్లంబటే—నీళ్లు కారతయ్' అని యతఁ డనును.

ఇటులు ఆఱువింతలతో ఆ గ్రామము ఆచ్ఛన్నమాయెను. ప్రతిమాటలో అహోబలుఁడు! ప్రతిచేతలో అహోబలుఁడు!

అహోబలునకు రుచింపనిదొక్క పుస్తక భాండాగారవ్యాపారము. మింజుమలె అతఁ డొక పౌరాణికుని రావించెను. నాలుగు పుట్ల వడ్లు ఏర్పాటు చేసి ప్రతిరోజును రాత్రి పురాణము చెప్పుటకు నియమించెను. అహోబలునకు పు డాంధ్రోపాధ్యాయుఁడు గుఱుతువచ్చెను 'ఆతఁ డిపు డిది చూచి పోవుచోనా?' అని యనుకొనియెను.

గ్రామమునందు జన్మపట్టికకంటె మరణపట్టిక యెక్కుడగుటచే ఆసుపత్రి లేకపోవుటొక లోపమని యహోబలునకు కొలఁది నాళ్లలోనే తెలిసివచ్చెను. మందులు చేయుటకును, ఇచ్చుటకును శివలమల్లయ్యను నియోగించెను. దీని కేటేటను కళ్లమునకు కావడి ధాన్యము చొప్పున చందాలు వేయించెను.

ఈ ప్రయత్నబీజములన్నియు ఫలింపకముందే కుక్కమూతిపిందెలు పడఁదొడఁగెను.

తపాలాకచేరీ ఒకయేఁడాదిపాటు తిన్నగా నడచెను. ఆయేఁడు పంతులుగారే పోస్టుమాస్టరు. బాలురే జవానులు. ఈరీతి కార్యాంతరప్రసక్తివలన గురుశిష్యులకు విద్యయెడ విసుకు తగ్గెను. రెండవయేఁడు టపాకు హావిస్సు లేదు. వచ్చునుత్తరము లేదు, పోవునుత్తరము లేదు. నష్టపుటు లంతకన్న లేవు. మనియార్డరులు మంగళము. రిజస్టరులు రిక్త. వచ్చునవి వార్తాపత్రికలు. అవియు నొకటియో రెండో! కాన తపాలా యెత్తివేయుటకు ఆలోచనలారంభమాయెను.

రోడ్డు పడ్డతరువాత గ్రామమున నాలుగయిదు ఒంటియెద్దుబండ్లు వెలసెను. సివారులు పోవుటకు వానికి కిరాయి దొరకుచుండెను.

ఇంతలో కొలఁదినాళ్లలోనే జనరల్ రోడ్డుమీఁద సేనాప్రదర్శన మొకటి జరగెను. ఆయెడ ఆరోడ్డుమీఁదినుండి గ్రామపరిసరములకు పిరంగిబండ్లును, సేనలును వచ్చెను. గ్రామమునందలి ఆలకును, జేలకును కొంత చేటు కలిగెను. చిన్నచిన్న కంతలనుండి బిక్కుబిక్కుమని చూచిన ఆఁడువారికి ఆందోళనము కలిగెను. సైనికులు కొన్నిగంటలే మకాము చేసిరిగాని రోడ్డుధర్మమా యని

ఆయూరివారికి నేటివఱకు నాఁటిముచ్చట లతో గుండియ లవియుచుండును.

రోడ్డువలన దొంగలదాడి యొకటి కలుగఁదొడఁగె నని ప్రవీణులు నిశ్చయించిరి. ఏది యెటులున్నను ఏనేండ్లపదపట నది పక్కా-రోడ్డయి పోయెను.

సహకార-సంఘములో పుచ్చికొనినవారే గాని ఇచ్చిన పాపమునఁ బోయినవా రెవరును లేరు. ఆఱునెలలు, ఏడాది, రెండు, మూఁడేండ్లు దాఁటెను. సంఘమునకు వసూలు వట్టిదాయెను.

సారవంతము లయిన చేలు లోఁగడనే తాకట్టులలో నిఱికికొనియెను. మిగిలిన పొలములను కొనువా రెవరును లేరు.

మెంబరులలో కొందఱకు ఆస్తి లేదు. వారి జామీనుదారులకును లేదు. లేకున్నను వారిమాటయే ప్రమాణముగాఁ దీసికొని అహోబలుఁడు అప్పు పెట్టెను. వా రెన్నఁడును ఈయ మని అనరు. కాని యెన్నాళ్లకును వచ్చు దారిలేదు. పలుకుమాత్రము శిలాక్షరముగా నిలిచియుండెను.

ఈయప్పు తీర్చుటకుఁ గొందఱు క్రొత్త ఋణములఁ దెచ్చిరి. కాని అవి సంసారము క్రిందఁ బడెను.

దీని విముక్తికిఁగాను దీర్ఘ-వాయిదాలు ఏర్పాటు చేయఁబడెను.

వ్యవసాయ-పరిశోధన-క్షేత్ర మొకొక్క-యేఁడెక్కినకొలఁది వహ్వా యనిపించెను. ఎన్నఁడును ఎఱుఁగని పంట! ఎకరమునకు నాలు గయిదుపుట్లు!

మావియంట్లు సపోటాలు వెఱ్ఱికాపు. ఒకొక్క- మావిపండు నేర్లకొలఁది. బరువు. సపోటా ముప్పదియయిదు తులములతూకము. వీని యెరువులకు వ్యయపఱచినది పదిరెట్లు!

ఆఁబోతులు నందులు! జాతియగుగోజాతి యుత్పన్నమాయెను. దానితో సంఘమునకు కొన్ని యప్పులు తీరునని యహోబలుఁ డనుకొనెను.

చిత్రశాలను చిన్నలును బెద్దలును రెండు నెలలు చిత్రముగాఁ జూచిపోయిరి. పిదప దాని గుమ్మమున గడ్డి మొలిచెను. కాని దానఁ గుమ్మరులకు లాభము కలిగెను. అందలి చిత్రరువులఁ జూచి కుమ్మరులు బంకమట్టితో అట్టి బొమ్మలను జేసి ఆవమునఁ గాల్చి తెచ్చి అహోబలునకుఁ జూపెరి. అవి నీగ్రోలవలె నుండెను. అహోబలుఁడు రంగులు తెచ్చి రంజిత మొనరించుట వారికి నేర్పెను. దానితో వారికి జీవిక యేర్పడెను.

కొందఱు ఒకొక్క-నాఁడు వచ్చినను రాకున్నను, మద్దెల వాచుటకు 'మేముమే'మని తగవులాడి పృష్ఠములనే మద్దెళ్లుగను దవడల మీఁద చేతులనే తాళములుగఁ జేసినను, స్వరములు ఖరస్వరము లయినను, పియానో స్వరము లయినను భజన మందిరము వలన భ్రంశ మేమియు కలుగలేదు.

భారతమున యుద్ధపర్వాంతమువఱకును పురాణము నిండోలగము. శాంతిపర్వ మారంభమాయెను. వినువారందఱును వెంట చిఱిచాఁపలను దెచ్చికొనఁ దొడఁగిరి. అహోబలుఁడెంత కట్టుదిట్టమగు శ్రోతయయినను పౌరాణికుఁడు మిగుల వాచంయముఁ డయిపోయెను.

ఆసుపత్రిలో ఆసవము లంత మొందెను. అరిష్టములు ఆఖరాయెను. ఆనందభైరవి అపరూపము. పైత్యాంతకమునకు పస్తు. లేహ్యములు లేవు. చేఁదుమందులు చెక్కుచెదర లేదు.

గ్రామస్థులు మొదటియేఁడు వడ్డిచ్చిరి. రెండవయేఁడు బకాయిపెట్టిరి. మూఁడవయేఁడు మూల్గిరి. నాలుగవయేఁడు నాస్తి చెప్పిరి. ఆసుపత్రి బరువంతయును అహోబలునిమీఁదనే విఱుచుకొనిపడెను.

## ౧౫

వీరవెంకమ్మ పెత్తనమునకుఁ బోయెను. గృహమెల్ల రహస్యములు చెప్పుటకు చెవులు కొఱుకుచున్నటు లుండెను.

అహోబలుఁడు కిటికీ దేళులు మూసివయిచెను. కలమును కాకితమును బట్టుకొని కూరుచుండెను.

'మా రెండు పొట్టలకును లేక మఱియొక పొట్టకును ఈయున్న యాస్తి చాలదా? మూఁడుపుట్ల వడ్లు మాకుఁ జాలు—పొట్టకుపుట్టెఁడు. ఇఁక నాకు పొగపులతో పని లేదుగదా' అని అనుకొనెను.

కొంచెమునే పూరకుండి 'పై పొట్టలకు పై ఖర్చు?' అనుకొనెను. అతఁ డాలోచించుచు నాలోచించుచు మెలమెల్లగా నిటులు పద్దులు వ్రాయఁదొడఁగెను.—

శ్రీరామ

| | | | | |
|---|---|---|---|---|
| నేయి | నెలకు | 3 | వీ | ౬-౦-౦ |
| నూనె | ,, | ౧ | ,, | ౧-౦-౦ |
| కందులు | ,, | 3 | మా | ౩-౦-౦ |
| పెసలు | ,, | ౧ | ,, | ౨-౦-౦ |
| మినుములు | ,, | ౧ | ,, | ౧-౮-౦ |
| ఉప్పు | ,, | ౧ | ,, | ౦-౪-౦ |
| మిర్చి | ,, | ౧ | వీ | ౦-౮-౦ |
| చింతపండు | ,, | ౨ | ,, | ౦-౮-౦ |
| ఆవ, జీర, మెంతి | ,, | | | ౧-౦-౦ |
| నిప్పుపెట్టెలు | ,, | | | ౦-౨-౦ |
| తలంటు సామగ్రి | ,, | | | ౧-౦-౦ |
| దీపసామగ్రి | ,, | | | ౧-౦-౦ |
| విస్తళ్లు | ,, | ౨ | కట్టలు | ౦-౧౦-౦ |
| చాకల | ,, | | | ౧-౦-౦ |
| మంగల | ,, | | | ౦-౮-౦ |
| దాసి | ,, | | | ౪-౦-౦ |
| చిల్లరమల్లరలు | ,, | | | ౧-౦-౦ |
| | | | | ౨౫-౦-౦ |

'పెరిసి పాతికెరూపాయలు. పంద్రెండు పాతికెలు = మున్నూఱు. సంవత్సరమున్నకు మూఁడుపుట్ల వడ్లును మున్నూఱు రూకలును

ఉన్ననో కొల్లు. ఇపుడు నాలుగుపుట్ల ధాన్యమునకు ఢోకా లేదు. శిస్తులు మున్నూటికి పదియో యిరువదియో యెక్కుడే వచ్చును. కొల్లోకొల్లు,' అని యనుకొని కొంచెమునే పాలోచించెను.

'వసుమతి భరణమునకు దావావేయుచో ఎటులు?' అను ప్రశ్న అతని మతికి గాఢముగాఁ దాఁకెను. తలక్రిందఁ జేయిడుకొని పడుకొని ఆకాశమువంక నొక పావుగంటనే పదేపనిగా చూడఁదొడఁగెను.

'వసుమతి యీపాడుపని చేయఁజాలదు.' అని దృఢముగాఁ బలుకుచు లేచి కూరుచుండెను.

కొంచెమునే పతఁడు కనుల బిగియఁబట్టి చూపు నిలిపి కూరుచుండి 'చదివికొనిన యాఁడుది భరణముకొఱకు దావా వేయకుండఁ గూరుచుండఁజాలదు.' అని యనుకొని మరల వెలకిలఁ బండుకొనియెను. కొంచెము సేపు కుడిప్రక్కమీఁదను, కొంచెమునే పెడమప్రక్కమీఁదను ఆనుకొని పిదప మోచేతిని తలాఁపిగాఁ జేసికొని ఆకసము దెసఁ జూచుచుఁ బండుకొనెను.

తమయూర టపాకచేరీ తఱలిపోవుటచే తపాజవాను పొరుగూరినుండి యిపుడు రావలయును. మూఁడు నెలల కొకఁడు మాఱుచుండుటచే ఎల్లపుడును క్రొత్తరోగమే. ఇపుడొక క్రొత్తవాఁడువచ్చి 'అహోబలుఁడుగారెచట, అహోబలుఁడుగారెచట?' అని అఱచుచు అహోబలుని యాలోచనలను అట్టిట్టొనరించెను. బిడాయించిన తలుపులను దెఱచి అహోబలుఁడు హడావడిగా అరుఁగుమీఁదికి వచ్చెను. టపావాఁడొకకవరును, కొన్ని వార్తాపత్రికలును ఇచ్చి వెళ్లిపోయెను. అహోబలుఁడు వానిని దీసికొని తలుపులు మూసికొని యథాస్థానమునఁ గూరుచుండి మునిముందర కవరు విప్పెను. వసుమతి చీటి.

తలక్రిందుగా చేతికి అందిన ఆచీటిని తల క్రిందుగాఁ ద్రిప్పెను. అది క్రిందఁ బడెను. అతఁడు చేకొనెను. అడ్డముగా వచ్చెను. తొట్రుపాటును, తొందరను అడఁచికొని చీటిని విదిలించి తుదకు తలబట్టకొని గబగబ చదివికొనెను.

'ఇంటర్మీడియేటుతో ఇల్లు నగైరాలు చెల్లెను. నానగ కట్టుతోడను, అమ్మనగ కట్టుతోడను, ట్యూషనులతోడను మెడికల్ కాలేజిలో మూఁడుపాళ్లు ముగించితిని. సంతతకృషిచే కొంచెము జబ్బుపడితిని. ఈయేఁడు మీసాయముతక్క వేఱుపాయము లేదు.'

అహోబలుఁడు రెండు మూఁడుసారులు చదివి ఉత్తరమును మడఁచి 'దావాకు ఇదియే నాంది' అని యనుకొనెను. 'రిజష్టరు నోటీసు వచ్చినపిదపనే దీనిసంగతి యాలోచింతము' అని యనుకొని దానిని ఇనుపపెట్టెలోఁబెట్టి బీగము వయిచెను.

వీరవెంకమ్మ కొలఁదిరోజులలోనే కొడుకు కవళికను గమనించెను. మెలమెల్లగా పునర్వి

వాహ ప్రస్తావమునకు గణేశపూజ చేసెను. అందుల కెన్నఁడును అభిముఖుఁడు కాని అహోబలుఁడు ఇపుడిపుడు తలవాల్చి వినీవిననటులు వినఁదొడఁగెను.

అచట వసుమతికి నేఁటివఱకును విశేష చింత కలుగలేదు. తన కొక కూఁతు రున్నదనియు సోమమ్మ యనుకొనలేదు.

వసుమతి ఇంటర్మీడియేటు చదివి మెడికల్ కాలేజీలో ముప్పాతికెపాలు దాఁటువఱకును ఈగతిగనే నడచెను. ఇప్పటికి ఉన్నదంతయు సర్వమంగళమయి తల్లిబిడ్డలు మిగిలిరి.

గంజాముజిల్లాలో హెల్త్ ఆఫీసరుగా పని చేయుచున్న వాసుదేవరావు నడుమ నడుమ రాధను బంపి సోమమ్మవసుమతుల యోగక్షేమము లారయుచుండెను. రాధవచ్చి యీతూరి ఇటులు చెప్పెను: 'వసుమతి మెడ బోసిపోయెను. ముక్కుదూలమున కిరుతట్టుల గాసులైట్లవలె నున్న బేసరి, అర్ధచంద్రులు రెండును అఱిపోయి ముక్కుతూములే మిగిలెను. చేతులకు గాజుల అఱువల్లిమాత్రము శేషించెను. వసుమతి యిపుడు పుట్టినపిల్లవలె నున్నది. శిష్టుల యింటిలోవలె కుండలో వంటకము. నన్నుఁ జూచి కూరలు ఇంటిని తొంగి చూచినటు లున్నవి.'

అక్కఱ కలిగినపుడు తన సాయమును తప్పక వసుమతి కోరు నని వాసుదేవరావు తలఁచి యుండెనుగాని అట్టి యాచూకి యావంతయు నగపడకపోవుటచే వసుమతి యెంత యభిమానధనయో యిపు డతనికిఁ దెలిసివచ్చెను. వెంటనే నూఱురూపాయలు మనియార్డరు చేసెను.

'అమ్మా! నాకొఱకు వాసు నూఱు రూపాయలు మనియార్డరు చేసినాఁడు' అని వసుమతి యొకనాఁడు తల్లికిఁ జెప్పెను. సోమమ్మకనులలో ఆనందబాష్పము లుదయించెను. కొంచె మాలోచించి యిటు లనెను: 'కూఁతురు దర్జీ దగుచో తల్లియు అయినటులే. రేపటి నుండి నాకుఁగూడఁ గొన్ని దుస్తులు కుట్టుటకుఁ బట్టుకొనిరమ్ము. ఈ కొలఁది కాలమును గూడ ఇటులనే యీఁదుదము.'

వసుమతి తల యూఁపి మనియార్డరు తిరుగఁగొట్టుట దురుసుగా నుండునని పుచ్చుకొని ఆనూఱురూపాయలను భద్రపఱిచెను. నాఁ డేకాదశి. ఆనాఁ డింట నూకలు లేవు. అంగడిలో అప్పు. తల్లికి నిట్టుపాసము. తల్లి దుఃఖమునే పాథేయముగాఁ గొని వసుమతి కాలేజికి ట్రామెక్కెను.

వసుమతి రూపమును సౌకుమార్యమును, స్వరసౌభాగ్యమును శ్రవ్యతను, గనిపట్టుచున్న సినీమాడైరెక్టరొకఁ డానాఁ డాసమయమున మోటారులోఁ బోవుచు వసుమతిని జూచెను. అతఁడు ట్రామును వెంబడించి వసుమతి మెడికల్ కాలేజికి వెళ్లుట కనుఁగొనియెను. అతఁడు ప్రిన్సిపాలుతో మాటాడి వేఱొక పనిమీఁద వెళ్లిపోయెను.

వసుమతి సాయంకాల మింటికి వచ్చు సరికి నవుకరొకఁ డొక యుత్తరము తెచ్చి యిచ్చెను. సినీమాకు వేషధారణ మొనరించు నెడల ఇపుడు నెలకు మున్నూఱు రూకలు ఈయఁబడుననియు, ముందుముందు పదియేనువందలవఱకు వృద్ధిచేయఁబడు ననియు దాని సారాంశము.

పావుసేరునూకలకు కఱవుగా నున్నపుడు మూఁడువందల జీతము! దీనితో వసుమతి కొంచెమాందోళనముచెందెను. కొంతవడికి— 'ఎటులు వచ్చెను? అనునది అంతగా ఆలోచనీయము కాదుగాని-ఎటులు బ్రతికెను? అనునది ఆలోచనీయము' అని యనుకొనియెను. పిదప ఈ సమాచారము తల్లికిఁ జెప్పకుండఁగనే యిటులు ప్రత్యుత్తరించెను. 'తమకు ధన్యవాదములు. మీ రింకొకరికొఱకు ప్రయత్నించుకొనవచ్చును.'

నవుకరు నిర్గమించెను. చూపు ఆనినవఱకును వానిని జూచి నిట్టూర్చెను. పిదప బదులుకొఱకు బయలుదేఱెను.

బెదురుచు బెదురుచు ముందర కోమటి దుకాణముకడకు వెళ్లెను. అప్పు తీర్పనిదే అరువు పుట్టదని యతఁడు నిష్కర్షగాఁ దెలిపెను!

గత వత్సరము తా నొక జమీందారు సోదరికి ట్యూషను చెప్పియుండెను. వసుమతి యిపు డాగౌరవమును తాకట్టు పెట్టఁదలఁచెను. సూటిగా అతనియింటి కేఁగెను.

జమీందారు పిన్నవాఁడు. చదువు సందెలెఱిఁగినవాఁడు. 'ఎట్టికెట్' తెలిసినవాఁడు. అతఁడు మరియాదగా వసుమతి నాహ్వానించెను. వసుమతి తనస్థితిగతు లన్నియుఁ దెలుపుకొని యిరువదిరూకలు అప్పు కోరెను. అతఁడు చిఱునగవుతో 'జవానుచేతి కిచ్చి మీావెనువెనుకనే పంపఁగలను' అనియెను. వసుమతి సెలవుగొనెను.

ఆమె యింటికేఁగి కూరుచున్న మఱునిముసముననే జవాను ఒక కవ రొసఁగి వెళ్లిపోయెను. వసుమతియు వెంటనే లేచి బియ్యము కొనుట కంగడికి పోయి కవరు విప్పెను— నూఱురూపాయల నోటు!

వసుమతి శరీరము కంపించెను. ఆమెకొంచెమాలోచించి తుదకు మార్చి అప్పుతీర్చి కావలసిన సంబారమును కొని యింటికి మరలెను. నాలుగునాళ్లు నడచినపిదప వాసుదేవరావు పంపిన నూఱురూపాయలు తీసికొని జమీందారుకడకు వెళ్లెను. ఆమెను జూచుచునే అతఁ డిటులనెను: 'మొన్న తక్కువగా నుండుటచే కొలఁదిగాఁ బంపితిని. నేఁడు—'

'అయ్యా! అక్కఱలేదు. తమకు చెల్లించుటకే వచ్చితిని. మీాయుపకారము స్మరించుకొందును' అని వసుమతి నూఱురూపాయలును ఎదుట నిడెను.

అతఁడు చాల నసంతుష్టుఁ డాయెను' అయినను తుద కతనికి పుచ్చుకొనక తప్పలేదు.

ఆమఱురోజు కాలేజీకి సెలవు. వసుమతి ఆనాఁడు ఆవీథిలో మరియాదగల కుటుంబముల నన్నిఁటిని గాలించి ఒకబట్టల మోపింటికిఁ దీసికొని వచ్చుచుండెను. సహాధ్యాయ లిలీయను నామె యామె కెదురుపడి యిటు లనియెను—

'చాకితయా?'

'కాదు. దర్జీ.'

రాత్రులందు కుట్టుపని పెట్టుకొనుటచే వసుమతి కిపు డలంకారము లేకున్నను కనులకు అలంకారములు పెట్టుకొనవలసివచ్చెను. మైక్రాస్కోపుతో ఆమె చేయవలసిన పరిశోధనములు కొన్ని దాన మానవలసివచ్చెను. దర్జీపని దర్జాగా నున్నను కనులను బలిగోరుటచే కొన్నాళ్లకే దానిని విడనాడెను. అటుపిమ్మట శ్రోత్రియు లగు అఱవవారియిండ్ల మడిబట్ట లాఱవేయు పనిని సంపాదించెను. కొన్నాళ్లు అది లాభించెనుగాని వసుమతి తెలుఁగు దని తెలియుటచేత ఆమె వారిమడికిఁ గాకపోయెను. ఇంతియకాక యామె కన్య. కన్య మడియా? దానితో ఆమె కాపని యూడెను.

ఆనాఁ డామె అతిగ్లానితో కాలేజీకి వెళ్లెను. మైక్రాస్కోపుతో పరిశోధన చేయుచుండఁగా శోషచే పడిపోయెను. ఆమెతో పాటు పరిశోధనలో నున్న మేరీయను ఆంగ్లో ఇండియన్ స్త్రీ యొకతెయు మఱి యిరువురును చక్కఁగా ఉపచరించిరి. వడిగానే వసుమతి కోలుకొనెను. కొంచెముసే పయినపిదప మేరీ యిటు లనెను:—'ఇంగ్లీషువారి అంగడులలో పని సంపాదించుట మేలు. సాయంకాలమయిదు గంటలనుండి రేయి తొమ్మిది గంటలదాఁక చల్లని పని. మంచి డ్రెస్సు, మంచి టాయ్‌లెట్టు దొరకును. టర్కిష్ బాత్ ఉచితము. జీత మేఁబదికిఁ దగ్గదు. నే నిపుడు నూటపదిలో నుండి చదువుకొనుచున్నాను.'

ఇంకొకతె యిటు లనెను: 'అంగళ్లలో పని దొరకవచ్చును, దొరకకయుఁ బోవచ్చును. హోటళ్లలో అప్లికేషనే తరవాయి. స్నానభోజనములు ఉచితము. వలయుచో శయ్యగూడ దొరకించుకొనవచ్చును. నాచెల్లెలొకతె తొంబదిలోనుండి చదువుచున్నది.'

'కాదు కాదు. వసుమతి నైటింగేల్. ముఖము సూదంటురాయి. ఈమె పాటకును, ఆటకును పుట్టి మాయమందులలో పడిపోయినది. ఆపెరాకు ప్రయత్నించుచో లక్షలు మూటకట్టవచ్చును.' అని వేఱొకతె యనెను.

వసుమతి వినివిని యిటు లనెను—'వాసుదేవరావును మీ రంద ఱెఱుఁగుదురుగదా!'

'బరంపురములో నిపుడు హెల్త్ ఆఫీసరా?'

'ఆఁ. అతఁడు మాయన్న.'

'అగుచో మూటలు మోయనేల? ఉపవాసము లేల?' అని లిలీ యనెను.

'నాఁటి కతఁడింకను కాలు నిలఁద్రొక్కు-కొనలేదు ఇటుముం దతనిసాయము లభింపఁగలదు' అని వసుమతి అనెను.

అందఱి మొగములందును సంశయము ప్రతిఫలింపఁగా ఆనాఁటి సంభాషణ మంత మొందెను. ఈసంభాషణమునకు ఫలముగా పదిరోజులలో వాసుదేవరావు చెన్నపట్టణము చేరెను. వసుమతి కాలేజినుండి ఇంటికివచ్చి ఇక్కట్టునఁ బడెను. ఇల్లంతయు తనరహస్యమును బయటఁబెట్టుచుండెను. అతనికిఁ బెట్టఁదగిన ఆహారపదార్థ మిల్లె. ఇంట నున్నది, పరబ్రహ్మము—ఏనుఁగులు తిను బియ్యమును, త్రిమూర్తులును—ఉప్పు, చింతపండు, మిర్చి.

వసుమతి మార్కెటుకుఁ బోవ సిద్ధపడుచుండఁగా కనిపట్టి వాసుదేవరా వామె నాఁపి, 'బాబయ్యగారి హయామునుండియు మార్కెటుపని నాది' అని తాను వెళ్లెను. ఆఱు నెలలకు సరిపడు సామగ్రిని బండిమీఁద తోలించుకొని వచ్చెను.

'రేపు సంతర్పణ మేమేని తలపెట్టితివా?' అని సోమమ్మ యనెను.

'మా అమ్మ కొడుపుట్టువు లేని లోటు వసుమతితోఁ దీఱెను. మీకు మగపుట్టువు లేని లోటు నాతోఁ దీఱదా? పిన్నమ్మగారూ!' అని వాసుదేవరా వనెను. సోమమ్మ కనులలోని వాత్సల్యధారయే ప్రత్యుత్తర మాయెను.

'పద్దు ఎంతయినది?' అని వసుమతి యడిగెను.

'శత్రువు నడిగినటు లడుగుచున్నావే?' అని వాసుదేవరా వనెను.

'కాదు వాసూ! నేఁటినుండి ఆఱు నెలల వఱకు నాకొక నో మున్నది. దాని ఫలమును రాధకు త్యాగము చేసితిని.' అని వసుమతి యనెను.

వాసుదేవరావు నిర్ఘాంతపోయి నిలువఁబడెను.' (సశేషము.)

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు సంపూర్ణముగ చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి, వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి. ప్రకటింపనివ్యాసముల తమకు త్రిప్పిపంపుటకయి తపాలుబిళ్లలు పంపవలయును.

సంపాదకుడు, 'భారతి'.

## కో యి ల

ఉభయభాషాప్రవీణ, మిన్నికంటి గురునాథశర్మ గారు

లేదర్థంబు, స్వరంబులేదు, శ్రుతియుఁ లే, దక్షరాబద్ధముఁ
గా, దభ్యస్తముగాదు, లాక్షణికముంగా, దైననేమి? మహా
హ్లాదంబుం గలిగించి తన్మయులఁ జేయంజాలు మహ్మార నీ
కి దివ్యామృతమొల్కుపాట పికమా! యెట్లబ్బెఁ జైత్రంబునన్?

ఎంతయుఁ బండకున్న నెదియే నొకయేఁడు రసాలసాల మొ
క్కింతయుఁ జూడఁబోదు కరశేష్టముఁ బండిన నింబవృక్షముఁ
వంత వచింప కేరికిని వాడుచు శోషిలుచుఁ ఫలవ్రజా
క్రాంత రసాలము న్నమకుఁగాక పికంబది సారెసారెకున్.

వానకోయిలయఁట, మ్రాను గోయిలయఁట - యెట్టిపేర్లు నేఁడువుట్టెనమ్మ!
అంతమాత్రముననె యఖిలమోహనకళా - విలసనములు తమకుఁ గలిగెనొక్కొ!

పికమా! కలస్వనము నో - పిక మాచెవి నిడుచుఁ దీయ విరిమామిడిఁ జూ
డకుమా! దోననిశితశర - ప్రకరమలర శబరుఁ డిదిగొ వచ్చుచునుండెన్.

బధిరు లున్నెడఁ గోయిల! మధురమైన నీకుహూంకారమలరారుఁ గాక యేమి?
ఆకృతింగని కాకమ్మ వనుచు నిన్ను - నందు రజ్ఞులు దైవోపహతులు వారు.

కాకులసభ దైవికముగ - నీకునికి ఘటిల్లె నేని నిర్మలగీతిం
బైకము! వెలికింజూపకు - మా! కీర్తికి బదులుగ నపహాస్యమ కలుగున్.

కాకులమూఁకలలోపలఁ - గోకిలము చెలఁగిన మధురకోమలగీతిఁ
జోకచెడునె? కఠినరవం - బే? కళ్యాణప్రకృతికి హీనులమైత్రిన్.

ఎల్లపుడు మావితోఁటలఁగొల్లగొట్టి - పల్లవోల్లల న్మంజరి నుల్లసిల్లి
దైవికముగ వేములఁబడ్డ-కోవెలలకు, రుష్టబలిపుష్టములకు పత్రాష్టమంబు.

(అడవి పువ్వులు)

---

# సారె

అద్దంపూడి అన్నపూర్ణమ్మగారు

విజయలక్ష్మి చాలా మంచిది. అయితే డాంబికురాలు. ఎప్పుడూ తనమాటేకాని ఇంకెవ్వరి మాటా ముందుంచకూడదని ఆవిడ అభిప్రాయం. ఆవిడకు నగలు యెక్కువగా వున్నవి. మాటలలో చమత్కారం యెక్కువ. పనులుకూడా ఆలాగుననే చేసును. వాళ్ల ఇంట్లో అన్నినగలూ రెండేసిజతలు వున్నాయి. ఒకజత రవలకమ్మలూ, ఒకజత పుష్యరాగముల కమ్మలూనూ, ఒక బంగారపువడ్డాణం, ఒక గిల్టువడ్డాణం, మిగతనగలన్నీ లెఖ్ఖలేనన్ని వున్నాయి. ఏమేమి వెండిసామానులున్నాయో అవన్నీ గిల్టువికూడా వున్నాయి. అయితే భాగ్యవంతులు యేవివేసుకున్నా అవన్నీ యెంతో విలువగలవేకదా? సామాన్యంగా వున్నవాళ్లు యెంత విలువగలవస్తువులు వేసుకున్నా అవి యేగిల్టువో అని సహజంగా అందరూ అనుమానించేవిషయమే. ఆలాటి వారిలో విజయలక్ష్మి ఒక్కర్తె.

విజయలక్ష్మిఇల్లు ఆవూళ్లో యిళ్లన్నిటిలోనూ పెద్దది. చాలా అందముగాకూడా వుండును. యెప్పుడూ ఒకళ్లో ఇద్దరో చుట్టాలు వస్తూనేవుంటారు. వస్తే రెండు రోజులకుపైన వుండనియ్యదు విజయలక్ష్మి. ఎప్పుడైనా వాళ్లు ఒకదినం యెక్కువగా వున్నట్లయితే, ఆవేళంతా కసురుకొని చిర్రుబుర్రుమని అందరిపైనా కేకలు వేస్తూంటుంది. డబ్బేమో యెక్కువగానే వుంది. ఉంటే యేమిలాభం? ఒకళ్లూ ఇద్దరూ వస్తేనే ఈ పాట్లు. ఇంక పదిమంది బంధువులువస్తే చెప్పనేఅక్కరలేదు. వచ్చినవాళ్లందరినీ డంబంగా మర్యాదలు చేయడం; వాళ్లు వెళ్లగానే వీథి అరుగుమీద కూర్చుని, పక్కయింటి అమ్మన్నా రావే, యెదురింటి రాముడూ రావే, నాలుగోయింటి నాగమ్మా రావే, అని అక్కడ నుంచి పురాణాల్లాగ యేకరువెట్టడం. మరియెందుకో కాదు, గొప్పగా అందరూ చెప్పుకోవాలన్న అభిప్రాయమువల్లనే.

విజయలక్ష్మి భర్తకు సాలుకు అయిదువేలు వస్తాయి. అదీకాక ఆవిడపుట్టింటిలో పసుపుకుంకుమకు యిచ్చినభూమిలో యేడాదికి అయిదువందలు వస్తాయి. అందువల్ల నగలూ, బట్టలూకూడా ఆవూరి అందరికన్నా విజయలక్ష్మికే యెక్కువ. ఏసామాను యెరువుకావాలన్నా విజయలక్ష్మియింటికి వస్తే దొరుకుతుంది. రెండుబండ్లు, నాలుగుకాళ్లయెడ్లూ, నాలుగుఆవుల పాడీ సిరీ సంపదా కూడాను. ఆవిడకు గొప్పాడంబరం వుండకపోతే మరి యెవ్వరికి వుంటుంది? అయితే ఆవూరు పల్లెటూ రవడంవల్ల, పెద్దవూళ్లల్లో రాణించేటట్టు రాణించదు.

విజయలక్ష్మికి సావిత్రి ఒక్కర్తేపిల్ల. తరువాత పిల్లలు లేరు. సావిత్రి మంచి అందమైనది. ఆఅందానికి తగినట్లు చదువూ పాటా కూడాను. సావిత్రి పాడిందంటే యేడిచేపిల్లలు యేడుపుమాని చక్కగా వింటారు. ఆ కోకిలస్వరంతోటి పాడుతూవుంటే యెప్పుడూ చూడనివాళ్లు నిర్ఘాంతపడి వింటారు. సావిత్రికి పన్నెండేండ్లు నిండినతరువాత పక్కన పదిమైళ్లదూరములో వున్న రాయవరంలో ఇచ్చి పెళ్లిచేసినారు. అల్లుడికి మూడువేలు కట్నం, వెండిచెంబులూ, పట్టుతాపితాలూ, ఆడబిడ్డలకు లాంఛనాలూ, వచ్చినవాళ్లందరికీ మంచి బట్టలూ, చీరె సారె|అంతా 'ఓహో' అనేటట్టు చేసేరు. వియ్యాలతరపువాళ్లుకూడా చాలా మెచ్చుకున్నారు. మేళాలేమి, తాళాలేమి, పాటలేమి, పద్యాలేమి, హరికథలేమి పెళ్లి అయిదురోజులూ చెప్పతరంకాకుండా చేసినారు.

పెళ్లి అయినప్పటినుంచీ ఆవూరివాళ్లకి విజయలక్ష్మిఅంటే మరింత విశ్వాసం హెచ్చింది. మొదటనే అమ్మలక్కలంతా విజయలక్ష్మి చెప్పినమాటకు జవదాటరు. ఇప్పుడు ఇంక చెప్పవలెనా? విజయలక్ష్మి అంటేనూ, వారియిల్లంటేనూ, ఆచుట్టుప్రక్కగ్రామా



ఘూర్జర గోపిక

చిత్రకారుడు: శ్రీ వింజమూరి వెంకటరావుగారు, గుంటూరు.

లన్నింటికీ సాటించినట్టు గౌరవం మర్యాదా వచ్చేయి పెళ్లి అయేక.

భీమయ్యగారుకూడా మంచి పెద్దమనిషి; పేరు ప్రతిష్ఠ కలవారు. వారికీ మంచి సిరీ సంపదా కూడాను. ఆయనా మంచి బలుకుబడి కలవారే. రామచంద్రుడు పెద్దవాడు. తరువాత ఇద్దరు పిల్లలు. రామచంద్రుడు బి. యే. చదువుకున్నాడు. తెలివితేటలలోను, సాంప్రదాయంలోను సావిత్రికి తగిన వరుడే. వారి దాంపత్యం అందరికీ సంతోషమయినదే కాని, వాళ్లున్నదీ, వీళ్లున్నదీ, పల్లెటూరేగదా? అని అప్పుడప్పుడు అనుకునేది సావిత్రి.

పెళ్లి అయిన యేడాదికంతా సావిత్రి రజస్వలయినది. దానికికూడా వియ్యంకుడితరపువాళ్లు చాలామంది వచ్చేరు. అదీ చాలావైభవంగానే జరిపింది విజయలక్ష్మి. ఏవో అయిదువందలరూపాయిలు ఖర్చయినాయి. అక్కడనుంచి వీధిఅరుగుపైన కూర్చుని 'పెండ్లికింత అయినది, అల్లుడి కింత ఇచ్చేను, బట్టల కింతా, పాత్రలకింతా, ఇప్పుడింతా, ఇంకా కార్యాని కెంత ఖర్చుచేయవలెనోకదా? రాముడూ' అని రోజూ అంటూవుండేది విజయలక్ష్మి.

"అవునమ్మా, కాదూ? మాటలా చెయ్యాలంటేనూ?" అని అంటూవుండేవారు స్నేహితులైన అమ్మన్నావాళ్లూను.

రామచంద్రుడు బి. యే. ప్యాసుఅయినతరువాత కార్యంచేతామని నిశ్చయించి, ముహూర్తంపెట్టి శుభలేఖ వ్రాసినారు భీమయ్యగారు. ఆజాబుచూచి ఆవూరివాళ్లు 'సావిత్రి అత్తవారింటికి పోతుందిగదా' అని విచారించేరు. విజయలక్ష్మికి చెప్పనక్కరలేదుకదా విచారానికి. ఇంక పదిహేనురోజులుండె అనగానే విజయలక్ష్మి పనులుచేయడానికి ఆరంభించింది.

విజయలక్ష్మిచెల్లెలు చాలామారంగా వున్నందువల్ల పెళ్లికి రాలేకపోయినది. కార్యానికేనా వద్దామనుకొని యేలాగైతేనేమి వీలుచేసుకొని వచ్చింది కాంతమ్మ. చెల్లెలూ అక్కా యేమేమి చేయవలెనో అని ఒకరోజంతా కూర్చుని ఆలోచన చేసేరు తుదకు ఒకరకంగా తేలినది ఆలోచన. కార్యం అత్తవారింట్లోనే గనుక వీళ్లకి ఆట్టే పనిలేదు. అయితే అసలు లేకపోతుందా?

ఇరవైరకాల పలహారాలు చేద్దామనుకున్నారు. స్నేహితురాండ్రను పిలిచి ఒక్కొక్కళ్లను ఒక్కొక్క ఫలహారం చేయమని చెప్పి తనూ కాంతం తీసి పలహారాలు చేసేరు. విధీ విరామం లేకుండా ఐదురోజులు చేసేరు. పలహారాలుచేయడం అయేసరికి మూడురోజులే గడువు వున్నది గనుక ఆరోజుననే బయలుదేరి వెళ్లినారు, విజయలక్ష్మి, చెల్లెలూ, భర్తా, సావిత్రీ, ఇంకా తనకుముఖ్యమైనవాళ్లంతాకూడాను.

వీరందరూ వస్తారని యెదురుచూస్తూవున్న భీమయ్యగారి బంధువులు తగిన మర్యాదలతోటి విడిదింటికి తీసుకువెళ్లి అక్కడ స్థలం అంతా చూపించివెళ్లినారు. వాళ్లుచేసిన మర్యాదలు విజయలక్ష్మి చేసినదానికన్నా పదిరెట్లు యెక్కువగా వున్నది.

విడిదింటికి నాలుగుపక్కలా చెట్లు దట్టముగా వున్నవి. వీధిలో పెద్దపందిర వేసినారు. ఆపందిరమీద జాజులూ, సంపెంగలూ, మల్లెలూ ఇంకా రకరకాల పువ్వులు వేసినారు. భీమయ్యగారింటికీ విడిదింటికీ మధ్య పదిళ్లు వున్నాయి. విడిదిల్లే ఆఖరిల్లు. అవతలంతా పొలాలూ, తోటలూ, బురదాను. ఆ ఇల్లు బంగాళా పంపిణీగా వుంది వీరందరూ ఆయింట్లో ప్రవేశించిన తోడనే కొంచంసేపటికల్లా పెద్దగాలీ వానా యెడతెరిపి లేకుండావచ్చేయి. కార్యంనాటికి కొంచెం వాన వెలిసింది. కాని చినుకులు పడుతూనేవున్నాయి.

భీమయ్యగారు చేసే మొదటికార్యం యిదే. కాబట్టి చాలా ఆర్భాటంగా చేస్తున్నారు. ఇల్లంతా బంధువులతోటి సందడిగా వున్నది. విడిదింటినుంచి ఈ ఇంటికీ ఈ ఇంటినుంచి ఆఇంటికీ తిరిగేవాళ్లు లెఖ్ఖలేదు. సావిత్రిపాట వినడానికి కొంతమందీ, అక్కడకు వచ్చిన వాళ్ల చీరెలు చూడడానికి కొంతమందీ, నగలు చూడడానికి కొందరూ, ఈవిధముగా వానఅనకుండా వెడుతూ వస్తూ వున్నారు.

విజయలక్ష్మి ఇదంతా చూచి బ్రహ్మానందపడింది. డంబం గొప్పా హెచ్చిపోయి అతిగాంభీర్యంగా మాటలాడ్డం మొదలెట్టింది. వీళ్లు చేసేయత్నానికీ, మన కున్న మర్యాదకూ, ఈ ఫలహారాలు చాల వనుకొని, కాంతమ్మను పిలిచి యేమిచేద్దామని ఆలోచనతో ఫలహారాలు పెట్టిన గదివద్దకు వెళ్లినారు.

"అక్కా నాకో ఆలోచన తోస్తూందే, అలా చేద్దామా?" అంది కాంతమ్మ మెల్లిగా.

"చెప్పు, త్వరగా, రాత్రి మనం అన్నీ పట్టుకెళ్లాలా వద్దా? ఇప్పుడే సర్ది పెట్టి తేకదా బాగుంటుంది. మళ్లీ అందరూ వస్తారు. తరువాత తీరుబడి వుండదు" అంది విజయలక్ష్మి.

"పెద్దబుట్టలు తెప్పించి అందులో అడుగుని అంతా పాతబట్టలూ, కాగితాలూ పెట్టీ, పైన ఫలహారాలు పెడదాం. బట్టలన్నీ నొక్కి పెట్టి పైన ఆకులేస్తే తెలియకుండా వుంటుంది. యేమంటావు?" అంది కాంతమ్మ.

"అవునే, మంచి ఆలోచనే తోచింది నీకు; అలాగే చేద్దాం, అప్పుడు బుట్టనిండా ఫలహారాలు వున్నట్టు కనబడుతాయి" అనిచెప్పి బజారుకుపంపించి, ఇరవై పెద్దబుట్టలు తెప్పించింది. అవి రాగానే కాంతమ్మను రహస్యంగా పిలిచి అక్కా చెల్లెలూ ఇద్దరూ ఫలహారపుగది లోపలకు వెళ్లి, ఒక్కొక్కబుట్టలోనూ మూడువంతుల కాగితాలూ, బట్టలూ కుక్కి, అన్నిబుట్టలూ తయారుచేసినారు. వీళ్లిక్కడ వుండగానే, "వియ్యపురాలెక్కడా! భోజనాలకు వేళ అయిందే, ఇంకా రాలేదేమీ?" అని వచ్చి వెతుకుతున్నారు. ఆమాటలు వినపడగానే అవసరంగా తలుపులుమూసి బయటకు వచ్చేరు ఇద్దరూను. వీరు వచ్చినతోడనే అందరూ కలిసి భోజనానికి వెళ్లేరు.

రాత్రి తొమ్మిదిగంటలకు ముహూర్తం గనుక మూడుగంటలనుంచీ, సింగారించుకొనేవాళ్లూ, జడవేసుకొనేవాళ్లూ, ఈవిధంగా హడావిడిగా వున్నారందరూను. బాజాభజంత్రీలు వచ్చికూర్చున్నారు. ఇల్లంతా కలకల్లాడుతూంది. సాయంత్రం యేడుగంటలకి పీటలమీద కూర్చోవాలని బ్రాహ్మలు తొందర చేస్తూ వున్నారు. కాబట్టి సావిత్రిని అలంకారంచేసి తీసుకువచ్చింది కాంతమ్మ. ఆతరువాత రామచంద్రుడూ సావిత్రీ పీటలమీద కూర్చున్నారు.

అప్పుడు విజయలక్ష్మి, "ప్రొద్దు అయిపోయింది. పీటలమీదకూడా కూర్చున్నారు. ఇంకా మనం ఫలహారాలు సర్దలేదే" అని అవసరంగా వెళ్లి తలుపుతెరిచి తనుచేసి తయారుగావుంచిన రకరకాల ఫలహారాలన్నీ ఒక్కొక్కబుట్టలోనూ సర్దుకొని బ్రాహ్మలని పిలిచి కావిళ్లేయించుకుని బయలుదేరింది యెనిమిదిఅయేసరికి.

సావిడిఅంతా బ్రాహ్మలతోటీ, ముత్తైదువలతోటీ, కిటకిటలాడుతూ నిండివుంది. అప్పుడు వయ్యారంగా నడుస్తూ కావిళ్లుతీసుకొనివచ్చింది విజయలక్ష్మి. ఈవిడను చూసినతోడనే అందరూ కొంచెం తోవచేసినారు. వరుసవరుసగా అన్నిబుట్టలూ తెచ్చి మధ్యలో



అప్పుడు వయ్యారంగా నడుస్తూ కావిళ్లు తీసుకొని వచ్చింది విజయలక్ష్మి.

వుంచినారు వంటబ్రాహ్మలు. ఇవన్నీచూచి అమ్మ లక్కలంతా ఆశ్చర్యపడి, "చూసేవా జగ్గమ్మత్తా, యేళ్లా తెచ్చేరోనూ? చేస్తే ఈలాకాక్కదా చేయాలి? నరసమ్మగారింట్లో మొన్న చేసేరే; యేం బాగుందీ? ఎంత పెద్దబుట్టలో ఇవన్నీ చేయడానికి యెన్ని రోజులు పట్టిందో?" అంది కామమ్మ.

"వీళ్లకేమీ భాగ్యమంతులు. నరసమ్మకీ వీళ్లకీ సాటితెస్తావూ? వాళ్లకేముంది పాపం! జీతాలిచ్చి చేయించివుంటారు. లేకపోతే ఈవియ్యపురాలా పొయ్యి దగ్గరకెళ్లి కష్టపడింది? అంతకీ ఆధారమయింది యేమిటో తెలుసా? డబ్బే! అదివుంటేసరి, కొండమీది కోతైనా దిగివస్తుందంటారు?" అంది జగ్గమ్మ.

ఈలా ందరూ పరిపరివిధాల అనుకుంటున్నారు, బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు. పేరంటాండ్రందరూ కూచున్నారు. బుట్టలన్నీ కళ్లు కుట్టుతూన్నట్టు మధ్యగా పెట్టివున్నాయి. పిల్లలూ పెద్దలూ అందరూ, బుట్టలకేసే రెప్పవాల్చకుండా చూస్తున్నారు.

ఆసమయంలో బ్రాహ్మడు, "మేళం వాయించండి, మేళం వాయించండి," అని కేకలువేస్తున్నాడు. ఆతక్షణం మేళం సన్నాయీ వాయించడం మొదలెట్టేరు. అప్పుడు చక్కిలాలబుట్టలో పైనవున్న చక్కిలాలు కదిలేయి. ఇంకా కొంచెంసేపయేసరికి బుట్టలో వున్న చక్కిలాలన్నీ కిందపడుతూవున్నాయి. అక్కడ వున్నవాళ్లంతా "ఇదేమిది? ఈలా కదుల్తున్నాయి." అనుకుంటున్నారు. మేళం సన్నాయీ గింగురుమని చెవులు ఘుల్లెత్తేలాగ వాయిస్తున్నారు. ఒకరిమాట ఒకరికి వినపడ్డంలేదు. ఆసమయంలో చక్కిలాల బుట్టలో నుంచి, "బుస్సు, బుస్సు" మని చప్పుడుతోటి పెద్ద రెండుబారల పామొకటి బట్ట ఈడ్చుకుంటూవచ్చింది.

దాన్ని చూడడంతోటే అంతా చెల్లాచెదరై మూలకొకళ్లు పరుగులెత్తేరు. బ్రాహ్మలంతాకూడా మంత్రాలుమానేసి పారిపోయేరు. పీటలమీద కూర్చున్న వాళ్లిద్దరూకూడా బిక్కమొఖాలేసుకొని వాళ్లోపక్క



'బుస్సు బుస్సు మని పామొకటి......వచ్చింది.

పోయేరు. మేళం వాయిస్తూనే వున్నారు. వాళ్లిదంతా చూసి వాయించడం మానేసి, "ఏమి, ఏమి,?" అని వాళ్లోపక్క కేకలేస్తున్నారు. మంచికాలంవల్ల ఆ



నాలుగైదుబుట్టలు......బట్టలుమాత్రం వున్నాయి

పాము వీధికేసి పారిపోయి యేమూలనో మరుగుగా దూరింది.

అరగంట అయేసరికి అందరూ సద్దణిగి ప్రాణా లు పిడికిట్లో పెట్టుకొని హాల్లోకివచ్చి చూస్తున్నారు. అప్పుడు భీమయ్యగారి తమ్ముడు బుట్టదగ్గరకు వచ్చి చూస్తే ఒకగుడ్డ వేలాడుతూవుంది. "ఇంకా యేమైనా వుందేమో?" అని కర్రపెట్టి మెల్లిగా లాగడం మొదలు పెట్టినాడు. లాగ్గా......లాగ్గా......బట్టలు వస్తూనే వున్నాయి. ఆయనకు ఆశ్చర్యంతోచి, "అన్నింటి లోనూ ఈలాగే వున్నాయికాబోలు," అని నాలుగైదు బుట్టలు కర్రతోటి లాగిచూస్తే, పాము లేమీ లేవు, కాని పెద్ద చాకలివాడిమూటంత బట్టలుమాత్రం వున్నాయి. అక్కడ అందరూ యెలావున్నవారు ఆలాగుననే వుండిపోయినారు. అప్పుడు విజయలక్ష్మి యేవిధంగా వుండునో పాఠకులకే విశదము.

---

# వి శ్వం భ ర

కుందుర్తి నరసింహరావు గారు

గ గ న వా ణి

ఏ నవమల్లికాకుసుమమే, వనవాటిక, నిండుప్రొద్దులన్
జానకి కంటికోనల విషాదరసామృత చిత్రబిందువుల్
తెనెల సోనలోఁ గలిపి తేర్చినదా ?—మృగజాతియే గదా
కానల దిక్కులేని కసిగందుల నోమిన దిన్నినాళ్లకున్ !

ఈ లలితాంగిదృక్కు లొలికించెడు వెచ్చనిజాలివానలన్
రాలినవేమిరా, కుసుమరాజ్ఞి కనుంగవ నశ్రుబిందువుల్ !
ప్రేలి, నభోవిభూతి కురిపించెడు పుష్పాడిజాలు మంచులో
సోలఁడు, మోమువాల్చఁడిది చోద్యమురా: పతి కొండరాయిరా?

సీ త

తల్లీ! చీఱచెఱంగు నామెడకు రాదా? చిన్నదైపోయె; మే
నెల్లన్ శుష్కము, పంజరప్రతిమ లేవే! యిన్నినాళ్లుండియున్,
కళ్లోకాళ్లొ రవంతలోపడక నీకై వేచియేయుండియున్
వల్లీరజ్జు విషప్రయోగముల జీవా లూడ్చుకోనైతినే!

ఇతఁడు మహానుభావుఁడుసుమీ! నరలోక మొకేరవాన నా
గతికయి తల్లడిల్లు టెఱుఁగం దలపెట్టఁడు, మిన్నువాఁకలో

సుతులను బాఱవైచి వడిఁజొచ్చెద చల్లని నీయెడందలో;
బ్రతికినమూఁడునాళ్లు నొకపాప మెఱుంగను; నీవ చెప్పవే?

నాపసిపాప లీయెడఁదనాటిన ఘోరవియోగవహ్నిలో
పాపము పండిపోయినది: భర్తృగుణంబె జపించు నోటికిన్
లోపము లెట్లు వచ్చినవి?—లోచనగోళము లుబ్బిపోవ నా
కై పరితాపమొందు హృదయాధిపుఁజూచి యిఁకెట్లు లోర్చెదన్?

ఇంకేమే, జగమెల్ల మోసెదవు నీవే యింత కన్నెత్తినన్
క్షుంకల్ వీరొక లెక్కయేమిటి నరుల్? గోలెత్తని మ్రొట్టులో,
వంకల్ మాత్రము దిద్దుచుండు మిట దుర్భావస్రవంతిన్, మహా
హంకారుల్ సుమి మచ్చమాపెదరు నిన్నైనన్, దిశల్ చూచినన్?

ఈవిషమాగ్ని దీక్షలు సహింపఁగలేనిఁక, క్రుంగిపోతి, త
ల్లీ వడఁకెత్తుచున్న యొడలిన్ దయఁజూడుము, గర్భసీమలో
ఏ వనవీథినో శరణమిమ్ము, సుఖించెద; కొండకోనలన్
జీవము నిల్పు టీవెడఁగు సీతకు క్రొత్తదిగాదు, చూడవే!

భూ మి

కోటర మెంతగా నడుపుకొంటివొ పండిన పుణ్యమార్గముల్
దాఁటని వృద్ధుఁడై దశరథక్షితిపాలుఁడు నిల్చియుండఁగా!
నేఁటికి నీమహత్త్వము గణించెడి ప్రాణి జగాన లేఁడు! నీ
కేటికి, తల్లిరో, యిఁక నశించిన లోకముతోడ?—రాఁగదే!

ఏమరాత్ముఁడో నిజశక్తి యెఱుఁగలేక - కాలు లేవ ప్రేలిన, గుండెకదలిపోవు
రాజమాత్రునితో కాపురం బిఁకేమి!—శాంతిభూమిలో నీకు సుస్వాగతమ్ము

రమ్మిఁక నీవు పెంచిన కురంగపుమాపుల అంపకాలతో
ఘుమ్మని వాసనల్ గుబులుకొన్నవి వావిడి యేడ్చుచున్న మం
యమ్మ వనేందిరాసతి వెలార్చిన దూముడి తమ్మిపూలపై!
కమ్మనివేళ దీవనలు గైకొని లోకము శీఘిరాఁగదే!

# గృహిణీపదమ్

మల్లాది రామకృష్ణశాస్త్రి గారు

ఆవిడే...మరే...ఆ అమ్మాయిపేరు లీలావతి...'

'ఏ అమ్మాయి?'

ఆ...అమ్మాయే...ఆ అబ్బాయి లేడూ...వాళ్ల అమ్మ...'

'వాళ్ల నాన్న పేరు...'

'నాన్నే...'

'ఒళ్లు దగ్గర పెట్టుకుని జవాబుచెప్పు...చదవకుండా ఇష్టంవచ్చినట్టు వాగుతావేం...'

'చెపుతానుండుమరి...అతడు రాజ్యము...ఊహు...అప్పుడు దేవతలందరూ...ఊహు...ఊ...ఇదిగో ఆయన పేరు హిరణ్యకశిపుడు...ఎబ్బే, ఏం పేరు...'

'ఏం...'

'లేకపోతే ఆపేరేమిటి...అందరూ వెక్కిరించరూ...హిరణ్య...బలే...బలేపేరు...'

'నీపేరు మహాబాగుందిలే...'

'బాగా లేదూ?...ఆ అబ్బాయిపేరు చూడు ప్రహ్లాదుడుట...అంతకన్న నాపేరే బాగుంది...'

'సరేకాని, ఆవిడపేరు లీలావతికాదు...'

'పోనీ'

'అదికాదు...నీపుస్తకంలో తప్పు వ్రాశేరు. అసలుపేరు దత్త...'

'ఆ...మరీ బాగుంది..దత్తేమిటి, దత్తా గిత్తాను..'

'నేను చెప్పినట్టుగా చదువు...తెలిసిందా.'

'మరి పంతులు కొట్టరూ'

'మీపంతులకి అసలు వచ్చా...'

'రాకపోతే ఏం...కొట్టరూడదూ?'

...ప్పు సరిగా చదవకపోతే నేనూ కొడతాను...

'కొట్టు మరి...మామయ్యా వదుగుతానుండు..'

పోనీ మాపంతుల్ని కొట్టరాదూ...అలా చెప్పొద్దని...'

'అసలు పుస్తకం వ్రాసినవాడికే ఓజెల్లా యిస్తే బాగుంటుంది'

నన్ను మటుకు వద్దమ్మా...ఎవరినన్నా కొట్టు...ఆ అమ్మాయిపేరు ఏమైతే నాకేం...పోని, ఆవిడ వాళ్ల అమ్మేనా...

'ఆ...కాని పేరు లీలావతికాదు...దత్త...'.

'మరి ఇందులో ఈలా ఉందే...'

'తప్పని చెప్పడంలా...'

'నిజంగా?'

'ఆఁ...'

'అయితే నే నీపుస్తకం చదవను...'

అని విసిరిపారవేసాడు పుస్తకాన్ని బాబు...ఏదో ఆలోచించుకుంటూ. ఆనాటకమంతా గమనించకుండా, పరధ్యానంగా లోపలికి వస్తున్నాడు నెమ్మదిగా ఆయన; ఆ గ్రంథరాజం...మాక్మిలన్ రెండోవాచకం...తిన్నగా పోయి ముఖానికి తగిలి చేసిన తప్పు క్షమించమని కాళ్లమీద పడిపోయింది. దెబ్బ తగలకపోయినా, ఆతాకుడుకి తెలివివచ్చింది ఆయనకి: తానెక్కడ ఉన్నది గ్రహించగల మామూలుధోరణిలోకి వచ్చాడు...ఆలోచనలన్నీ చాలించాడు.

'ఏమిటీ అల్లరి, బాబూ'

'నే నిది చదువను మామయ్యా, ఇందులో అన్ని తప్పులుట'

'ఎవ రన్నారు?'

బాబు, 'ఆమే' అని సైగచేశాడు. ఆయన నవ్వి...

'నీచదువంతా పాడి కెందుకూ...అసలు ధోరణి చెడగొట్టబోకు' అన్నాడు ఆమెతో...

'తప్పులు చదువుతూంటే చూస్తూ ఊరుకోలేను. నేను నిజంగా ఎందుకని ఊరుకుంటున్నానుకాని, ఈలాటివి వ్రాసేవాళ్లని, అచ్చువేసేవాళ్లని, చదివించే వాళ్లనీ......'

'పోనిద్దూ...ఇంతకూ అసలుకథ ఏమిటి'

ఆమె, బాబూ, ఎవరికి తోచినట్టు వారు చెప్పారు. ఆయన అంతా విని, మళ్లా నవ్వి.

'నీవ్రమాత్రం అయోమయాన అలాగే చదువుకో లేను...వాడికి కాస్త తెలివి వచ్చిన తరువాత...తెలు స్తుంది...ఇంత చిన్నతనంలో, నీ చదువంతా వాడికి ఏలా అబ్బుతుంది?' అన్నాడు.

'చాల్లెండి...మీరు ఈలాటి తీర్పులు బాగా తీరుస్తారు......'అవధాన్లగారేం చేస్తున్నారంటే తప్పు వ్రాయనూ, దిద్దనూ; ఆయనభార్య ఏం చేస్తూందంటే ఒలుకబోయనూ, ఎత్తుకోనూ ...' అన్నట్టు ముందు తప్పులు చదువడం తరువాత దిద్దుకోడం, ఇదేనా జీవితంలో చేసేపని......'

'ఏమిటో, మన జీవిత మెంత...మనం చేసే పనెంత...'

'మళ్లా మొదలా...మాట్లాడితే వేదాంత మేనా...'

అవును నీకు నచ్చదు...కవయిత్రివి కనుక...'

—బాబు సావకాశంగా అన్నీ ఆలకిస్తున్నాడు ...ఆమాట వినేటప్పటికల్లా బిగ్గరగా నవ్వి...

'కవిత్రి...కవిత్రి ఏమిటి మామయ్యా జా పత్రి...'

అన్నాడు...

ఆమెకు ఓమాదిరిగా కోపం వచ్చేసింది: కొంచెం చిరుముడిపాటుతో,

'మీ వేదాంతం, నా కవిత్వం...అందుకనే మన గోష్ఠి ఈలా ఉంది' అని రుసరుసలాడుతూ అక్కడనుంచి వెళ్లిపోయింది.

... ... ... ...

ఇదుగో...

ఓయ్...

నిన్నే...

పలకవేం...

వినబడటంలా...

ఏం చేస్తున్నావ్...

ఎక్కడున్నావ్...

పిహూరి తలాకస్తావ్

...ఎన్నిరకాల పిలవడానికి వీలవుతుందో అన్ని విధాల పిలిచి చూసాడు: ఓసంబోధనకన్నా, లోపల నుంచి...'ఆఁ...వచ్చే' ననిగాని, పోనీ వినిపించుకున్నట్లు జవాబుకాని రాలేదు: పిలిచి, పిలిచి, నాలుగైదు నిమి షాలు నిదానించిచూశాడు. రాలేదు. ఇక ఇది పనికా దనుకుని, దగ్గర బల్లమీది కేస్‌లోంచి ఫిడేలు తీసి, కమాన్ దబాయించిపట్టుకుని ఎగుడుదిగుడుగా రెండు మూడుసార్లు తీగెలమీంచి లాగాడు: ఓతీగె తెగింది: అంత ఉత్సాహంతో మరీజోరుగా వాయించడం మొద లుపెట్టాడు. కర్ణారుంతుదంగా, 'వరిబోణి' ఛాయలో, భైరవిరాగాన్ని భయపెట్టే కొన్ని వింతగమకవిశేషాలు వాటంతటవి ఉదయించి, నానాగందరగోళం చేసేస్తు న్నాయి:...ఆయన ఇంకా ఆలాగే వాయిస్తున్నాడు...

'...బాగానే ఉంది...ఆనాటి కానాడు మరీ వస్తూందేం...'

'ఏమిటి?'

'...చిన్నతనం'

'ఎంతపిలిచినా పలుకకపోతే ఏం చేయ మన్నావు?'

'ఏం చేయమన్నాను...ఫిడేలు పాడుచేసి, పనికి రాకుండా చేయమన్నాను...చాల్లెండీ...మరీ నేర్చు కుంటున్నారు...'

'నీవు రాకపోతే కోపం వచ్చిందేమో ననుకున్నాను.'

'అప్పుడు కాదు, ఇప్పుడు నిజంగానే వచ్చింది... ఏదో ఆలోచించుకుంటూ ఉంటే, ఇంతలో ఏం ముంచుకుపోతూందని అలా నిలువనీయకుండా పిలు వడం...అంతపనుంటే, మీరే లోపలికి రాకూడదేం...'

'నా కంతమాత్రం ఆలోచన తోచిందికాదు... సరేలే, పోనీ వెళ్లు...ఏమి లేదు...'

'మరి ఎందుకు పిలిచారు...'

'...రెండంకాలుమాత్రం మిగిలి పోయినాయి కాదు నిన్న...ఇవాళ చదివేసేద్దాం...శాకుంతలం పట్టుకునిరా...'

'మన మిద్దరం కలిసిచదువుతూంటే కుదరడం లేదు. నేను విడిగా చదువుకుంటా లెండి...'

౨

'మొగవాళ్లు...ఛీ...వట్టి పశువులు...'

అన్నది ఆమె చదువుతూన్న సంచిక విసిరిపుచ్చు కుని పారవేసి, చివాలున కుర్చీలోంచి లేస్తూ...

ఆయన ఏమీ మాటాడకుండా తెల్లబోతూ ఆమె వంక చూశాడు.

'కానీ...ఎన్నాళ్లీ ఏలుతారో చూద్దాం...ఇంత పొగరా...వివేక ముండొద్దూ...'

ఆయనఅలాగేచూస్తూన్నాడు రెప్పవేయకుండా.

'ఏం...అలా చూస్తారేం...మీకు సంతోష మేగా.'

ఆయనకు ఆఘూకుదు ఏమాత్రం అర్థంకావడం లేదు...ఏమీ అనకుండా ఊరుకున్నా ఆమె శాంతించే టట్టు లేదు...కోపకారణం ఏమిటో అసలు తెలియదు. ఏమనడానికీ తోచక నెమ్మదిగా...

'కాఫీ చల్లారిపోవడం లేదూ?...' అని ఆమె వైపు చూడకుండా ముఖం తిప్పుకున్నాడు...

'పోనీండి...ఇవన్నీ చూస్తూంటే నాకు కడుపు ఇదివరకే నిండిపోయింది. నావంతూ, మీవంతూ మీరే (తాగేసేయండి.'

ఆయన త్రాగబోయినాడు...

'మీకేం...నే నెంత వేదన పడుతూంటేమాత్రం మీకేం...నాకు తోడా, నీడా ఎవరున్నారు దగ్గర న న్నాదరించేందుకు? నామీద మీకు ఎందుకు జాలి ఉంటుంది? ఓఅమ్మ కన్నబిడ్డను...పరాయిదాన్ని నేనేమైతేమాత్రం మీకేం...'

'ఆలాగేం'...అన్నాడు ఆయన చిరునవ్వుతో.

'ఇంకా ఆలాగేం అంటారు!...మీజాతంతా అంతే...విశ్వాసఘాతకులు...నమ్మించి గొంతుకోస్తా రు...ఛీ...వాళ్లను ఎన్నటికీ నమ్మకూడదు...'

ఈచదువంతా అగమ్యగోచరంగా ఉంది: ఇది వరలో ఎన్నడన్నా కసరినా, విసిరికొట్టినా, ఆసత్కా రాలన్నీ తనకే: ఇప్పటిధోరణి చూడగా జాతిఅంతకూ తిప్పలు వచ్చినవి. లోకంలో ఉన్నయావన్మంది మొగ వాళ్లూ ఆమెయెడల ఏం అపరాధం చేశారో!

'మరి పెళ్లి చేసుకోవచ్చేం?'

ఆమె మరీ రేగింది.

'మళ్లా అక్కడా మోసమే: మానాన్న చేశాడు ఇదంతా...ఆయనకుకూడా అభిమానమే...ఏమీ తెలి యనప్పుడు మోసం చేశారు...నేనా...నేనైతేనా... నాకే అప్పటికి బుద్ధితెలిసి ఉంటేనా...పెళ్లికొడుకనే వాడు కళ్లబడినాఅంటే, దిమ్మతిరిగిపోయేటట్టు ఓ జెల్లా ఇచ్చేసేదాన్ని...'

'ఆలాగై తే...మరి...'

'మరిలేదు గిరిలేదు...మీ మొగవాళ్లే పెళ్లిచేసు కోవాలని ఏశాస్త్రంలో ఉంది. ఆడవాళ్లని మోస గించి వలలో వేసుకునేందుకు మొగవాళ్లందరూ మొన గాళ్లే...తెలియక మోసపోతున్నారు కాని...తెలిస్తే ఏమానుషమున్న ఆడది...మొగవాణ్ణి పెళ్లిచేసుకునేం దుకు వప్పుకుంటుంది...నాయిష్టంమీదనే వదిలిపెడి తేనా...మామామయ్యకూతురు కామాక్షిని పెళ్లిచేసు కునేదాన్ని...హాయిగా ఎంతో అన్యోన్యంగా ఉండే వాళ్లం...'

ఆయన నెమ్మదిగా, మాటకు అడ్డంవచ్చి

'నిజమే...నేనూ ఏదో ఆపిల్లను వరించడం మానేసి, మామేనత్తకూతురును చేసుకున్నట్లయితే బాగుండేది: ఇద్దరం సైకిళ్లెక్కి తిరుగుతూ, సినీమాలకి వెళుతూ, మరీహాయిగా ఉండేవాళ్లం.' అన్నాడు.

ఆమె ఓక్షణం నిదానించి ఆయనవంక చూసి పకపక నవ్వింది...ఆయన చిరునవ్వుతో ఊరుకున్నాడు...

కాని అంతటితో అణగలేదు...అప్రసన్న భావం రవంతసేపుమాత్రం కానుపించింది...మళ్లా బొమలు ముడివడుతున్నవి. ముఖం జేవురిస్తూన్నది...

'చాల్లెండి...మీ మాయలూ మీరూను...నన్ను మరపించాలని చూస్తూన్నారా...నేనా...నాకసి ఎన్నటికైనా తీర్చుకుంటాను.'

ఇక నిదానించ లేకపోయినా డాయన...

'ఎందుకు ఈగల్లంతు...ఎవరేం చేశారు...'

అని సరసంగానే ప్రశ్నించాడు...

'మీరే చూడండి...మీకళ్లు చల్లబడతవి...'అని సంచిక తీసుకువచ్చి - ఆయనమీదకు విసిరివేసినట్లుగా అందిచ్చింది...

ఆయన అందుకుని మెదలకుండా ఊరుకున్నాడు.

'చూడరేం మరి'

'ఏమిటి...'

'నా మొగం...'

ఆయన ఆమెవంక అమాయికంగా చూశాడు...

'మీకంతా వేళాకోళంగా ఉంది...'

'కాదుగాని...విషయ మేమిటో చెప్పుదూ. ఎందు కీరాద్ధాంతమంతా...'

'అడ్డమయినవాళ్ల కథలూ, పద్యాలూ...పనికిమాలిన వ్యాసాలూ, ఇవన్నీ వేయవచ్చునుగాని, నాకథకుమాత్రం చోటులేదుకాబోలు ఇందులో...'

ఆయన కాస్త తెప్పరిల్లాడు...

'అదా సంగతి!... అయిన తిన్నగా మరోమారి చూడు...నీవు పంపిస్తే వేయకుండా ఉంటారా?'

'ఎన్నిమార్లు చూడను...నాకేమైనా...మతిపోయిం దనుకున్నారా...ఈలాటి చేతగానివాళ్లు...కథ పంపమని వేధించుకు తినడమెందుకూ...రెండు ఉత్తరాలు వచ్చినతరువాతనే, పోనీకదా అని పంపించాను.'

'ఆలస్యంగా అందిందేమో...ఏదైనా ఆలాటి ఆటంకం ఉంటేనేగాని వేయకుండామానరే...అయినా ఉత్తరమన్నా వ్రాస్తారుకాదూ...సంగతి తెలియకుండా ఎందు కింత తొందర?'

'వాళ్లకేం...ఉత్తరం వ్రాస్తారూ? ఆమాత్రం మర్యాదకూడా తెలుసూ'

'పోనీ ఈమారు పడకపోతేమాత్ర మేం? నీగౌరవానికి లోటా?'

'ఆసంగతి మీకేం తెలుసు...అయినా మీ కిది అంతా నవ్వుగా ఉంటుంది...కానీండీ...ఎన్నటికైనా నేనే గెలుస్తాను...'

లోపలనుంచి 'మామయ్యా!' అని బాబు కేక వేశాడు. సందు చిక్కిందే వ్యవధానంగా ఆయన తప్పించుకుని లోపలకు వెళ్లిపోయినాడు. ఆమె వెనుకనుంచి సణుగుతూనే ఉంది.

వెంటనే, బాబూ, ఆయన తిరిగి వచ్చారు...ఆయన ఈసారి నిర్భయంగా ఆమెను చూసి నవ్వేశాడు... బాబు, మోసుకువచ్చిన పుస్తకాన్ని క్రిందపడేసి తాను కూడా, అర్థం తెలియకుండానే నవ్వడం మొదలుపెట్టాడు...

ఆమె ఆశ్చర్యపడ్డది...

'నీవు చూపినసంచిక ప్రాతది. ఏలా వచ్చిందో పొరబాటున మరి...ఇవాళ...ఇదిగో ఇంకొకటివచ్చింది చూడు...ఇందులో ఉందేమో'

అన్నా డాయన:

ఆమె చెంగున ముందుకు దుమికి, ఆసంచిక తీసుకున్నది: గబగబ పేజీలు తిరగవేసి, మధ్యలో ఎక్క

డనో తీసి, నవ్వు మొగంతో చదవడం మొదలు పెట్టింది...

'ఉన్నదా' అన్నాడాయన.

ఆమె తల ఊపింది...

'అమ్మ: బ్రతికిపోయాం అందరమూను!' అని తనలోతాను ఆమెకు వినబడేటట్టుగానే అనుకున్నాడాయన...

ఆమె కొంచెంసేపు ఏంమాట్లాడకుండా ఉంది. మళ్లా కోపంగా...చూడండి...వీళ్ల దేం ముంచుకుపోయిందో...అడ్డమయిన కథలకీ చిత్రాలు వేయించి, నా ఒక్కదానికే మానేసేరు... వీళ్లు...'

ఆయన ఇక అక్కడ నిలువలేదు...

## 3

'ఆహా...ఎంత చక్కగా అన్నాడో మహానుభావుడు...ఈ మాదిరివి చదివినతరువాత...మళ్లా ఏం మొగం పెట్టుకుని బయలుదేరుతారో కవులమంటూ?... అయినా...భావంలో బడాయి...కాగితంమీద పరాయి...ఖరాబుకవిత్వమాయెను ఇప్పటిరకా లందరిదీని!'

'ఒక్కపద్యం...ఒక్క పాదం చివరికి...ఇంత చక్కగా వ్రాస్తే చాలదూ...' శ్వసతి కథ మసౌ రసాల శాఖాం చిరవిరహేన విలోక్య పుష్పితాగ్రాం'... ఆహా...'

ఆయన తన్మయుడౌతున్నాడు...ఆమె ఆవైఖరంతా గమనిస్తూ, ఎకెసెక్కంగా చూస్తూ...తనను చూసి అయినా ఆధోరణి మానుతాడేమో...అయినా చూస్తాడో, లేదో, నని, ఆలాగే, గుమ్మంలో నిలుచుని ఉన్నది, కర్టెన్ సగము తొలగించి...

'...ఎవ రామహానుభావుడు?...'

ఆయన ఆమెవంక చూడకుండా, తన ధోరణిలో తా నున్నాడు...ఇక లాభంలే దనుకుని ఆమె...ఆలా పలుకరించింది...

ఆయన వెంటనే జవాబు చెప్పకుండా...సావకాశంగా ఆమెను లక్షించి తరువాత, మరీనిదానంగా చిరునవ్వుతో...

'జయదేవుడు...' అన్నాడు...

'ఓస్...ఆత డటండు...అంటే... ఏజయదేవుడు?...పద్మావతి మగడే కాదూ?'

—అవునని తలఊపాడు ఆయన నవ్వుతూనే...

"నిజమే...ఆయన కేం...ఏదో పూర్వజన్మాన సుకృతం చేసుకున్నాడు గనుక ఆలాటి భార్య లభించింది...అంతేకాని ఆయనప్రయోజకత్వం ఏముంది?... అదంతా ఆ మెపుట్టింటివారి ఆస్తి...అనుభవించడానికే ఆయన...స్త్రీవిత్త మథమాధమం...ఏమిటి ఆయన గొప్ప ఇక?

'ఏం?'

'ఏముంది. ఆమె లేకపోతే ఊరా, పేరా... మిస్టర్ పద్మావతి అనే ఏమన్నా ఆయనకు గౌరవం ఉంటే!'

'...ఆమహాకావ్యం...'

'ఆమె...ఆపద్మావతి రచించింది...లేకపోతే ఆయనతరమా'—

'అలాగేం...'

'కాదేం, మరి: అయినయింటి పిల్లకనుక, ఎంత అప్రయోజకుడయినా, ఆతన్నే ఆశ్రయించుకుని, ఆతనికి గౌరవం తెప్పించాలనే ప్రయత్నించింది...పెండ్లాం వ్రాసిన కావ్యాన్ని తనదునమ్మా అంటూ తనపేర పెట్టించుకున్నాడు...చేసుకున్న భార్య ఎంత గుణవంతురాలైనా...అంతలోకువ...అయినా తిరుగపడదుకదాఅనే దిలాసాకూడా ఉందికాదూ...హిందూ ధర్మంట! మొగవాడికి ఓధర్మం...అదే ఆడదానికి అధర్మం...ఏం న్యాయమో!'

'అయితే గీతగోవిందం స్త్రీధన మన్నమాట'

'ఆఁ...నికరంగా...అయినా ఆమాట అందులోనే ఉన్నదికాదూ'

'ఏమని?'

'జాగ్రత్తగా చదివితే...నిష్పక్షపాతంగా ఆలోచిస్తే...తెలుస్తుంది...ఓమాదిరిగా చూస్తే జయదేవుడూ అమాయకుడే...గ్రంథంలోనే వ్రాయించుకున్నాడు కాదూ...'పద్మావతీ చరణచామరచక్రవర్తీ' అని...ఇంకా అంతకన్న విశదంగా...విపులంగా. ఏలా చెప్తాడూ—పెళ్లాం కాళ్లుపిసికి...అంత పెద్దవాణ్ణయినానని...సర్గాంతాన కృష్ణదాసునని చెప్పుకున్నాడు కాదూ మరి...పోనీ పద్మావతికి ఇంకో పేరు కృష్ణ అని విన్నారా...?'

'లేదు...'

'సరే...మీకు కావాలిసిన సంగతులు ఏవీ తెలియవు!—ఇప్పటికన్నా తెలిసిందా...గీతగోవిందం వ్రాసింది...వ్రాయగలది స్త్రీయేనని—'

'ఆలాగేం'

'అవును. మీసంస్కృతకవులలో ఎంతమంది భార్యలవల్ల పయికివచ్చినవాళ్లున్నారు!...రాజశేఖరుడు...ఆతనికి ఓనమాలన్నా వచ్చా?...అవంతిసుందరి వ్రాసిన నాటకాలుకావండీ అవన్నీని...'వాచస్పతి మిశ్రుడు...సరే భామతిసంగతి చెప్పనే అక్కరలేదు కదా...లీలావతిగణితం భాస్కరాచార్యులేనా రచించింది—లోకంలో ఇప్పుడు కూతుళ్లసొమ్ము తిన్నారంటేనే విని ఆశ్చర్యపడుతున్నాం...సాఫుగా గ్రంథమే కొట్టేసి తనపేరు పెట్టుకుంటే...ఇక ఏమిటి ఆమహానుభావుణ్ణి చేసేది?...'

'ఇదో కొత్తసిద్ధాంతంలాగా ఉందే'

'మాటకు అడ్డం రామోకండి...కాళిదాసును తీసుకోండి...మీవాడనే అభిమానం విడిచి ఆలోచించండి, ఆకావ్యాలు, నాటకాలూ, విలాసవతి రచించిందో, లేక ఆతడేనో...'

'సరే...ఇంతకూ నీవు అనే దేమిటి?'

'కవిత్వం—చిత్రం—శిల్పం—ఇంత ఎందుకూ, ఏరమణీయమైన కల్పనన్నా, సృష్టిఅయినా, ఆడవాళ్లు చేయాలి...పురుషు డెవరండీ—ఆతనిచేత నేమౌతుందండీ...'

'మరి...కొన్ని పురుషులు రచించినవికూడా ఉన్నవికాదూ?'

'కాదు...సృష్టిలో, నూతననిర్మాణానికి సామర్థ్యం వినియోగించకలది...అసలు ఉన్నది...స్త్రీయే. స్త్రీ ఒక్కతే...కొన్ని స్త్రీలపేరుతో ఉన్నాయి...కొందరుస్త్రీలే, ఏమొగుడో, తండ్రో కాజేస్తాడేమోననే భయంతో, చాటుగా కావ్యరచన చేసుకుంటూ, మరోమారుపేరు...ఏమాఘుడనో, భవభూతనో పెట్టుకునేవారు...'

'నిజంగా'

'అవును...నేను సప్రమాణంగా రుజువుచేస్తాను...ఈకవులు, శిల్పులు, చిత్రకారులు...అందరూ స్త్రీలేనని...'

'ఆఁ...'

'అప్పటికికాదు...ఇప్పుడు మాత్రం...ఎంతమంది మొగవాళ్లు పత్రికలకు ఆడపేరున వ్రాసి పంపుతూంటారు...లేకపోతే తమ గచనలు ఎవరూ ఆదరించరని...అందుకనే చూడండి...పరువుగల ఆడది ఈరోజుల్లో తనపేరున ఏమీ వ్రాయదు...సాధారణంగా మొగపేరు పెట్టుకుని గౌరవం నిలుపుకుంటున్నారు...ఆడపేరున్న ఏవ్యాసమన్నా...పద్యమన్నా...చిత్రమన్నా బాగుంటుందో ఏమోచూడండి...ఎందుచేతంటే అవన్నీ ఆడపేరు పెట్టుకుని మొగవాళ్లు చేసే పనులు...'

'నీసిద్ధాంతాలతో ఉక్కిరిబిక్కిరవుతున్నాను. నా కోసందేహముంది, అడుగనా?'

'ఊఁ...'

మరి నీకు చాలా పేరున్నదికాదూ...నీవు పేరు మార్చుకోలేదేం...నీవు స్త్రీవా...పురుషుడవా...?'

'మీకెందుకూ... నా సంగతి?'

'నీవు ఎవరలైతే వాకేం...నీభర్త నయినందుకు నాకు గౌరవం వస్తూందనే సంతోషం...'

'చాల్లెండి...మీరు ఎప్పుడూ ఇంతే...'

... ... ... ...

'దయచేయండి శాస్త్రిలుగారూ!'

అని లేచి తాను కూర్చున్న కుర్చీ ఆయనకిచ్చి తాను మరోట కూర్చున్నాడు. ఆ వచ్చినపండితుడు సావకాశంగా కుర్చీలో కూర్చుని, శాలువ అంచు సరిగా పైకి కనపడేటట్టు అమర్చుకుని, గడ్డం సవరించుకుంటూ—

'రేపు ఆచార్యజయంతికదా... తాము శ్రమతీసుకుని ఉపన్యసించాలని కోరడానికి వచ్చాను. దీక్షితులుగారు, మీరు అంగీకరించక తప్పదని చెప్పుతున్నారు...'

అన్నాడు...

ఆయన ఆశ్చర్యపడుతూ...

'మీలాటివారందరూ, నన్నింత అన్యాయంచేస్తే ఏలా? మీరు నిలుచున్నచోట నిలువడానికికూడా నాకు అర్హత లేదే? నాయందుండే వాత్సల్యంచేత దీక్షితులుగారూ, మీబోటి పెద్దలూ, అభిమానించడమేకాని...ఈ శిష్యుణ్ణి మరీముందుకు తీసుకరామోకండి...'

అన్నాడు వినయంగా...

'నాయనా! మీరు నాకన్న చిన్నవారైనా, జ్ఞానవృద్ధులు...మాకు అందని అనేకాంశాలు మీరు సులభంగా గ్రహించగలరు. మీ మేధాసంపత్తి ఆలాటిది. మీరు నిరాకరించరనే కోరుతాను....మీ రందరూ వృద్ధిలోకి వస్తూంటే చూడటంకన్న మాకు వేరే కావాలిసింది ఏమున్నది...అన్యథాగా ఎంచుకోకుండా, తప్పకుండా ఒప్పుకోవాలి...'

అని ఉపన్యసించాడు ఆశాస్త్రిల్లుగారు...

!...అహో స్థిరభల్లుకస్య మంత్రోపన్యాసః;... పరిహాసకుశలతాచ...'

—శాస్త్రిల్లుగారు తెల్లబోయినాడు...కోపం వచ్చింది...లేవబోతున్నాడు...

ఆయన ఏమి పలించకుండానే శాస్త్రిల్లగారితో...

'నాభార్య అండీ...మురారి చదువుతున్నది...' అన్నాడు...శాస్త్రిల్లగారు కొంచెం శాంతించి లేచే ప్రయత్నం మానాడు...ఆయన ఏదో సంభాషణ మొదలుపెట్టబోతున్నాడు, ధోరణి మార్చడానికి... బాబు పరుగెత్తుకునివచ్చాడు ఇంతలో...

'చూడు మామయ్యా! అత్తఎందుకో...ఏలా నవ్వుతూందో' అని శాస్త్రిల్లగారివంక ఓక్షణం చూసి...బిగ్గరగా నవ్వి...

'నిన్ను చూసే...అత్త నవ్వుతూంది...' అని నవ్వుతూంటూనే లోపలికి పారిపోయినాడు:

శాస్త్రిల్లుగారు సెలవుదీసుకోకుండానే వెళ్లిపోయినాడు...

ఆయన ఏమి అనకుండా కూర్చునేఉన్నాడు: లోపలనుంచి నవ్వు వినపడుతూనేఉంది...

కొంతసేపటికి, బాబు ఆమెను అక్కడికి లాక్కునివచ్చాడు...ఆయన కుర్చీదగ్గరగా ఆమెను తీసుకునివెళ్లి...

'చూడు మామయ్యా...తాను మహాబాగుంది కాబోలు...ఎల్లా నవ్వుతూందో చూడు...—అత్తా! నీవు ఆలాగే ఉంటావులే ముసలాడవై...శాలువ కప్పుకుని...గడ్డం మీసం అతికించుకుని...'

ఆమె బాబును కొట్టపోయింది...—తప్పించుకుని పారిపోయినాడు.

'—ఇప్పటికన్నా తెలిసిందా మురారి ఆడదో...మొగవాడో.'

అన్నది నవ్వుతూ ఆమె: ఆయన చిన్నబోయినాడు...

౩

'...ఆశారద చంద్రికాముంచహాసాల్లో— ఆకిరణామృతవృష్టిలో—యమునా సైకతస్థలాల...రహః ప్రదేశాల ఆ ఆనందమయుడు మురళి మ్రోయించితే, లోకాలన్ని మారుమ్రోగవా ?...ఆవిశ్వమోహనమూర్తి పల్ల

వించితే, స్పష్టంతా పల్లవించదా...ఆవల్లవీపల్లవుడు... ఆరాధాలోలుడు...ఆ...'

...తెల్లని పాలవెన్నెల...హాయిగా చల్లనిగాలి. ...తల దిమ్మెక్కేట్టు పన్నీరుపూల వాసన—కిటికీ దగ్గరగా, వెన్నెల మీద పడేటట్టుకూర్చుని, ఆమె ఏదో వ్రాసుకుంటూంది.

వంచినతల ఎత్తకుండా గంటకుపైగా ఆమె అలాగే ఉన్నది. కలము సాఫీగా, చకచకా నడుస్తూంది. కాగితాలన్నీ క్రమంగా జ్యోత్స్నారూపాల్ని వీడి కళంకాంకితము లై పోతూన్నవి...శచీవల్లభునిలాగా...—రాధాకృష్ణులు కలుసుకున్నారు. ఏలాగైతేనేం యమునా తీరాన...ప్రణయకోపాలూ, పరిహాసాలూఅన్నీచాలించి ...ఒకరికౌగిలిలో ఒకరు చేరబోతున్నారు...

మనసులో భావాలు ఎంత ఉబుకుతున్నా, ఇక కలముపట్టడానికి విసుగనిపించింది ఆమెకు. కాని వ్రాస్తూన్నది ఆఖరుకానిది, వదలివేయ బుద్ధి పుట్టడంలేదు... అప్పటికిమటుకు—ఏమీ ఆలోచన తెమలక—దీపం చాలా తగ్గించేసి వెన్నెలలో కూర్చుంది విశ్రాంతిగా.

అక్కడనుంచి చూస్తే తోట చాలావరకు కనపడుతూంది...కొంచెం చలిగా ఉన్నా. ఇక అక్కడ కూర్చుండటానికి మనసొప్పిందికాదు. కాస్సేపు బయట తిరిగితే బాగుంటుందనుకుని, లేచి క్రిందకు రాబోతున్నది, రాధాకృష్ణుల ప్రేమగాథను, ఆనాటి కక్కడికి ఆపివేసి.

శాలువ వేసుకున్నది...అద్దంలో చూసుకుని బాగుండలేదనుకుని మళ్లా తీసివేసింది...ముంగురులు చెరిగినట్లుగా తోచి చక్కగా సవరించుకున్నది...ఇక వెళ్లుదామని అక్కడనుంచి కదిలి...

—నిశ్చలంగా అలాగే నిలువబడిపోయింది... మొదట కొంచెంసేపువాకా, నమ్మలేకనే పోయింది... భ్రాంతి యేమో ననుకున్నది...వెన్నెలమాయ లేమో... తనకన్నులే మోసంచేస్తున్నా యేమోనని చాలా ఆలోచించింది...పోనీ, నిజమైనా...ఆయన కాడేమో... అవిశ్వాసఘాతకుడు...

—నమ్మలేక, నమ్మలేక...నమ్మక తప్పనిసరిగా నమ్మింది...మరెవరూ కారు...ఆయనే...ఇక...ఆమె!

ఆయన, ఆయువతిని...కౌగలించుకోడం స్పష్టంగా చూసింది...ఎన్నాళ్లనుంచో, ఈ...ద్రోహము!... తాను కలలోనైనా తలచలేదే...ఆయన మరొక ఆమెను వరిస్తాడని...వరించాలనే ఆ'యావ'...ఆసామర్థ్యం ఉన్నదనిఅయినా అనుకోలేదే—అంతస్వేచ్ఛగా తన కళ్లఎదుట, తన యింటిలో...తనతో అనుభవించాలన్న ఆప్రణయమంతా, మరొక్కతెతో అనుభవించడానికి సాహసిస్తున్నాడా?...తనమీది కోరికెలు, తాను...తానే తీర్చవలసిన కోరికలు...ఎవతెయో స్వైరిణి తీరుస్తూన్నదా......ఇంత కాపటికుడా, ఆయన...?

ఇక చూడలేకపోయింది...ఆఉద్రేకంలో తానేం చేస్తున్నదీ తెలియకుండానే గబగబ క్రిందికి దిగివచ్చింది...

'అత్తా! ఇంకా వేళ కాలేదూ?...అని అడిగాడు అడ్డంవచ్చి బాబు...

ఆమెకు కోపం ఇనుమడించింది...ఆపిల్లవానికేమీ బదులు చెప్పకుండానే, ద్రోవతప్పుకునేటట్టు ఆపసివాణ్ణి తోసివేసి, తాను ముందుకు దూకింది...

'అమ్మా! అప్పుడే బయలుదేరుతారా!' అని చాలా వినయంగా ప్రశ్నించాడు షావ్కార్, మెట్లు ఎక్కుతూ ఆమెకు ఎదురుపడి...

'—అసలు వెళ్లము...నీ వింకావెళ్లిపో...'అని గర్జించినట్టుగా జవాబుచెప్పి అక్కడ నిలువకుండా పోయింది...ఆతడు తెల్లబోయినాడు, ఆమెధోరణి అర్థంచేసుకోలేక...

ఏలా అక్కడకు చేరుకున్నదో, ఆఉన్మాదపు ల్యావస్థలో ఆమెకు తెలియనే లేదు...

'చలి వేస్తూందికాదూ'...అని ఆయనమాట వినబడ్డది—

ఆమె, ఆయన్ని చూడనేలేదు...మాట విని చప్పున ఆగిపోయింది...కోపభరంచేత మాటాడనూలేక పోయింది...కాని ఏలాగైనా పక్కా ఖండితగనుక...

'సరససల్లాపాలకి చలిగా ఉంటేనే బాగుంటుంది కామా ?'

అన్నది ఓరగా ఆయన్ని చూసి.

'ఆలాగేం!' అన్నాడు ఆయన ఆఅమాయకపు... మామూలు ధోరణిలోనే.

'నేను మీఏకాంతానికి భంగం కలిగించాను, తెలియక...మీరు, దేవితో కూడియున్నారని అనుకో లేదు...మన్నించండి...ఏదీ...ఆసాధ్వీమణి!...'

ఆయన ఏమీ మాటాడలేదు...

'ప్రణయకోపమా ఏమిటి చెప్పరేం...జడతో వీపు కందేటట్టు సత్కారాలు జరిగినాయా?...అసలు ...పోనీ...జడఉన్న నాయికేనా...'

'నాయికకు వాలుజడ ఉండాలనే నియమం ఉన్నదా ?'

....................................

'ఎవరానాయిక...ఇంతకూను' అన్నాడా యన...

'ఎంత అమాయకులు!...తెలియకుండానే కౌగలించగలిగారు...మీప్రియురాలుకూడా...తన బాహు లతను...కోమల బాహువల్లరిని...మీ మెడకు పెనవేసిందా...'

ఆయనకు అర్థం కాలేదు...

'అమ్మ! ఎంతవారండి...మీ వేదాంతమంతా ఇందుకేనా...ఎన్నాళ్లనుంచి, ఈవ్యాసంగం...నూతన ప్రణయమా, ఏమిటి ?'

'ఏమిటి ఈభావకవిత్వం ?'

'నేను చూడలేదనుకున్నారేం...పాపం ఎన్నటికైనా బయటపడకమానదు...ఎవరు ఆమె... చెప్పండి ?'

'ఎవరు...ఆమె ?'

'నన్ను మోసగించలేరు...నేను చూశాను... ఎవరో...చెప్పండి...తప్పదు...'

'ఎవరు ?'

'చెపుతారా, లేదా ?'

'ఏమని ?'

'మీగడుసుదనం చాలించండి ... ఎవరు ... ఆమె...ఎన్నాళ్లనుంచి మీ కీస్నేహం...'

'ఆమె...?—ఆమె ఎవరో నీవే చెప్పు మరి విసిగించక...తరువాత స్నేహంసంగతి నీకే తెలుస్తుంది...'

ఆమె తాను చూసినదంతా చెప్పింది... కోపంగా

'చెప్పితీరాలి...తప్పదు...' అన్నది...

ఆయన నవ్వి...

వెన్నెలలో, నీవు పొరబడిఉంటావు...ఎవరూ లేరు...నాకు...నాకుతోడు ఒకప్రియురాలుకూడా నా...ఈఛాందసుడికి—బలే...'

అన్నాడు...

ఆమె అంతటితో ఊరుకోక,

'నేను చూశాను...వెన్నెలలో నే మిమ్మల్ని చూసినప్పుడు...మీవద్ద ఎవరున్నదీ లేనిదీ...మీరు ఒంటరిగా ఉన్నదీ కనబడదేం...' అన్నది...

'నేను...నీవు నమ్మినా, నమ్మకపోయినా సరే ... ఒక్కడనే ఉన్నాను ... వెన్నెల మాత్రం ఉన్నది...'

'వెన్నెల, మిమ్మల్ని కౌగలించిందా ?'

'ఏమో...లేక...నిజంగా నేను నీవన్నంత రసికుణ్ణి అయితే...ఏదేవకన్యఅయినా నాకు కనబడకుండానే కౌగిలించుకుందేమో...ఈమారు ఎన్నడయినా నాకు ఆమె కనబడితే నీవు అడిగావని చెప్పనా... అయినా నీకు కనబడి, నాకెల కనబడలేదో...'

ఆమె నవ్వింది...

'ఎంత తెలివిగా మాట్లాడుతారండీ...మీమాట నమ్మాలిసిందేనా; నాకళ్లనే నేను నమ్మకుండా?'

'కౌగిలించినదన్న...ఆకన్నె...కనబడనే లేదు .. నీవు అనుగ్రహించరామా?'

ఆమె సిగ్గుపడ్డది...

'రండి...చాల్లెం మీపరిహాసాలు...నాటకానికి వెళ్లాలన్నమాటే మరచిపోయినారా...అన్నట్టు కారు మీరే నడపాలి...వాణ్ణి వెళ్లిపొమ్మన్నాను...ఇందాక కోపంలో...'

'మహాప్రసాదం'

... ... ...

'చాలా బాగుందికాదండీ...నిజంగా వ్రాసినవారెవరో?...ఎవరండీ ఆమహాకవి?—అప్పుడే నిద్ర వస్తొందా?—అంత చక్కని నాటకం చూసినతరువాత కూడా నిద్ర యేమిటండీ...అబ్బ...మేలుకుందురూ... పాటలు చాలా బాగున్నాయికాదూ?...ఆ ఆడవేషం వేసిన అబ్బాయి చక్కగానే పాడాడండీ...వేషం వాడిమొగంలాగా ఉన్నా......'

'ఏమిటో...ఈజగమంతా నాటకమేకాదూ?'

అన్నాడు ఆయన నిద్రమబ్బుతో...

'అయితే...ఎందుకు వచ్చారు, మరి ఈనాటకం చూడటానికి...ఏంవేదాంతమండీ...పోనీ, జగన్నాటకాన్నయినా, మేలుకుని చూడండి......'...

✂

'...అతికర్కశతర్కశతక్షుభితక్షుపితక్షపణక్షణభంగపదమ్.'

'ఇక చాలించండి-మీవేదాంతం మోతతోనే తల దిమ్మెక్కిపోతూన్నది...ఎవరండీ, ఆకవి?...'

'అప్పయ్యదీక్షితులు.'

'...దీక్షితదవానలదుర్విదగ్ధం సాహిత్యమ్... ఈతడే కాడండీ...పళ్లూడిపోయినతరువాత చెప్పే కవిత్వమంతా ఈలాగే ఉంటుంది...కరకరా నమలడానికి పళ్లు లేవుగనుక, కటుక్‌కటుక్‌మంటూ కవిత్వం అల్లాడు...నోటిరుచికోసం...'

'ఆయన చాలా గొప్పవాడు.'

'పోనిద్దురూ...మీరూ అంత గొప్పవారు కారూ ...ఆధోరణి కాస్సేపు కట్టిపెట్టండి...నాకో సందేహం వచ్చింది...'

'నీసందేహాలు ఎన్నడూ నాదగ్గరకు రావడం మామూలు లేదే.'

'చెప్పండి...నేను కళ్లకి జోడుపెట్టుకుంటే ...బాగుంటానా?'

'ఇప్పుడు నాకూ ఓసందేహం వచ్చింది—నేను చీర కట్టుకుంటే ఇంకా అందంగా ఉంటానా?'

అన్నాడాయన నవ్వుతూ...

'బాగుంటారు...ఏం...చివరకి వేదాంతం చీర కట్టుకోవడంలోకి దిగుతూందా?'

'కవిత్వం ...కళ్లజోడుమీద బుద్ధి పుట్టిస్తూంటే...నాకు చీరమనసు కాకూడదేం?'

ఆమె, ఇక అక్కడ నిలువకుండా చివాలున వెళ్లిపోయింది...'

... ... ... ...

'నేను...మీ ఎదుట బడి చెపుతున్నాననుకోకండి...

చెప్పడమే మంచిదనుకుంటాను...ఒకరిని ప్రేమిస్తున్నాను...మాటకు అడ్డం రాకుండా తిన్నగా వినండి...ఆయనలో ఉన్న ఆఅద్భుతశక్తిని...ఆయన వైదుష్యాన్ని...ఆయన రసజ్ఞతను...ఆ ఔచిత్యాని... ప్రేమిస్తున్నాను...మీకు సమ్మతమేనా'

భోజనానంతరం వసారాలో పచారుచేస్తున్నాడాయన మినుకుమినుకుమనే చుక్కలనంక చూస్తూ... ఆమె తాంబూలం నములుతూ, ఆయనకు వక్కలూ, ఆకులూ అందిచ్చి...ఈసంగతి తడబాటులేకుండా చెప్పేసింది...

ఆయన ఏమీ కలవరపడలేదు. అలా నెమ్మదిగా తిరుగుతూ...చిరునవ్వుతో, మామూలుమాదిరిగానే... శాంతంగా—

'సరే' అన్నాడు...

'ఎవరో తెలుసునా'

'ఎవరు—ఎవరో, నాకెందుకూ తెలియడం?...

'పోనీండి—చాలా చక్కగా కథలు వ్రాస్తాడండీ ఆయన...పేరు నాకూ తెలియదు...ఓం...అని సాధారణంగా పడుతూంటుంది ... ఆయనఎవరో ... ఆయనదర్శనము చేయాలి...'

'ఓం...అంటే...'ఆయనే'...అనగా మగవాడనే ఏలా...నీసిద్ధాంతం ప్రకారం, ఏసౌభాగ్యవతో కావాలికామా మరి...'

'కాదులెండి...నామనసుకు తెలుసు...తప్పకుండా ఆయన...పురుషుడే...మాయిద్దరికీ ఏదో జన నాంతరసౌహృద మనుకుంటాను...ఆయనభావాలూ, పోకడలూ, అన్నీ నాకు చాలా తెలిసినవిలాగా...నే నెన్నడో విన్నవాటిలాగా...కనబడుతూంటాయి... నేను, ఆయనను ఎంతో ఎరుగున్నట్టుగా అనుకుంటూం టూను...ఎవరో...ఎన్నడు చూస్తానో...మీరు... నాకు సాహాయ్యంచేస్తారా...'

'అయితే...నీవు మరోవిషయం ఆలోచిం చాలి...ఓం...అన్న సాంకేతికం, ఒక్కడినే నిరూపిస్తుందని ఏలా?...'ఓం'...లో త్రిమూర్తుల అంశలున్నాయి...అందుచేత నీ'ఓం' కూడా అంతేకావూడమూ...అప్పుడు నీవన్నట్లు...ఆముగ్గురిలో ఉంటే అద్భుతశక్తిని కలియవేసి ప్రేమించాలిసివస్తుంది...'

'మీపరిహాసాల కేం?—మీకు సమ్మతమైనా... కాకపోయినా ... నేను—ఆయనను—ప్రేమించాను... తెలిసిందా?'

'మంచిది 'క్షేప్తుం చింతామణిం పాణిలబ్ధ మబ్ధా యదీచ్ఛథ'......గం పెడుకవిత్వం కొద్దుకుల్నీ కూతుళ్లనీ ఎత్తి...కలకాలం సుఖంగా వర్ధిల్లండి...ఆఅద్భుత శక్తి...నీప్రాను.'

... ... ...

'ఎన్నాళ్లకు!—ఎన్నాళ్లకు నానోము ఫలించింది!—'

'ఏం—విశేషం?'

'చూడండి...ఆయన ఉత్తరం వ్రాసారు... తన క్రొత్తపుస్తకాన్నికూడా పంపించాడండీ...'శిరీషమాల'ఎంత చక్కని పేరో...అంతచక్కని పేర్లు ఊహించగల...ఆయన...ఇంకా ఎంతచక్కగా ఉంటాడో...నేను ధన్యురాలనండి...నా ప్రేమను...ఎవ రేమన్నా సరే...వెల్లడిస్తాను ఇక...కొంతకాలము ఆయనతో కలసిమెలసి ఉండాలని ఉంది...?'

'పూర్తిగా సగుణోపాసనలోకి దిగుతున్నావు'

'విశుద్ధమైన ప్రేమకు కళంక మేమున్నదీ... రాధలాగా, నేనూ....నామనోనాయకుణ్ణి....ప్రేమించాను...ప్రేమిస్తాను...'

... ... ...

'—నేను మిమ్మల్ని వదలివెళుతున్నా ననుకోకండి—ఎన్నటికైనా ఈలా జరగాలిసిందే...మన దోవలు వేరు—మన ఆలోచనలువేరు—మన...అదృష్టాలు వేరు—నేను అగ్నిసాక్షిగా...మీభార్యను... కాని నామనస్సు...దానికి అధినాథు డింకొకరు... వెళ్లనా...'

'మానసికంగా ప్రేమిస్తూ...నీవు వెళ్లడ మెందుకు?...మనుసును పంపివేసి నీవుండిపోరాదు... ఒక్కతె వెళ్లగలదు లే...'

'నీమనసు తప్పిపోదు ఎక్కడాను...'

'అవును...నే నభిలషించేది ఆయనసాన్నిధ్యం...'

'చెప్పవేం మరి...అయినా, చేత్తో కథలు వ్రాస్తూ...నోటితో ప్రేమ...ప్రేమ...అని చెపుతూ ...చివరకు మనసుతోనా ప్రేమించేది?...'



౧౦. గొల్లవాని మంటపము



౧౧. రాతిస్తంభముపై నొక హరిదాసు

'మీరు నా ప్రేమను అర్థం చేసుకోలేరు...'

'కొన్ని పాఠాలు చెప్పి వెళ్లరాదూ?...విద్యాదానం చేసినదాన వవుతావు...ముందుకు ఎన్నడైనా అక్కరకు వస్తాయేమో కూడాను...'

... ... ...

'ఎందుకూ...ఎందుకూ...అలా విచారిస్తావు?... 'కలకంఠికంట కన్నీ రొలికిన...'అని చిన్నప్పుడు పెద్దవాళ్లు బెదురు పెట్టేశారు...నన్ననుగ్రహించి మానేద్దూ...ఏమిటీ విచారానికి కారణం...చెప్పవూ?

'విచారమా...నాకీ ప్రపంచంలో విచారకారణమేమున్నదండీ...చూడండి...'శిరీషసుమాల' నాకే అంకితము చేశాడు...నా జీవితము ధన్యమైందండీ!... ఆయన...నా మీద...ఈ దీనురాలిమీద ఎందుకండీ ఆయనకు అంతదయ...నేను అర్హురాల్నా ఇంత గౌరవానికి...'

'నీకు ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా కష్టమే...ఇంతా సంతోషమేనా?...'

'మీకు విచారమా?'

... ... ... ...

'ఎప్పుడు వెళ్లడం?'

'ఎక్కడికి?'

'నీమనో...'ఆయన' వద్దకు...'

'...నాయిష్టం వచ్చినప్పుడు......'

'మరి...ఆయనకు...ఇష్టమేనా?'

'మీ కెందుకూ?'

'అత్తా!...మామయ్యను కొడుతావు కాదూ... చూడు ఏం చేస్తున్నాడో...'

'ఏం చేశారూ...?'

'మరే...నీవు వ్రాసుకుంటూనే...అలాగే చిన్న కాగితాలమీద తానుకూడా...రాసేస్తున్నాడు...'

'ఏమిటి...? ఉత్తరమా?'

'ఉత్తరం కార్డుమీదకాదూ రాసేది...చిన్న ముక్కలమీదే...ఏమిటో పిచ్చిరాతలు...'ఆఅమ్మాయి తలలో...మల్లెపూల చెండు...జారి పడిపోయింది...' ఎందుకు అత్తా! అలా రాయడం?

'ఏమో......'

'ఇంతేనా...నీకు తెలియదూ...పోనీ ఇంకోటి చెప్పుకో చూద్దాంమరి...మామయ్యపే రేమిటి?'

'నీకు తెలియదూ?...'

'ఆపేరు కాదు ..ఇంకో కొత్తపేరు...'

'నాకు తెలియదు...కొత్తపే రేమిటి...'

సరేలే...నీకు ఏమీ తెలియదు మరి...నేను చదవలేదని...నాకు ఏమీ రాదని నన్ను కోప్పడుతావుకాదు...మామయ్య పేర్లు తెలియదు...ఏంరాసేదీ తెలియదు...

'పోనీ నీవు చెప్పవూ!'

'ఊహుఁ...'

... ... ... ...

'ఈలా ఓమారు రావూ?...' అని పిలిచాడు ఆయన...ఆమె వినిపించుకోకుండా వెళ్లిపోతూంది... ఆయన పరుగెత్తుకుని వెళ్లి పట్టుకున్నాడు...

'నేను పిలిచాను...వినపడలేదూ?...'

అని నవ్వుతూ అడిగాడు ఆయన...

ఆమె తలవంచుకున్నది...కళ్లవెంబడి జలజల నీళ్లు రాలుతున్నవి...

'నన్ను క్షమించ ... ఊహు ... నాఅపరాధాన్ని...నన్ను ఎన్నటికైనా మరచిపోగలరా...ఎన్నడన్నా దయతో...నన్ను తలుచుకుంటారా...నా మాట అనుకుంటారా?...'

'ఏం విశేషం...నిన్ను మరచిపొమ్మన్నావా?'

'సెలవా...నన్ను మన్నించండి...'

అని ఆయనపట్టు వదలించుకుని ముందరికి పోబోయింది...ఆయన ఆమెను ఆపి...

'ఏమిటి అపరాధం?...ఎక్కడకు వెళుతావు?...' అని అడిగాడు

'స్వర్గానికి...ఊహు...కాదు, నరకానికి'

ఆయన నవ్వాడు...ఆమె ఇక దుఃఖ మాపుకో లేకపోయింది...

—ఆయన, ఆమెను చేరదీసి సమాశ్వసించాడు...

'నీ వేంచేశావు... నేనూ కథలు వ్రాయకుండా ఉండలేకపోయినాను...కాని...నీఅంత బాగా వ్రాయ లేను...నీపేరు...ఫలానాఆయనభార్య అని...చెడగొట్టట మెందుకని...ఏదో...పేర వ్రాస్తూన్నాను...'

'ఇంకా నన్ను...మన్నించరూ...ఇక నేను కలంపట్టను...మీ—మీ భార్యను అవుటమాత్రం చాలు... అంతగౌరవానికి నోచుకున్నందుకే...ధన్యురాల నయినాను...'

'కాదు...నేను ఇక వ్రాయను...నీవు...నీవే ఇందుకు తగినదానవు...లోకంఅంతా గౌరవిస్తూంటే... నిన్ను...చూసి సంతోషిస్తూంటాను...'

'అంతకన్న మంచిపేరు దొరకదనా?...'ఓం' అని పేరు పెట్టుకోవడ మెందుకూ?'

'చెప్పలేమూ...నీవూ...నేనూ...బాబు...మన ముగ్గురం కలిసి...ముక్తసరిగా...ఏమవుతాము...'

* * * * *

'మామయ్యా!...మరిచిపోయినా...ఓం...ఓం' ...ఓం...'

'ఏం పొగురు రా...తన్నులు కావాలా... అన్నది ఆమె...

'నీవు ఎందుకు...నీకో కూతురు పుడితే...వాడికి యిస్తావుకాదూ...అప్పుడు...మనపిల్లే వాణ్ణి తంతుంది.'

'చూడు, అత్తయ్యా!...'

ఏం...అత్తయ్య చూడట మెందుకూ...నన్ను ఓం...అంటే నే నూరుకుంటానేం...పోనీ నే నూరుకున్నా...రేపు మాఅమ్మాయి ఊరుకుంటుంది...మా నాన్నను ఎందుకన్నావని నిన్ను పట్టుకుతంతుంది...'

'నీవు కొట్టవుగద...మామయ్య...ఓం...'

'ఆ...మామయ్య...ఓం...మామయ్య కూ రు గీం...దాని మొగుడివి నీవు...ఢాం...'

---




## దిబ్బిపోలేరమ్మ

శింగరాజు వెంకటరమణయ్యగారు

అనంగ అనంగ వొకవూళ్లో ఒక అత్తగారుండేది. ఆవిడ బహు గడుసుమనిషి. కోడండ్లు యేడుమంది—అందరు కాపురానికి వొచ్చినవారే—కొడుకు లందరూ అమ్మకే పెత్తనం కట్టేశారు. అందుచే లక్ష్మీసరస్వతుల సరసము ననుసరించి సహజక్రౌర్యము అత్తగారికిని, కోడంట్రకముతోగూడ మహాపాతకము లారనియు, వ్యసనములు యెనిమిదనియు లెక్క—బెట్టుకొనుట కోడండ్లకు యేర్పడింది. తుదకు అన్నపానాలకుగూడా రాపిడి పెడుతుంది ఆ అత్త. మానవతులుగనుక పాపము భర్తలకు చెప్పేవాండ్లు గారు, కోడళ్లు. అందుచే కొడుకుల కేందెలుస్తుం దీగొడ వంతా—మనలో మనమాట అనుకుందాంగాని.

కొన్నాళ్లు గడిచిం దీమాదిరే. ఒకనాడు కడగొట్టుకొడు క్కెట్లాగో తెలియవచ్చిం దీ సంగతి. ఏంజేశా డనుకున్నా రామైన "వది నెల్లాల, పప్పు బియ్యం యిస్తాను. రాత్రి మాయమ్మ నిద్రబోయినపాట్ల వండుకొని లక్షణంగా తినండి" అన్నాడు. "సరే నాయనా" అన్నారు—కూటికి మొహం వాచివున్న కోడండ్లు.

సరి సామ్రగితెచ్చియిచ్చినాడు. ఎవరూ? చిన్నమరిది. పెద్దవదినె అత్తగార్ని నిద్రబోనిచ్చి వంట యావత్తు చేసింది. తినబొయ్యేటప్పటికి జ్ఞాపకం వచ్చాయి, నెయ్యి, కంచాలు. పరవాలేదు నెయ్యివద్దని ఒకరు, కంచాల్లేకుంటే గుడ్డలో దిందామని మరొకరు. అత్త లేస్తే ఆపిడిచెడు మెతుకులుకు గడ్డ పడుతుందని వొకకోడలు, యీమాదిరిగా వున్నారు. అందులో చిన్నకోడలు—కడగొట్టుది ధైర్యంగా అత్తగా రుండే యింట్లో కెళ్లి నేతిదుత్త నెత్తినబెట్టుకొని నాల్గుకంచాలు చంకలోబెట్టుకొని మళ్లి రావటంలో ఘల్లుమని చప్పిడయింది—గ్రహచారం చాలక. "ఎవ రక్కడ? ఎవ రక్కడ?" అని లేచిం దావిడ ఆర్భాటంతో. ఇహం నేం జెప్పమన్నారు, కోడలికి పడుకు పుట్టింది. అయినా ధైర్యంతో కొంతసేపు 'హుహూహూ' అని వూగి "నేను శక్తిని. నన్ను గొల్చుకో కొల్చుకో" అని వూగింది శానాసేపు. ఆమైన సాంబ్రాణి పట్టకొచ్చి పొగవేసి "తల్లీ! కొలుచుకుంటా మీ పేరేమో. ఆనెత్తిన చంకల్లో వుండే వేమో సెలవియ్యా" లన్నది అత్త. కోడ లన్నాదిగదా

"మెరగవా మెరగవా, నేను దిబ్బిపోలేరమ్మను. కోడండ్ల కుక్కాడుబెట్టని అత్తలను కొనిపోను వచ్చిన నన్ను, నన్ను!!" అని పండ్లుకొరికి "నెత్తిది కిరీటం, చంకలోవి చక్రా" లన్నది.

"అమ్మా, రేపట్నుంచి కోడండ్లను బాగా యేలుకుంటా నమ్మా, శాంతించండి యీవేళ" కని అంటూవుండంగనే కొడుకులు వచ్చారు. "అమ్మా మ్రొక్కోవే పోలేరి తల్లి" కని చెప్పేరు.

శాంతించింది శక్తి. నిద్రబోయిం దత్త, పడమటింట్లోనే. కడగొట్టుకోడలివల్ల సుఖంగా భోంచేశా రావేళకు కోడం డ్లందరు, తమ చిన్నమరది, కడగొట్టు తోడికోడల ధైర్య సాహసాలవల్ల—వాండ్లను దలచుకుంటూ. మర్నాడు యీసంగతి అన్నలకు చెప్పాడు తమ్ముడు. అందరు వీడి యుక్తికి నవ్వినారు. అత్తగారికిమాత్రం సంగతి తెలియకుండుటచే మర్నాడు మొదలు లక్షణంగా కోడళ్లని యేలుకుంటూన్నది.

---

## పిచ్చుక నడక

అత్యం సత్యనారాయణగారు

అనంగా అనంగా ఒక చిన్నపిచ్చుక ఉండేది. ఆ పిచ్చుక ఓనాడు ఓ వరిచేలో వడ్లకంకులు తింటూ కూర్చుంది. సరిగా ఆ సమయానికే ఆకాశంమీాదనుంచి ఒక రాజహంస చిత్రవిచిత్రమైన నడకల్తో తెల్లమబ్బు తునకలా ఎగిరిపోతూంది. ఆ నడక చూచి పిచ్చుకపిల్ల తానుకూడా నేర్చుకోవా లనుకుంది.

మర్నాడు రాజహంసవద్దకు వెళ్లింది. రాజహంస "పిచ్చుకా! పిచ్చుకా! ఏంపని మీాద వచ్చావ్?" అని అడిగింది. "ఏమీా లేదు. మీానడక చాలా బాగుంటుంది. అది నేర్చుకోవాలని మీాదగ్గరకు వచ్చా." అంది పిచ్చుక. రాయంచ నవ్వుతూ 'సరే' అంది.

ఆరోజు మొదలుకొని రాజహంస పిచ్చుకకు నడకలు నేర్పుతూంది. కాని, ఎన్నాళ్లకూ ఆనడకలు పిచ్చుకపిల్ల కబ్బలేదు. హంసకు విసుగుపుట్టి "ఇక నీకు నడకలు రావు. మీాఊరు వెళ్ల" మంది.

పిచ్చుక తనూరికి వచ్చింది. భూమిమ్మీద నడవపోయింది. హంస చెప్పిన నడకలు రాలేదు సరిగదా ఇదివరకు తన మామూలు పిచ్చుకనడకకూడా మరిచిపోయింది. అంచేత నడవలేక గంతులువేయటం మొదలుపెట్టింది. ఇప్పటికికూడా పిచ్చుకలు ఇతరపక్షులవిధంగా భూమిమ్మీద నడవలేక గంతులువేస్తాయి అందుకనే. కథ కాశీపట్నం పోతే మనం మధురా పట్నానికి వచ్చాం.

---

# గ్రహచార బలము

శ్రీమతి కల్పాకం త్రిలోకసుందరమ్మగారు

పూర్వము తపోబలమున గొప్పవరములను పొంది ఎల్లలోకములను తనవశముచేసికొనిన రావణాసురుడు లంకను పరిపాలించుచుండెను. ఒకనాడు 'తన కెగ్గుచేయువారెవరయినగలరా' అని విచారించగా 'నవగ్రహములు' గలగని తెలిసికొనినాడు. అంత సేవకులను పంపి వారిని పట్టి తెప్పించి తనసింహాసనము తొమ్మిదిసోపానములకు తొమ్మండుగురిని కట్టించినాడు. అదిమొదలుకొని రావణాసురుడు ప్రతిదినము సింహాసనము నెక్కునపుడు వారినందరిని తనపాదములతో త్రొక్కుచుండువాడు. నవగ్రహము లిట్లు బంధింపబడియుండుటచేత ఎల్లలోకములవారును మంచిసెబ్బరలు తెలియజాలక చాలచీకాకుపడినారు.

నారదముని తనదివ్యదృష్టిచేత నవగ్రహములకు కలిగిన ఆపదను తెలిసికొని వారిని రక్షింప తలచినాడు. వెంటనే లంకకుపోయి రావణాసురుని కొలువుకూటమున ప్రవేశించి, 'ఓ రాక్షసేంద్రా, వీరెవరు? ఏల ఇట్లు బంధించితివి?' అని సింహాసనముమెట్లకు కట్టబడియున్న నవగ్రహములను చూపి యడిగినాడు. 'మునీంద్రా! వీరు నవగ్రహములు. వీరివలన నాకు చెరుపు గలుగగలదని వీరి నిట్లు కట్టియుంచినాను' అని రావణుడు చెప్పెను. 'ఓయీ, ఇట్లు కట్టియుంచిన వీరు చచ్చువారుకారు. వదలిపెట్టినయెడల మరల బాధింతురు. కావున వీరిని కొనిపోయి వెలకిల పరుండబెట్టి అందరచేత త్రొక్కింపుము. ఎముకలు పొడియయి వెంటనే మృతినొందుదురు. తరువాత నీవు నిరంతరము సుఖముగ నుండవచ్చును' అని చెప్పి నారదుడు తనత్రోవనుపోయినాడు. రావణాసురుడు నారదునిమాటలకు మెచ్చుకొని 'అట్లుచేయు'డని తనభటులకు ఆజ్ఞాపించినాడు. తోడనే వారు నవగ్రహములకు కట్లువిప్పినారు. 'అదేఅద'నని నవగ్రహములు పరువిడి తమస్థానములను చేరినవి. కొన్ని వక్రించి చరించినవి. కొన్ని క్రూరములయి రావణాసురుని చూచినవి. అందువలన రావణునకు మతిచెడి పరమపతివ్రతాతిలకమగు సీతాదేవిని చెరబట్టి లంకకుకొనివచ్చినాడు. అంత రామలక్ష్మణులు, కోతిమూకలనుకూర్చుకొనిలంకకుబోయి రావణాసురుని బంధుమిత్రపరివారముతో చంపిరి. కావున గ్రహచారబలమును ఎంతవారును తప్పించుకొనజాలరు. కథ కంచికి; మన మింటికి.

---

# కాకరకాయకథ

పి. లక్ష్మీబాయమ్మగారు

అనగా అనగా ఒకఊళ్లో ఒకబ్రాహ్మణుడు, ఆయనపెళ్లాం ఉంటున్నారు. వాళ్లకు పొలం కొంచెం ఉంది. రోజూ పొలంవెళ్లి దున్ని, సొంతవ్యవసాయం చేసుకుంటూ, వాళ్లకు ఏడాదికి కావలసిన పంట పండించుకుంటూ, రోజూ ఇంట్లోకి కావలసిన కూరగాయలు, ఏవయినా

పళ్లు కాపించుకుని, ఎలాగో కాలం వెళ్ల బుచ్చుకుంటున్నారు. ఇలా వుంటూవుండగా వానాకాలం వచ్చింది. రాగానే పాదులన్నీ పెట్టి కాకరపాదుకూడా పెట్టారు. కాయలు కాస్తున్నాయి. ఒకరోజు ఉదయాన్నే మొగుడు పొలంవెళ్లి, కాకరచెట్టుకు నాలుగుకాయ లుంటే కోసుకొచ్చి పెళ్లాని కిచ్చి అన్నాడు గదా "ఒసేఒసే, యివాళ యీకాకరకాయలు కూరవండి వంటచేసివుంచు. నేను త్వరగా పొలంవెళ్లి వచ్చి భోంచేస్తా" నన్నాడు. పెళ్లాం 'సరే'నన్నది. త్వరగా స్నానంజేసి మడిగట్టుకుని వంటజేసి కాకరకాయముక్కలు వేయిస్తూంది. ఆముక్కలు వేగుతూ కమ్మని వాసన వస్తూంటె ఆవిడకు నోరూరి ఒక్కొక్కముక్కే తినటం ఆరంభించి, అన్నిముక్కలు తినేసి పోనీ పాపంగదా అని ఒక్కముక్క గిన్నెలో అట్టె బెట్టి వుంచింది. ఇంతలో పొలంనుంచి మొగుడు ఇంటికొచ్చి స్నానం చేసి మడిబట్ట గట్టుకొని విస్తరిముందు కూర్చున్నాడు. సంధ్యావందనం అయేలోగా పెళ్లాం వడ్డనఅంతా చేసి కూరగిన్నె తెచ్చి, ఆ మిగిలిన ఒక్కముక్కా వేయబోతూఉండగా, మొగు డన్నాడుగదా "ఇదేమిటేవ్, కాకరకాయకూర అంతా ఇదేనా, ఒక్కముక్కే వున్న దేమే" అని అడిగాడు. అప్పుడు పెళ్లాం అన్నదిగదా, "ఉడికిందో లేదో అని ఒక ముక్క తిన్నాను. ఉప్పు చాలిందో లేదో అని ఇంకోముక్క తిన్నాను. కారం సరిపోయిందో లేదో అని మరొకముక్క తిన్నాను. వేగిందో లేదోఅని ఇంకోటి తిన్నాను" అని యింకా ఏవో అన్నీ యిలాగే చెప్పేసింది. అన్నీ విని మొగు డన్నాడుగదా "అదేమిటే అన్నిముక్కలు ఎలా తిన్నావే" అన్నాట్ట. అనంగానే ఆమిగిలిన ఒక్కముక్క నోట్లో వేసుకుంటూ, 'ఇలా తిన్నా' నని చెప్పేసింది. ఇక ఆ మొగు డేంజేస్తాడు? నాఖర్మం యింతేననుకొని చారూఅన్నంతిని చేయి కడుకున్నాడు.

కథ కంచి కెళ్లింది. మనం ఇంటికొచ్చాము. విన్నవాళ్లకు వీశెడు బంగారం చెప్పినవాళ్లకు చాటెడు బంగారం.

---

## పాత పాటలు

సంపాదకుడు—నేదూరి గంగాధరంగారు

### ౧౫

పత్తిచెట్టువంక పత్తాకువంక
కొట్టములో సీతమ్మ పచ్చబొట్టువంక
రావిచెట్టువంక రావాకువంక
రాఘువుల సీతమ్మ రాతఫలమువంక.

### ౧౬

తమలపాకుల కట్ట దడిగట్టరాదు
తమ్ము డన్నమాట తలపెట్టరాదు.

### ౧౭

కుంచె డావు నెయ్యి కంచు దివిటీలు
కుదురు మిరియాలవారు అన్న లొచ్చేరు

చింపిరిపింపిరి చీరికలతోడ
బడాయి వడాయి బావ లొచ్చేరు.

**౧౮**

మాబావ లొచ్చేరు కూరేమిలేదు
కుళ్లుగుమ్మిడికాయి పుచ్చువంకాయి
మాఅన్న లొచ్చేరు కూరేమిలేదు
పాటిమీాది పచ్చపెసలు అచ్చావునెయ్యి.

**౧౯**

కుంచెడు బియ్యమ్ము గుమ్మిడిపండు
గుడిదిరిగి నేనిస్తు గుళ్లో దేవుడికి.

**౨౦**

వదిన ! వదిన ! వాసింత
పన్నెండేళ్ల కడుపంట
పత్తిగింజ కొడుకంట
తిరుపతిరాయడు పేరంట
తిరిగిచూస్తే లేడంట
మళ్లీచూస్తే మంచా న్నున్నాడంట.

**౨౧**

పైడమ్మ తలకాయి పచ్చిమిరపకాయి
బుచ్చమ్మతలకాయి బూడిదగుమ్మిడికాయి
అచ్చమ్మతలకాయి అసలు ఆనపకాయి
సీతమ్మతలకాయి సీమచింతకాయి.

**౨౨**

అంతంతదూరాన బాతులు
బాతులకు బంగారు తీగెలు
తీగెలకు వింతవింత సోగలు
సోగలకు ముత్యాల పోగులు.

**౨౩**

నాచేతి రోకళ్లు నల్లరోకళ్లు
చేయించు అన్నయ్య చేవరోకళ్లు
వేయించు అన్నయ్య వెండిపొన్నుల్లు.

**౨౪**

"వీరన్న ! వీరన్న ! వీరచెలమన్న !
నీమీాద మీావదిన పాటపాడింది"
"ఏమని పాడింది వెన్నెల రంభ
ముక్కుసున్నపుకాయి నోరెల్ల విడెము
పక్కలో చురకత్తి బాలుడు వీరన్న."

**౨౫**

అబ్బాయితండ్రులు యెటువంటివారు
అంచుపంచెలవారు అంగీలవారు
నిలువుటంగీలవారు నియ్యోగివారు
అబ్బాయిమామల్లు యెటువంటివారు
ఊరకుక్కలతోడ వూరేగువారు
గుడ్డిగుఱ్ఱాల నెక్కి గోడెక్కువారు.

**౨౬**

చెట్టుమీాది రామచిలుక తుఱ్ఱుమంది
అత్త తెచ్చిన కొత్తకోక కట్టనంది
మామ తెచ్చిన మల్లెపువ్వు ముడవనంది
పీటకింది రొట్టెముక్క తియ్యనంది
మొగుడుచేత మూడు గుద్దులు తిననంది.

**౨౭**

అరటిపం డరటిపం డమ్మన్నముద్ద
పైపైముద్ద ప్రధానముద్ద
లంకసాని లాల్ పీను
శొంఠికొమ్ము సోమాలింగం
గచ్చపప్పు గెలకోడి.

**౨౮**

ఎన్నెన్ని జన్మాలు యెత్తినగాని
యీా ఆడజన్మము యిక నెత్తరాదు
ఆడజన్మ యెత్తి అడలుటకన్న
అడవిలో వృక్షమై అట్లుంటమేలు.




# కదలెడి బొమ్మలు

కొ. నరసింహాచారిగారు

### కాపు - కోడి

ఈ బొమ్మయందు ఒకఅరుగున్ను, మేత వేయుతొట్టియు, ఒకమనిషియు, ఒక కోడియు భాగములై యున్నవి. మనిషియు, కోడియు అరుగుఅడుగున నుండు ఒకబద్దకు కట్టబడి, బద్దను ఆడించుటవలన కదలునవై యున్నవి. చిత్రము 9 ని చూచినయెడల ఈ బొమ్మయొక్క తీరు తెలియగలదు.

### అరుగు

12" × 6" వైశాల్యముగల ఒకఅట్టను దీసికొని దానియంచులవెంబడి చుట్టును ఒక అంగుళము వెడల్పున గుర్తించుకొనవలెను. నాలుగు మూలలందును 1 వ చిత్రమునందలి విధముగ అతుకుతునకలను (Flaps) వదలి కత్తిరించవలెను. పిమ్మట e. f. g. h—s. t. u. v అను రెండు వెడల్పుప్రక్కలందును j. j అను అరఅంగుళము పొడవుగల సందులను రెంటిని కోసికొనవలెను. తర్వాత f. h. s. u అను అరుగు పైభాగము (top) నందు ఎడమ అంచునకు సమీపమున k. m అను రెండు సందులను, కుడిఅంచునకు సమీపమున L అను సందును కోయవలెను. k అనుసందు మనుష్యునియొక్క A అను కదలెడి కాలిని m అనునది C అను కదలనికాలినిన్ని బిగించుటకు సందులయియున్నవి. L అనునది కోడిని బిగించుటకు సందు. f. s.—h. u అను నిడివిఅంచులవెంబడి n. n.—O. O. అను రంధ్రములను చిత్రమున జూపబడినవిధముగ చేయవలెను. n. n. అను రంధ్రములగుండా ఒకకమ్మినిన్ని, O. O. అను రంధ్రములగుండా మరియొకకమ్మినిన్ని దూర్చవలసియుండును కాన, ఈరంధ్రముల జతలు ఒకదానికొకటి ఎదురుగా నుండవలెను. తర్వాత అరుగుయొక్క నాలుగుప్రక్కల (Sides) ను వంచి మూలలందు అతికించి 9-వ చిత్రము నందలి d వలె చేయవలెను.

### మేతతొట్టి

4" × 4" పరిమితిగల అట్టను దీసికొని (చిత్రము 2 e.f.g.h.) చుట్టును ఒకఅంగుళము వెడల్పున అంచును వదలి చిత్రమునందలి విధముగ మూలలను కత్తిరించి ఏటవాలు ప్రక్క

లుగల తొట్టిగా చేయవలెను. (చిత్రము 9. b) ఈతొట్టిని 1-వ చిత్రమునందలి చుక్కల చదరము ఉండుచోట అమర్చవలెను.

మనుష్యుడు (చిత్రము 9. a)

7″ × 3″ పరిమితిగల అట్టను దీసికొని, దానిపై 3-వ చిత్రమునందలిరీతిగ మనిషిచిత్రమును వేసి C C అనుభాగమునుమాత్రము కోసికొనవలెను. A అను ఒకకాలిసిమాత్రము నడుముఎత్తువఱకు 4-వ చిత్రమువలె ప్రత్యేకముగ వాసికత్తిరించవలెను. A ను తక్కినశరీరభాగమునకు కుట్టవలెను. ఇట్లు కుట్టుటకు A ను C తో చేర్చిపెట్టి h. h. అను రంధ్రములగుండా ఒకదారమును దూర్చి, దారపు రెండుకొనలందును రెండుబత్తాసులను దూర్చుకొని దారపుఒకకొనను రెండవకొనతో చేరునట్లు మరల వెనుకకు దూర్చుకొని ముడి



వేయవలెను. దారముపోవుతీరు చిత్రము 5 నందు ఈగుర్తులతో చూపబడియున్నది.

(కాళ్లక్రింద కొంతఅట్ట ఎక్కువగా నుండునట్లు కత్తిరించుటకు మరువకూడదు).

కోడి (చిత్రము 9. c.)

కోడిబొమ్మను 6-వ చిత్రమునందలివిధముగ కత్తిరించవలెను.

బొమ్మల నమర్చుట

అరఅంగుళము వెడల్పును 12'' పొడవునుగల గట్టిఅట్టముక్కనుగాని సన్నని వెదురు బద్దనుగాని (7 చిత్రము b) దీసికొని, అరుగునందలి j j అను సందులలో దూర్చుకొనవలెను. ఈబద్దయొక్క రెండుకొనలును అరుగుయొక్క రెండుప్రక్కలందును వెలుపలికి వచ్చియుండవలెను. పిమ్మట మనిషియొక్క A కాలిని k సందుగుండానున్ను, C కాలిని mగుండానున్ను, చిత్రము 9 యందువలె క్రిందికి దింపి A కాలిఅడుగుకొనను బద్దకు P వద్ద కట్టివేయవలెను. పిమ్మట 8-వ చిత్రమునందలి t అను రీతిగ నొకకమ్మిని వంచుకొని దానిని అరుగునందలి ఒక n రంధ్రము గుండానున్ను C అను కాలియందలి m రంధ్రముగుండానున్ను మరల అరుగునందలి రెండవప్రక్క n రంధ్రముగుండానున్ను దూర్చి కమ్మికొనను ఊడిరానీయక వంచవలెను. ఈకమ్మి బద్దకు తగులక దానిపైగా పోవలెను, కాన అది పోవురంధ్రములు J. J. అను సందులపై కొనలమట్టమునకన్న పైఎత్తుగా నుండవలెను. కోడిని బిగించుటలో దానిఅడుగుతునకయందుపైనుండు O రంధ్రము గుండానున్ను అడుగునందలి O. o. రంధ్రములగుండానున్ను రెండవకమ్మిని దూర్చి, అడుగుతునకయొక్క క్రిందికొనను బద్దకు q వద్ద కట్టవలెను.

బద్దను మనుష్యునివైపునకు త్రోసినయెడల వాని A కాలు వెనుకకు పోవును. అప్పుడు మనిషి వెనుకకు కదలును. కోడియొక్క తలకూడ వెనుకకు వ్రాలును. (కోడియొక్క కదలికలకు చిత్రము 6. r. s. చూడుడు) బద్దను కోడివైపునకు లాగినయెడల మనిషియు, కోడియు తొట్టిప్రక్కకు వ్రాలుట సంభవించును.



## పచ్చిబాలెంత

మున్నంగి శర్మగారు

తలఁగ విరు లింక! గాలియుఁ జలి వీఁచుగదు!
బాటచిత్తడి! పొల మొక పదవునేల!
పురిటివరుసను మార్నీళ్లు పోసికొనవు!
విడవు తలకొంగు! పత్తెపుఁ బిడుచఁ దినవు!
గనిమపై నీతపొదనీడఁ జినుఁగుబొంత
నెఱపి చన్నిచ్చి నిసుఁగును నిదురపుచ్చి,
బురదమళ్లను వరియూడుపులకు దిగుదు!
వెంత మొఱకవె పచ్చిబాలెంత వయ్యు!
కూలిగింజల కింత కక్కుఱితి యేల!
పేదఱికమిట్టి తెగువ నేర్పెనో గదమ్మ!

# బౌద్ధభిక్షుణీసంఘము

ఆర్. రంగనాథశాస్త్రిగారు

ఆర్యధర్మ ధారయందు స్త్రీలకు సంపూర్ణస్వాతంత్ర్య మెచ్చటను కానరాదు. ధర్మవిహితమగు విధినిషేధములతో గూడిన జీవితమును స్వాతంత్ర్యజీవితమని నుడివియున్నారు. నియమబద్ధుడై సాధనభజనల వలన నియమాతీతుడగు వానికిమాత్రమే పరిపూర్ణ స్వాతంత్ర్యము సిద్ధించును. ధర్మవిహీనము, నియమరహితమునగు జీవితమును స్వేచ్ఛాజీవిత మందురు. ఈ స్వేచ్ఛావర్తనమును భారతవర్షమం దవతరించిన కవులు, గాయకులు, పండితులు, మతకర్తలు, మహాపురుషులు మొదలగువారెల్లరును నిషేధించియున్నారు; పలువిధముల నిరసించియున్నారు. ఒక్క చార్వాకుడు మాత్రమే స్వేచ్ఛామతప్రవర్తకుడై యుండెను.

అందువలన ఆర్యధర్మమునం దెచ్చటను స్వేచ్ఛ యనుదాని కవకాశము లేదు. స్త్రీ పురుషున కర్ధాంగి. కావున స్త్రీకి ప్రత్యేకస్వాతంత్ర్య మనునది లేదు. స్త్రీ పురుషునితోడ గలిసి సమస్తకార్యములను నిర్వహింపుచుండవలయునని విధించియున్నారు. విశుద్ధ నివృత్తిమతప్రవర్తకుడగు బుద్ధుడు వారణాసియందు ధర్మచక్రమును స్థాపించెను. ధర్మచక్రమనగా భిక్షుసంఘము లేక సన్న్యాసిసాంప్రదాయము. కాని యార్యధర్మచక్రము యొక్క బునాదులమీదనే బుద్ధుడు ధర్మచక్రమును స్థాపించుటవలన స్త్రీల కందు స్థానమును గల్పింపకుండెను. అయినను బుద్ధభగవానుడు తనను చిన్నప్పటినుండియు పెంచి పెద్దవానిగ నొనర్చిన మహాప్రజావతి గౌతమీదేవి తలగొరిగించుకొని కాషాయవస్త్రముల ధరించి వందలకొలది శాక్యవంశస్త్రీలతోడ సంసారమును వీడి శ్రావంతినగరమునకు వచ్చి భిక్షుణీసంఘమును స్థాపించవలయునని కోరినప్పుడు మిక్కిలిగ యోచించెను. చివరకు గౌణభావమున భిక్షుణీసంఘమును స్థాపించుటకాజ్ఞయొసంగి గౌతమీదేవికి ధర్మదీక్ష నొసంగెను. భిక్షుణీసంఘము భిక్షుసంఘమునకు లోబడి వారి యాదర్శముల ననుసరించి ముక్తిని సాధింపవలయునను నియమముల నేర్పరచెను. వీనినే యష్టనియమము లందురు. భిక్షుణీసంఘమును స్థాపించుట కనుమతించిన పిమ్మట భగవాను డానందునితోడ విశుద్ధమగు బౌద్ధసంఘము అయిదువందల వత్సరములు ముగియునప్పటికి విశుద్ధతను గోల్పోయి కళంకపూరితమగునని నుడివెను. ఇందువలన భిక్షుణీసంఘ సంబంధమునం దీయన మనోభావమును గ్రహింపవచ్చును.

బుద్ధభగవానుని జీవితకాలమం దనేకమంది స్త్రీలు బౌద్ధధర్మమున దీక్షితలైరి. వందలకొలది స్త్రీలు సంసారమును వీడి భిక్షుణీసంఘమున జేరిరి. పదివత్సరముల కాలము నిష్కళంకభావమున భిక్షుణీవ్రతమును పరిపాలింపగలిగిన స్త్రీ 'ఖేరి' యను పేరున పిలువబడుచుండెను. ఖేరీగాథయం దుదాహరింపబడిన కొంతమంది స్త్రీలచరిత్రను సంక్షిప్తముగ నిం దుదాహరించుచున్నాము.

## ౧. మహాప్రజావతి గౌతమీదేవి.

బుద్ధభగవానుడు ధర్మప్రచార మొనర్చుచు తిరిగి స్వీయజన్మస్థానమగు కపిలవస్తునగరమునకు వచ్చి పురసామీప్య మందున్న 'న్యగ్రోధారామ'మను పేరుగల వనమందు శిష్యబృందముతోడ విహరింపజొచ్చెను. అప్పుడు శుద్ధోదనుని ధర్మపత్నియగు మహాప్రజావతి గౌతమీదేవి సంసారాశ్రమమును త్యజించుటకు కృతసంకల్పయై బుద్ధభగవానుని సంబోధించి యిట్లనియె: "భగవానుడా! రమణీగణమును బౌద్ధధర్మమున జేర్చుకొనుము. సంసారమును త్యజించిన మహిళామండలితోడ భిక్షుణీ సంప్రదాయమును సృష్టింపుము" అని ప్రార్థింప తథాగతు డిట్లనియె. "ఓ గౌతమీ! మీ రిట్టి ప్రస్తావము చేయవలదు." అని

నుడివి వెంటనే శిష్యజనపరివేష్టితుడై బయలుదేరి వైశాలీ నగర కూటాగారశాలయందలి మహావనవిహారమును బ్రవేశించెను.

ఇచ్చట మహాప్రజావతి గౌతమీదేవి తలగొరిగించుకొని కాషాయాంబరమును ధరించి శాక్యవంశస్త్రీల ననేకమందిని వెంటనిడుకొని వైశాలీనగరమును బ్రవేశించెను. సన్యాసినీరూపమున నున్న గౌతమిని గాంచి యొకింత విచారించి యానందుడు బుద్ధునికడ కేగి యిట్లనియె: "భగవానుడా! స్త్రీలకు సన్యాసధర్మదీక్ష నొసంగినయెడల బౌద్ధధర్మమునకు మిక్కిలి మంగళము చేకూరును." అన తథాగతు డిట్లనియె. "ఆనందా, ఈవిషయమును నాకడ ప్రస్తావించవలదు." అన ఆనందు డిట్లనియె. "భగవానుడా, ధర్మకథా శ్రవణమువలన స్త్రీలకేవిధమగు లాభమును కలుగదా? వారు స్రోతాపన్నము, సకృదాగామి, అనాగామి, అర్హత్ మొదలగు పదములను బొందుటకు యోగ్యులుకారా!" అన బుద్ధభగవాను డిట్లు ప్రత్యుత్తరం బొసంగెను. "ఆనందా! ధర్మప్రసంగములు వినుటకు స్త్రీల కధికారము కలదు. అందువలన వారికి మిక్కిలి మేలుగలుగును. సద్గతి నొందుటకు స్త్రీలకు పూర్ణాధికారము కలదు." అప్పు డానందు డిట్లనియె: "భగవానుడా! అట్లయినచో మహాప్రజావతి గౌతమీదేవికి ఉపకారమొనర్చుట కేల మీరు వెనుదీయుచున్నారు? మీరవతరించినంతనె మీతల్లి శరీరమునువీడి స్వర్గమును బ్రవేశించెను. అప్పటినుండియు మిమ్ము కంటికిరెప్పవలె కాపాడుచు పెంచి పెద్దవానినిగనొనర్చినది గౌతమీదేవియేకదా! ఆమె మీకొనర్చిన మహోపకారమునకు ప్రత్యుపకారమొనర్చుట మీకు ధర్మముకాదా!" అను వాక్యములు విని భగవాను డిట్లనియె. "ఆనందా! గౌతమీదేవి అష్టనియమముల ప్రతిపాలన మొనర్చుట కంగీకరించినయెడల ధర్మదీక్ష నొసంగుదును." అని యాక్రింద వివరించిన అష్టనియమముల నుడివెను.

(౧) ఏ సన్యాసినియైనను బౌద్ధభిక్షువును గాంచినంతనే నమస్కరింపవలయును.

(౨) సన్యాసులులేని స్థలమందు భిక్షుణి చాతుర్మాస్యలను గడుపరాదు. అనగా త్రైమాసిక వ్రతమును సలుపరాదు.

(౩) భిక్షుణీ ప్రతిపక్షమందునను భిక్షుసంఘము గాంచి యీ క్రింది రెండు ప్రశ్నల నడుగుచుండవలయును ఏదినమున ఉపోసథమగును? ఏసమయమున భిక్షు డుపదేశమొనర్చును?

(౪) చాతుర్మాస్య లయినంతనే భిక్షుణీ ప్రవారణాకర్మమదాని ననుష్ఠింపవలయును. అనగా తానొనర్చిన పాపకార్యములను భిక్షుసంఘము భిక్షుణీసంఘమందు వెల్లడింపవలయును.

(౫) గురుతరాపరాధ మొనర్చిన భిక్షుణీ భిక్షుసంఘము, భిక్షుణీసంఘముల సమక్షమందు 'మానత్త' వ్రతమును ఆచరింపవలయును.

(౬) ఏభిక్షుణీయైనను బౌద్ధధర్మమున దీక్షనొందిన రెండువత్సరములలో సామణధర్మముల నారింటిని ప్రతిపాలింపగలిగినయెడల నామె భిక్షుసంఘము, భిక్షుణీసంఘములను, ఉపసంపదను గోరవచ్చును.

(౭) భిక్షుణీ యెప్పుడును భిక్షువును నిందింపరాదు, అవమాన పరచకూడదు.

(౮) భిక్షుబృందము భిక్షుణీగణమును ననుశాసనం బొనర్చుచుండవచ్చును. కాని భిక్షుణీసముదాయ మెప్పుడును భిక్షుబృందమును ననుశాసింపరాదు.

అప్పు డానందుడు భగవానునికడనుండి బయల్వెడలి మహాప్రజావతి గౌతమీదేవిని సమీపించి బుద్ధభగవానుడు నుడివిన అష్టనియమములను వినిపించెను. ఆ నియమముల విని గౌతమి యిట్లనియె: ఆనందా! తరుణవయస్కురాలగు రమణీమణి స్నానాంతమున నలంకారముల ధరించి శిఖను పుష్పమాలల నలంకరించుకొను విధమున నే నీయెనిమిది నియమములను సంతోషముగ శిరమున ధరింపుచున్నాను"

గౌతమీదేవివాక్యముల విని యానందుడు తిరిగి తథాగతుని సమీపించి యిట్లనియె: "ప్రభో! భగవా

మడా! మహాప్రజావతి గౌతమీదేవి మీ రుపదేశించిన అష్టనియమములను సంతసముగ స్వీకరించినది. కావున నిప్పుడే యామె కుపసంపదదీక్ష నొసంగ ప్రార్థన." అందులకు భగవాను డనుమతించెను. అప్పుడు మహాప్ర జావతి గౌతమీదేవి భగవానుని సమీపించి చేతులు జోడించుకొని నిలువ నామెకు భగవానుడు బౌద్ధధర్మ దీక్ష నొసంగెను. తదనంతరము భగవానుడు ఆనందుని చూచి యిట్లనియె: "ఆనందా! స్త్రీలను గృహత్యాగు లుగ నొనర్చి భిక్షుణీవ్రతదీక్ష నొసంగకుండినయెడల పవిత్రమగు ఈధర్మము జగత్తునందు సుప్రతిష్ఠితమై యుండెడిది. కాని నే నిప్పుడు స్త్రీలను సన్యాసినులుగ నొనర్చియున్నాను. అందువలన నేను ప్రచార మొనర్చు పవిత్రధర్మము పంచ శతవర్షములకంటె యధికకాలము పవిత్రభావమున విరాజిల్లజాలదు. అయినను ధర్మము కలుషితముగాకుండుటకు నే నీయెనిమిది నియమముల నేర్పరచితిని.

మరుసటిదినమున గౌతమీదేవి భగవానుని సమీపించి తలవంచుకొని యిట్లు విన్నవించెను: 'భగవానుడా! నాతోడ వచ్చిన శాక్యవంశ రమణీమణులకు ధర్మమార్గమును జూపింపవలయును.' అన భగవాను డిట్లనియె, "స్త్రీల కుపసంపద నొసంగి భిక్షుణీ సంప్రదాయమును సృష్టించుటకు భిక్షుసంఘమున కనుమతి యిచ్చియున్నాను."

## ౨. యశోధర

బుద్ధభగవానుని భార్యపేరు యశోధర. ఈమె తండ్రి సుప్రబుద్ధుడు. బుద్ధత్వమును బొందినపిమ్మట భగవానుడు కపిలవస్తునగరమునకు వచ్చి పుత్రుడగు రాహులునికి స్వీయధర్మదీక్ష నొసంగియుండెను. ఆమెకొక్కడే పుత్రుడు. అతడు బాలుడు. ఆయనయు సన్యాసమును గైకొనుటవలన యశోధరకు సంసారసంబంధమగు బంధనము లన్నియు దొలంగెను. తీవ్రవైరాగ్యముతోడ సన్యసింపవలయునని ప్రయత్నించెను. కాని బుద్ధభగవానుని తండ్రియగు శుద్ధోదనుని యాజ్ఞను జవదాటజాలక గృహమందె యుండెను. గౌతమీదేవి భిక్షుణీసంఘమున జేరెనను వార్త చెవిసోకినంతనె యామె గృహమందు నివసింపజాలక వైశాలీనగరమున కేగి మహాప్రజావతి గౌతమీదేవిని సందర్శించెను. వెంటనే గౌతమీదేవి యశోధరను వెంటనిడుకొని శ్రావంతీ నగరమును ప్రవేశించి భగవానునకు యశోధర మనోభావమును వెల్లడించెను. అప్పుడు భగవానుడగు తథాగతుడు యశోధరకు ఉపసంపద నొసంగెను. ఆమె తదనంతర మామె గౌతమీదేవితోడ మరలి వైశాలీనగరమునకు వచ్చి కొంతకాలము భిక్షుణీసంఘమున నివసించెను. యశోధర యటనుండి బయలుదేరి రాజగృహమును జేరి యచ్చట నివసింపుచు స్వీయధర్మానుష్ఠానమునం దణుమాత్రమైనను లోపము గలుగనీయక ధర్మప్రచార మొనర్చుచు బుద్ధభగవానుడు మహాపరినిర్వాణమును బొందుటకు రెండువత్సరములకు బూర్వమే యామె మహాపరినిర్వాణమును బొందెను.

## ౩. క్షేమా

మగధదేశాధీశుని నామధేయము బింబిసారుడు. ఆయన పట్టమహిషిపేరు క్షేమా. ఈమె శాకలీనగర రాజకులమం దవతరించియుండెను. ఒకదినమున నామె నగరసమీపమం దున్న వేణువనము నందియున్న ధర్మవిహారమందు శిష్యజనపరివేష్టితుడైయున్న బుద్ధభగవానుని గాంచి యాయనసన్నిధి కేగెను. అప్పుడు తథాగతుడు స్వీయబుద్ధిప్రభావమువలన వరుసగా నామె నేత్రములకు గోచరించునటుల మూడు స్త్రీరూపములను బ్రదర్శించెను. అం దొకటి చిక్కి శల్యావశిష్టమై యుండు స్త్రీరూపము. ఆమె యాస్త్రీని గాంచినంతనే రోగజ్వాలలవలన బరితపించుచుండు మరియొక స్త్రీరూపమును కనుబడునటుల జేసెను. చివర కొక మరణించిన స్త్రీశవమును బ్రదర్శించెను. ఈత్రిదృశ్యముల గాంచిన క్షేమహృదయమందు వైరాగ్యము మొలకలెత్తెను.

అప్పుడు తథాగతుడు సంసారదుఃఖములనుగూర్చి క్షేమకు వివరముగ దెలియజెప్పెను. బుద్ధభగవానుని ధర్మోపదేశముల హృదయంగమ మొనర్చుకొని క్షేమ స్వీయమందిరమున కేగి భిక్షుణీసంఘమున జేరుటకు భర్త యనుజ్ఞను కోరెను. బింబిసారు డామె మనోవేదనను

గాంచి చివర కంగీకరింప క్షేమ చీనిచీనాంబరములను నవరత్నమండితమగు భూషణములను వీడి కాషాయ వస్త్రమును కట్టుకొని చేత మృణ్మయపాత్రను ధరించి తథాగతుని సమీపించి భిక్షుణీధర్మదీక్ష నొసంగవలయునని ప్రార్థించెను. భగవానుడామెకు ఉపసంపద నొసంగెను.

ఈ మహాసన్యాసిని బౌద్ధధర్మతత్వగ్రహణమందు, నియమపాలనములయందు నద్వితీయ. అందువలన నీమె తథాగతుని యగ్రశ్రావికలయందు ముఖ్యురాలుగ బరిగణింపబడుచుండెను. బుద్ధభగవానునికి దక్షిణదిక్కున గూర్చుండుట కర్హతను బడసెను. అందువలన క్షేమను దక్షిణహస్తశ్రావికయని పిలుచుచుండిరి. బుద్ధభగవానుడు సంసారదుఃఖమునుగూర్చి యొకప్పు డీక్రింది శ్లోకమును బలికియుండెను:

'యేవాగరత్తాను పతంతి సోతం
సయం కతం మక్కటకోవజాలం,
ఏతమ్పి ఛేత్వనవజంతి ధీరా
అనపేర్ధినో సబ్బదుక్ఖం పహాయ.'
(పాలీభాష)

(సాలెపురుగు స్వీయనిర్మితజాలమందా బద్ధమై దానియందు తిరుగుచుండువిధమున రాగాసక్తులగు మానవులు స్వయంకృతమగు రాగప్రవాహమందు బడి కొట్టుకొనిపోవుచుందురు. పండితులీరాగస్రోతము నతిక్రమించి వైరాగ్యము నవలంబించి సర్వవిధములగు దుఃఖములనుండి ముక్తిని గాంచుచున్నారు.)

## ఉత్పలవర్ణ

ఉత్పలవర్ణతండ్రి గొప్ప ధనికుడు. శ్రావంతీనగరనివాసుడు. ఆమె యకాలమందు నారీలోకమందద్వితీయసౌందర్యలావణ్యమున నలరారుచుండెను. ఆమె సౌందర్యాతిరేకమువిషయము దేశదేశాంతరములయందు వ్యాపించినకొలందిని ఈమెను వివాహ మాడవలయునను తలంపు రాజాధిరాజులకుకూడ మిక్కుట మగుచుండెను. ఆవిషయమును గ్రహించి యుత్పలవర్ణతండ్రి యిట్లు యోచింపజొచ్చెను. "దీని నెవరి కిచ్చి వివాహ మొనర్తును? రూపలావణ్యవయోవిలాసములయందును, వినయవివేకములయందును ఉత్పలవర్ణతోడ బోల్పతగినవా డెవ్వ డున్నాడు? ఈమెను చేపట్టవలయునని ప్రయత్నించు ధనికులు, రాజులు, మహారాజులు, యువరాజులయం దెవరి కీమె నిచ్చి వివాహ మొనర్తును? ఎవనికైన నిచ్చి వివాహ మొనర్చినను వానికి మిగిలినవా రందరు శత్రువులై సైన్యముతోడ తరలివచ్చి వానిని సంహరింపరా? జననాశనముకాదా? కావున నీమెకు వివాహ మొనర్పకుండుటయే యుత్తమము." అని యోచించి చివరకు పుత్రికాక్షేమమును గమనించి వివాహమొనర్పక బౌద్ధధర్మము నవలంబించుట కాజ్ఞయొసంగెను. ఉత్పలవర్ణ తండ్రియభీష్టము ననుసరించి భిక్షుణీసంఘమున ప్రవేశించి త్రికరణశుద్ధిగ బౌద్ధధర్మము నాచరించుచు కొలదికాలములోనే భిక్షుణీసంఘమం దత్యున్నతస్థానమును బడసెను. తదనంతరము 'అగ్రశ్రావిక'యై బుద్ధభగవానుని వామపార్శ్వమందు గూర్చుండుట కర్హతను బడసి వామహస్తశ్రావికయను పేర బిలువబడజొచ్చెను. బుద్ధభగవానుని అగ్రశ్రావికయగు ఉత్పలవర్ణ శ్రావంతీనగరసమీపమందు ఒకానొక యరణ్యమందు తపమాచరించుచుండెను. ఒకదినమున నామె భిక్షాపాత్రను చేధరించి నగరమందు భిక్షాటనము చేయుచున్నప్పుడు, మేనమామకొమరుడగు నందుడనువాడు కామోద్రేకమున శరీరమును మరచి యామెశరీరమును స్పృశించెను. అప్పు డుత్పలవర్ణ నందుని గాంచి తిరస్కారపూర్వకముగ ధర్మోపదేశము లొసంగి తిరిగి యరణ్యమున కేగెను. నందుడు పశ్చాత్తప్తహృదయుడై గృహమునకు మరలెను. కాని చివరకు నందు డొనర్చిన మహాపాపము ననుభవించుటకు 'అవీచి' యను నరకమును బ్రవేశింపవలసినవా డాయెను.

## ౫. కీసాగౌతమి

శ్రావంతీనగరమం దొక కోటీశ్వరు డుండెను. ఆతని భార్యపేరు కీసాగౌతమి. వివాహమైన కొలది వత్సరముల కాదంపతుల కొక పుత్రుడు కలిగెను. కాని యాబాలుడు శైశవముననే మరణించెను. అందువలన నామె శోకాకులచిత్తయై మృతశిశువును బుజముమీద

పరుండబెట్టుకొని రోదనము చేయుచు ప్రతియొక్కయింటికి బోయి "ఏదయిన అవుషధ మొసంగి నాపుత్రుని బ్రతికింపగలరా?" అని ప్రశ్నింపజొచ్చెను. కాని యెల్లరును "చచ్చినవానిని బ్రతికింపగల మందేదియు లేదు." అని ప్రత్యుత్తర మొసంగుచుండిరి. కాని యామాటలయందామెకు విశ్వాసము గలుగకుండెను.

ఆమె దురవస్థను గాంచి యామార్గమున బోవుచుండిన యొక వృద్ధసన్యాసి యిట్లనియె: "అమ్మా! నీవు బుద్ధభగవానుని కడకు బొమ్ము. ఆమహాపురుషుడు తగిన యౌషధము నొసంగును." అనుమాటలు వినినంతనే కీసాగౌతమి రోదన ముడిగి తీవ్రగమనమున నగరసమీపమందు పర్వతసానువులయందు గూర్చుండి శిష్యమండలికి ధర్మోపదేశం బొనర్చుచుండిన బుద్ధభగవానుని సమీపించి బుజముమీదనుండు పుత్రుని ఆయనయెదుట నేలమీద బరుండబెట్టి చేతులు జోడించుకొని యిట్లు ప్రార్థించెను. "భగవానుడా! మీరనేకౌషధములు నెరింగియున్నారని వినియున్నాను. అందువలన మరణించిన నాశిశువును మీకడకు దీసికొని వచ్చితిని. తగిన యవుషధ మొసంగి వీనిని బ్రతికింపుడు. నాకు పుత్రభిక్షపెట్టుడు." అని చూచువారి హృదయములు కరగి నీరై పారునట్లు రోదనము చేయజొచ్చెను. అప్పుడు బుద్ధభగవానుడు గౌతమిని గాంచి యిట్లనియె: "గౌతమీ, తిరిగి నీవు నగరమునకు బోయి తలిదండ్రులు, అన్నదమ్ములు అక్కచెలియండ్రు, పుత్రికాపుత్రులు మొదలగువారెవ్వరును మరణింపని గృహమునుండి పిడికెడు నువ్వులను యాచించి దీసికొనిరమ్ము. ఆనువ్వులతోడ దగిన యౌషధమును నీకొసంగెదను."

అనువాక్యములకు గౌతమి మిక్కిలి సంతుష్టచిత్తయై క్రింద బరుండబెట్టిన శిశువు మృతకళేబరమును తిరిగి బుజముపై నిడుకొని నువ్వుల దీసికొనివచ్చుటకు తిరిగి నగరమును బ్రవేశించెను. ఆపురమందలి ప్రతియొక్క గృహమునకు బోయెను. కాని నువ్వులు దొరకునెట్లు? అన్నయో, తమ్ముడో, తల్లియో, తండ్రియో బంధువులో—ఎవ్వరో యొకరు మరణించిరని ప్రతియొక్క గృహమునుండియు ప్రత్యుత్తరము రాదొడంగెను. ఆచెప్పుటతోడ వారును చింతింపజొచ్చిరి. కాని యెవ్వరును మరణింపని గృహ మానగరమం దొకటియైనను కానరాకుండెను. అందువలన మరణము జీవులకు సర్వసామాన్య మను విషయము ప్రస్ఫుటమై యామె మనమందు వైరాగ్య మంకురించెను. అప్పు డామె దుఃఖమునువీడి శిశువును శ్మశానమునకు గొంపోయి యచ్చట భూస్థాపిత మొనర్చి యీక్రిందిగాథను బఠించెను:—

"నగామ ధమ్మో నో నిగమస్స ధమ్మో
నచాపియం ఏకకులస్స ధమ్మో,
సబ్బలోకస్స సదేవ కస్స
ఐసేవ ధమ్మో యదిదం అనిచ్చతాతి."
(పాలిభాష)

(సకలవస్తువు లనిత్యములు. ఈయనిత్యత్వ మొక గ్రామము లేక నగరము వంశమునకుమాత్రమే సంబంధించినదికాదు. సమస్తమానవులు దేవతలుగూడ ననిత్యులే.)

తదనంతరము కీసాగౌతమి బుద్ధభగవానుని సమీపమున కరిగెను. ఆమెను గాంచి బుద్ధు డిట్లనియె. "గౌతమీ, తిలలు లభించెనా?" ఈప్రశ్నకు గౌతమియిట్లనియె. "భగవానుడా, తిలలతో సంబంధించిన కార్యము పూర్తియైనది. ఇంక నాకు తిలలతోడ ప్రయోజనము లేదు. నాచిత్తము స్థిరమైనది." అప్పుడు బుద్ధుడు గౌతమిని గాంచి యిట్లనియె.

'తం పుత్తపసుసమ్మత్తం వ్యాసత్తమనసం నరం
సుత్తం గామం మహోఘోవా మచ్చుఆదాయగచ్ఛతి.

నసంతి పుత్తా తాణాయ నపితా నపి బంధవా,
అంతకే నాధిపన్నస్స నవీథి జ్ఞాతిషుతాణతా,
ఏతమత్థవసం జ్ఞాత్వా పండితో సీలసంబుతో,
నిర్వాణగమనం మగ్గం ఖిప్పామేవ విసోధయె.

(ప్రబలజలప్రవాహమునందు గ్రామములు కొట్టుకొని పోవుచుండువిధమున పుత్రులు పశువులు మొదలగు వానియం దాసక్తితో గూడుకొనియుండు చిత్తముగల మానవులను మృత్యువు గబళింపుచుండును. మృత్యు

ముఖమునుండి తప్పింపగల పుత్రుడుగాని, తండ్రిగాని, బంధువులుగాని, జ్ఞాతులుగాని యెచ్చటను లేరు. శీల పరిశుద్ధుడగు పండితుడుమాత్రమే యీతత్వము నవగత మొనర్చుకొని శీఘ్రముగ నిర్వాణగమనపథమును పరిష్కృత మొనర్చుకొనును.)

బుద్ధభగవాను డుచ్చరించిన గాథను వినుటవలన గౌతమికి తత్వజ్ఞానము గలిగెను. వెంటనే యామె భగవానునివలన ప్రవ్రజ్యమును, ఉపసంపదలను దీక్షనొంది భిక్షుణీసంప్రదాయమందు ప్రవేశించెను. అప్పుడీక్రింది విషయ మామెకు హృదయంగమ మాయెను.

ప్రేమతో జాయతీ సోకో ప్రేమతో జాయతీ భయం,
ప్రేమతో విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం.

(ప్రేమనుండి శోక ముత్పన్నమగును. ప్రేమనుండి భయము పుట్టును. కావున ప్రేమనుండి విముక్తుడగువానిని శోకభయము లనునవి యుండు టెట్లు?)

## ౬. విశాఖ

అంగరాజ్యమందు భద్దియ యను పేరుగల నగరమున ధనంజయు డను వణిక్పుంగవు డుండెను. ఆతడు వంగరాజ్యకోశాధ్యక్షుడు. ఆతని పుత్రికపేరు విశాఖ. విశాఖ యత్యంతసౌందర్యమున నలరారుచుండెను. కాని యామెకు ఎనిమిదివత్సరముల వయసు వచ్చునప్పటికి తథాగతుడు భద్దినగరమునకు వచ్చెను. ధనంజయుని తండ్రిపేరు మేండకుడు. భగవానుడు నగరబహిర్భాగమందలి యుద్యానవనమునందున్నాడని విని మేండకుడు మనుమరాలగు విశాఖను బుద్ధభగవానునకు పరిచర్య చేయుటకు బంపించెను. పంచశతసహచరీబృందముతోడ విశాఖబుద్ధభగవానుని సమీపించి యాయనకు సేవ చేయ దొడంగెను. తథాగతుడు మిక్కిలి సంతుష్టచిత్తుడై విశాఖకు నానావిధములగు ధర్మోపదేశము లొసంగెను. ఉపదేశానంతర మాబాలిక బుద్ధధర్మమున దీక్షితురాలాయెను.

తత్కాలమున శ్రావంతీనగరపరిపాలకుని నామధేయము ప్రసేనజిత్తు. ఆయన కోశాధ్యక్షుని పేరు మిగారుడు. మిగారునకు పుణ్యవర్ధనుడను పేరుగల నొక పుత్రుడుండెను. పుణ్యవర్ధనుడు సర్వసుగుణ సంపన్నుడు. ఆతనికి విశాఖనిచ్చి వివాహమొనర్చిరి. విశాఖ బౌద్ధధర్మావలంబులకు మిక్కుటముగ దోడ్పడియుండెను. భిక్షుబృందమున కామె నిరంతరము అన్నము పెట్టి వస్త్రము లొసంగుచుండెను. శ్రావంతీనగరమునకు తూర్పుదిక్కున నున్న యుద్యానవనమును భిక్షుసంఘమునకు దానము చేసెను. ఆ యుద్యానవనముపేరు పూర్వారామము. బుద్ధభగవాను డీపూర్వారామమున నివసించునప్పుడు విశాఖను లక్ష్యమందుంచుకొని యిట్లు నుడివియుండెను.

'యథాపి పుప్ఫరాసిమ్హ కయిరామాలా గుణేబహూ,
ఏవం జాతేన మచ్చేన కత్తబ్బం కుసలం బహుమ్.'

(పుష్పరాసిద్వారమున ననేకమాలలను సంసిద్ధముచేయవచ్చును. అటులనే మానవు డవతరించి యనేక సత్కర్మ లొనర్పవచ్చును.)



# చిత్రకళ



## అజంత కళాలయములు

తలిశెట్టి రామారావుగారు, బి. ఏ., బి. యల్.

3

కళాధిక్యము :

అజంత మహాచిత్రముల నా చిత్రబ్రహ్మ లెటుల వ్రాసిరో, యెట్టి పరికరముల నుపయోగపరచిరో చూడదగును.

ఇప్పటికిని హిందూదేశమున గోడలపై చిత్రములను వ్రాయించుట యాచారమైయున్నది. ఇటుకలతో గట్టిన గోడలపై యిసుక సున్నము కలిపి చెక్కబెట్టిన పిమ్మట యది యారకమునపే పలుచని తెల్ల సున్నమును బూసెదరు. ఇదియు తడిగ నున్నప్పుడే వర్ణములను బూసెదరు. చిత్రింపవలసిన భాగ మెండిపోవుచున్నయెడల నీటితో దడిపి మరల చిత్రించెదరు. ఇటుల చిత్రించిన యెడల వర్ణములు సున్నములోని కింకియు, రంగులపైని సున్నపురస మేర్పడియు నెప్పటికిని చెరిగిపోకయుండునటు లగును. వర్ణలేపనమునకు ముందు సున్నపుపూత నునుపుగ నున్నయెడల నొకకఱ్ఱచెక్కతో గరుకుగ జేసెదరు. చిత్రము పూర్తియైనపిమ్మట నొక నున్నని వస్తువునుబట్టి యాచిత్రముపై జాగ్రత్తగా నణచి మెరుగు పెట్టెదరు. మట్టిగోడలపై నిసుక మన్ను లేక మన్నుఊక కలిపి మెత్తి తరువాత సున్నమును బూసి దానిపై చిత్రించుట కలదు.

అజంతయందు సుమారించుమించుగ నిటులనే చిత్రించిరి. గరుకుగనున్న రాతిగోడపై జిగటమన్ను, పేడ, రాతిగుండ కలిపి మెత్తిరి. ఇచ్చటి రాళ్లయందు చిన్న కన్నము లుండుటచే నిది వాటి కంటుకొని యిప్పటికిని రాలకయున్నది. ఈ మెత్తుడు సుమారు అంగుళమున పరకవంతునుండి ముప్పాతికవంతువరకు దళసరిగ గలదు. తొమ్మిదవ కందరమున పలుచగ, నునుపుగ నున్నది. దీనిపై వజ్రలేపనము గలిపిన సున్నమును బలుచగ బూసి యది యారకమునపే వజ్రలేపముతో గలిపిన రంగులను బూసినటుల కానవచ్చును.

"తొలుత చిత్తరువుయొక్క రూపు నెరుపురంగుతో రేఖామాత్రముగ వ్రాయుచుండిరి. దీనియందు మార్పులను చేయవలసి వచ్చినయెడల నలుపుతోకాని, యెరుపుతోకాని దిద్దుట కలదు. పిమ్మట యీరేఖలు కనబడునటులు పలుచని యాకుపచ్చరంగును పూసిరి(?). ఇది యారినపిమ్మట కావలసిన వర్ణలేపనముజేసి, మరల మట్టిరంగులతోను, నలుపుతోను తొలిరేఖలమీద దిద్దుచుండిరి. ఈ చిత్రకారుల గురువు వాటిని బరీక్షించి యచ్చటచ్చట సవరించునటుల గొన్ని చిత్రములందు కానవచ్చును.

"సున్నము పైనిపూసినయెడల కొన్నిరంగుల రూపుచెడును. కాన (యజంత) చిత్రకారు డన్నివర్ణముల నుపయోగింపజాలక పోయెను. ఆతడుపయోగించిన రంగు లించుమించుగ నన్నియు ప్రకృతియందు లభించునవిగ నున్నవి." తెలుపు, ఎరుపు, మట్టిరంగు, హరిదళము, ఆకుపచ్చ, నీలి, మసిని వీ రుపయోగపరచిరి. రంగులను రాళ్లపై నూరుచుండిరి. రంగుల నిటుల నూరుట వలననో లేక ప్రయాణికులు ఘసాలాలను; పచ్చళ్లను

మారుటవలననో యజంతకందరములందు రాళ్లపై గోతు లేర్పడియున్నవి.

వీ రెట్టి కుంచెల నుపయోగపరచిరో తెలియుట లేదు.

ఇటలీయందు నిట్టి రచన లేదనియు, ఈజిప్టునందు కొంత కలదనియు, రసాయనశాస్త్రజ్ఞానము విశేషముగ కల యీకాలమునగూడ నింతకు మించిన మార్గము తెలియదనియు గ్రిఫిత్సుగారు వ్రాసిరి.

కుడ్యచిత్రములు సాధారణముగ మోటుగ నుండును కాని యజంతచిత్రము లతి సున్నితముగ నున్నవి. వర్ణలేపనమున నిట్టి గభీరము, సౌందర్యము, నిర్మాలిన్యము మరెచ్చటను కానరాదని ఆక్జెల్ జారల్ (Axel Jarl) గారు వ్రాసియున్నారు:

“ మీదజెప్పిన కారణములవలన అజంతచిత్తరువుల రంగులు చాలావరకు మాసి చిత్రపుష్టినిజూపు లేత చాయలను, వర్ణములు వేరువేరుచోటుల వ్యత్యాసముతో చిత్రించుటవలన గలిగిన విస్పష్టతయు, వీటియన్నిటివలన గలుగు సౌందర్యమును అధికాంశము గోలుపోయినవి. తీవ్రతను విడనాడిన వర్ణములు— ముఖ్యముగ నలుపు మాత్ర మిప్పుడు మిగిలియున్నవి. ఒకానొక కాలమున నీ చిత్తరువులు గాఢమైనట్టియు, తేజోవంతమైనట్టియు నీలి, యాకుపచ్చలతోను, వాటివద్దనే వ్యతిరేక భావమున దోచు ఊదామట్టిరంగులతోను విరాజిల్లుచుండెను. రంగుల సౌందర్యము నధికపరచునటులు మిక్కిలి ప్రవేశముకల చేతితో దృఢముగ వ్రాయబడిన రేఖలు విరాజిల్లుచుండెను. అజంతచిత్రరచనయెడల సానుభూతికల సుప్రసిద్ధ చిత్రకారు లీచిత్రములు వేయిసంవత్సరముల క్రిందట యెట్లుండెనో యటు లూహించి వ్రాసినయెడల అజంత గుహాల మహిమ (మరికొంత) లోకమునకు ........ వెల్లడి కాగలదు.

“ తొమ్మిదవ గుహయందలి చిత్తరువులందు తప్ప యించుమించుగ నన్నిచిత్రములందును గాఢమైన వర్ణముల (సాధారణముగ నలుపునకు సంబంధించిన రంగుల) మధ్య లేతరంగులతో మనుష్యాకారము లుండుటవలన చిత్రోద్దేశములు స్ఫుటముగ కానవచ్చును. అచ్చటచ్చట లేత రంగులమధ్యను గాఢమైన రంగులతో మనుష్యాకారములను చిత్రించి వీటియందు భిన్నరుచులను జూపజాలిరి. ఈ రెండవతరగతి చిత్తరువులందు నల్లగ కొప్పును జూపుటవలన ముఖము తేజోవంతమై, చిత్రకారుడు చూపజూచిన భావములన్నియు స్పష్టముగ కానవచ్చును.”

అంజతయం దధమ మిరువదిరకముల చిత్రరచన కానవచ్చుచున్నదని హేరింఘాముసతిగారు వ్రాసిరి.

వర్ణలేపన మెంత యాహ్లాదకరముగ నున్నను అజంత చిత్రములకు—అజంతచిత్రముల కననేల, భారతీయచిత్రములకు—రేఖ ప్రధానము. దీనిసహాయముననే యీ చిత్రకారు లంగపుష్టిని, సౌందర్యమును, వ్యక్తివిన్యాసమును, సకలాలంకారములును, జీవచిహ్నములను, ప్రదర్శింపగలిగిరి. పూర్వము గ్రీసు, ఇటలీ, ఈజిప్టు దేశములందు రేఖలతో చక్కని చిత్రములను వ్రాసిరి కాని అజంతచిత్రములతో సౌందర్యమున సరిపోలవని చిత్రకళావిమర్శకు లందరి యభిప్రాయము. పాశ్చాత్యులు తమచిత్రములందు చూపు వెలుతురు చాయలు చేయగలిగిన పనిని హిందూ చిత్రకారులు రేఖలతో నెరవేర్పగలిగిరి. అచ్చటచ్చట విశేషముగ ఛాయ జూపవలసివచ్చినయెడల నీరేఖలకు తోడుగ కొంచెము చాయనుమాత్రము చూపుచుండిరి. స్త్రీలయొక్క సౌందర్యము, బోధిసత్త్వుల పరలోక ధ్యానము, ఏనుగుల పెద్దయాకారము, పోరాడు వృషభముల కోపము, అన్నిచిత్తవృత్తుల నన్నియాకారముల జూపగలిగి, హిందూచిత్రరచనను వేలకొలది సంవత్సరములు కాపాడిన యీ రేఖాప్రయోగముయొక్క ప్రవీణతను లోకమంతయు గ్రహించినది. అన్నివిషయములు నొకే రేఖయందిమిడియున్నటుల నిడివిగ దిద్దుబాటులు లేక రేఖలను రచించిన యాచిత్రకారు లద్వితీయులు.

సుప్రసిద్ధచిత్రము లిన్ని యెచ్చటను లేవు. ఇటలీయందుగల గోడలమీద బొమ్మలనేకము లున్నను భావగభీరత, ఆధ్యాత్మికచింత, రేఖావిన్యాసము, స్వేచ్ఛ, భావకేంద్రీకరణము మొదలగు విషయములం దజంత చిత్రములకు తీసిపోవుచున్నవి.

భారతీయచిత్రము లన్నియు చిన్నవని కొందరి యభిప్రాయము. మొఘులు, రాజపుత్ర చిత్రములు చిన్నవియేకాని పురాతనచిత్రములలో మన కిప్పుడు మిగిలియున్నవన్నియు గోడలమీద నుండుటవలన పెద్దవియై యున్నవి. రూపపటములు మొదలగునవి చిన్నవిగ వ్రాయుటయు కలదని పురాణములవలన మనకు తెలియుచున్నది. చిన్నచిత్రములనే వ్రాయు మొగలాయీల కాలమునందును గోడలపై వ్రాయబడిన పెద్ద చిత్తరువులు చక్రవర్తుల భవనములం దిప్పటికిని కానవచ్చుచున్నవి. కాన చిన్నవియో లేక పెద్దవియో వ్రాయవలెనను నియమమెప్పుడును లేనటులు తోచుచున్నది.

సృష్టియొక్క రహస్యములు, లోకమున దేవునిలీలలు, జాతియొక్క యాధ్యాత్మికపరివర్తనము మనోజ్ఞకళలవలన వ్యక్తమగుచుండును. మనోజ్ఞకళలు నాగరికతయొక్క ప్రతిబింబములు. పూర్వులు మనకు జూపిన చిత్రకళాదికళలశైలి వారు మన కళాజీవనములను బోషించుటకు విడచిన నిధులని భావించి వాటిని బోషించుట మనవిధి. ఇట్టి నిధులలో యజంత యొకటి. హైందవ నాగరికత మహదాశయములతో నిండియుండెనని యెట్టివారికైనను నచ్చజెప్పుట కీకందరములు చాలును. ఒక్కొక్క "గుహకు" వెళ్లి యాచిత్ర శిల్పరాజములను జూచిన యెడల నీప్రపంచమును మరచి, సగము కానవచ్చెడి యాపురాతన వ్యక్తుల చెలిమికూడి, వారి మహదాశయములను కొంత యవలంబించి నూతన జీవముతో నిండిపోవునటు లుండును. మనలను సంసారమునకు బంధించియున్న ప్రాపంచిక విషయము లొకటివెనుకనొకటి విడిపోవునటుల నుండును. చిత్రకళయెడల గల విముఖత ప్రేమగ మారును. పాశ్చాత్యవిమర్శకుల వ్రాతల నిస్సారత మనస్సునకు నాటును.

“ప్రపంచమునం దితరదేశముల చిత్రరచన శైశవదశయం దున్నప్పు డిట్టి చిత్తరువులను భారతదేశము సృజింపగలిగెను. .........ప్రతిముఖమును భావపూరితము. ప్రతిచిత్తరువును మనోభావములను మేల్కొలుపును. ఫలపుష్పములకు, జంతువులకు, మనుజులకు—జీవప్రవాహమునందలి యన్నితరగతులకును—ఈచిత్రపంక్తియందు తావు కలదు. క్షీణించెడి వస్తువులన్నియు దైవశక్తుల యావిర్భావమనియు, సకల జీవరాసుల కదలిక దేవుని విలాసమనియు నమ్మిన చిత్రకారులు భక్తితోను, గౌరవముతోను వీటిని చిత్రించినప్పు డవి యన్యముగ నుండునా?”

ఇట్టి చిత్రములను సందర్శించుట పుణ్యకార్యములలో నొకటి. భారతీయుల పుణ్యతీర్థములలో నజంత యొకటి.

భారతీయ చిత్రకారుల స్వేచ్ఛకు వారి రచనయొక్క ప్రత్యేకవ్యక్తిత్వమే నిదర్శనము. అజంతచిత్రములన్నియు స్వేచ్ఛగలిగియున్నవి. వర్ణవిభేదమునందును, రేఖాప్రయోగమునందును, వ్యక్తుల విన్యాసప్రదర్శనమునందును, చెట్టుపుష్పములు మొదలగువాటి నలంకారములుగ నుపయోగపరచుటయందును స్వేచ్ఛ తాండవమాడుచుండును. తమశక్తిని, భక్తిని, ప్రేమను, జీవితాదర్శములను ఈ చిత్రకారులు స్వేచ్ఛతో చిత్రరచనకొరకు ధారపోసినటులున్నది. మతముకొరకు తమజీవితమును వినియోగించుటకు ప్రాపంచికబంధములను వీడినవారికిని, వారిచేయు కార్యములందును స్వేచ్ఛయుండని యెడల మరెచ్చటయుండును ?

తాము నివసించిన ప్రపంచము నాచిత్రకారు లజంతయందు సురల సృజింపగలిగిరి. చుట్టునున్న జంతుజాలములు, మానవులు వారిహస్తములందు వింతగ పరివర్తితములయ్యెను. సహజముగ నీచిత్రము లున్నవని యనేకులు పొగడియున్నారు. కాని ప్రకృతిననుసరించి వ్రాయబడిన చిత్రములకును వీటికిని విశేషము భేదము కలదు. చిత్రరచనా విధానమును మరచి తక్కినవిషయములబట్టి చూచినను ఈ భేద మెట్టివారికైనను గోచరింపకమానదు. ఆచారప్రాయముగ వ్రాయుశైలియు, ప్రకృతియందు కానవచ్చెడు లావణ్యమును కలసినయెడల నిట్టి నవీనరచన యేర్పడునని చెప్పినంతమాత్రమున నీభేదమున కర్థము చెప్పినవారముకాము.

ప్రతివస్తువున దేవుడు కలడనియు, నా మహాశక్తి వలననే ప్రపంచమంతయు నడచుచున్నదనియు, జీవరా

సులకు సేవ చేయజాలుటవలననే దేవుని సమీపించవచ్చుననియు హిందువులు నమ్ముచున్నారు కాన వీరికి సకల వస్తువులయెడల సోదరభావము, ప్రేమ, గౌరవము కలదు. కళావేత్తలైన యీ చిత్రకారులకు సాధారణమానవునికంటె యెక్కువదైవత్వము ప్రకృతియందు కానవచ్చుటచే నీదైవత్వము తమచిత్రములందు చూపజూపుటకు యత్నించుటవలన నిట్టి సౌందర్యమును, ఉత్సాహమును, పరలోకచింతయు కలుగజేయు చిత్రములు మనకు లభించినవి. వీటిప్రత్యేకత చాలావర కిందుగలదు.

మన కవిశేఖరు లాడువారి పెద్దరొమ్ముభాగమును, సన్నని నడుమును, పెద్దపిరుదులను, ముఖముయొక్క మనోహరాంగములను విరివిగ వర్ణించియున్నారు. వీరూహించినసౌందర్యమునకును, పాశ్చాత్యకవిశేఖరులూహించిన సౌందర్యమునకును విశేషము భేదము కలదు. భారత వాఙ్మయమును సృజించిన వారియొక్కయు, భారతచిత్రములను సృజించినవారియొక్కయు నాగరికత యొక్కటియే కాన భారతచిత్రకారులు రచించిన మానవవ్యక్తి విన్యాసమునందును ప్రత్యేకరుచులు కలవు.

సంగీత, సాహిత్య, చిత్రలేఖనములు మతమునకును, తత్త్వవిద్యలకును చెలికత్తెలవలె అనాదినుండియు నుండెను. కాన మనోజ్ఞకళల వినియోగమున నాధ్యాత్మికదృష్టి విశేషముండును. అజంతయందు సృజింపబడిన వ్యక్తుల ముఖముల నీదృష్టి మనకు స్పష్టముగ కానవచ్చును.

అజంత విధానములను పునరుద్ధరించెదమని యిప్పుడు చిత్రకారులు పూనుకొని రచించు చిత్రములలో కొన్నిటినిజూచి అజంతచిత్రములు సహజముగ లేవని తలంచుట కలదు. అజంతచిత్రకారులకు గల వస్తుజ్ఞానము, మానవచిత్తవృత్తులజ్ఞానము నద్వితీయములు. ప్రతియంగమునందును, ప్రతిజంతువునందును, ప్రతిపుష్పమునందును, ప్రతియలంకారమునందును వీరిజ్ఞాన మెంతగొప్పదియయిందియు కానవచ్చును. ఇట్టి జ్ఞానముండెను కనుకనే వీరిష్టమువచ్చినటులు స్వేచ్ఛగవ్రాసి యాబ్రహ్మదేవునకు క్రొత్తరుచులను నేర్పించిరా యనునటులు చిత్రించిరి. ఆ చిత్రకారులు రచించిన దృశ్యములలో కొన్ని యిప్పటికిని యజంతపరిసరప్రాంతములందు జూడనగును. కాని యీ దృశ్యములందలి గొప్పతనము నేను వారు ప్రదర్శించుటచేత మనకు గలిగిన యుత్సాహమునకు మేర లేక యున్నది. అజంత యొకనూతనసృష్టి; మన మనుదినమున గోరు లోపము లేనిప్రపంచము; ఒక మహత్తు.

దృశ్యజ్ఞాన మీచిత్రకారుల యాస్తి. అంగముల యునికి, చెట్లరచన మొదలునవన్నియు నీప్రకృతినియమముల ననుసరించి యున్నవి.

దుస్తుల రచనయందును వీరుచూపిన జ్ఞానమునకు సాటిలేదు. దళసరివస్త్రములను వ్రాయునప్పుడును లోపలియంగముల యునికియు, వాటిసౌందర్యమును కనబడునటుల రచించిరి. కాని సన్ననిదుస్తులను రచించుటయందు వీరి ప్రవీణత వర్ణనాతీతము. దుస్తులు, లోనున్న మనోహరాంగముల మనోహరత్వము నధికపరచుటకేకాని దాచుటకు కాదనునటుల నొకరేఖవలనను, వ్రేలాడు కొనలవలనను మాత్రము వస్త్రములను సూచించి యితరులకాదర్శకులైరి. రాజులు, రాణులు, ధనికులు నలంకృతులు. దుస్తులు వీరిమీద విశేషముగ గానరావు. బహుశః వీరిదుస్తులు భారతదేశపు సన్నని మజిలీను లేమో? భిక్షుకులకు నగలులేవు కాని వారి ప్రత్యేకవస్త్రములు కానవగును. నటులు రంగులబట్టలను అలంకారములను ధరించియున్నారు. సేవకుల, బీదల వస్త్రములు ముతుకుగనున్నవి.

“,........ చిత్తరువులందలి హస్తముద్ర మనోహరముగ నున్నది. దైవపూజయం దిప్పటికి నీముద్ర మనదైనిక కార్యములం దెట్టి ప్రాముఖ్యము వహించెనో చూడగలము. నిర్జీవములగు నీచిత్రములు తమభావములను వాక్కులద్వారా కాక వ్రేళ్లద్వారా చూపరులకు జెప్పునటులుండును. ప్రతివ్రేలియందును జీవమున్నటులుండును. చేతులు ముడుచుకొనుట, వ్రేళ్ల ననేకవిధముల వంచుట, మణికట్టుయొక్క సుందరమైన వంపు, వీటిన్నిటికి నర్థముకలదు. తెలియబరచు భావ మేదియు లేనప్పుడు పాత్రయో, వింజామరమో, పుష్పమో (అనుగుణముగ) హస్తము నలంకరించియుండును. ఇట్టి సమయములందు కూడ నీహస్తముల సౌందర్య మద్వితీయము. చిత్రకారున కిందుగల ప్రవీణత—ముఖ్యముగ మృదంగము మొదలగు వాటిని వాయించుచున్నటులు చిత్రించినప్పుడు—చూడన

గును. కోమలములును, సుందరములు నైన వ్రేళ్లతాకుడు మాత్రమున నాయంత్రములు వింతస్వరములతో సజీవము లైనటుల నాతడు చిత్రింపగలిగెను. తక్కినవిషయము లటుండ నీయొక్క ప్రవీణతకుమాత్రము హైందవచిత్రకారుడు మిగుల గౌరవార్హుడు."

"అజంతగుహల స్త్రీ చిత్రములుమాత్ర మీ చిత్తరువులను సుప్రసిద్ధములుగ జేయుటకు చాలును. నవలాది గ్రంథరచయితల గొప్పతనము ముఖ్యముగ వారు సృజించు స్త్రీపాత్రలపై నాధారపడియుండునట్టులు చిత్రకారుల చాకచాక్యము వారి స్త్రీ చిత్రములవలన గ్రహింపవచ్చును. అజంత చిత్రకారు లీ విషయమున మిగుల పరిశ్రమజేసి గెలిచిరి. వీరిచే సృజింపబడిన స్త్రీలందరు సురూపవతులు. వికారము స్త్రీల కిడుట యాచిత్రకార సన్యాసుల మతముకాదు. మగవా రెంతసురూపులైయున్నను, మనోహరములగు వస్తువు లెన్నియున్నను స్త్రీలు ప్రపంచము నలంకరించుటయం దగ్రస్థానమున నుండుటకు తగినవారలు. అజంతయందు స్త్రీ లిట్టిస్థానము నలంకరించియున్నారనుట నిశ్చయము. ఎన్ని చిత్తరువులందు వీరు కానవచ్చినను సౌందర్యము లేనివారు మాత్ర మచ్చట కానరారు. పుష్పములచే హిందువులు పవిత్ర హృదయముతో దేవు నెటు లారాధింతురో యటులు అజంతచిత్రకారులు స్త్రీలతో నృపులసభలను, వీథులను, కిటికీలను అలంకరించి లలితకళాసరస్వతి నారాధించిరి. మతవిషయక చిత్తరువులనేకాదు.— అలంకరించుకొనునటులు, సంభాషించుచున్నటులు, నిలువబడియున్నటులు, సేవచేయుచున్నటులు, భిక్ష మెత్తుకొనునటులు, స్త్రీలను చిత్రించి చిత్రకారులు తృప్తిజెందిరి. అలంకరించుకొనుటయం దద్వితీయులని గ్రహించి వారిస్త్రీలను తమకు తోచిన యన్ని భూషణములతోను నింపిరి. స్త్రీ లలంకారముగ నుపయోగపడనిచోటుల వారి యలంకారములగు ముత్యములు మొదలగువాటి నలంకారముగ వ్రాసిరి. ఇట్టి స్త్రీల యారాధన యితరచిత్రసమితులయందు కానవచ్చుట దుర్లభము. స్త్రీల నెన్నివిధముల వీరు చిత్రించినను నిందారోపణము, పాతివ్రత్యములేమి మాత్రము కానరాదు. ఎచ్చట జూచినను వీరియెడల సోదరీభావము కలుగుచుండును. అచ్చటచ్చట వీరు పురుషులవద్ద కొనవచ్చెదరు. కాని యసభ్యతమాత్రము వెదకినను కానరాదు. ఇంతకుమించిన నారీమణుల యారాధన వేరుకలదా? సౌందర్య కేంద్రీకరణము స్త్రీలయందు కలవని వీరు భావించినటులు కనబడును. స్త్రీలను ప్రత్యేకముగ స్త్రీలుగ మాత్రము గణింపక వారి నొక సౌందర్యసంస్థ గణించి యారాధించిరి.

ఆధ్యాత్మిక ప్రపంచమంతయు నానంద, సౌందర్యమయము. కనుక నాచిత్రకారులు రచించినదంతయు సుందరముగ నుండెను. స్త్రీలేకాదు-పురుషులు, పక్షులు చేపలు, పుష్పములు, పత్రములు—అన్నియు సుందరముగ నున్నవి. విచారమును కలుగజేయు విషయములను వ్రాయవలసివచ్చినప్పు డారసమును పోషించుట కితరములగు మార్గములను వెదకిరేకాని సౌందర్యమును మాత్రము తగ్గింపలేదు. చావుకు సిద్ధముగనున్న సానియొక్కయు, మరణించుచున్న రాణియొక్కయు చిత్రములు దీనికి నిదర్శనములు.

ప్రపంచమంతయు జీవముతో నిండియున్నది! ఎచ్చటజూచినను దేవుడు కలడు. ఈవిషయమును బాగుగ గ్రహించి యాగోడల నెచ్చటను విడువక తమచిత్రములతో నింపిరి. పెద్దచిత్రములమధ్య కొంతస్థలము మిగిలినను, స్తంభములపైని, కప్పులపైని, యలంకారముగ చిన్న చిన్న చక్కనిబొమ్మలను వ్రాసి యావిహారములను, చైత్యములను కళాలయములుగ జేసిరి. కథ నేదైన జెప్పునప్పుడు చిత్రములను వ్రాయుచు నాచిత్రముల మధ్యమధ్య సూచనామాత్రముగ కొన్నివిషయములను వ్యక్తీకరించి వ్రాసి యాభాగమును నింపి కథయొక్క యర్థమును పూర్తిచేసిరి.

కుడ్యచిత్రములు మరల ఆదరణకు వచ్చుచున్న యీకాలమున నజంతచిత్రము లనేకవిషయములను మనకు నేర్పగలవు. వీటి నాదర్శముగ నుంచుకొనినయెడల పరు లేమియన్నను మన చిత్రకళాజ్ఞానమున కెప్పటికి నెట్టి కొరతయు వాటిల్లదు.

అజంతకళాలయములను నిర్మించిన కళారాధకుల గూర్చి మన కేమియు తెలియదు. లోకమున ఖ్యాతిమం

తెలుసుటకు వారు చిత్రించలేదు. ఇప్పటి చిత్రములందు వలె కాక యెచ్చట వెదకినను వారి పేర్లు కానరావు. తాము నిజమని నమ్మిన విషయములయందు—బౌద్ధమతము, సృష్టియందుగల మహిమ, ప్రపంచము నెడగల నమ్మకము—వారు చిత్రించుటయందు తమ యావచ్ఛక్తిని ధారపోసిరి. కళారాధనమున తమ్ము దామ మరచిరి. తాము చేయుచున్న పనియందు వారి కెప్పుడు నీరసభావము, విశ్వాస రాహిత్యము లేకపోయినవి. కనుకనే యట్టి మహాకందరములను సృజింపగలిగిరి.

వీరి యుత్సాహమున కంతు లేకపోయెను. అటులగానియెడల నిరువదితొమ్మిది మహానిర్మాణములను సృజింపగలుగు టెటులు? ఉత్సాహమే యన్ని ఘనకార్యములను తుదవరకు జేయించును. ఉత్సాహమే వ్యయప్రయాసములను మరచునటుల జేయును. ఈచిత్రకారుల యుత్సాహ మానిర్మాణములందును, చిత్రములందును బాగుగ కానవచ్చును. ఇందువలనగూడ నీ చిత్రములు సజీవములై యున్నటులు మన కిప్పటికిని గోచరించును.

నిర్మాణకర్తలు, శిల్పులు, చిత్రకారులు నొకేవిధమున, నొకేదృష్టితో తమపనిని నెరవేర్చుచుండుటచే నీ కళావిధానము లన్నియు నచ్చట మేళవించి మనల నాశ్చర్యమున ముంచుచున్నవి. నిర్మాణ సౌందర్యముకొరకు శిల్పులు చిత్రకారులును, శిల్పసౌందర్యముకొరకు నిర్మాణకర్తలు చిత్రకారులును, చిత్రరచనకొరకు నిర్మాణకర్తలు శిల్పులు పాటుపడినటులు కనబడుచున్నది.

అజంతకందరములు బౌద్ధమతముకొరకు బౌద్ధులచే నిర్మింపబడినను నిజమగు మనోజ్ఞకళ లిందు మూర్తీభవించియున్నవి. కనుక నవి దేశ, కాల, మత భేదములెరుగనివిగ నున్నవి. ప్రపంచమున నన్ని దేశములవారు, నన్ని మతములవారును వీటి నిప్పుడు ప్రశంసించుచున్నారు. వందలకొలది సంవత్సరముల క్రిందట, వందలకొలది సంవత్సరముల వరకు నిర్మింపబడిన యవి యన్నియు నిప్పుడు మనల నుత్సాహపూరితులుగ జేయుచున్నవి. కళలు చేకూర్చు విశ్వభ్రాతృత్వ మిచ్చట గలుగుచున్నది.

అజంత కందరములు భారతదేశీయులచే భారతదేశమున నిర్మింపబడుటచే వాటివలన మనకు గౌరవము కలుగుచున్నది. పూర్వికులు మనకొరకు విడిచిపెట్టినవివి. పవిత్రసంస్థలు కనుక వాటి నారాధించి, యాకందరములు నేర్పునదంతయు నేర్చుకొనుట మనవిధి. వారి వలె కళారాధనము, సృష్టి జేసి వారికి నూతనగౌరవమును చేకూర్చుట మన పవిత్రధర్మము. ఆ శిల్పులు, చిత్రకారులు మనగురువులు. వారి నారాధించి మనము సనాతన భారతీయ జీవనముయొక్క గొప్పతనమును లోకమంతట జాటి, స్వదేశము నాచిత్రకారుల కుండెడి యుత్సాహముతో నింపుటకు భగవంతుడు మనకు శక్తి నిచ్చుగాక!

(ఈ వ్యాసమును వ్రాయుటయందు ఇ. బి. హేవెలుగారు, గ్లాడ్‌స్టన్, సోలొమనుగారు, పెర్సీ బ్రౌనుగారు, విన్సెంటు స్మిత్తుగారు, నిహాలుసింగుగారు, కన్యాలాలు వకీలుగారు రచించిన గ్రంథము లుపయోగపడెను. వారియెడల కృతజ్ఞుడను. నేను రచించి యాంధ్రగ్రంథమాలయందు ప్రచురించిన "భారతీయ చిత్రకళ" యను గ్రంథమునుండికూడ కొన్ని భాగముల నిచ్చట జేర్చితిని.)

---

# లోకల్ బోర్డులు—స్త్రీలు

శ్రీమతి చిలుకూరి లక్ష్మీనరసమ్మగారు

లోకల్ బోర్డులంటే గ్రామమునకు సంబంధించిన పంచాయతీలు, తాలూకాలకు సంబంధించిన తాలూకాబోర్డులు, జిల్లా మొత్తమునకు సంబంధించిన జిల్లాబోర్డులు అనేవి.

వీటిలో అల్పసంఖ్యాక వర్గములవారితోబాటు స్త్రీలకుకూడా ప్రత్యేకస్థానములు క్రొత్త లోకల్ బోర్డుల (౧౯౩౧ సం. రపు) చట్టమునందు జిల్లా, తాలూకాబోర్డులందు ఏర్పాటుచేయబడినవి.

స్త్రీలకు ప్రత్యేకస్థానము లుండడమువల్ల, సామాన్యస్థానములకు వారు నిలువకూడదనే నిషేధములేదు. పురుషులతోబాటు వారున్ను ఆస్థానములకు నిలువవచ్చును.

క్రొత్తచట్టముప్రకారము ఆయాలోకల్ బోర్డులకు ఎన్నికలు అచిరకాలములో జరుగబోతున్నవి. ఎన్నికలకోసము సంప్రతింపులు, సలహాలు, సహాయాభ్యర్థనములు, సభ్యాశ్వ నివేదికలు అప్పుడే తయారవుతున్నవి. ఎన్నికలలో సాధారణముగా జరిగే సంఘర్షణములు తలచూపుతున్నవి.

ఈ సంఘర్షణములోనికి స్త్రీలు కూడ ప్రవేశింపవలసిన ఆవశ్యకత యేర్పడినది. కాని క్రొత్తగా కల్పింపబడిన సౌకర్యములు గలిగిన స్త్రీ, ఎన్నికల గొడవకు క్రొత్తదయిన స్త్రీ, ఈ సంఘర్షణముయొక్క వేడిమికి నిలువగలదా అని సందేహము కలుగుతున్నది. పురుషుల కుండే గౌరవపు ఆశ స్త్రీకి కలిగినప్పుడు, ఆ ఆశకు అంతు ఉండదు. అందుచేత ఎన్నికలలో కలిగే సాధారణమైన పక్షవిభేదములలో ఆమెకూడా తగుల్కొనవలసి వస్తుందేమో అని భయమవుతుంది. స్త్రీల నట్టిపక్షసమరములలోనికి దింపుట భావ్యము కాదు. సాధారణముగా వారిని పక్షరహితముగానే ఎన్నుకొనుట ధర్మము.

సంఘములో సగముమంది పురుషులు, సగముమంది స్త్రీలు. ఇన్నాళ్లున్ను ఉన్న గౌరవమంతా, ఉన్న హక్కులన్నీ, ఉన్న అవకాశములెల్లా పురుషుల అధీనములోనే ఉండేవి. ఇప్పుడిప్పుడు కొంచెము కొంచెముగా స్త్రీలకు కొన్ని సౌకర్యములు కలిగినవి.

పురుషులు లోకల్ బోర్డులలోచేరి ఏమి సేవ చేయగలిగినారో, ఆసంఘసేవను స్త్రీలు కూడా చేయగలరు. పురుషులేయేమోహములకు పాల్పడి, తమస్థానముల నేయే దుర్వినియోగముల కుపయోగించినారో ఆమోహములకున్ను, ఆ కష్టములకున్ను ఆ అగౌరవములకున్ను, అపవాదులకున్ను స్త్రీలను కూడా పాల్పడ జేయడమువల్ల సంఘముయొక్క రెండో అర్థభాగమునుకూడా కళం

కముపాలు చేయడమే అవుతుంది. కాబట్టి, రాబోవు లోకల్‌బోర్డుల ఎన్నికలలో సభ్యత్వ మునకు అభ్యర్థినులుగా నిలిచే స్త్రీలు పక్షము లకు చేరక స్వతంత్రముగానిలబడి కృతార్థలు కావడము మేలు. వోటరులుకూడా ఇట్టి దృష్టితోనే సభ్యురాండ్ర నెన్నుకొనడము మంచిది.

స్త్రీలు సభ్యురాండ్రయి ప్రత్యేకముగా లోకల్‌బోర్డులలో చేయదగిన దేమున్నదని అడిగేవారు లేకపోలేదు. పక్షములలో చేరక స్వతంత్రంగా, అన్ని పక్షముల సదాశయముల కున్ను అనుకూలముగా, ఆయాసంస్థ లుపక రించే ప్రదేశములకు స్త్రీ చాలామేలు చేయ గలదని చెప్పవచ్చును. నిష్పక్షపాతముగా వ్యవహరించడానికిన్ని, పక్షవిభేదములవల్ల కలిగే అన్యాయములను చాలావరకు తగ్గించ డానికిన్ని స్త్రీ ఉపకరించేటట్లు పురుషు డుపక రింపనేరడు. పురుషునికి తరతరములనుంచిన్ని వస్తూ ఉన్నది అహంకారము. స్త్రీకి అనాది నుంచిన్ని తన్ను మరచిపోయి యితరులకు సేవచేసేబుద్ధి నాటుకొని ఉన్నది. ఈబుద్ధి స్త్రీ స్వభావములో వేరు నాటుకొని పోయినది. అందుచేతనే ఆమెకు ఓర్పు, ఔదార్యము, సమత్వము సహజలక్షణములుగా వెలసినవి. ఈ గుణములు స్త్రీకి పురుషుడు నేర్పినవే.

ఇన్నాళ్లున్ను ఆ సుగుణముల నలవడజేసి తానెట్లు సంచరించినా, పురుషుడు స్త్రీని గృహాధిదేవతగా నిలుపుకొన్నాడు. గృహాము ననాదినుంచిన్ని కాపాడగలిగిన స్త్రీ, సంఘ మునుకూడా కాపాడగలదనే విశ్వాసముతో, సంఘమనే పెద్ద కుటుంబములోకూడా ఆమె కొకస్థానమును కల్పించినాడు. తన సేవాధర్మ మును గృహములో సరిగా నిర్వహించే సామ ర్థ్యమును రుజువుచేసి, స్త్రీయే సంఘములో ఇప్పటి స్థానమును సంపాదించుకొన్నదని అయినా చెప్పవచ్చును.

లోకల్‌బోర్డులనేవి శాసనసమ్మతములైన, కావలసిన రక్షణములతో కూడిన, సక్రమ ముగా సంఘవ్యవహారములను సరిచూడడాని కేర్పడిన సంస్థలు. గృహమునందు సాధారణ ముగా ఇంటిపెద్దమాటయే చెల్లి తీరవలెననే నియమ ముంటుంది. ఇంటిలోనివారు తన వారు కాబట్టి ఇంటిపెద్ద తన అధికారమును దుర్వినియోగము చేయడనే విశ్వాసమును పుట్టించి, ఇంటివా రందరియెడలను పిన్న పెద్ద తారతమ్యమును చూపి, చనవు, గౌరవము, ప్రేమ, భయము, భక్తి అనే గుణములను చూపి, ఇతరులలో పుట్టించి, కలతలు లేకుండా వ్యవహారములను చూచుకొంటాడు. ఇట్టి పరి పాలనమునకు దయాసహితనిరంకుశాధికార మని అంటారు. కాని, సంస్థలలో పిన్న లుం డరు కాబట్టి, ఎన్నోతలలు పనిచేయవలసి యుండడముచేత సహజముగా సంఘర్షణము కలుగుతుంది. అందుచేతనే అధికసంఖ్యాక సభ్యుల నిర్ణయము ననుసరించి వ్యవహారము లను నడుపవలసి ఉంటుంది. ఆనిర్ణయమునకు

# రూపరేఖ చిత్రావళి



౧. కృష్ణలీల

చిత్రకారుడు: శ్రీ శారదా ఉకిల్ గారు, ఢిల్లీ.



౨. సైరంధ్రీ బలాత్కారము

చిత్రకారుడు : శ్రీయుత ఎం. వి. ధురంధరు, బొంబాయి.

అల్పసంఖ్యాకపక్షమువారు తలలొగ్గవలసి ఉంటుంది.

సభ్యులందరున్ను సమత్వబుద్ధితో, పరస్పరసహనముతో వ్యవహరిస్తే ఎట్టి సంఘర్షణమున్ను కలుగడానికి అవకాశ ముండకూడదు. కాని, మానవ స్వభావములో సద్గుణములతో బాటు దుర్గుణములున్ను ఉన్నవి. ఆ దుర్గుణములలో అహంభావము, మొండిపట్టుదల, స్వలాభాపేక్ష అనేవి ముఖ్యములు. ఇవి తలచూపడము చేతనే సాధారణముగా పక్షము లేర్పడడము సంభవించినది. ఇది మన దేశమునకు పట్టిన అనర్థము. పక్షప్రభుత్వమనేది ఇతర దేశములలో లేకపోలేదు. కాని, ఆ పక్షములు పై దుర్గుణములవల్ల పుట్టక, ఆయాసంస్థలను నడుపవలసిన విధానమును గూర్చిన అభిప్రాయభేదములవల్ల కలుగుతవి. అవలంబింపవలసిన విధానమునుబట్టి ఏర్పడిన పక్ష ప్రభుత్వము మంచిదే. అయినా, మనసంస్థలను నడుపవలసిన విధానము ముందుగా నిర్ణయముకాదు. సభ్యులయేవరకున్నూ తామెందుకు సభ్యులు కాగోరుతున్నారో ఆలోచింపరు. ఒక కార్యప్రణాలిక నేర్పరచుకొని, దానిని నిర్వహించడానికి సభ్యులు కాగోరుతున్నాము కాబట్టి మమ్మెంచుకోవలసినదని వోటరులను కోరడము మన కలవాటులేదు. ఉద్దేశరహితమైన ఈ అభ్యర్థనమువల్ల సంఘమునకుగాని, సంస్థలకుగాని మేలు కలుగజాలదు. అట్టి సంస్థలలోని పక్షములు నిరర్థకములై పైజెప్పిన దుర్గుణములే లక్షణములుగా కలిగి ఉంటవి. ఈ అవస్థ లోకల్‌బోర్డులకే కాక పెద్దశాసనసభలకుకూడ మన దేశములో పట్టినది.

ఈ దురవస్థను తొలగించవలెనంటే, ఏ సంస్థలలోని సభ్యులైనా మున్ముందుగా ఒక కార్యప్రణాలిక నేర్పరచుకొని పక్షములుగా ఏర్పడి, ఇతర పక్షములను తమప్రక్కకు ఆ ప్రణాలికకు సుముఖులయేటట్లు ఆకర్షింప ప్రయత్నింపవలెను. ఈపక్షములలో కులము, వర్ణము, మతము, బాంధవ్యము అనే పూర్వకాలపు శ్రుతికి తప్పినఘోష అడుగంటవలెను. దేశక్షేమము, "సర్వేజనా స్సుఖినో భవంతు" అనుభావము, న్యాయము, ధర్మము అనే సంగీతము హృదయాల కానందము కలిగింపవలెను. లోకల్‌బోర్డులీ యేకజాతీయతాభావమునకు పునాదులు కాబట్టి, ఆ భావము లక్కడనే కుదురుకొంటేనేతప్ప, దేశప్రభుత్వహర్మ్య మచిరకాలములో శిథిలము కాక తప్పదు.

లోకల్‌బోర్డుల ఎన్నికలలో అనేకవిధములైన దురాచారములు బహిరంగముగా జరుగుతూ ఉన్నవని అందరున్నూ అనుకుంటూనే ఉంటారు. వాటిని అరికట్టడానికి మాత్రము ఎవ్వరున్ను పూనుకొనరు. కారణములు (౧) భయము, (౨) లేని పోని గొడవనాకేల అనే భావము, (3) అజ్ఞానము. వీటిలో వోటరు లందు సామాన్యముగా వ్యాపించిఉన్న అజ్ఞా

నమే ప్రబల కారణమని చెప్పక తప్పదు. వారికి వోటంటే ఏమిటో, దానివల్ల తనకున్ను సంఘమునకున్ను ప్రయోజనమేమిటో, దానిని సరిగా వినియోగింపక పోవుటవల్ల కలిగేనష్ట మేమిటో తెలియదు. 'వోటుకు ఎంత ఇస్తావు' అని ఏలముపాటకు అభ్యర్థులను దింపేటంతటి హీనదశకు వచ్చినదని లోకములో వాడుక. ఇది నిజమయితే వోటరులు తాత్కాలిక లాభము నాసించి, తమకును తమ సంఘమునకును తీరరాని అపకారము చేస్తూ ఉన్న విషయమును మరచినవా రౌతారు. అందుచేత ప్రజాపరిపాలన విధానమునుగూర్చిన్ని, అందులో ముఖ్యముగా లోకల్‌బోర్డుల పరిపాలనవిధానమును గూర్చిన్ని జనులలో జ్ఞానమును వ్యాపింప జేయవలసి ఉన్నది.

ఈపనిని స్త్రీలు చేయగలరా! తాము సభ్యత్వము నభ్యర్థించినప్పుడు దురాచారములకు లోనుగాక, తమకార్యావిషయములందు సరియైన జ్ఞానమున్నదనిన్ని, తమసభ్యత్వమును న్యాయముగను, నిష్పక్షపాతముగను నిర్వహింపగలమనిన్ని వోటరులకు విశ్వాసమును కలిగించినయెడల వోటరులు పురుషులపట్ల ఎట్లు సంచరించినా, స్త్రీలయెడల తామును విశ్వాసము కలిగి ప్రవర్తిస్తారనడాని కవకాశము లేకపోలేదు.

లోకల్‌బోర్డులు నిర్వహింపవలసిన ధర్మములను (౧) బోర్డుకు అధికారముగల ప్రదేశములోని జనులక్షేమము, (౨) ఆరోగ్యాభివృద్ధి, రోగనివారణము, (3) స్థానికప్రజలకు అనుకూలమైన ఏర్పాటులు, (౪) విద్య—అని నాలుగు విధములుగా భాగింపవచ్చును. వీటిలో (౧) జనులక్షేమముకోసము మార్కెటులు, కసాయిదుకాణములు, పశువధశాలలు, బండ్లదొడ్లు మొదలయినచోట్లలో మురికి, కంపు, చేరకుండచేయవచ్చును. మురుగుకాలువలు, పాయఖానాలు, ఉచ్చలదొడ్లు మొదలైన వాటిని నిర్మించి వాటిని పరిశుభ్రముగా ఉండేటట్లు చూడడమేకాక, అట్టివి ప్రయివేటువున్నయెడల వాటినికూడా పరిశుభ్రముగా ఉంచేటట్లు చేయవచ్చును. జనులు క్రిక్కిరిసి నివసించే సందుగొందులను విశాలముచేయించి యిండ్లు తగినంతగాలి, వెలుతురు కలిగిఉండేటట్లుగాను, పెరడులు కలిగిఉండేటట్లుగాను, నిర్బంధము చేయవచ్చును. రోడ్లప్రక్కను చెట్లను నాటించుట, పార్కులనేర్పాటుచేయుట, ఆయాస్థానములను అందముగానుంచుట మొదలయిన పనులను చేయవచ్చును. (౨) రోగనివారణముకోసము వైద్యశాలలను, ఉచితౌషధశాలలను, ప్రసవశాలలను, పశుచికిత్సాలయములను స్థాపింపవచ్చును. ఆరోగ్యసంరక్షణముకొరకు టీకాలు వేయించడము, కుష్ఠురోగుల శరణాలయములను స్థాపించడము మొదలైన ఏర్పాట్లు చేయవచ్చును. ఆరోగ్యక్షేమాభివృద్ధిసంఘములకు ధనసహాయము చేయవచ్చును. పేదలసహాయముకొరకేర్పడినసంఘములకును, వ్యాధిగ్రస్తులకును, బలహీనులకును సహాయముచేయడాని

కేర్పడిన సంఘములకును, అంగహీనులు, దిక్కుమాలినవారు మొదలయినవారి సహాయమున కేర్పడిన సంఘములకును ధనసహాయము చేయవచ్చును. (3) జనుల అనుకూలముకొరకు ప్రయాణికుల బంగళాలు, సత్రములు, చలిపందిరులు, నీటికొళాయిలు, బావులు, చెరువులు మొదలయినవాటికి ధనమును ఖర్చుపెట్టవచ్చును. వంతెనలు, త్రాడు వంతెనలు, బల్లకట్లు మొదలయినవాటి నేర్పాటుచేయవచ్చును. జనులప్రయాణసౌకర్యమునకు రోడ్లనువేయించి వాటిని బాగుచేయించి మోటారుబస్సులను తాము సొంతముగా నడిపించి, రైళ్లునిర్మించి, అనేకవిధములుగా పని చేయవచ్చును. అన్నిటికంటె ముఖ్యమయిన (4) విద్యకోసము ధనవినియోగము చేయవచ్చును. ఇందుకొరకు ఉత్తమ, మధ్యమ, సాధారణతరగతులుగల పాఠశాలలనుస్థాపించి, వాటిని సరియైనస్థితిలోనుంచి ఋతుపాఠశాలల నేర్పరచి, పఠనాలయములను, గ్రంథాలయములను, సంచారగ్రంథాలయములను ఏర్పాటుచేసి రాత్రిపాఠశాలలు, వృత్తిపాఠశాలలు నడిపించి, శాస్త్రపరిశోధనాలయములకు ధనసహాయముచేసి, ఈరీతిగా ఎన్నోవిధముల విద్యాభివృద్ధికి తోడ్పడవచ్చును.

పైని వివరించిన విధులలో పురుషులే నిర్వహింపగలిగినదిన్ని, స్త్రీలు నిర్వహింపలేనిదిన్ని ఒకటిన్నీ లేదు. కాని, స్త్రీలు తక్కిన వాటినిగూర్చి శ్రద్ధతీసికొంటూ, ఆరంభదశలో సాధారణ విద్యావ్యాప్తి, గ్రంథాలయస్థాపనము, ప్రసవవైద్యశాలలు, శిశురక్షణ సంఘములు, స్థానికరామణీయకత అనే విషయములనుగూర్చి సంపూర్ణమైనశ్రద్ధను చూపిస్తే, జనుల ఆక్షేపణకున్ను, అపనిందలకున్ను గురికాక, అందరి మన్ననలకున్ను, కృతజ్ఞతకున్ను పాత్రులౌతారు. సాధారణముగా స్త్రీలు పక్షసంఘర్షణములోనికి దిగక, అందరికిన్ని ఆమోదకరములయిన విషయములలో పురుషసభ్యుల సహాయమును కోరితే వారు తమ సంపూర్ణ సహాయమును చేయకపోరు.

---

# హిందూదేశ పరిపాలనావిధానము

చావలి వెంకట హనుమంతరావుగారు, యమ్. ఏ., బి. ఇడి.

(అయిదవ భాగము)

మాంటేగ్యూ-చెల్మ్సుఫర్డురిపోర్టునందిమిడియుండిన ద్వంద్వప్రభుత్వవిధానము హిందూదేశములో ప్రచురింపబడినపుడు దేశస్థులు దానినిగురించి ఎట్లభిప్రాయపడినదియు ఇంతకు ముందుభాగములో చెప్పబడినది. ఆ విధానము ఇంగ్లండు, ఇండియాలలో చర్చింపబడు సమయమందే దేశమం దనేకచోట్ల విప్లవసంఘములు బయలుదేరుటయు, కొన్ని రాజకీయహత్యలు జరుగుటయు తటస్థించెను. రాజకీయరంగమందు బయలుదేరిన ఈ క్రొత్త పరిణామములనుగూర్చి విచారించి తగు సలహా నిచ్చుటకై ప్రభుత్వమువారు రౌలట్ సంఘము (Rowlett committee) ను నియమించిరి. ఈ కమిటీవారు సంగతుల నన్నిటిని విచారించి చివరకు విప్లవోద్యమము నరికట్టుటకు ఒక శాశ్వతమైన చట్టము నేర్పాటుచేయుట అవసరమనియు, సాధారణక్రిమినలు చట్టములు ఆపనికి తగినవి కావనియు సూచించిరి. ప్రభుత్వము కమిటీవారి సూచన ననుసరించి వెంటనే విప్లవసంఘముల నణచుటకు ప్రభుత్వోద్యోగియులకు పూర్తియగు అధికారముల నిచ్చు ఒక చట్టమును తయారుచేసి భారతశాసనసభలో ప్రవేశపెట్టిరి. దీనికే రౌలట్ బిల్లు (Rowlett Bill) అనిపేరు. దానిపై దేశమం దంతటను ఒక గొప్పదియు, తీవ్రమైనట్టియగు ప్రతికూలోద్యమము బయలుదేరెను. ప్రతిచోటను ఈక్రొత్త నిర్బంధ-చట్టమును ఖండించుచు సమావేశములు, సభలు జరుపబడెను. చివరకు రౌలట్ బిల్ శాసనసభలో ఆమోదింపబడినప్పటికిని దానిని ప్రభుత్వమువా రింతవరకు ఎన్నడును ఆచరణయం దుంచియుండలేదు.

ఇట్టి ప్రతికూలపరిస్థితులలో ఏర్పాటు చేయబడిన నూతనసంస్కారణముల జయము మొదటినుండియు చాల అనుమానముగానే యుండెనని వేరుగ చెప్పవలయునా? హిందూదేశప్రజలు కోరినదానికిని ప్రభుత్వమువారిచ్చినదానికిని చాల వ్యత్యాసము కలదు. కాన దేశములో రాజకీయఅశాంతి ప్రబలుట, ద్వంద్వప్రభుత్వవిధానము విఫలమగుట తటస్థించెను.

### ౧౯౧౯-వ సం. పు ఇండియాప్రభుత్వచట్టము

ప్రస్తుతము మనదేశమం దమలులో నున్న రాజ్యాంగవిధానము ౧౯౧౯ లో ఏర్పాటుచేయబడిన ఇండియాప్రభుత్వపు చట్టము (Government of India Act of 1919) పై నాధారపడియున్నది. ఆచట్టము బ్రిటిష్

పార్లమెంటువారిచే ఆమోదింపబడెనుకాని అంతకుముందు హిందూదేశపు పరిపాలనా విధానమునందర్భములో ఏర్పాటుచేయబడిన ఇతర-చట్టములవలె అది దానియంతట నది సంపూర్ణత్వము కల్గియుండలేదు. అది ౧౯౧౯-వ సంవత్సరములో ప్రవేశపెట్టబడిన ఇండియాప్రభుత్వచట్టమునకు సవరణగా పార్లమెంటులో ప్రవేశపెట్టబడి ఆమోదింపబడెను. అదియుగాక చట్టములో చేర్చబడని అనేక విషయములు తరువాత అవసరమునుబట్టి చట్టముక్రింద చేయబడిన రూల్సు (Rules made under the Act) మొదలగువాటి మూలమున ఆచరణలోనికి తీసుకొనిరాబడెను. ఈ'రూల్సు' అన్నియు ఇండియాప్రభుత్వమువారిచేతనే చేయబడి వారిచేతనే మార్చబడవచ్చునని కూడ నిర్ణయింపబడెను. కాని వాటిలో ఏవైనను పార్లమెంటువారి ఆమోదనను పొందవలసిన అవసర మున్నప్పుడు వాటిని పార్లమెంటుఎదుట పెట్టి వారిచే ఆమోదన పొందినప్పుడే ఆచరణలోనికి రావచ్చునను నిబంధన ఏర్పాటుచేయబడెను. ఆ ఆమోదన పొందిన వెంటనే వాటికి సాధారణ-చట్టముల యధికారము వచ్చును.

ఈ భారతదేశీయ ప్రభుత్వచట్టము ౧౯౧౯-వ సం. డిశంబరు ౨౩-వ తేదీని సార్వభౌమునిచే సంతకముచేయబడెను. తరువాత సుమారొకసంవత్సరకాలము చట్టముక్రింద అవసరములగు కొన్ని నిబంధనలు తయారుచేయుటతోడను, ఎన్నికదారుల పట్టీలు తయారుచేయుటతోడను గడచెను. ౧౯౨౦ నవంబరులో క్రొత్తసంస్కరణములక్రింద మొట్టమొదటి ఎన్నిక (General Election) జరిగి 1921 జనవరిలో శాసనసభలు, కార్యనిర్వాహకవర్గములు ఏర్పాటుకాబడి పని ప్రారంభింపబడెను. 1921 ఫిబ్రవరి 9-వ తేదీని కానాటుప్రభువు (Duke of Connaught) భారతకేంద్రశాసనసభప్రారంభోత్సవము జరిపెను. అంతకుముందే ఆతడు సంస్థానాధిపతుల సభను (Chamber of Princes) కూడ తెరచెను.*

నూతనసంస్కరణముల నిజవైఖరిని చూచి వాటియందలి ప్రధానవిషయములను గూర్చి చర్చింపకపూర్వము ఒక ముఖ్యమైన సంగతిని మనము జ్ఞాపకముంచుకోవలసియున్నది. "హిందూదేశపు పరిపాలనావిధానము 'ఫెడరల్' పద్ధతులపై ఏర్పాటుకాబడవలెను" అను సూత్రమును మనస్సునందుంచుకొని మాంటేగుఛ్యామ్సుఫర్డు రీసంస్కరణములను ఏర్పాటుచేయుట కుద్దేశించిరి. అందుల కనువుగ నుండునట్లు రాష్ట్రీయకేంద్రప్రభుత్వములు

* భారతదేశరాజ్యాంగవిషయములలో స్వదేశసంస్థానాధిపతుల కిదివర కున్న సంబంధమును గట్టిపర్చి వారికిని బ్రిటిష్ఇండియా ప్రజలకును సమానసంబంధములు గల విషయము లన్నిటిలోని ఇరుపక్షములవారికిని సహకారముకల్గించు నుద్దేశ్యముతో ఈసభ ఏర్పాటుచేయబడెను. కాని ఈఆశయము పూర్తిగ నెరవేరినదని సంస్థానాధిపతుల సభవారి పనినిబట్టి చూచిన చెప్పుట కష్టము

పరిపాలనాధికారములను ఫెడరల్ రాజ్యాంగ (Federal Constitution) సూత్రానుగుణముగ విడదీయుటకు వీలైనంతవరకు ప్రయత్నింపబడెను. 1919-వ సం.పు భారతరాజ్యాంగ సంస్కరణములు ఏర్పాటు కాబడునంతవరకు భారతప్రభుత్వవిధానము "యూనిటరీ" (Unitary) పద్ధతులపైననే నడుపబడుచువచ్చెను. కేంద్రప్రభుత్వమువారికే పరిపాలనావిషయము లన్నిటియందును చివర అధికారముండి ఆ ప్రభుత్వమువారి యాజమాన్యముక్రిందనే రాష్ట్రప్రభుత్వములు తమ చేతిక్రింద నుంచబడిన ప్రభుత్వశాఖలను పరిపాలించుచుండెడివి. పరిపాలనావిషయములందేకాక, ఆర్థిక, శాసనాద్యధికారములుకూడ కేంద్రప్రభుత్వమువారికే యుండుచుండెడివి. కాని నూతన సంస్కరణములు ప్రవేశపెట్టుటవలన పూర్వ పరిస్థితు లన్నియు తారుమారయినవి.

౧౯౦౭ లో భారతప్రభుత్వమువారు భారతరాష్ట్రీయప్రభుత్వాధికారములను విడదీయు నుద్దేశ్యముతో "డిసెంట్రలైజేషను కమీషను" (Decentralization Commission) అను సంఘము నేర్పాటుచేసిరి. అప్పటినుండియు రాష్ట్రముల కెక్కువ స్వాతంత్ర్యముల నిచ్చు అభిప్రాయము భారతప్రభుత్వమువారి కుండియేయుండెను. ౧౯౧౧ లో అప్పటి రాజప్రతినిధియగు హార్డింజిప్రభువు ఈవిషయమును గురించి ముఖ్యమగు నివేదికను బ్రిటిష్ప్రభుత్వమువారికి పంపెను. దానియందాతడిట్లు వ్రాసియుండెను: "హిందూదేశములో సంపూర్ణపరిపాలనాస్వాతంత్ర్యము గల రాష్ట్రములను వాటి యన్నిటిపైనను కేంద్రశాఖలపైననే అధికారముగల భారతప్రభుత్వమును ఏర్పాటుకాబడు పరిస్థితు లేర్పడువరకు, వీలైనప్పుడెల్లను, వీలైనంతవరకు రాష్ట్రములకు స్వపరిపాలనాధికారముల నిచ్చుచుండుటయే హిందూదేశరాజ్యాంగసమస్యను పరిష్కరించుటకు ముఖ్యమార్గము." హార్డింజిప్రభు విచ్చిన ఈఅభిప్రాయమువలన ఆతడు ౧౯౧౯ లో ఏర్పాటుకాబడనున్న సంస్కరణములను కొంతవరకు తెలుసుకొనగలిగెనని చెప్పనగును. రాష్ట్రీయస్వాతంత్ర్య సూత్రమున కర్థము రాష్ట్రములకు కొన్నిశాఖలపై పూర్తియగు అధికార మిచ్చుటయు, ఆశాఖల విషయమై కేంద్రప్రభుత్వమువారు కలుగజేసికొనకుండ నుండుటయు నైయున్నది. ఇట్టి రాష్ట్రీ స్వాతంత్ర్యమునకు ప్రథమసోపానము ౧౯౧౯-వ సం.పు సంస్కరణముల ప్రకారము ఏర్పాటుచేయబడినదని చెప్పవచ్చును.

ఈసంస్కరణచట్టమునందలి మొదటి శెక్షను మొదటి సబుశెక్షనుప్రకారము ఏయేశాఖలు కేంద్రప్రభుత్వముక్రిందను, ఏ ఇతర శాఖలు రాష్ట్రీప్రభుత్వములక్రిందను నుండవలెననువిషయము నిర్ధారణచేయుటకును, రాష్ట్రీశాఖలలో ఏవి మంత్రుల యధికారముక్రింద నుండవలెను, ఏవి "రిజర్వు" శాఖలుగా నుండవలెననునిర్ణయము చేయుటకును, ఏయే

మార్గములవలన ఆయాప్రభుత్వములకు అవసరమగు సొమ్ము ఏర్పాటుచేయబడవలెను అని నిర్ణయించుటకును నిబంధనలు ఏర్పరుపవలెనని చెప్పబడియున్నది. ఆనిబంధన ననుసరించి ఈ క్రిందివిధముగ పరిపాలనశాఖల విభజన "డివల్యూషను" రూల్సులో చేయబడెను.

కేంద్రప్రభుత్వము క్రింద నుండవలసిన శాఖలు:—

౧. దేశసంరక్షణ
౨. విదేశాంగవ్యవహారములు
3. స్వదేశసంస్థానములతో గల వ్యవహారములు
౪. సముద్రతీరప్రదేశములు, రేవుపట్టణములు
౫. రైల్వేలు; పోస్టుటెలిగ్రాఫ్ శాఖలు
౬. నాణెములు
౭. ప్రభుత్వపు అప్పు; సేవింగ్సుబ్యాంకు శాఖ; పెన్షను లెక్కలు
౮. వర్తకవ్యాపారము; గనులు
౯. సుంకముల శాఖ; ఆదాయపు పన్ను శాఖ; ఉప్పుశాఖ
౧౦. సివిల్, క్రిమినలుచట్టములు
౧౧. నల్లమందుశాఖ
౧౨. కేంద్రపరిశోధనసంఘములు
౧3. రాష్ట్రపుసరిహద్దులయందు మార్పులు
౧౪. రాష్ట్రములకీయబడని ఇతరశాఖలన్నియు

రాష్ట్రీయప్రభుత్వములక్రింద శాఖలు, (రిజర్వుశాఖలు):
(Reserve Departments)

(1) భూమికి సంబంధించిన చట్టములు; ఇతరములగు భూమిపన్నుకు సంబంధించిన విషయములు, (2) క్షామనివారణ, (3) వ్యవసాయపు నీటిసప్లయి, (4) న్యాయశాఖ, న్యాయస్థానములు, (5) పోలీసుశాఖ, జైళ్లశాఖ, (6) అడవులు, (7) ఫ్యాక్టోరీలు, వాటితనిఖీ, పనిచేయువారికి సంబంధించిన విషయములు, (8) ఏజెన్సీవిషయములు.

ప్రజాయత్తశాఖలు:— (Transferred Departments) త్రాగుడు, మత్తుపదార్థములపై పన్నులను విధించు అధికారము, (2) స్థానికస్వపరిపాలనాశాఖ, (3) విద్యాశాఖ, (యూరోపియన్, ఆంగ్లో-ఇండియన్ విద్య లేదు) (4) ఆరోగ్యశాఖ, (5) వైద్యశాఖ, (6) పబ్లిక్ వర్క్సుశాఖ, (7) అభివృద్ధిశాఖ, పరిశ్రమల నభివృద్ధిచేయుట, (8) వ్యవసాయశాఖ, (9) పశువులశాఖ, చేపల సహకారసంఘములు.

సర్వసాధారణముగ ఏప్రభుత్వముక్రింద నున్న శాఖలవిషయములో ఆశాసనసభవారికే చట్టములు చేయు అధికారము లీయబడెను. కాని కొన్నికొన్ని శాఖలు రాష్ట్రశాఖలుగ పరిగణింపబడినప్పటికిని వాటిని గూర్చి చట్టములుచేయు అధికారము కేంద్రశాసనసభవారికి వదలివేయబడెను. అట్టివాటిలో ముఖ్యమైనవి,— (i) వ్యవసాయపుకట్టడములు మొదలగునవి, (ii) హైకోర్టులు, వాటి

నిగురించిన విషయములు, (iii) ఫ్యాక్టోరీలు, కార్మికులకు సంబంధించిన విషయములు, (iv) క్రొత్త విశ్వవిద్యాలయముల నేర్పాటుచేయుట. ఈవిషయములలో కేంద్రప్రభుత్వము వారి కీ యధికారము నిచ్చుటలో ముఖ్యోద్దేశము, అవి అఖిలభారతప్రాముఖ్యము కలవగుటయు, వాటియందు దేశమం దంతటియందును ఒకేవిధమగు పద్ధతి అమలునం దుండుటకు గల ఆవశ్యకతయు.

కాని ఈసందర్భములో ఒక ప్రధాన విషయము గమనింపవలసియున్నది. గవర్నరు జనరలు అనుమతితో భారతశాసనసభవారు కాని రాష్ట్రశాసనసభవారుకాని వాటికి పూర్తిగ సంబంధములేని శాఖలనుగురించి కూడ (అనగా రాష్ట్రసభవారు కేంద్రశాఖకు సంబంధించిన విషయములనుగురించి ఆరాష్ట్రమునకు సంబంధించినంతవరకును, కేంద్రశాసనసభవారు రాష్ట్రశాఖలనుగురించియు) చట్టములను చేయుటకు నిబంధనలప్రకారమవకాశ మీయబడెను. సర్వసాధారణముగ ఈ అధికారమును ఆయాశాసనసభలవా రంత హెచ్చుగ ఉపయోగించియుండక, ఏశాసనసభవారికి ఏశాఖలనుగురించి చట్టములను చేయుట కధికారము కల్గియున్నవో వాటిని గురించియే చేయుటయే ఇంతవరకు జరిగినదని చెప్పవచ్చును.

---

# తంజావూ రాంధ్ర నాయకరాజాస్థాన సంస్కృతాంధ్ర కవులు ౧

కురుగంటి సీతారామయ్యగారు, యం. ఏ

## పూర్వరంగము-సంస్కృతవాఙ్మయము

అపౌరుషేయములని బ్రాహ్మణులచే గొనియాడబడుచు, ప్రపంచంబున నెల్ల ప్రథమగ్రంథమని పాశ్చాత్యవిజ్ఞానవేత్తలచే ప్రశంసింపబడుచున్న ఋగ్వేదము ప్రపంచముయొక్క కన్నుల దెరచెను. ఋగ్వేదము చారిత్రకదృష్టితో పఠింపబడినదాదిగా, నీభారతదేశమునకు పశ్చిమముననుండు భూములలో నైర్లండువరకు ప్రచారమున నున్న యన్నిభాషలకును సంబంధమున్నట్లు భాషాతత్త్వవేత్తలకు పొడకట్టెను. అనేక విషయముల పాశ్చాత్యులకు మార్గదర్శకమైన భారతదేశము భాషాశాస్త్రమునకు[1] కూడ మార్గదర్శక మయ్యెను. నృవంశశాస్త్ర[2] ముద్భవిల్లెను. మొత్తముమీద కొంతకాలమునకు పరిశోధకు లందరును, నార్యులను నొకజాతివారెచ్చటినుండియో పశ్చిమద్వారముద్వారా భారతదేశమున ప్రవేశించి, తమకు పంచనద (Punjab) దేశమును నివాసముగా నేర్పరుచుకొని కొన్నిసంవత్సరము లుండిరనియు, ఋగ్వేదము వారి నాగరకతను తెలియచేయు చారిత్రకప్రాముఖ్యముగు గ్రంథమనియు, నిప్పటివరకు నమ్ముచున్నారు.[3] ఈయార్యులకు ప్రథమనివాస మెద్దియని యనేకులు భిన్నాభిప్రాయములతో నున్నారు. ఈ కేంద్రభూమిని గొంపోయి పాశ్చాత్యులు యూరపుఖండమున నుంచుచున్నారు. కాని ప్రాచ్యపండితులు తద్వాదమును ఖండించి తత్ప్రదేశము నాసియాఖండములో మధ్యనో ఉత్తరముననో యుంచుచున్నారు. తిలకుమహాశయుడు జ్యోతిషసాక్ష్యమునుబట్టి యేతత్ప్రదేశ ముత్తరకురుభూముల (Arctic circle) వద్ద నని యభిప్రాయపడినాడు.[4] వీరు చీలిన కాల మెవ్వరును నిదమిత్థమని నిర్ధారణచేసి చెప్పియుండలేదు. ఊహలు మాత్రమున్నవి. పైవిషయము లన్నియు వాదోపవాదములపై నాధారపడియున్నవి. మరియొక వాదము సిద్ధాంతమగువరకు నీవాదమును విశ్వసింపవలసియున్నది.

ఈయార్యులభాష గీర్వాణమనిగాని, దేవభాష యనిగాని పిలువబడుచున్నది.[5] ఈయది గీర్వాణమని శ్రీ వేదం వెంకటాచలయ్యగారును,[6] దేవభాషయని శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారును[7] తెల్పుచున్నారు. శ్రీ యాచార్యులవారు దేవదేశమని యొకదేశ మున్నట్లును, అచ్చటి భాష దేవభాషయనియు, అదియే యిప్పుడు సంస్కృతమని వాడబడుచున్నదనియు సహేతుకముగా వాదించుచున్నారు. వేదత్రయ మీయార్యులోనర్చెడి యాగాంగములని స్పష్టము. సంహితాభాగములు

---

1. Comparitive Philology
2. Ethnology.
3. ఇటీవల యీ 'వలస'నుగూర్చి యనుమానము లచ్చటచ్చట వెలిబుచ్చబడుచున్నవి.
4. అవినాశచంద్రదాసుగా రీస్థానము సప్తసింధనుపేరుగల పంజాబే నని తమ గ్రంథములో మిగిలినయభిప్రాయముల నన్నిటిని ఖండించి సిద్ధాంతము చేయుచున్నారు. (Rigvedic Culture, A. C. Das.)
5. సంస్కృతే మనుపద మిటీవలనే యీభాషకు వచ్చినది.
6. కతిపయ శబ్దార్థ శబ్దస్వరూప విచారము. (భారతిలోని వ్యాసావళి.)
7. చెన్నపురి నిటీవల యిచ్చిన యుపన్యాసము.

మొదటను తరువాత. బ్రాహ్మణాదులును క్రమముగా నుద్భవిల్లెను. ఈజాతియు జనసంఖ్య యెక్కువకాగా దేశమున ప్రాక మొదలిడిరి. దేశభేదముతో నీ వేదమున శాఖభేదము లుద్భవిల్లెను. వీరిలో కొందరు తత్త్వాన్వేషణమునకు గడంగిరి. వారి యనుభవమే యుపనిషత్సమూహము. ఈ యుపనిషత్తులు వేదములకు తుదిభాగములగుటవలన శ్రుతిశిరస్సులనుచు వాడబడుచున్నవి. ఈ శ్రుతిశిరస్సులు పుట్టిన కాలమువరకు నీజాతివా రుత్తర భారతమునందే యుండినట్లు కానవగును.[1] కాలముగడచుకొలదియు నీవేదములకును తద్భాగములకును పవిత్రత హెచ్చెను. జాతి యభివృద్ధియగుకొలది క్రమముగా రాజ్యాంగము ప్రబలెను. రాజ్యములు స్థాపింపబడెను. కర్తవ్య నిర్వహణమునకై వర్ణవిభాగ మేర్పడెను. రానురాను గొప్ప నాగరకత ప్రబలెను. క్రమముగా భాషలోకూడా మార్పులు కలిగెను. వేదములను తరువాతి వాఙ్మయమును పరిశీలించినయెడల నీమార్పు కన్నులకట్టినట్లు గన్పట్టగలదు. క్రమముగా భాషకు వ్యాకరణ మేర్పడెను. ప్రథమమున రామాయణాది పురాణములును తరువాత క్రమముగా వాఙ్మయమంతయును పెరిగెను. రామాయణకాలము నాటికే రాజ్యాంగమును, వర్ణాశ్రమధర్మ నిర్వహణమును నవిచ్ఛిన్నముగా నడచుచున్నట్లు "కచ్చిత్సర్గ"వలన మనకు తెలియగలదు, ధర్మము నిర్వచింపబడెను. ఈ రామాయణ మార్యుల దక్షిణ దేశయాత్రను తెలుపునని కొందరు చారిత్రకుల మతము. ఇది నిజమే కావచ్చును. అప్పుడు దక్షిణదేశము ఇప్పటివలె బహుజనాకీర్ణముగాక యార్యులకంటె భిన్నులగు కొన్ని జాతులవారిచే నావృతమై యుండెను.[2] మహాభారతకాలము నాటికి దక్షిణదేశము రాజ్యములతో నిండినట్లు స్పష్టముగా తెలియుచున్నది. ఆర్యనాగరకత దక్షిణమున పూర్తిగావ్యాపించుటకు తప్పక కొన్ని శతాబ్దములు పట్టియుండును. అదివరకుకూడా కొంత నాగరకత ఇచ్చటయుండెనని నిర్వివాదము. సమ్మేళన ముభయతారకమయ్యెను. కొంత జాతిసమ్మేళనముకూడా జరిగియుండవచ్చునని నమ్మవలయును. ఆర్యులు దక్షిణదేశమునకు రా మొదలిడిననాటిగా వారి వాఙ్మయాభివృద్ధికి దక్షిణముకూడా కొంత సాయపడెనని చెప్పవలెను. తరువాత సూత్రకాలమునాటికి కొందరు దాక్షిణాత్యులుకూడా సూత్రకర్తలై కొన్ని యాచారవ్యవహార భేదముల నెలకొల్పిరి. ప్రథమార్యుల దక్షిణదేశాగమనము షుమారిప్పటికి ౩౦౦౦ సంవత్సరములైయుండవలెనని కొందరి యభిప్రాయము.[3] ఈకాలము నింకను వెనుకకు నెట్టుట పరిశోధకుల యాచార మగుచున్నది. నూతనపరిశోధనల వలన నార్యనాగరకత యిప్పటికంటె ప్రాచీనతరమని నిర్ధారణ మగుచున్నది. ఈసందర్భమున శ్రీయుత తేకుమళ్ల రామచంద్రరావుగారు భారతియందు వ్రాసిన వ్యాస ముద్బోధకరము.[4]

సూత్రకాలము క్రీ. పూ. ౩ క్రీ. వె. ౨-వ శతాబ్దముల మధ్యనని పాశ్చాత్యపండితు లభిప్రాయపడుచున్నారు.[5] ఇట్టి సూత్రకారులలో దాక్షిణాత్యులుకూడా కలరు. బోధాయనాపస్తంబు లిందు ముఖ్యులు. ఈబోధాయనాపస్తంబులనుగూర్చి చెప్పునపుడు క్రీ. పూ. ౭, ౮ శతాబ్దముల ప్రాంతమున నార్యులు దక్షిణమునకు వచ్చియుండవలెనని డాక్టరు వింటర్నిజుగా

1. Dr. Winterntz's History of Indian Literature, Vol. I. p. 303.

2. నృవంశశాస్త్రజ్ఞులు అస్థినిర్మాణాదులయందు ఆర్యులకును ద్రావిడులకును భేదము లున్నట్లు చెప్పుచున్నారు.

3. History of India from earliest times, Dalal. p.36.

4. భారతి ఆంగీరస వైశాఖమాస సంచిక. (Rigvedciculture, A. C. Das.)

(ఆర్యనాగరకతను దాసుగారు దాదాపు 25000 సంవత్సరములవరకు వెనుకకు నెట్టుచున్నారు.)

5. Dr. Kieth's History of Classical Sanskrit Literature, p. 472

రభిప్రాయపడుచున్నారు.1 నిజము కనుగొన్న నీకాలమునకంటె పూర్వమే కావలయును. ఇచ్చట యిదమిత్థమని చెప్పుటకు వీలు లేదనియే వింటర్నిజుగారి యభిప్రాయమని గ్రహింపనగునుగాని వారు చెప్పిన, ౭, ౮ శతాబ్దము లనునూహ నిష్కృష్టమని గ్రహించుట కెంతమాత్రమును వలనుపడదు. సూత్రకాలము ౫-వ శతాబ్దమని చెప్పునప్పుడుకూడా యిట్లే యూహపై నాధారపడియున్నదనియే చదువరులు గ్రహింతురుగాక! ఈసందర్భమున నాపస్తంబుడు వింటర్నిజుగారు చెప్పు కాలమునకంటె ప్రాచీనుడనుటకు శ్రీ పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యుక్తియుక్తమగు వాదము చదువరులకు విన్నవించుచున్నాను.2

ఆకాలమునుండి యార్యవిజ్ఞానమునకు దక్షిణభారతదేశము తోడ్పడుచునే యుండెను. ఉపనిషత్తులందుండు తత్త్వశాస్త్రవిషయములనుగూర్చి సూత్రకర్తలు దర్శనములు వ్రాయుకాలమునందుకూడా తద్రచనమునందీదేశము సాయపడెను. ఆచారవ్యవహారముల దక్షిణ సాంప్రదాయములు వెలువడెను. సూత్రకర్తల వ్రాతలలో వీనిని స్ఫుటముగా చూడగలము. దర్శనకాలమునకు పూర్వపునాటికే దక్షిణభారతదేశము స్వతంత్ర నాగరకత కలిగి దానికిని ఆర్యనాగరకతకును కల్గిన సంఘర్షణమున మార్పులు చెందియుండెను. ఈ సంఘర్షణమున కేవల నాగరకతలేగాక జాతులయందుకూడ సాంకర్యముకూడ గలిగినట్లు చెప్పవలసియున్నది. దర్శనకాలమునకు పూర్వమే యిచ్చట భక్తిమతములు (అనగా శైవ వైష్ణవమతములు) ప్రబలియున్నట్లు చరిత్రకారు లందరును తెల్పుచున్నారు.3 ఇటీవలి పరిశ్రమలవలన నీద్రావిడనాగరకత యింకను ప్రాచీనమని చారిత్రకులు చెప్పుచున్నారు. అన్యోన్యసమ్మేళనము ఫలముగా దక్షిణ భారతదేశమునందలి కొందరార్యులు దక్షిణదేశభాషనే మాతృభాషగా గొనియుందురు. ఆర్యసంబంధముకల కొన్ని ద్రావిడకుటుంబములకుకూడ ద్రావిడమే మాతృభాషగా నుండెను. ఇప్పటి దక్షిణభారతమునందలి బ్రాహ్మణాది జాతులకు ద్రావిడభాష మాతృభాషగా నుండుట కిదియే కారణము. కాని యార్యవాఙ్మయము పరిశ్రమచేయబడుచు వేదాదులు నిరంతరపాఠ ప్రవచనములలో నుండెను. ఈ యార్యులకు నదీతీరములు ముఖ్యవాసస్థానము లయ్యెను. వానిలో గోదావరి, కృష్ణ, కావేరి, తామ్రపర్ణి ముఖ్యములు. బోధాయనాపస్తంబులేగాక కాత్యాయనాదులగు వ్యాకరణశాస్త్రజ్ఞులుకూడ దక్షిణదేశవాసులేనని చారిత్రకుల యభిప్రాయము. ఉత్తరమువలెనే దక్షిణమున శిష్టుల

1. "The fact however that some Vedic scholars such as those of Baudhayana and Apastamba originated in the South of India makes it probable that the conquest of the south by the Aryans must have taken place much earlier, perhaps as early as 7th or 8th century B. C., for the who'e countıy can hardly have been colonised and Brahminised immediately after the conquest to such an extent that Vedic schools could originate in the distinct South." (History of Indian Literature, Dr. Winternetz, pp. 299-300.)

2. ఆంధ్రపత్రిక ఆంగీరససంవత్సరాది సంచిక పు. 176.

"There is nothing like finality in views that are mainly based on mere intelligent guesses, surmises and probabilities, rather than on positive uncontestable historical proofs..........."
(A. C. Das in Rigvedic India, Vol. VIII.

3. Some Contributions of Southern India to Indian culture.
Dr. Winternetz's History of Indian literature; pp. 526, 527, 304

కాటపట్టని తలంపబడుచుండెను.[1] భాషలోకూడ దాక్షిణాత్యులు మార్పులకలుగజేయుచుండిరి. ఈమార్పుల నౌత్తరాహులు ప్రశంసించుచుండిరి. కావున నన్ని విషయములను దాక్షిణాత్య సంప్రదాయములు వెడలి యౌత్తరాహులచే నామోదింపబడుచుండెను. క్రమముగా నార్యలమతము, విజ్ఞానము, రాజధర్మము, నితరధర్మములన్నియు నాసేతుహిమాచలమును వ్యాపించుటయేగాక యితరదేశములకుకూడ వ్యాపించెనని యిటీవలి విమర్శకులు చెప్పుచున్నారు. ఇదియే యార్యజాతియొక్క భారతదేశ వైజ్ఞానిక విజయము. ఈయార్యవిజ్ఞానములో నెల్లదర్శనములు నిగ్గు. ఈయన్నిదర్శనములకును పునాది యుపనిషత్తులైనను వీనిలో వేదాంతదర్శనము సానదీర్చిన జాతిరత్నము. ఉపనిషత్తు లార్యతత్త్వ సంబంధవిజ్ఞానమునకు తుదిమాట. ఆధునికులు తాము నూతనమని చెప్పు నన్ని సిద్ధాంతములు నిందిమిడియున్నవి. సర్వతత్త్వ విషయములందును వీనిని తుదిపలుకు లనుట వింతకాదు.[2] ఈ యార్యజాతి మిగిలిన శాస్త్రములనుకూడ యశ్రద్ధ చేయలేదు. కాని మతము ప్రధానముగాగల జాతిగాన నన్నివిషయములకును ముఖ్యముగా మతము వాతావరణము కల్పించుచుండెను. కావ్యనాటకసృష్టియే గాక వైద్యము, జ్యోతిషము, తుదకు నాట్యము, సంగీతము, అలంకారకావ్య శాస్త్రములుకూడ వీరి పరిశ్రమలకు గురియయ్యెను. ఇటీవలివరకును నర్థశాస్త్రమున వీరు పరిశ్రమచేయనట్లు పండితులు భావించిరి. కాని ఇటీవల బయటకు వచ్చిన కామందకీయ, కౌటిల్యార్థశాస్త్రములు వారి పరిశ్రమను చాటుచున్నవి. కాని యన్నిశాఖలను మతమున కంగములుగా భావింపబడెను. ఇట్లిప్పటికి మనకు వచ్చిన యార్యవిజ్ఞానము సర్వతోముఖము. ఉత్తరమున నుద్భవమంది ప్రతివిషయమును దక్షిణమునకు వచ్చినవెనుక దాక్షిణాత్యులు దానిని తమకు తగినట్లు మార్చుట యొకయాచార మయ్యెను.

ఇట్లు శాఖోపశాఖలై ప్రబలుచుండగా మహమ్మదీయదండయాత్రలు వచ్చెను. వీనిచే నుత్తరము దక్షిణభాగముకంటె కష్టపరంపరకు పాలయ్యెను. మాలికాఫరు[3] క్రింద అల్లాయుద్దీన్ కిల్జి[4] పరిపాలనమున వచ్చిన దండయాత్రతప్ప దక్షిణము నంతకుపూర్వ మితరమహమ్మదీయదండయాత్రలు కలంచలేదు. మహమ్మదుగజనీ కాలమునుండి కొన్నిశతాబ్దము లుత్తరదేశము దినదినైకభయోత్పాతములచే గాలము గడపెను. అందుచేత నీవాఙ్మయాభివృద్ధికి కొంతదెబ్బ తగిలెను. పదునొకండవ శతాబ్దముతరువాత నుత్తరభారత మీవాఙ్మయాభివృద్ధియందు పాల్గొనుట తగ్గెను. కాని దక్షిణము తనకు తోచినట్లు, తదభివృద్ధికి సాయపడుచునేయుండెను. కుమారిలభట్టు, శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మొదలగు గొప్పవ్యక్తు లిచ్చట నుద్భవించి తద్విజ్ఞానాభివృద్ధిని సర్వతోముఖముగ సాగించిరి. మహమ్మదీయులు మొట్టమొదట దక్షిణమునకు వచ్చినది ౧౩-వ శతాబ్దారంభము. అంతకుపూర్వము ఇతరజాతులవారనేకులు వచ్చి యీదక్షిణభారతదేశమును పరిపాలించినను వారు ఆర్యుల నాగరకతకుగాని వాఙ్మయమునకుగాని శత్రువులుగా మెలంగక పోవుటయేగాక పైపెచ్చువానితో కలసిపోయి యొక్కొక్కప్పుడు వానికి యూతకూడా యొసంగిరి. వారు తెచ్చిన నాగరకత యార్యులదానినుండి మిక్కిలి భిన్నముగాకపోవుటచే నట్లు తటస్థించెను. వీరియొక్కయు, బౌద్ధమతవాఙ్మయములయొక్కయు సంబం

1. "The true home of the Sistas is given by Patanjali as Aryavartha, but even in his time the Deccan was the home of Sanskrit. Katyayana himself seems to have lived there in 3rd century B. C Yaska (500 B. C.) already mentions a southern use of Vedic word Vijamati and Patanjali records the love in the south of darivative formations and the use of Sarasi (large pond)" (Dr. Keith's Classical Skt. Literature, p. 15.

2. Philosophy of Upanishads, Sir Radhakrishnan.

3. Malikafur.

4. Allauddin Khilji.

ధముచేత ఆర్యవిజ్ఞానవాఙ్మయములు బహువిశాలములై వరలెను. మహమ్మదీయుల రాక చల్లనిదికాదు. వారి నాగరకత, వాఙ్మయము, మతము, భిన్నములగుటచేతను మతవ్యాపనమును, ధనార్జనమును వారి ముఖ్యోద్దేశ్యము లగుటచేతను భయమును, పీడయు వారిముందు నడచెను. వారెచ్చటికి పోయినను బలవంతమున మతమున కలుపుకొనుట, దోపిడి యను రెండుపనుల చేయసాగిరి. మతవ్యాపనమని యనేకక్రూరకృత్యములను వారొనర్చినట్లు గ్రంథదృష్టాంతములు కలవు. వీరికి దక్షిణభారతము దాదాపు ౭౫ సంవత్సరములు గురియయ్యెను. ఈకాలమునందలి యీదేశస్థితి గంగాదేవీకృతమధురావిజయకావ్యమున మిక్కిలి రసవంతముగను, కండ్లకు కట్టినట్లును వర్ణింపబడినది.[1] బ్రాహ్మణపండితులు వీరి దృష్టికి గురియైరి. వీరు మధురరాజధానిగా చేసుకొని దాదాపు దక్షిణహిందూస్థానము నంతను తమ పీడకు గురియొనర్చిరి. దేశమంతయు భయావహ మయ్యెను. అందుచే నీకాలమున సంస్కృతవాఙ్మయమును, పండితులును మూలల దాగుకొనవలసివచ్చెను. తరువాత విద్యానగరసామ్రాజ్యస్థాపనము వెంటనే చిరస్మరణీయులగు బుక్కరాయ విద్యారణ్యుల ప్రేరణమున బుక్కరాయల కుమారుడగు కంపరాయలు మధురనుండి మహమ్మదీయుని వెడలగొట్టి యార్యనాగరకతా వాఙ్మయములకు కలిగిన తాత్కాలి కాంతరాయములను తొలగించెను. తరువాత మూడు శతాబ్దములు మరల దక్షిణభారతమున తద్విద్యావాఙ్మయము లవిచ్ఛిన్నముగా నడచెను. కాని యుత్తరముమాత్రము వెనుకటి సంకలనమునుండి కోలుకొనక పోవుటయేగాక యనేకరాజ్యపరివర్తనములకును, తత్ఫలముగావచ్చు యుద్ధములకును, నిరంతరభయమునకును గురియగుటచే వెనుకటి యభివృద్ధిని మరల పొందలేకపోయెను. అందుచే నుత్తరదేశ సంస్కృతవాఙ్మయము ౧౧-వ శతాబ్దముతో చాలామట్టు కంతమయ్యెననియు, నచ్చటచ్చట కొంత పరిశ్రమచేయబడినను నది వైశాల్యమునకు చాలినంత కాదనియు సిద్ధము. మహమ్మదీయ దండయాత్రకు పూర్వపు దక్షిణభారత సంస్కృతవాఙ్మయము ఉత్తరదేశమునకూడ సంపూర్ణముగా ప్రచారములోనుండి తద్రచయితల గ్రంథములు దేశమునందంతను పాఠప్రవచనములలోనుండెను. తరువాతి ౧౫, ౧౬, ౧౭ శతాబ్దములందలి దక్షిణదేశవాఙ్మయము సమగ్రముగా వెనుకటిదానివలె అఖిలభారత

---

1. "సతతాధ్వరధూమసౌరభైః ప్రాక్
నిగమోద్ఘోషణవద్భి రగ్రహారైః,
అధునాజని విస్రమాంసగంధైః
అధికక్షీబతులుష్కసింహనాదైః.

మధురోపవనం నిరీక్ష్య మాయే
బహుశః ఖండితనాళికేరఖండం,
పరితో నృకరోటికోటిహార
ప్రచలచ్ఛూలపరంపరాపరీతమ్.

శ్వసితానలశోషితాధరాణి
శ్లథజీర్ణాయితచూర్ణకుంతలాని,
బహుబాష్పపరిప్లుతేక్షణాని
ద్రమిడానాం వదనాని వీక్ష్య దూయే.

పరితస్తతతంతువాయతంతు
వ్యతిషంగాజ్జనితాని జాలకాని,
పురగోపురసాలభంజికానాం
దధతే చీనపటావకుంఠనత్వమ్.

హిమచందనవారిసేకశీతా
న్యభవన్యాని గృహాంగణాని రాజ్ఞామ్,
హృదయం మమ వేదయంతి తాని
ద్విజబందీనయనాంబుమాషితాని.

శ్రుతి రస్తమితా, నయః ప్రలీనః,
విరతా ధర్మకథా, చ్యుతం చరిత్రమ్,
సుకృతం కృత, మాభిజాత్య మస్తం,
కిమి వాన్యత్ ? కవి రేక ఏవ ధన్యః."

(మధురావిజయకావ్యము-)

ప్రచారమును బడయలేదు. కాని కొందరు అప్పయ్యదీక్షితులవంటి వ్యక్తులు దేశమంతను నాకర్షించిరి.[1]

పదునేనవ శతాబ్దమున పాశ్చాత్యులు భారతదేశమునకు రామొదలిడిరి. ప్రథమమున వచ్చిన పోర్చుగీసు డచ్చివారి కిక్కడ సంపూర్తిగా రాజ్యసంపాదనకాంక్ష లేకపోవుటచే నిచ్చటి నాగరకత వారికంతగా పట్టలేదు. వారు ముఖ్యముగా మతప్రచారముకొరకును, వర్తకమునకును వచ్చిరి. తరువాత వచ్చిన ఫ్రెంచివారు రాజ్యసంపాదనముకొరకు వచ్చినను ఈదేశముయొక్క నాగరకతను, జాతిమతరీతులను కనుగొనుటలో శ్రమతీసుకొనలేదు. ఆంగ్లేయులుమాత్రము ప్రథమమున ముఖ్యముగా వర్తకముకొరకై వచ్చినందున నిచ్చటిప్రజల మనోవృత్తులు తెలిసికొనుట వారికి కర్తవ్యమయ్యెను. అందులకై యిచ్చటి జాతిమతములును, నాగరకతయు వారి నాకర్షించెను. వా రందుల పరిశోధనము మొదలిడిరి. క్రమముగా రాజ్యమును సంపాదించి పొదుకొనిపోయిరి. రాజ్యముచేయుటకు ప్రారంభించినంతనే యిచ్చటి ప్రజలయొక్క మనస్తత్త్వమును తెలిసికొనుట యత్యవసరమయ్యెను. పరిశోధనములు విరివిగా సాగెను.[2] క్రమముగా తమ నాగరకతయొక్క పూర్వరంగ మిచ్చటి ప్రాచీననాగరకతలో కన్పట్టెను. భాషలోకూడా సంబంధము పొడసూపెను. సంస్కృతవాఙ్మయము వారి పరిశోధనలకు గురియయ్యెను. ఉత్తరదేశవాఙ్మయము ముఖ్యముగా వారి నాకర్షించెను. ఋగ్వేదకాలమునుండి ౧౧-వ శతాబ్దమువరకుండు వాఙ్మయమును పరిశోధించిరి. వాఙ్మయచరిత్రమును వ్రాయుటలో నీవాఙ్మయమునే వా రెరింగియుండుటచే దానినిగూర్చియే వారు వ్రాయుట తటస్థించెను. తరువాతి గ్రంథకర్తలు దక్షిణభారతవాఙ్మయమునుకూడా తెలిసికొనిరిగాని వారికి సామగ్రి లభింపకపోయెను. వాఙ్మయమంతయు, నందలి గ్రంథములును మూలల దాగియుండెను. అందుచే దానిని వారు విమర్శింపలేకపోయిరి. దక్షిణభారతసంస్కృతవాఙ్మయమునకు మహమ్మదీయదండయాత్రల యనంతరకాల మత్యుచ్చకాలము. అనగా ౧౫, ౧౬, ౧౭ శతాబ్దము లన్నమాట.[3] ప్రథమమున నీవాఙ్మయమునుగూర్చి పాశ్చాత్యుల నేత్రముల దెరచినది బర్నెలుపండితుడు. ఈయన తంజావూరు పుస్తకాలయమునందలి గ్రంథములనుగూర్చి తన పట్టికను క్రీ.శ. ౧౮౮౦-వ సంవత్సరమున ప్రకటించెను. అప్పటినుండి పాశ్చాత్యసంస్కృతపండితు లనేకు లిచ్చటికి వచ్చి తద్గ్రంథములను చూచుట తటస్థించెను. దక్షిణభారతదేశముయొక్క దర్శనగ్రంథములేగాక కావ్యనాటకాలంకారశాస్త్రములందు కూడా ఉత్తమగ్రంథము లున్నవని యొక ప్రతీతి వ్యాపించి జర్మనీమొదలగు దేశములనుండి యిచ్చటికి పండితులు వచ్చుట మొదలిడిరి. ఈతంజావూరుపుస్తకాలయమునందలి యనేకములుత్తమగ్రంథములు ఖండాంతరము

1. వారణాసిపట్టణము మొదటినుండి విద్యలకు నెలవయ్యెను. దక్షిణభారత గ్రంథకర్తల కృతులుకూడ వారణాసియందలి పండితుల యాదరణమును బడసినగాని వాని కఖిలభారతప్రచారము లభింపలేదు. శంకర రామానుజ మధ్వాదు లట్లే కాశికి వెడలి తమగ్రంథములను ప్రచారము చేసిరి. అప్పయ్యదీక్షితులుకూడ నట్లే యొనర్చెను. మహమ్మదీయుల దండయాత్రలకు తరువాతకూడ మిగిలిన శాస్త్రములను న్యాయవైశేషిక దర్శనములు మాత్రము బంగాళము ప్రాంతముల ప్రచారములో నుండెను. పదునెనిమిదియవ శతాబ్దాంతమునకూడ ఈ వ్యాసకర్త ప్రపితామహుడు నవద్వీపమునకు బోయి తర్కశాస్త్ర మభ్యసించి యనుగమ భట్టాచార్యుడని బిరుదమును గొని యానేతు హిమాచల మంతటి తార్కికుడు లేడని వరలెను.

2. హిందుదేశముయొక్క వైజ్ఞానిక విజయముకొరకు ఇంగ్లీషువిద్యను వ్యాప్తము చేసిరి. ప్రస్తుతపు టాంగ్లవిద్యాధికులను హిందుదేశస్థులలో చాలమంది "ఇయింగ్లండుమానసపుత్రు" లని చెప్పవగును.

3. Introduction to Rukminiparinaya., Adyar Edition.

భారతి-ఆంగీరస చైత్రమాస సంచిక. పు. 631.

లకు కాలుసేతులతో నడచిపోయినట్లు చెప్పుదురు.1 మరికొందరు ఇచ్చటికి వచ్చి దేశమున పర్యటన మొనర్చి పేదబ్రాహ్మణులను కొలదిరూకలతో సంతృప్తుల గావించి యపూర్వములగు తాటియాకు గ్రంథములను గొనిపోయిరనుట నిర్వివాదము. పేదతనమేమి చేయించలేదు? లూడర్సు[2]అను నొక జర్మనుపండితుడు దక్షిణదేశమునుండి, అందును తంజావూరునుండి యనేకములగు నమూల్యగ్రంథములను స్వల్పక్రయమునకు గొనివచ్చినట్లు తనతో చెప్పెనని ఆటోస్టీను[3] అను నొక జర్మను పండితుడు నాతో చెప్పినాడు. ఇది యసంభవము కాదు. ఇప్పుడెచ్చటను దొరకని కొన్ని యపూర్వగ్రంథములు లండనునందలి మ్యూజియమునందును స్టేటు సెక్రెటరిగారి లైబ్రరీయందును ఉన్నవని విదితమే కదా? శాయనభాష్యముతో కూడిన యథర్వణవేదము యూరపుఖండములో ప్రచురింపబడుట అందరికి తెలిసినవిషయమే. ఇప్పటికిని ఇంక ననేకాపూర్వగ్రంథములు మూలల దాగియుండుటయు, నటకలపై దాచియుంచబడి యుంచబడుటయు నిజము.4 పరమేశ్వరుడు తత్ప్రచారమునకు తోడ్పడుగాక! ఈదక్షిణభారతవాఙ్మయములో తంజావూరు నాయకరాజకాలమున వరలిన సంస్కృత వాఙ్మయమునుగూర్చి చెప్పుట యీ వ్యాసావళి యుద్దేశ్యము. కవులకు రాజాస్థానములు ౮౦౫ స్థలములనుటచే దక్షిణదేశమునందలి మధుర,తంజావూరు, వేలూరు, తిరుచినాపల్లి, కొత్తకోట మొదలగు రాజాస్థానములలో వీరు వరలిరి. ముఖ్యవాఙ్మయ పోషకులలో తంజావూరు నాయకరాజులు ముఖ్యులు.

---

## నీటిపట్టు చెట్టు

దొండపాటి రామమూర్తిగారు

రాతిదప్ప కేకపాదధ్యానరతిఁ బూను, బకమానులకుఁ దపోవనతలమ్ము
తల్లక్రిందుగా జగమ్ములఁ జేయఁగల ఋషి, పక్షిజాలమునకుఁ బట్టుఁగొమ్మ
భ్రమగొల్పు రూపుల గమియించెడి భుజంగ, కులదైవములకు దేవళము కలిమి
పరదర్శనమున నిష్ఠురమూను పండితం, మన్యఘూకములకు మాన్యభూమి
యొడ్డుఁ బాదువును గలిగి పరోపకార-కర్మయయ్యును బంకజాకరతటస్థ
కుజ ముపేక్షింపఁబడె సాధువ్రజముచేతఁ-బాత్ర మెఱుఁగని దానమ్ము ఫల మదేమొ?

---

1. Burnell's Catalogue of Skt. Mss. in the Tanjore Library, p. VI.
2. Leuders.
3. Otto Stein.
4. ఇటీవల అప్పయ్యదీక్షితులతండ్రి యగు రంగరాజాధ్వరికృతమగు "వివరణదర్పణ" మను పంచపాదికా వివరణ వ్యాఖ్యానమును కనుగొంటిమి. అది నంది నాగరలిపియందు వ్రాయబడియుండుటచే నిదివర కెవ్వరిని ఆకర్షించి యుండలేదు.
A Descriptiveh Catalogue of Skt. Mss.in the Tanjore Palace Library, Vol,XII.5206.

# కాబోయే చిత్రకళావిమర్శకులకు ఉపదేశములు


అన్నీ తెలిసినట్లు నటించాలి.


చిత్రకారులకు భయము కలిగిస్తూండాలి.


ఎల్లప్పుడూ పుస్తకాలు చేతనుండాలి.


నలుగురకూ కనబడేటట్టు లైబ్రరీలలో కూర్చోవాలి.



అక్కడ నిద్రపోయినా నష్టములేదు.



చిత్రప్రదర్శనములలో చిత్రములను చూచేటట్టుల నటించాలి.


హేవెల్ తో నేనేకీభవిస్తానంటుండాలి




పేరుపొందిన చిత్రాలు మంచివికావని, చిన్నవారివి బాగున్నవని అభిప్రాయాలు వ్రాస్తుండాలి.

ఇత్యాది

---



3. హైమవతి

చిత్రకారుడు: యస్. ఫర్నాండిస్ గారు, బొంబాయి



౪. గోపికలు కృష్ణుని దుడుకులను యశోదకు విన్నవించుట

చిత్రకారుడు: శ్రీ రామవైశ్యగారు, లక్నో.

చెన్నరాజధానియందు ౧౯౫౯-వ సంవత్సరము జులయి ప్రారంభము మొదలు సెప్టెంబరు తుదవరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

ఆంధ్రవాఙ్మయ మీ క్రింద పేర్కొనిన వివిధశాఖలతో వెలసియుండుటచేత నీపట్టికయం దాయాశాఖల నుత్పన్నములగు గ్రంథములాయా శాఖలకే చేర్చబడును. గ్రంథముల నామములన్నియు నకారాదిక్రమమున నుండును.

1. అర్థశాస్త్రము, 2. అలంకారశాస్త్రము-నాట్యకళకు సంబంధించిన గ్రంథములు సయిత మీ శీర్షిక క్రిందనే చేర్చబడును, 3. ఆయుధధనుశ్శాస్త్రములు, 4. ఆరోగ్యశాస్త్రము, 5. ఇతిహాసములు-ఇతిహాసములలోని భాగములు, కథలు, మార్పుచేయక ప్రత్యేకముగ ముద్రింపబడునవి యీశీర్షికక్రిందనే చేర్చబడును, 6. కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు, 7.—కల్పితములు, 8.—చారిత్రకములు, 9. కల్పము, 10. కామశాస్త్రము, 11. కావ్యములు, 12. గణితశాస్త్రము, 13. గేయములు, 14. చరిత్ర(దేశ-), 15. చిత్రలేఖనము, 16. చట్టము(Law), 17. ఛందశ్శాస్త్రము, 18. జంతుశాస్త్రము, 19. జీవితములు, 20. జ్యోతిషశాస్త్రము, 21. తర్కశాస్త్రము, 22. దండకములు, 23. ధర్మశాస్త్రము, 24. నవలలు, 25. నాటకములు, 26. నాట్యశాస్త్రము, 27. నిఘంటువులు, 28. నీతి- నీతికథలుకూడ ఈ శీర్షికక్రిందనే వచ్చును, 29. పరిశిష్టము, 30. పాకశాస్త్రము, 31. పారిశ్రామికము, 32. పురాణములు- ప్రత్యేకముగ ముద్రింపబడి ప్రకటింపబడు పురాణములలోని భాగములు సయిత మీ శీర్షికక్రిందనే చేర్చబడును, 33. ప్రకృతిశాస్త్రము, 34. ప్రబంధములు- ఆంధ్ర సారస్వతమునందు ప్రసిద్ధములగు 'హరివంశము', 'ఆంధ్రచంపూభారతము', 'అచ్చతెలుగు రామాయణము'వంటి పురాణేతిహాసకావ్యములకు సంబంధించినవి, 'పాండురంగమాహాత్మ్యము' వంటి మాహాత్మ్యములు, 'ఆంధ్రమేఘసందేశము'వంటి అనువాదములు, 'రంగనాథరామాయణము'వంటి ద్విపదగ్రంథములు మొదలయినవి యీశీర్షికక్రిందవచ్చును, 35. ప్రహసనములు, 36. భూగోళశాస్త్రము, 37. భౌతికశాస్త్రము, 38. మంత్రశాస్త్రము, 39. మతము - హిందు, 40.— ఇతరములు (బౌద్ధ, జైన, క్రైస్తవాదిమతములు)- ఇతరమతములకు సంబంధించిన గ్రంథములు— ఏ విషయ విభాగమునకు సంబంధించిన వయినను- ఈశీర్షికక్రిందనే చేర్చబడును, 41. మాహాత్మ్యములు, 42. మీమాంసాశాస్త్రము, 43. యక్షగానములు, 44 యోగశాస్త్రము, 45. రత్నశాస్త్రము, 46. రాజకీయములు, 47. వాస్తుశాస్త్రము, 48. విమర్శనము- ఇందు సారస్వతమునకు సంబంధించిన విమర్శనలు మాత్ర ముండును, 49. వృక్షశాస్త్రము, 50. వేదవాఙ్మయము– ఉపనిషత్తులు, ఇతర వైదికగ్రంథములుసయిత మిందే చేర్చబడును, 51. వేదాంతము - భక్తి జ్ఞాన వైరాగ్య విషయకగ్రంథము లీశీర్షికక్రింద వచ్చును, 52. వైద్యశాస్త్రము, 53. వ్యవసాయశాస్త్రము, 54. వ్యాకరణ శాస్త్రము, 55. వ్యాపారము, 56. వ్యాయామము, 57. శకునశాస్త్రము, 58. శతకములు 59. సంగీతశాస్త్రము, 60. సాంఘికములు, 61. సాముద్రికశాస్త్రము, 62. సారస్వతము-భాష, 63. స్తోత్రములు, 64. హరికథలు.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.– అధ్యాయము ; అను.— అనువాదము. అనువాదకులు. ప.–పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.–భాగము. వ.–వచనము. సం.—సంపాదకులు. సటీ.–సటీకము.

## ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్యమార్గములు, ఫారం ౧,౨—జి. వెంకటరామయ్య
ఆరోగ్యమునకు మార్గము—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
కుటుంబ ఆరోగ్యము—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

## కథలు-ఐతిహాసికములు, పౌరాణికములు

అనసూయ—సి. సుందరరామయ్య
కుచేలోపాఖ్యానము—(ప్ర.) మారుతిరాం అండ్ కో, బెజవాడ.
గంగావతరణము—వి. రామమూర్తి
దుర్యోధనునిఘోషయాత్ర, భరతుని సౌభ్రాత్రము—(ప్ర.) డి. యగ్గన్న, మచిలీపట్టణము.
ధైర్యకవచము—వి. సుందరరామశాస్త్రి
శ్రీమదాంధ్రభారతము—(ప్ర.) కుప్పుస్వామిమొదలి, మదరాసు.
శ్రీమన్నారాయణకవచ కర్ణామృతమును, వృత్రాసుర వృత్తాంతము, చిత్రకేతూపాఖ్యానము—(ప్ర.) ఎ. నరసింహులునాయుడు, నారాయణవనం
శ్రీమహాభారతము వచనము, భా ౨.—(ప్ర.) ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో, మదరాసు.
సావిత్ర్యుపాఖ్యానము—(ప్ర.) రాంజి అండ్ కో, మచిలీపట్టణము.
హారవిలాసము ...యస్. వి. రంగాచార్లు

## కథలు—కల్పితములు

అరాబియన్ నైట్సుకథలు, భా. ౧—పి. సూర్యప్రకాశరావు
పిల్లలకథలు, భా. ౨—(ప్ర.) పి. శ్రీనివాసరావు, ఆదోని.
మట్కాభామంజరి—యస్. వెంకటసుబ్బయ్య

## కథలు—చారిత్రకములు

ఆంధ్రదేశచరిత్రకథలు—యం. నరసింహరావు
ఆంధ్రవీరులు, భా. ౧—శేషాద్రిరమణకవులు
ఆంధ్రహర్షచరిత్రము—(అను) యం. వెంకటరమణాచారి, విజయనగరము.
ఉత్తమపురుషచరిత్రములు, భా. ౧—ఏ. శేషగిరిరావు
భారతనారీమణులు, తరగతి, ౮—కే. కృష్ణవేణమ్మ
రఘువంశకథనము—బి. తమ్మయ్య
వీరవనితలు, భా. ౧—ఏ. శేషగిరిరావు
షోడశమహారాజచరిత్ర—పి. చిదంబరశాస్త్రి

## కావ్యములు

ఆంధ్రమేఘసందేశము—జి. వెంకటసుబ్బరామయ్య
శ్రీమద్రామాయణము, వచనము, భా. ౧—(ప్ర.) ఆర్. వెంకటేశ్వర్ అండుకో, మదరాసు.

## గణితశాస్త్రము

ఆరంభగణితము, భా. 3—(ప్ర.) శ్రీనివాసవరదాచారి అండ్ కో, మదరాసు.
గణితచంద్రిక (తరగతులు. ౨, 3)—యన్. రంగారావు
బాలబోధగణితశాస్త్రము, బుక్కు. ౨—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
మణుగతిజంత్రి—వి. రామస్వామిశెట్టి
రెండవతరగతి లెక్కలు—జేమ్సు యం. భక్తుల్
సరస్వతీగణితము, భా. ౧—ఆర్. వీరభద్రరావు

## గేయములు

కీర్తనలు—యన్. ప్రకాశదాసు
కీర్తనలు—వి. సుబ్బారెడ్డి
కుశలవ—బి. స్వామి
గజేంద్రోపాఖ్యాననాటకభజనకీర్తనలు—యస్. బుల్లిసత్తిరెడ్డి.
దక్షునియజ్ఞము—(ప్ర.) జి. జగన్నాథం అండ్ సన్, రాజమహేంద్రవరము
పాండవవనవాసము—యన్. రామిరెడ్డి
భజనకీర్తనలు—యల్. వెంకటప్పారాయశర్మ
శ్రీమహాలక్ష్మీగీతములు—డి. సర్వేశ్వరరావు
శ్రీరామనామమాహాత్మ్యకీర్తనలు—బి. నాగయ్యదాసు
శ్రీహరినామసంకీర్తనలు—(ప్ర.) పి. నాగరత్నం, పెద్దాపురము
హరిభజనకీర్తనలు—పి. భోగలింగకవి

## చరిత్ర

నందకుమారవధ, చైతుసింగు—యం. సంజీవరావు
బ్రిటిష్‌చరిత్రసంగ్రహము—(ప్ర.) లాంగ్ మెన్సు గ్రీన్ అండ్ కో, మదరాసు.
హిందూదేశచరిత్రము, భా. ౨—వి. వెంకటరంగరావు
హిందూదేశచరిత్రము, భా. 3—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

## జీవితములు

నారదమహర్షి జీవితచరిత్రము—వి. జగన్నాథశర్మ
వేమన—ఆర్. అనంతకృష్ణశర్మ
శిష్టుకరణకవులచరిత్ర—(ప్ర.) డి. నారాయణమూర్తి శర్మ, తెక్కలి
శ్రీసురభి వేంకటలక్ష్మరాయబహద్దర్ వారి జీవితము—వి. రామసుబ్బారాయుడు

## జ్యోతిషశాస్త్రము

ఆయుర్దాయదీపిక—(ప్ర.) వి. కుప్పుస్వామి మదలి, మదరాసు.
జాతకమణి—వై. లచ్చయ్యశాస్త్రి

## దండకము

దండకత్రయము—(ప్ర.) టి. వి. రమణయ్య అండ్ బ్రదర్స్, రాజమహేంద్రవరము

## నవలలు

అగ్రహారము—కే. వెంకటశాస్త్రి
కర్పూరమంజరి భా. ౨—సి. లక్ష్మీనరసింహం
ధర్మపాలుడు—వి. సత్యనారాయణకవి
ప్రతాపసింహ—హెచ్. వెంకటకృష్ణకవి
ప్రతిక్రియ—జి. శ్రీరామశర్మ
ప్రభాతము—వి. సుబ్బరావు
బుగ్గిరాముడు—వి. పద్మనాభరాజు
వాడేవీడు—బి. కోటేశ్వరరావు
సంపూర్ణగ్రంథావళి, భా. ౫—సి. లక్ష్మీనరసింహం
సుందరి—యం. శ్రీపతి

హత్యాగాంభీర్యము, భా. ౧—యం. వెంకటశాస్త్రి

## నాటకములు

కాంతామతి—బి. కోటేశ్వరరావు
కుచేలాభ్యుదయము—యస్. కామేశ్వరరావు
గంగావతరణము—యస్. రామానుజరావు
గులేబకావలి—ఏ. సుందరరామయ్య
చంద్రగుప్త—జె. సత్యనారాయణమూర్తి
జోబుని విజయవిలాసనాటకము—జి. బాలసౌరురెడ్డి
మాలతీమాల—పి. లక్ష్మీనరసింహారావు
ముక్తధార—(ప్ర.) వెంకటరాం అండ్ కో, ఏలూరు
ప్రహ్లాదచరిత్రము—సి. లక్ష్మీనరసింహం
ప్రహ్లాదనాటకము—బి. సురమాంబ
మల్లికామారుతప్రకరణము, అంకములు ౬-౧౦ (అను.)—వి. సుబ్బారాయుడు
మోహినీరుక్మాంగద—ఏ. శేషగిరిరావు
సీమంతినీనాటకము—యస్. గోపాలకృష్ణయ్య
శ్రీలక్షణాపరిణయనాటకము—వి. బాలసుబ్బరావు

## నీతి

పుత్రవతీహితోపదేశము—ఇ. సత్యనారాయణశర్మ
రామాయణ నీతికథలు—ధ. వి. జోగరావు

## పరిశిష్టము

అధ్యక్షోపన్యాసము—(ప్ర.) జి. వెంకటరెడ్డి, అల్లవరము
అనుభవజ్ఞానకోటి, భా. ౧—డి. కోటిలింగజ్ఞాని
అభినవాంధ్రవాసవదత్త—యు. నరసింహశర్మ
ఆంధ్రవాచకబోధిని, తరగతులు. ౧-3—కే. నారాయణమూర్తి
ఆదిమాంధ్రఅనుపంచమకులప్రబోధము—వి. సుబ్బారెడ్డి
ఇంజను డ్రైవరులబుక్—కె. యజ్ఞరామశర్మ
ఇండియాతపాల్ సంగ్రహము—కె. వెంకటరామయ్య
ఇల్లాలు—రామయ్య
ఐదవతరగతి తెలుగువాచకపుస్తకము—యస్. భూషణం
కండ్లుకట్టుటనుగురించి—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

కర్మఫలము—బి. పాపయ్యశాస్త్రి
కల్లంగడిలో ఏమితీసికొంటారు—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
కలగూరగంప—తిరుపతి వేంకటేశ్వరకవులు
కల్యపాలంభము—యు. నరసింహశర్మ
కవిత—సి. శేషగిరిరావు, సి. జానకిరామయ్య
కాలక్షేపమేజీవనము—జి. సన్యాసిరాజు
కావ్యసంగ్రహము, భా. ౧—(ప్ర.) వెంకటరాం అండ్ కో., ఏలూరు.
గర్భశోకము—జి. వీరాస్వామి
చదువులముత్తె—కె. వెంకటరావు
చిట్టికెత—కె. వెంకటరావు
తీర్థయాత్రాప్రదర్శిని—ఐ. నరసింహమూర్తి
పరీక్షవిజ్ఞానచంద్రిక, భా. ౩—జి. రంగరావునాయుడు
పిల్లలఆర్యాంగప్రకాశిక, తరగతి ౪—యం. శ్రీపతి
పురాణపాఠములు, తరగతులు ౨, ౩, ౪, ౫—యం. సూర్యనారాయణశాస్త్రి
పెద్దాపురము ఆర్యవైశ్యమహాసభలచర్యానివేదిక—(ప్ర) టి. వి. భగవత్, మదరాసు.
ప్రపంచజ్ఞానము,తరగతులు ౩, ౪—జి. వి. రామమూర్తి
బాష్పబిందువు—వెంకటకాళిదాసకవులు
భవిష్యత్కాలశుభాశుభ ఫలసూచని—(ప్ర.) టి. సి. రామానుజులునాయుడు మదరాసు
భారతీయప్రబోధము—యస్. వరదదాసు
భావికాంజలి—ఆర్. సుబ్బరావు
మదనపల్లె శ్రీవెంకటేశ్వరనిధిరూల్సు—(ప్ర.) కె.భీమరావు, మదనపల్లె.
మణిభూషణము, భా. ౧—టి. రాజగోపాలరావు
మాతృపూజ, భా. ౧—జి. వి. వి. సత్యనారాయణ
మూడవగృహతంత్రపాఠపుస్తకము—జి.వెంకటరామయ్య
మోగాతెలుగువాచకపుస్తకము—యస్. భూషణం
యక్షప్రశ్నలు—(ప్ర.)యస్.వి. రంగాచారి,మదరాసు
రసికానందము—తిరుపతి వెంకటేశ్వరకవులు
రామావాచకము, తరగతులు ౧-౫—జి. దామోదర మొదలి, పి. యస్. రామశర్మ
లౌకకయాత్రికుల మార్గదర్శిని—యం. ఇగ్నాటిస్
వంశగత్నాకరము—బి. ఆశ్నాఖ్య
విశ్వబ్రాహ్మణశబ్దార్థఖండనముండనము—జి. యస్. బి. సరస్వతిస్వామి
శాశ్వతసుఖప్రదర్శిని—పి. వెంకటకృష్ణదాసు
శిశుతత్త్వదీపిక—కె. హెచ్. వి. యస్. నారాయణ
శ్రీవెంకటేశ్వర ఎలెక్ట్రిక్ మహత్యము—యం. సుబ్బరామదాసు
శ్రీశైలయాత్రావిమర్శనము, పద్యకావ్యము—కె. సూర్యనారాయణరావు
శ్రీసీతారాముల కల్యాణము—బి. జియ్యరుస్వామి
సంతాననిరోధము-గుణదోషవిచారణ— జె. సాంబశివరావు
సంస్కృత బాలబోధిని, ౧, ౩, ౪, ౫ (in one)—వి. దుర్గశర్మ
సత్యసామ్రాజ్యము—న. రఘూత్తమాచార్యులు
సర్వవిషయసంగ్రహము—యం. రాఘవాచార్యులు
సాంగవేదపాఠశాలా సంఘముయొక్క నిబంధనలు—(ప్ర.) ఆర్. రామచంద్రయ్య, మచిలీపట్టణము
సిపిక్సుపాఠములు,తరగతి౩—బి.లక్ష్మీనారాయణశాస్త్రి
హితోపదేశవాచకములు, తరగతులు ౨, ౩, ౪, ౫—జి. సోమన్న

## పాకశాస్త్రము

నలభీమపాకశాస్త్రము—(ప్ర.) కె. లక్ష్మణమొదలియారు మదరాసు

## పారిశ్రామికము

వివిధవస్తు పరిశ్రమము—టి. వెంకటరామయ్యచౌదరి

## ప్రకృతిశాస్త్రము

ప్రకృతిశాస్త్రపాఠములు, బుక్కు ౧-ఏ; ఫారము, ౧, ౨, ౩—జి. వెంకటరామయ్య
ప్రకృతిశాస్త్రము, తరగతి ౭, ౮—ధ. యస్. ప్రకాశరావు, కె. హెచ్. వి. యస్. నారాయణ
ప్రథమశాస్త్రగ్రంథములు,బుక్కు ౧—కె. సూర్యనారాయణరావు, కె. రంగాచారి, ఆర్. గోపాలయ్యర్

ప్రథమశాస్త్రగ్రంథములు, బుక్కు 3—(ప్ర.) పి. వరదాచారి అండుకో, మదరాసు.

## ప్రబంధములు

గరుడగర్వభంగము—కె. సుందరరామయ్య

శ్రీమదాంధ్ర చంపూరామాయణము, భా. ౧—(అను) ఎ. రంగశాయి, పిఠాపురము

## ప్రహసనములు

ఇప్పుడు—భ. కామేశ్వరరావు

మాటాడు ప్రాణిబొమ్మ—టి. యల్. రామస్వామి అయ్యంగారు

## భూగోళశాస్త్రము

గంజాంజిల్లా జాగ్రఫీ—యం. వెంకటశాస్త్రి

గుడివాడతాలూకా భూగోళము—వి. మాధవరావు

తూర్పుగోదావరిజిల్లా భూగోళము—యం సత్యనారాయణమూర్తి

దివితాలూకాభూగోళము—వి. వేణేశ్వరరావు

నూతనగంజాంజిల్లా భూగోళము—పి. సత్యనారాయణశర్మ

ప్రథమపాఠశాలారోగ్యబోధిని ప్రథమచికిత్సలు—యస్ గోపాలం

ప్రారంభభూగోళశాస్త్రము, భా. ౧—(మిస్) డార్లింగ్

బందరుతాలూకాభూగోళము—వి. వేణేశ్వరరావు

భూగోళశాస్త్రము—యం. వెంకటేశ్వరరావు

మనదేశము—ఇ. డి. (మిస్) బర్డ్ సేటు

మారుతిభూగోళశాస్త్రము—ఎ. నారాయణమూర్తి

విశాఖపట్టణము జిల్లాభూగోళము—పి. అప్పయ్య

## మతము—హిందు

పరశురామదివ్యావతారము—టి. రామజోగిశాస్త్రి

వివాహవయోదర్పణము, వివాహపద్ధతి—(ప్ర.) టి. సి. రామానుజశర్మ, మదరాసు

వేదాచారనిర్ణయము—భ. అప్పలాచార్యులు

వైదికనిలయము—(అను) యం. సత్యనారాయణశాస్త్రి

## మతము—ఇతరములు

ఆనందసామ్రాజ్యము—జె. క్రిష్ణమూర్తి

ఒక్కొక్కరికి సువార్తప్రకటనజేయువారికి సహాయములు—(ప్ర.) దేవానందం, కాకినాడ

క్రిస్టోఫరుచరిత్రము—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి, మదరాసు

తెలుగుకీర్తనలు—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి, మదరాసు

దేవమాత అద్భుతచరిత్రము—(ప్ర.) పి. చిన్నయ్య, బెజవాడ

నలుగురు బాలశిఖామణులచరిత్ర—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

నూతననిబంధన గ్రంథములోని కథలు—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

"నెల్లూరు మైత్రాసనము" సంగ్రహచరిత్రము—(ప్ర.) బి. సోమయ్య, నెల్లూరు

ప్రభువైనయేసుక్రీస్తు అయిదువేలమంది జనుల కాహారము పెట్టుట—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

బంధవిముక్తజీవితము—(ప్ర) వసంతగృహము, అడయారు

భయంకరమైనదొంగలు—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

సుందరమ్మసేవ—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

సుకృతమంత్రములును, జ్ఞానోపదేశమును—జె. అలక్, నెల్లూరు

## మాహాత్మ్యములు

కార్తీకమాసమాహాత్మ్యము—ఏ. వ్యాసలింగశాస్త్రి

కోటిఫలిమాహాత్మ్యము—కె. బసివిరెడ్డి

ముక్కోటి ఏకాదశీమాహాత్మ్యము—వి. సుబ్బారెడ్డి

శ్రీకృష్ణవేణీమాహాత్మ్యము—యం. గురుబ్రహ్మశర్మ

## యక్షగానము

రామదాసు చరిత్రము—(ప్ర.) కె. లక్ష్మణమొదలియారు మదరాసు

## వృక్షశాస్త్రము

పాదపజీవన సంగ్రహము—యన్. లక్ష్మీనరసింహస్వామి

## వేదాంతము

ఆత్మానుసంధాన గురుబోధప్రకాశిక—(ప్ర.) యం. సుందరరామయ్య, మదరాసు

ఈశ్వరరహస్యసారము—(ప్ర.) టి. సి. రామానుజశర్మ, మదరాసు

బ్రహ్మసూత్రసారసంగ్రహవిమర్శనము—యం. గోపాలదాసు

ముముక్షుహితచర్య—వి. సుబ్బరావు

విచారసాగరము—(ప్ర.)వి.కుప్పుసామిమొదలి,మదరాస్

వేదాంతసారప్రబోధిని—సి. సుబ్రహ్మణ్యకవి

శ్రీభగవద్గీత—(ప్ర.) హితసమితి, పొన్నూరు

శ్రీరామకృష్ణ వచనామృతము భా. ౧—(ప్ర.) రామకృష్ణమఠము, మదరాసు

సాంఖ్యతత్త్వప్రదీపిక—పి. రామమూర్తి

## వైద్యశాస్త్రము

అష్టాంగహృదయము—(ప్ర.) పి. వెంకటకృష్ణరావు, మదరాసు

అష్టాంగహృదయము—(ప్ర) యు. సూర్యచింతామణిశాస్త్రి, రాజమహేంద్రవరము

ఆంగ్లేయవైద్యరహస్యము—కె. బుచ్చయ్యశర్మ

కుటుంబచికిత్సాదర్పణం—కె. బుచ్చయ్యశర్మ

గృహవైద్యము, గృహపరిశ్రమ—యన్. జానకిరామశర్మ

గోసాయిచిటికెలు —పరశురామ అవధూత

తెలుగుమెడికల్ హేండుబుక్కు—కె. బుచ్చయ్యశర్మ

ధన్వంతరి నిఘంటువు—(ప్ర.) పి. వెంకటకృష్ణరావు, మదరాసు

భిషక్సుధార్ణవము—యన్. లక్ష్మీనరసింహం

## వ్యాకరణశాస్త్రము

ఆంధ్రభాషాలక్షణశిక్షణము—పి. శ్రీరాములురెడ్డి

ఆంధ్రవ్యాకరణపాఠములు—యన్. వెంకటరామానుజాచారి

ఆంధ్రవ్యాకరణసర్వస్వము—శేషాద్రిరమణకవులు

వ్యాకరణసంగ్రహము భా. ౧,౨—శేషాద్రిరమణకవులు

శబ్దసంస్కారిణి—సి. యోగానందకవి

## శతకములు

చిదానందమూర్తి శతకము—యన్. అయ్యవాచార్యులు

దైవముదిన్నె వెంకటేశ్వర శతకము—సి. చెన్నారెడ్డి

భాస్కర శతకము—కె. రామచంద్రరావు

రాజగోపాల శతకము—కె. వీరరాఘవాచారి

వెంకటేశ్వర శతకము—యన్. లక్ష్మీనరసింహరాజు

శ్రీకదళీపుర నాగేశ్వర శతకము—కె. రాజేశ్వరయోగి

శ్రీనాగేశ్వర శతకము— జె. లక్ష్మీనరసింహయ్య

శ్రీముకుంద శతకము—వి. సుబ్బారెడ్డి

శ్రీరంగనాయక శతకము—కె. సూర్యనారాయణరావు

## సాముద్రికశాస్త్రము

హస్తసాముద్రికశాస్త్రము—వి. సూర్యనారాయణరావు

## స్తోత్రములు

అంజలి—యం. వెంకటరత్నం

భక్తబృందావనము—యం. వెంకటరత్నం

భగవన్నుతి భా. ౧—యం. వెంకటరత్నం

వీరాంజనేయ వినుతి—యన్. సత్యనారాయణశాస్త్రి

శ్రీరామరక్షాస్తోత్రము— (ప్ర.) పి. సూర్యప్రకాశశర్మ, పాలకొల్లు

శ్రీరామరాఘవతారావళి—ఒ. బ్రహ్మయ్య

## హరికథలు

అంబరీషచరిత్రము—ఏ. నారాయణదాసు

గజేంద్రమోక్షము—ఏ. నారాయణదాసు

రుక్మిణీకల్యాణము—ఏ. నారాయణదాసు

శ్రీజానకీశపథము—ఏ. నారాయణదాసు

సీతాంబాచరిత్రము— జె. రామనాథశాస్త్రి

# తు ది పా ట

వేంకట కాళిదాసకవులుగా

నీవు హసించినావు కమనీయముగాఁ, జిరుమల్లెతీవ క్రొం
బూవులుగా, సుధాప్రణయమూర్తి! కనుంగొనలంటఁ గాటుకల్
ప్రోవులుగాఁగ రాలి పడిపోవఁగఁ జూపులు వాల్చినావు; కాం
తావిలమైన నాయెడఁద నంకితముల్ సుమి యా సువృత్తముల్.

నీ తెలిచెక్కులన్ బ్రణయినీ! తొలిముద్దిడువేళ నీ కనుల్
మూఁతలువడ్డ వంబుదవిముక్త తుషారకణంబులన్ నునుం
జేతులు మూయు కల్వవలె;—నిన్ స్పృశియించినయంత నన్ను న
జ్ఞాతములైన వేవో పులకల్ కదలించె నదృష్ట వీథులన్.

నీ చిరునవ్వు నాకనుల నిద్దురవేళలఁ దోఁచు స్వప్నకాం
తా చయమో యనన్ గొనలుసాగు; సుఖస్మృతు లెల్ల నాయెదన్
బూచును పువ్వులై, వెలిఁగిపోవు, నశించుఁ; ద్వదీయనీలశో
భాచికురమ్ములన్ దురిమివైచెద నాయెద, రమ్ము నెచ్చెలీ!

నీసొగసెల్ల నాకొరకు నీవు నివాళులు పెట్టినావు; నా
యాసలులేని ప్రేమహృదయమ్మును నామెయినుండి కోసి, నీ
హాసములోననే మరణమందఁగఁ, బూవులతోడఁ గాన్కగాఁ
బోసితి నీదుపాదముల ముందర; దుఃఖమెలేదు నాకిఁకన్.

నా తొలిముద్దు నీ సొగసునన్ మధురాంకముగాఁగ నిల్చి నా
కై తపియించి వేయికనులై ననుఁజూచుచుఁ బిల్చుచున్న; దీ
చేతిబిగింపులన్ సుఖము సెందిన నీయెద వేయిగొంతుకల్
కోఁతలువడ్డవై, ప్రణయలోకములో ననుఁ బిల్చు నెచ్చెలీ!

---



## ఆంధ్ర వాఙ్మయము

మన ఆంధ్రులలో ననేకులు—జానపదులుగూడ నేడు సకలవిధాందోళనములందును తలమున్కలు పొందుచున్నారు. కాని వారొకరు చెప్పినది విని యట్లు చేయుచున్నారే; గాని సంగతు లన్నియు స్వయముగ తెలిసికొని కాదు.

ఏమంటే? నవీనవిజ్ఞానమునకు సంబంధించిన యే విషయమునందును మనకు వాఙ్మయము లేదు.

ప్రజలకు విజ్ఞానము కలిగింపవలసిన పండితులును, ప్రజలను మంచిమార్గమున బెట్టవలసిన సంస్కర్తలును, ప్రజల నేదో యొకమార్గమున నడుపవలసిన నాయకులునుగూడ మొత్తముమీద గొఱ్ఱెదాటుగ బోవుచున్నారే; గాని వాఙ్మయనిర్మాణవిషయమును గమనించుట లేదు.

కాగా; ప్రపంచపరిణామము తెలిసికొందమన్న మన ఖండాంతరదేశముల చరిత్రలు మనభాషలో లేవు. భరతవర్షపు పూర్వోన్నతి నెఱుంగుటకు భరతవర్షపుటంతర్గతదేశముల యితిహాసములును లేవు. "ఆంధ్రు లన నెవరు? మన మెప్పుడెప్పు డెట్టి యున్నత్యవనతులు పొందినాము? నేటి మనస్థితికి కారణములైన సన్నివేశము లెట్టివి?" ఈవిషయముల నవగాహనము చేసికొనుటకు నేటివరకును సమగ్రమైన మనచరిత్రమే లేక పోయినది.

ఆంధ్రదేశపు భౌతికస్వరూపమునైన తెలిసికొనుటకు మనకు భూగోళశాస్త్రము లేదయ్యె. జాతకగ్రంథములు, పంచాంగములు ననంఖ్యాకములుగ వెలువడుచున్నవి; గాని ఖగోళశాస్త్రము ప్రకటింపబడదయ్యె. మనకు గణితశాస్త్రము లేదు. ఇంజనీరింగు (Civil and Mechanical) గ్రంథములు, సముద్రమునకు, భూగర్భమునకు, గనులకు, లోహములకు సంబంధించిన గ్రంథములును లేవు.

కొన్ని ప్రకృతిశాస్త్రములకు ప్రవేశికలే గాని విపులపరిశోధనలను తెలుపు సద్గ్రంథములు లేవు. దేశమున ఊరూరను ఆయుర్వేదఫార్మసీలే; గాని ఆయుర్వేదమునందలి యుద్గ్రంథములు, దానిచరిత్ర మన భాషలో లేవు. ఎక్కడచూచినను అల్లోపథీ డిస్పెన్సరీలును, ఔషధశాలలు నున్నవి; గాని దానికి సంబంధించిన ఉద్గ్రంథముల అనువాదములైన లేవు.

యువకులకు శీలనిర్మాణమున దారిచూపు మహాపురుషుల జీవితములు ఒకటి రెండు తప్ప తగినన్ని లేవు. మహాపురుషుల యుపదేశములును, రచనలును లేవు. కర్ణాటకగానమునకు జీవనదాత ఆంధ్రుడైనా గాయకచరిత్రగాని, సంగీతశాస్త్రముయొక్క వికాసమును దెలుపు ఇతిహాసము గాని లేవు.

మనదేశమున అనేకమతము లున్నవి; గాని వానికి సంబంధించిన ఉద్గ్రంథములు, వానిచరిత్రలును, భక్తియోగమునకు సంబంధించిన గ్రంథములు, మహాభక్తుల చరిత్రలు, మతాచార్యుల చరిత్రలును లేవు.

విపులమైన కవులచరిత్ర లేదు. సమగ్రమైన వాఙ్మయచరిత్ర లేదు.

దర్శనగ్రంథములు, అలంకారశాస్త్రీయగ్రంథములు, ఇతరభాషలయందలి గొప్పగొప్ప శ్రవ్యదృశ్యకావ్యముల యనువాదములు, తక్కిన చరిత్రములును లేవు.

మన కింతవరకును విజ్ఞానసర్వస్వము (ఎన్‌సైక్లోపీడియా) లేదు. సమగ్రమైన నిఘంటువు లేదు.

మనవేదములు, శాస్త్రములు, సాహిత్యము, మతములు—ఇంక నిట్టివానినిగురించి మాక్సుముల్లరు, గాయిటీలవంటి ఖండాంతర మహామహోపాధ్యాయులు వ్రాసిన గ్రంథముల అనువాదములు లేవు.

ఇక రాజకీయముల సంగతి నేటి యాందోళన మున మూడుముఖ్యప్రాతికవంతులు రాజకీయములకు సంబంధించినదే; గాని సనాతనములు, అధునాతనములు నగు యూరోపీయ భారతీయ రాజ్యతంత్రగ్రంథములు మనకు లేవు. ఉపసంహరించుకోబడిన నెహ్రూనివేదిక యున్నది; గాని భవిష్యద్భారతరాజ్యాంగమునకు ప్రాతిపదిక కాబోవుచున్న సైమన్ నివేదిక లేదు.

ఇంకను అనేకవిషయములకు సంబంధించిన గ్రంథములు మనవాఙ్మయమున లేవు

ఇట్లెటు చూసినా మనవాఙ్మయము వికాసము లేక, ఎదుగు బొదుగులు లేక, మారాకు వేయక, సభ్యవాఙ్మయముల గణమున స్థానము లేక గుంటపూవులు పూయుచున్నది. మహాపురుషులను సృష్టింపగల—జాతియొక్క నాగరికతకు నికషమైన వాఙ్మయమువిషయమున మన ప్రముఖులు ఏమియు తలపక, ఏమియు చింతింపక, ఏమియు పట్టించుకొనక దేశమును, జాతిని, నాగరికతను, సభ్యతను వెనుకకు నెట్టుచున్నారు.

కాని ఆంధ్రులు ముందంజవేసినారని యొకకేక వినబడుచున్నది. ఎందు? అనుకరణమునందా? అడుగులలో అడుగులు వేయుటయందా?                శాస్త్రి.

## ప్రాగాంధ్రసీమ

మన ఆంధ్రరాష్ట్రాందోళనము, నేడు "ఆంధ్ర రాష్ట్రనిర్మాణముమాట దేవు డెరుగును; గాని ఆంధ్రమండలము లిప్పుడున్నవి యున్నట్లయిన నుంచినచాలు" నని ప్రాధేయపడవలసినంతవరకును వచ్చినది.

మన ప్రముఖుల అలసభావమువలన మన కిప్పుడు రెండునష్టములు వచ్చినవి. ఒకటి; ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గురించి సూచనలైన లేకపోవుట. మరియొకటి, గంజాము, విశాఖపట్టణమండలములయందలి పెద్ద పెద్ద ఆంధ్రభూభాగములను ఉత్కళులు కబళించుచుండుట.

మనలో కొందరు నేడు ఓడినల్ కమిటీ రిపోర్టునెడల అసమ్మతిని, అసంతృప్తిని ప్రదర్శించుచుండుట నిజమే; గాని మనప్రదేశములు మనకు తక్కవలయునని ఆమోతాదు చాలదు.

"ముందు యావద్భారతస్వాతంత్ర్యము సంపాదించినచో తరువాత భాషైకరాష్ట్రనిర్మాణము నిమిషాలమీద పని" యని మనప్రముఖులు ఆంధ్రరాష్ట్రమునెడల చేసిన అశ్రద్ధను దీనివిషయమునగూడ చూపినచో అప్పటి కిది పూర్తిగా బిగిసిపోయి దుర్భేద్యమయిపోవును.

అప్పుడైన సీమానిర్ణయము సందర్భమున మనవలె అందరును ఉదారులై యుండకపోవచ్చు ననుటకు ఈ సందర్భమున విదేశీయుడైన అధ్యక్షుడు నిష్పక్షపాతముగ నిర్ణయము చేయగా, దేశీయులైన సభ్యు లిద్దరును పాక్షికాభిమానము చూపుట పరమనిదర్శనము.

ఏతావతా, ఇది నిర్లక్ష్యముచేసి యూరకుండ వలసినది కాదు. ఇప్పుడు ఉత్కళరాష్ట్రమున కలుపుటకు తలపెట్టబడిన ప్రదేశములయందలి ఆంధ్రులు ఆంధ్రోద్యమమున మొదటినుండియు శ్రద్ధాభక్తులతో పనిచేయుచున్నవారు. ఇప్పటికే ఉత్కళులతోడి సాహచర్యము వారికి ఎబ్బెట్టుగా నున్నది. ఉత్కళరాష్ట్రమున చేర్పబడుటయే తటస్థించినచో వారిస్థితి అయోమయమే అయిపోవును.

అపిచ, ఆప్రదేశములను గురించి మన మశ్రద్ధచేసినచో ముందు ముందు మనకు రాష్ట్రవైశాల్యము తగ్గిపోవును. ఆదాయము సన్నగిల్లును. దానితో ప్రత్యేకరాష్ట్రాందోళనమునకు బలముకూడ తీసిపోవును.

ఇప్పుడు ఈవిషయమున మన మశ్రద్ధచేసినచో—తగినంత పట్టుదల కన్పరుపనిచో ముందుముందు ద్రావిడాంధ్రసీమాపరిష్కారమునందును, కర్ణాటకాంధ్రసీమానిర్ణయమునందును ఈయొరవడినిబట్టి మనకు ప్రాతికూల్య మధికము కావచ్చును.

ఇంతకే,

"సత్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి—"

శాస్త్రి.

# సోమపాళెపు దేవాలయము

ఎ. కె. నటరాజన్ గారు, బి. ఎ., (ఆనర్స్).

మనకు ౧౫, ౧౬ శతాబ్దములనాటి యాంధ్ర వాఙ్మయమువల్ల రాయలకాలమున దేవాలయములు, నగళ్లు, గృహములు మున్నగువాని గోడలపై చిత్రపటములు వ్రాయించుచుండెడివారని తెలియుచున్నది. విజయనగర పురమున నివసించుచుండిన పాశ్చాత్యవర్తకుల గ్రంథములుగూడ పై చెప్పినరీతిని చిత్తరువులు వ్రాయుట వాస్తవమని ఋజువుచేయుచున్నవి; కాని యాకాలపు చిత్తరువులలో నొక్కటియు నేడు గానరాదు. బౌద్ధయుగమునాటి యజంతాచిత్రములు, తరువాతి పల్లవ చోళ ప్రభుత్వములనాటి చిత్తనవాసిల్, కంచి, తంజాపురచిత్రములు నపూర్వ చిత్రలేఖకుల కళాకౌశలమును వెల్లడిసేయుచుండ షుమారు మూడువందల వత్సరముల నాటి విజయనగరపు చిత్రకళయొక్క జాడయైన గానరాకుండుట యాశ్చర్యము. రాయలనాటి చిత్రములన్నియును సంపూర్ణముగ మాసిపోయినవా? వెదకిన నెచ్చటనైన గానవచ్చునా? ఈ ప్రశ్నలనే నాకు క్రైస్తవ కళాశాలయందు విజయనగరచరిత్రను పాఠము సెప్పిన నా గురువు డాక్టరు యన్. వెంకటరమణయ్యగారిని అడిగితిని. "వెదకిన దొరకకపోవునా? ఉత్సాహమున్న రమ్ము వెదకుదుము. అని వారనిరి. "ఎచ్చట?" నని నేనడుగ చిత్తూరుజిల్లా మదనపల్లి సమీపమున సోమపాళె మను గ్రామమున్నది. అచ్చట శిథిలమైన యొక ప్రాతగుడి యున్నదట. అందు చిత్రపటములుగల వన్న వార్తను విని యున్నాను. అచ్చటికిబోయి చూచి నాకు ఉత్తరమును వ్రాయుము. తరువాత నేనును వచ్చెదనని చెప్పినారు. పిమ్మట నేను సోమపాళెమునకు వెళ్లి అచ్చట చిత్రములుండుటను గని వారికి వ్రాసితిని. వారువచ్చి కలుసుకొనిరి. ఇద్దరమును సోమపాళెమునకుపోయి అచ్చటి విశేషములను గంటిమి. వానిని డాక్టరు వెంకటరమణయ్యగారి సమ్మతిమీద ఇచట వ్రాయుచున్నాను.

పాకాల—ధర్మవరము లైనులో మొలకలచెరువు రైల్వేస్టేషనుకు పశ్చిమమున నాల్గుమైళ్ల దూరమున లోకల్ ఫండు రోడ్డుమీద వెంకట్రెడ్డిపల్లె యున్నది. దాని రెండు ఫర్లాంగులు ఉత్తరమున నున్న కొండయడుగున సోమపాళెము గలదు. ఈ రెండుగ్రామములకును పడమట పాడుపడిన దేవాలయమొక్కటి యున్నది. దీని నచ్చటివారు కసింకోట చెన్నరాయని దేవస్థానమందురు. పూర్వము రాయలకాలములో సోమపాళెమున నొక గొల్లవాడుండెనట. వానికి నిధి యొకటి దొరకుటచే నపారధనసంపన్నుడై రాయల యనుగ్రహమువడసి యచ్చట నాయకతనమును సంపాదించి, యా కొండ ప్రక్కన నొక కోటను గట్టికొని యాచుట్టుపట్టు గ్రామములను పాలించుచుండెనట. అతడు టెంకణాచార్యుడను శిల్పాచార్యునిచే నీ దేవాలయమును కట్టించెననియు ఈ టెంకణాచార్యుడే వేలూరు, లేపాక్షి మున్నగుచోట్ల దేవాలయములను నిర్మించిన శిల్పి యనియు చెప్పుదురు.

ప్రాకారమునకు వెలుపట దేవాలయద్వారమునకు ఎదుట సుమారు అరువదియడుగుల యెత్తుగల పక్షులు దీర్చిన (15) తెల్లరాతికంబముకలదు. ఈకంబము చచ్చౌకమైన యొకవేదిమధ్య నిలిచియున్నది. కంబము చుట్టుకొలత పైకి పోనుపోను తగ్గిపోవుచున్నది. దానికొనయందు ఇటుకలతో గట్టిన యొక గుడివంటి చిన్న గదికలదు. వేదికచుట్టును ఏనుగులు, గుఱ్ఱములు, నృత్యగానములుసల్పు గాయనగాయనీమణుల ప్రతిబింబములును చెక్కబడియున్నవి. కంబము మొదట నాలుగుప్రక్కలను వైష్ణవమత సూచకములగు ప్రతిమలు చెక్కబడియున్నవి. ఈప్రతిమలనుండి బయలుదేరి యొక్కొక ప్రక్క నొక్కొక తీగ కంబము కొనవఱకును బోవుచున్నది. ఈదేవాలయమున ధ్వజస్తంభము లేకపోవుటచేత దీనినే ధ్వజస్తంభమని భావించవలసినట్లున్నది. ధ్వజస్తంభమైన ప్రాకారమునకు

వెలుపట నుండుటయెట్లు? కంబము కొసయందున్న గుడి వంటి గదియొక్క యుపయోగమేమి? ఆలోచించిచూడగా జైనదేవాలయముల యెదుటనుండు మానస్తంభము నకును దీనికిని కొంతపోలికయున్నట్లు తోచుచున్నది. కాని కంబముపైని వైష్ణవప్రతిమలను చూడ నది మానస్తంభమనుట తప్పు. మఱియు దీనికి నాగ్నేయమున నింకొక రాతిస్తంభము దీనికంటెచిన్నది కలదు. ఇట్టిస్తంభములు ఈప్రాంతపు హిందూ దేవాలయములయందు కానరావు. వీనిస్వభావమును నాగమజ్ఞులును శిల్పశాస్త్రవేత్తలునునగు పండితులు విశదముచేయవలసియున్నది.

దేవాలయమును ప్రవేశించగనే యెదుట రంగమంటపము (3) గన్పించును. ఈ మంటపము పదునాలుగు తెల్లరాతి స్తంభములమీద నిలచియున్నది. ఈ స్తంభములలో మంటపము అంచులచుట్టు నున్న పది స్తంభముల యందు శిల్పవిశేష మొక్కింత గాన్పించుచున్నది. ఈ స్తంభములన్నియును ఏకశిలానిర్మితములైనను, వానిలో కొన్నింటిని రెండేసి గుంజలుగను, తక్కిన వానిని నాల్గేసిగుంజలుగను మలిచి శిల్పి స్వకళాకౌశలమును జూపియున్నాడు. రంగమంటపపు తూర్పు అంచుమధ్య గర్భగుడికి యెదుట నొక చిన్నగుడి (౧౦) రథాకారము గలది

దేవాలయము ప్లాను          సోమపల్లెకు పోవుదారి





రంగమంటపము ప్లాను


| | | |
|---|---|---|
| 1. గర్భగుడి | 7. డిటో | 12. ఉగ్రాణము |
| 2. ముఖమంటపము | 8. డిటో | 13. గొల్లవానిమంటపము |
| 3. రంగమంటపము | 9. వంటశాలలు | 14. ఉట్టికొట్టుమంటపము |
| 4. కల్యాణమంటపము | 10. రంగమంటపములో రథరూపమున కట్టబడిన గుడి | 15. రాతిస్తంభము |
| 5. అమ్మవారిగుడి | 11. బలిపీఠము | 16. డిటో |
| 6. చిన్నగుళ్లు | | |

యున్నది. ఈగుడి క్రిందిభాగము తెల్లరాతితోడను, విమానము నల్లరాతితోడను నిర్మింపబడి చక్కని చెక్కడపు బనితో చూచుటకు ఇంపుగ నున్నది. గర్భగుడికి(౧) నిముఖమంటపమునకును (౨) ఎడమప్రక్కను కల్యాణ మంటపము (౪) కలదు. ఇది కృష్ణశిలానిర్మితమై చక్కని చెక్కడపుపనిగల నాలుగు స్తంభములపై నున్నది. శిల్పి తన కౌశల్యమునంతయును నీ స్తంభములకు రూపు నేర్పఱచుటయందు వినియోగించియున్నాడు. నల్లరాయి శిల్పి కరస్పర్శముచే సహజకాఠిన్యమునువిడిచి మృదుత్వమును బొందినది. శిల్పి ఉలితో సర్వాంగములును స్పష్టముగ నగపడురీతిని సూక్ష్మమగు బింబములను మలిచియున్నాడు. ఇందు తీగెలు, మొగ్గలు, పక్షులు, మనుష్యులు, దేవతలు వీనియొక్క ప్రతిమలు కలవు. కొన్ని సహజమగు నచేతనత్వమును విడిచి చేతనత్వమును బొందిన ట్లగపడును. కల్యాణమంటపమునకు వెనుక మూడు చిన్నగుళ్లు (౬) గలవు. అందు నడిమిగుడియందు చక్కని నల్లరాతి లక్ష్మీ నారాయణవిగ్రహ మున్నది. ఎడమచేతివైపు కొనయందున్న గుడిద్వారమున కిరుప్రక్కలను ఋషులయొక్క బింబములు చెక్కబడియున్నవి. ఈ దేవాలయములో మిక్కిలియు అందమైన భాగము కల్యాణమంటపమే. దీనికి తరువాత గొల్లవానిమంటపము (౧౩) పేర్కొనదగినది. ఈమంటపమునకు మూడుప్రక్కల గోడలున్నవి. తూర్పుతట్టు గోడలేదు. మధ్యభాగమున రెండు స్తంభములు పై దూలములకు ఊతగ నున్నవి. మంటపమునడుమ నొక వేదికయు, వేదికకు నాలుగు మూలలను బహుపక్షములుగ మలచబడిన తెల్లరాతి స్తంభములు కప్పునకు ఆసనిచ్చుచున్నవి. గొల్లవానిమంటపము దానియందుండు శిలాప్రతిమలచే గణనకెక్కుచున్నది. అందు సరాసరి నాలుగున్నర యడుగులయెత్తు గల ప్రతిమలు పదమూడు గలవు. ఈవిగ్రహములన్నియు మనుజులవే యైనను వానిని రెండుతెగలుగ విభజింపవచ్చును. అందు ఐదు కసింకోటను పాలించిన నాయకులవి. అందొకని పేరు చిన్నన్న; మఱియొకని పేరు కృష్ణప్పనాయకుడు. మంటపపుదక్షిణపుగోడ తూర్పుకొనయందు మనుష్య ప్రమాణముఎత్తును, బారెడు వెడల్పును, రెండుమూరల లోతును గల పెద్ద గూడొకటి కలదు. ఈగూటిపైన 'కృష్ణప్పనాయుడు కూర్చుండేతావు' అని గోడపై చెక్కియున్నది. ఈమంటపమును, దేవాలయమును కట్టించినవాడు ఈ కృష్ణప్పనాయకుడే యగునేమో! మంటపములోని విగ్రహములన్నియు బహుసుందరముగ జెక్కబడినవి. నాయకుల ప్రతిమలను చామరగ్రాహిణుల ప్రతిములను జూడ శిల్పాచార్యునికి రాతిబొమ్మలకుగూడ జీవకళల నిచ్చుశక్తియుండెనని తెల్లమగును.

గొల్లవాని మంటపము దక్షిణదేశపు శిల్పరచనా చరిత్రమున నొక ముఖ్యస్థానము నాక్రమించుకొనియున్నది. అందలి ప్రతిమలు విజయనగరమునందలి యమర నాయకులును, వారి యంతఃపురవర్తినులగు దాసీజనులును ధరించు వస్త్రాభరణముల వైఖరి దెలుపును. ఇదియంత ముఖ్యమైన విషయముగాదు. నాయకులు తమరూపములను శిలలయందు జెక్కించి మంటపములయందు నిలుపు నాచారము మధుర నాయకు లుత్పత్తి చేయలేదనియు, తత్పూర్వ మాంధ్రదేశముననున్న యాచారమునే వీరు తమిళదేశమున బాదుకొల్పిరనియు నీ మంటపములోని ప్రతిమలు దెలియజేయుచున్నవి. తిరుపతి, కాళహస్తి దేవాలయములందుగల కృష్ణాచ్యుతరాయల ప్రతిబింబములును నీతరగతిలోకి జేర్పదగినవే.

ఈదేవాలయమును నిర్మించిన దెప్పుడు? ఈకాలమును నిర్ణయించుటకు దగు శాసనము లేవియును గానరావు. కాని దేవాలయపు శిల్పరచనావిధానమునుబట్టి తత్కాలము నూహచేయవచ్చును.

(౧) రంగమంటపములోని స్తంభముల చెక్కడపుబనికిని, హంపిలోని విఠలస్వామి యాలయము స్తంభముల చెక్కడమునకును పోలికలున్నవి.

(౨) పెద్ద శిలాస్తంభము చుట్టునున్న వేదికపైని ప్రతిమలకు, విజయనగరములోని 'త్రోన్ ప్లాటుఫార' మనబడు సింహాసన వేదికచుట్టు జెక్కబడియుండు ప్రతిమలకును పోలికలు గలవు.

(౩) కల్యాణమంటపపు స్తంభములును వేలూరు కోటలోని దేవాలయ స్తంభములును నొకేతీరుననున్నవి.

కావున సోమపాళెపు దేవాలయమును ఆకాలముననే అనగా పదునారవ శతాబ్దమధ్యభాగమున నిర్మింపబడియుండవలయును. మఱియును ఈదేవాలయమును లేపాక్షిదేవాలయమును నిర్మించిన శిల్పాచార్యుడొక్కడే యన్నగాథ యొకటిగలదు. ఇందెంత సత్య మున్నదో? లేపాక్షి దేవాలయము క్రీ. శ. ౧౫౩౦ మొదలు ౧౫౪౨ వఱకును విద్యానగరమును పాలించిన అచ్యుతరాయలకాలమున పెనుగొండ వీరూపణ్ణచే గట్టింపబడినది. ఈగాథయందు కించిత్ సత్యమున్నను సోమపాళెము దేవాలయముగూడ యచ్యుతరాయలకాలమున నిర్మింపబడియుండవచ్చును. దేవాలయపు టుత్తరపుకొట్టు వాకిటిగోడమీదనొకచిన్న శాసనము వ్రాయబడియున్నది. "విజయ సం. మాఘ శు ౨ శ్రీమన్మహానాయకాచార్యులైన సిం. క్రిష్టప్ప నాయని నాగినాయనివారు విస్సుపాళెం భూమోజకుయిచ్చిన......" అని అచ్యుతరాయల రాజ్యకాలమున నొకవిజయసంవత్సర మున్నది. అది క్రీ. శ. ౧౫౩౩ కు సరిపోవుచున్నది. దేవాలయముగూడ అప్పటిదే కావచ్చును.

చిత్తరువులు:—సోమపాళెము దేవాలయములోని గొప్పవిశేష మేమన ముఖమంటపముయొక్కయు, రంగమంటపముయొక్కయు కప్పుపై వర్ణచిత్రములు లిఖింపబడియున్నవి. ముఖమంటపములోని చిత్రములు సంపూర్ణముగ రూపుమాసిపోయినవి. రంగమంటపము కప్పు బీటికలు వారి వర్ష జలము కురియుటవలన చిత్రములు మిక్కిలియు చెడిపోయినను కొన్ని యింకను గన్పించుచునే యున్నవి.

రంగమంటపమధ్యమున ఉత్తరదక్షిణము రెండు వరుసల స్తంభములు గలవు. వీటివల్ల మంటపము మూడు భాగములుగ విభజింపబడియున్నది. మొదటి మూడవ భాగములు సంపూర్ణముగ చిత్రింపబడియుండెను. మధ్యభాగములోని చొకమునందెట్టి చిత్తరువును లేదు. వర్ష జలమువల్ల మొదటి రెండుభాగములలో చిత్రపటములు మాసిపోయినవి. అచ్చటచ్చట ఈచిత్రపటముల పొడ కొట్టిగ గానవచ్చుచున్నవి. మూడవభాగమందలి పటములు చాలమటుకు వివర్ణములైనను స్ఫుటముగ గాన్పించుచున్నవి. రామాయణకథయే యిందు చిత్రింపబడియున్నది. తాటకహరణము, శివధనుర్భంజనము మొదలయినవి కొన్ని యింకను చెడిపోలేదు. ఈ చిత్రములను గుర్తించుట కొకవారము రోజులయిన నచ్చట నుండి పరిశోధింపవున్న పీలగుపనికాదు. వీని నన్నిటిని కాపీచేయుట కష్టతరమైనకార్యము-కనీసము ఒకమాసమేనియు పట్టును.

'చిత్రకళయందు ఈపటములకుగల విలువయెట్టిది? భారతచిత్రపటసముదాయమున వీని కియ్యదగు స్థానమెద్ది?' అని యెవ్వరైనను అడుగవచ్చును. ఇవి అడుగదగిన ప్రశ్నలేకాని వీనికి సమాధానము జెప్పు తరుణ మింకను రాలేదు; కాని వీనికి మన చిత్రకళాచరిత్రయందు ముఖ్యమైనస్థానము కద్దు. ఏలన, ౧. వీనివలనమున రాయలకాలమున దాక్షిణాత్యచిత్రకారకుని నేర్పెట్టిదియో తెలియగలదు. (౨) హైందవచిత్రలేఖనచరిత్ర మొన్న మొన్నటిదాక అజంత, ఎల్లూరగుహలతోడనే సమాప్తి యగుచువచ్చినది. శిత్తనవాసల్, కాంచి తంజావూరను నూతనాధ్యాయములు ఈమధ్యనే కనుగొనబడినవి. తరువాతి చరిత్ర సోమపాళెపు ప్రతిమలవల్ల దెలియుచున్నది. ఇందువల్ల ప్రాచీనహైందవచిత్రకళ సంపూర్ణము సేయుటకు నూతనసామగ్రి లభించినది. రాజపుత్రఘూర్జర చిత్రలేఖనము ఇట్టి సామగ్రి నిచ్చుచుండలేదాయని యెవరైన నడుగవచ్చును. వానికి తురుష్క సంపర్కమున్నది. విజయనగర చిత్రలేఖనమున కట్టి సంపర్కము లేదు. ఇది కేవలము హైందవకళయే. ఇదియే దాని యతిశయము. ఈ కారణముచేతనే దీనిని చక్కగ పరిశోధించవలసియున్నది. విజయనగరపు రాయలనాటి చిత్రపటములు తిరుపత్తికున్రము, లేపాక్షి, హంపి మొదలగుచోట్ల కలవని తెలియవచ్చుచున్నది. హైందవచిత్రకళాభిమానులందఱును వానిని పరిశోధించి వాని విలువను గనుగొందు రని నమ్ముచున్నాను.

---




## అమరావతీ స్తూపము, ఇతరవ్యాసములు

క్రౌను సైజు; పు. ౧౩౨; వెల ౧౨ అణాలు.

గ్రంథకర్త: మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు
**2/19** ఆదియప్ప మొదలివీధి, పురశవాకం, మదరాసు,

ఈగ్రంథమున నయిదువ్యాసము లున్నవి. ఇందలి మొదటి మూడువ్యాసములును (ఆంధ్ర విశ్వవిద్యాలయము) ఇంటర్మీడియేటు, (మద్రాసు విశ్వవిద్యాలయము) బి. ఎ. పరీక్షలకు, (౧౯౩౨-౩౪) పాఠ్యములుగా నిర్ణయింపబడినవి. ఈగ్రంథమున వ్యాసములన్నియు మున్నొకమారు 'ఆంధ్రపత్రిక' 'సమదర్శినీ' ఉగాది సంచికలయందును, 'భారతి' పత్రికయందును ప్రకటితము లయినవియే. కాలాతిపాతమున విస్మృతిపథమును బట్టియుండునన్న శంకతో నీక్రింద నల్పమాత్రముగ వాని స్వరూపము మరల పేర్కొనబడినది.

౧. అమరావతీ స్తూపము: బుద్ధు ననంతరకాలమున బౌద్ధమతవ్యాపనము. అమరావతీస్తూపము,అచ్చటి శిల్పకళాప్రాశస్త్యము మొదలగు నంశము లిందు వివరింపబడినవి.

౨. ప్రాచీనవృత్తి విద్యావిధానము: ప్రాచీన కాలమున భారతదేశమున వృత్తివిద్యల గౌరవము, తదభ్యాసక్రమము, తత్పోషణము, అందుచే దేశమునకు గలిగిన లాభములు మున్నగువిషయము లీవ్యాసమున తెలుపబడినవి.

౩. ప్రాచీన విద్యాసంస్థలు: పూర్వకాలమునందలి విద్యాభ్యాస విధానము, వానికుండిన సౌకర్యములు నిందభివర్ణితములయ్యెను.

౪. అనాదృతవాఙ్మయము: ఔరంగజేబు 'నవసానకాలమున' నాతని 'రాజ్యమునందలి హైదరాబాదు-ఓరుగల్లు ప్రాంతములగల దేశముపయి దాడివెడలి కోటను ముట్టడించును నగరములను కొల్లబెట్టుచు' వచ్చిన పరాక్రమశాలి సర్వాయిపాపనికథను, గేయరచనమును, వివరించుటతోపాటు ఆంధ్రదేశమున ద్విపద, గేయరూపముల వీరరసమంచితములు, నాపాతమధురములు నగు రచనములతో వెలసిన ఆంధ్రవీరుల చరిత్రములయొక్క ప్రాశస్త్యమును, వానియెడ నాంధ్రుల యుపేక్షను, తదుద్ధరణప్రచారణముల యావశ్యకమును నీవ్యాసమున నుగ్గడింపబడినవి.

౫. బౌద్ధవాఙ్మయము, పరిశోధన: ప్రాచ్యవిజ్ఞాన పరిశోధనకు ప్రారంభయుగ మగు 'క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్ది' మొదలుకొని కావింపబడిన బౌద్ధవాఙ్మయ పరిశోధనవివరము లిందు వివరింపబడినవి.

గ్రంథకర్త మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పెక్కేండ్ల నుండి చరిత్రపరిశోధనమును గావించుచున్నవారు. వారికి ప్రాచీనశాసనములు కొట్టినపిండి. ఏకాలము వానినయినను, ఎట్టి లిపినున్నవానినయినను అవలీలగా పఠించి వానియందలి విషయముల లెస్స యవగాహనము చేసికొను సామర్థ్యము గలవారు. వాఙ్మయమునందంతట నిగూఢముగ వ్యాప్తములయియున్న చరిత్రాధార లేశములను సూక్ష్మదృష్టిని పరిశీలించి ఏర్చి కూర్పనేర్చినవారు ఇట్లుపలబ్ధములగు పరికరముల నన్నింటిని జాగరూకతతో, నుపజ్ఞతో సమన్వయించి చర్చించి సిద్ధాంతములను సప్రమాణముగను, కరతలామలకములుగను ప్రద

ర్శించగలవారు. తప్పనిసరియగునెడల ఒరుల సిద్ధాంతము లను సౌమనస్యముతో మృదువుగ ఖండించువారు.

వీరి రచనము సుగమము, లలితము, సజీవము నయి యుండును. కడు నీరసములయిన విషయములనేని మిసల సరసములుగ మార్చి పాఠకులకు విషయాభిమానమును, విషయపరిశీలనాసక్తిని, ఉత్సాహమును పిక్కటిల్ల జేయు శక్తి వీరిరచనమునకు గల విశేషగుణము.

వీ రప్పటనప్పట రచియించి పత్రికలయందు ప్రకటించిన నూర్లకొలది వ్యాసములను తిలకించిన సహృదయులు గ్రంథకర్తనుగూర్చి పయి నుడివినవాక్యము లతిశయోక్తులు కావని యెరుగుదురు.

ఆంధ్రదేశము—సమగ్ర చరిత్ర విజ్ఞానమునకు దూరమయిన యాంధ్రదేశము — చరిత్రపరిశోధనమున నట్లు సిద్ధహస్తులగు శ్రీశర్మగారికి తగిన ప్రోత్సాహమును జ్ఞాపక యుపేక్షను వహించియుండుట విషాదకరము. ఇన్నాళ్లకు విశ్వవిద్యాలయములయినను శర్మగారు సేకరించిన చరిత్ర విజ్ఞానమునందలి గుణవిశేషమును గుర్తించి దానిని తమ విద్యార్థులకు ఇట్లొకింత పంచి పెట్టబూనుట తమ కాదాయమును కలిగించుకొనుటయే యయినది గాని శర్మగారిని గౌరవించుట యేమాత్రమును గాలేదు. శర్మగా రిప్పటికి ప్రకటించిన బహుసంఖ్యములగు వ్యాసములనుబట్టి వారికడ ప్రకటితముకాని చరిత్రవిజ్ఞానసంచయ మెంతయో యుండితీరవలయునని యూహింప నగుచున్నది. దానినంతయు వెలువడజేయు సౌకర్యములను విశ్వవిద్యాలయములు శర్మగారికి సమకూర్పవలయును. అపుడు స్వలాభముతోపాటు వారిని గౌరవించుటయు నగును. మఱియు విదేశచరిత్రకారుల విప్రతిపన్న భావములతో వికృతాకారమునుదాల్చి కృశీభూతమగుచున్న దేశచరిత్రను స్వస్వరూపమున నుజ్జీవింపజేయుటయు నగును.

కావున శ్రీశర్మగారిచే విశ్వవిద్యాలయములు తరుచు చరిత్రోపన్యాసముల నిప్పించి విద్యార్థులకు చరిత్రజ్ఞానమును పంచిపెట్టుచు, తదుపన్యాసములను ప్రకటించుచు శ్రీ శర్మగారికి, తతోధికచరిత్రపరిశోధనకార్యమును యథేష్టముగ కొనసాగించుటకుజాలిన ధనము నొసగుచు సత్కరించుచుండుట న్యాయ్యము.

విశ్వవిద్యాలయములకు విజ్ఞానమే సంపద. తత్సంపాదనార్థము విజ్ఞానసంపన్నుల యాశ్రయ మావశ్యకము, అట్లు చేయకున్న ఉన్న సంపద వ్యయమయి విశ్వవిద్యాలయములు క్రమముగ పేదవడిపోవగలవు.

---

## అడిదము సూరకవి

ప్రస్తుత విశాఖపట్టణమండలమున ౧౭౨౦-౧౭౮౫ సంవత్సరములలో జీవించియుండి, పెదవిజయరామరాజు, ఆనందగజపతి, చినవిజయరామరాజను విజయనగర జమీందారులయొక్కయు, పెద్దాపురపు వత్సవాయి తిమ్మ జగపతిమహారాజుగారియొక్కయు, పర్లాకిమిడి నారాయణదేవు మహారాజుగారియొక్కయు శృంగవరపుకోట జమీందారుగారి మంత్రి పాణుగుపాటి వెంకటమంత్రిగారియొక్కయు మన్నన లందినట్టియు, కవిజనరంజనము, కవిసంశయవిచ్ఛేదము, చంద్రాలోకము శ్రీరామదండకము, ఆంధ్రనామశేషము, రామలింగేశ శతకము మొదలగు ప్రసిద్ధగ్రంథములు రచించి మృతజీవియైన అడిదముసూరకవియొక్క జీవనచరిత్రము నేర్చికూర్చి, లిఖించి శ్రీ అడిదము రామారావుగారు ఆంధ్రుల కృతజ్ఞత కెంతయు బాత్రులైనారు. అడిదము సూరకవిచరిత్ర పఠించుటయనిన ఇంచుమించు పదునెనిమిదవ శతాబ్దమునాటి ప్రసిద్ధరాజులు, మంత్రులు, కవులు, వీరులు, సామాన్యప్రజలు, వారి ఆచారవ్యవహారములు. హాస్యములు, పరియాచకములు, ఆశలు నిరోధములు యుద్ధములు, జయాపజయములు మొదలగు చారిత్రికాంశము లన్నిటిని అతని పద్యములనెడి సులోచనములే ధరించి కళ్లకు కట్టినట్లు దర్శించుట యైయున్నది. సూరకవి కేవలము రాజులప్రక్కలలోనే దూరి రాజుల వైభవములే వర్ణించుచుండు భోగలాలసుడగు రాజకవి కాడు, అదపాకపాప, రేగాని సన్నిగాడు, బత్తుల అయ్యన్న, పాణుగుపాటి వెంకటమంత్రి, విజయరామరాజు, నారాయణదేవు ఇట్లు అధమ, మధ్యమ, ఉన్నతతరగతులకు

చెందిన సమస్తప్రజాసముదాయమును అతని కవితాదృష్టికి పాత్రులైనారు. తోడికవులతో వివాదములు, దుష్ట ప్రభువుల దూషణములు రెంటినుగూడ అకుంఠితలేఖినీ పరాక్రమముతో సాగించిన కవివీరుడని యితని నన నొప్పును. ఇతను కేవలము సూరకవియేకాక శూరకవి కూడ నైయున్నాడని అతని మొగమాటములేని విమర్శల వలన తెలియగలదు.

అతని చాటుధారపద్యములను గంజాము విశాఖ పట్టణమండలములలోని ఇప్పటి అక్షరాస్యులెల్లరునుకూడ వారి నిత్యజీవితములోకూడ సామెతలవలె ఎత్తి ఉచ్చరించుచు, చదువుచుండుటచేత సూరకవిభాష యిప్పటి వ్యావహారికభాషతో అందముగా అనగిపెనగి యున్నదనుట కెట్టి యాటంకమును లేదు. దీనికి కారణము కేవలము పండితులకొరకును లాక్షణికులకొరకును వ్రాసిన ప్రబంధాదులలోదక్క ప్రజాసామాన్యముకొరకు వ్రాసిన శతకములు చాటుధారలలో పరిశుద్ధమగునట్టియు, పామరులకుకూడ నర్థమగునట్టియు సామాన్యపదసంచయమును, జాతీయములును గూర్చి రచించుటయే యైయున్నది. అత నప్రయత్నముగ వ్రాసిన పద్యము లన్నియు నిట్లే యున్నవి. కనుకనే అవి అతని ప్రబంధములవలెగాక ఆంధ్రదైనందినజీవనములో మిళితములై అనునిత్యమును శోభాయమానముగ ప్రకాశించుచున్నవి.

పాలకొండమీద వ్రాసినపద్యము లప్పటికే ఆప్రాంతపు పరిస్థితులను దెలుపును. రేగ, కంచరాం మాన్యముల మీద వ్రాసిన పద్యములు చూచిన శత్రువులకైనను ఇనాములు వద్దురా యనిపించును. రేకపల్లి సోమప్పకును ఇతనికిని నడచిన పద్యముల యుద్ధమును పఠించినచో ఇప్పటివలెనే అప్పుడుకూడ 'అహంవిద్వా'న్నను మదము మాత్సర్యకలుషితమై యున్నట్లు తోపకమానదు. ఇక సమయోచితముగ వెలువడిన ఆశుధారపద్యములును పద్యపాదములును అప్పటి ప్రజాజీవ చిత్రముపై కాలపురుషుడు వైచిన మరపుతెరను కొంచెము తొలగించి మనలను తొంగిచూచునట్లు చేయును. ఇట్టివాని నన్నిటిని కూడపెట్టి విమర్శించి కవిజీవనముతోను అప్పటి కాలచరిత్రముతోను అతికి చారిత్రికసత్యాత్మక మగు నొక సులభసుందర వచనకావ్యముగా తయారుచేసిన రామారావుగారి కృషి మిగుల ప్రశంసనీయమేకాక తాను సూరకవి వంశీయుడే కనుక ఈరూపముగ కొంత పితృదేవతా ఋణమునుగూడ తీర్చుకొనినారని చెప్పవలెను.

గ. స.

---

## భరతుడు

ఇక్ష్వాకువంశశ్రేష్ఠు డగు దశరథ మహారాజు యొక్క పుత్రుడును, శ్రీరామసహోదరుడును నగు భరతుని చరిత్ర మీగ్రంథమున లిఖించబడినది. ఈచరిత్రకు మాతృక శ్రీమద్రామాయణము రామాయణమునుండి భరతునిచరిత్రకు సంబంధించినంతవరకు సమగ్ర వృత్తాంతమును ౭౩ పుటలలో పొందుపరచబడినది. భరతునిజననము, మందర దుర్బోధలు, కైకేయిక్రౌర్యము, దశరథుని పుత్రవాత్సల్యము రాముని పితృవాక్యపరిపాలనాతత్పరత్వము భరతుడు కైకను తెగనాడుట, రాముని తిరిగితెచ్చు ప్రయత్నము, అట్లు తేలేమి, పాదుకాపట్టాభిషేకము, నందిగ్రామవాసము, శ్రీరామునికొరకు నిరీక్షణము, రామపట్టాభిషేకము మొదలగు వృత్తాంతము లెల్లను ఇందు వర్ణింపబడినవి. భరతుని సౌశీల్యము ప్రతిపత్రమునను ప్రతిఫలించుచుండును. శైలి యతిసులభమునుకాక అతికష్టమునుగాక మధ్యమమై గంభీరశుద్ధాంధ్ర సంస్కృతపదమిళిత మైయున్నది. ఇతివృత్త మెల్లరును నెరిగినదే. దీనిని తిరిగీ రచించుటలో నూతనాభిప్రాయములనుగాని, స్వకీయవిమర్శనములుగాని గ్రంథకర్త యిందు చేర్చవలసిన యావశ్యకత కనుగొనలేదు. దీనినిబట్టి శుద్ధమగు పదచయము గ్రాంథిక మగు శైలియు హైస్కూలుతరగతుల విద్యార్థులకు అలవడుటకై గ్రంథకర్త మిగుల శ్రమ తీసుకొని రచించినట్లు తెలియుచున్నది. ఈ శ్రమను గుర్తించి పాఠ్యగ్రంథ నిర్ణయసంఘమువారు వీనిని ఉన్నతవిద్యాపరగతుల కుచితమగునట్లు నిర్ణయింతురుగాక!

గ. స.

---

## మైరావణచరిత్రము

అత్యద్భుత సాహసకృత్యములును పరాక్రమచర్యలును నొనరించువానిని "అతనివి మైరావణచర్యలురా" యని లోకు లిప్పటికిని నచ్చెరువుపోవుచుందురు. అయినను వాల్మీకిరామాయణ మామూలాగ్ర మెఱిగిన వారుకూడ యీమైరావణు డెవడో, అతని చర్య లెట్టివో వినియుండరు. రామపట్టాభిషేకమయి రామచంద్రు డయోధ్యపట్టణము నేలుచున్నప్పుడుగూడ శ్రీరామునకును ఈతని చరిత్రము అగస్త్యముఖతః వినువరకునుగూడ తెలియదు. అతని చరిత్రమే అంత యద్భుతమైనచో, వానిని కనుబ్రామి యోడించి వధించి రామలక్ష్మణుల రక్షించిన హనుమంతుని చరిత్ర మింకను నెంత వింతయై యుండవలెను. ఇట్టి వీరుల చరిత్రమును పండితపామరులకెల్లరకును సుబోధకమగు వచనములో డాక్టరు దువ్వా శేషగిరిరావుగారు రచించి ఆంధ్రయువకుల కెల్ల యుత్సాహమును గొల్పినారు.

మైరావణుడు లంక కుత్తరముగా నున్న రసాతలలంక కధిపతి. అచ్చటికి ఒక పద్మనాళముగుండ నతి సూక్ష్మమగు మార్గ మున్నది. మత్స్యవల్లభుడను నొక జలచరుడు దానిముఖమున నిలిచి యెవ్వరినిగాని లోనికి పోకుండ కాచును. మైరావణునకు దుర్దండియను నొక చెల్లె లున్నది. ఆమెకుమారుడు నీలమేఘు డనువాడు మున్ముందు రసాతలలంకకు రాజు కాగలడని ఆకాశవాణి పలుకుటచే మైరావణు డామెను దాసిగా జేసికొని కాళ్లకు సంకెళ్లు వేసి నీళ్లుమోయించుకొనుచు ఆమె కుమారుని చంప నుద్యుక్తు డగుచుండెను.

అట్టి మైరావణుని రావణుడు పిలిచి రామలక్ష్మణుల నెట్టయిన వధించుమని వేడుకొనెను. మైరావణుడు కొంతవడి నది వ్యర్థప్రయత్న మగునని నిరుత్సాహపరచియు లాభములేక స్వామికార్య పరాయణత్వముకొరకు వారిని వధింప బూనుకొనెను. ఈ సంగతి విభీషణుని వలన హనుమంతు డెరిగి, తన వాలమును పెంచి శ్రీరామసేనచుట్టును నొకకోటగా చుట్టిపెట్టెను. మైరావణుని బంట్లగు ఘటకసూచీముఖుల ననిపి రామలక్ష్మణుల నెత్తుకొని రమ్మనెను. ఘటకుడు ముందుపోయి కోట దాటి లోనికి పోదలచెనుకాని హనుమంతుని మాయవలన ఘటకుడు పోవుకొలదిని కోట పొడవు కాదొడగెను. సూచీముఖుడు తోకకు కన్నముచేసి పోగోరెనుగాని కన్నములోనుంచి యెంతదూరము పోయినను అద్దరి కానలే డాయెను. ఇరువురును నీసంగతి మైరావణునికి చెప్పిరి.

మైరావణుడు విభీషణవేషముతో హనుమంతుని మోసగించి అతని అనుమతిపైని లోనికి జని నిద్రించుచున్న రామలక్ష్మణుల నొక పెట్టెలో గొని పోయెను. హనుమంతు డది యెరిగి ఖిన్నుడై సూక్ష్మరూపమున రసాతలలంక కేగి, మత్స్యవల్లభుని తన కొమారునిగా దెలిసికొని అతనివలన అచ్చటి గుట్టుమట్టు లెఱిగి, దుర్దండి కుమారునికి రసాతలలంక పట్టణము కట్టుదునని చెప్పి ఆమె కుండలో దూరి మైరావణునియొద్దకు పోయి అక్కడి వీరుల నందరి నోడించి, మైరావణుని వధించి నీలమేఘునికి రాజ్యముకట్టి రామలక్ష్మణులకు తెలివివచ్చు లోపలనే అనగా ఆరాత్రియే ఆపెట్టెను సేనావ్యూహమునకు తెచ్చెను. ఈ సంగతి అగస్త్యులవారు చెప్పువరకు శ్రీరామచంద్రునకు తెలియనే తెలియదు. రామచంద్రుడు హనుమంతుని పరాక్రమమును మెచ్చి యెంతయు నుతించెను.

శైలి, యుత్సాహజనకమై, అద్భుతరసమును కడదాక ప్రవహింపజేయునదై, సులభమయ్యు గ్రాంథికమై, మరలమరల చదువవలె ననిపించుచుండును. మైరావణుడు రావణునికి చేసిన హితబోధ, మైరావణునకు తనపత్ని చేసిన హితబోధ, హనుమంతుడు నీలమేఘునకు చేసిన సదుపదేశములు మొదలగు కథపట్టు లన్నియు నీతిదాయకములై భక్తిపోషకములై యున్నవి. ఆంధ్రయువతీయువకు లెల్లరును దీనిని పఠించవలెనని అభిలషించుచున్నాము. గ. స.

---

## ధనలక్ష్మి

ఇది యొకసాంఘికవిషయకమగు నవలయని కవిగారు వ్రాయుచున్నారు. కామరాజు ధనలక్ష్మల వివా

హ మితివృత్తముగా గలది గనుకను, చారిత్రికాత్మకము కాదు గనుకను, సంఘముపైని కొన్ని విమర్శనములున్నవి గనుకను ఇది సాంఘికనవలయని కవి తలచవచ్చును. కాని సకలవిషయములలోను ఇది సంఘభవనముయొక్క సరియైన చిత్రమని కాని, ఆంధ్ర సాంసారిక జీవనము యొక్క సరియైన ప్రతిబింబమనికాని, సాంఘిక నవల కుండవలసిన లక్షణములన్నియు నిందు పాటింపబడిన వనికాని చెప్పుటకు వీలులేదు.

అయినను సాధారణముగా నవల కుండవలసిన పడికట్లెల్లను దీనియందు పాటింపబడినవి. మొదటి అధ్యాయములో ఒక చిక్కు చూపెట్టి కడపటి అధ్యాయములో విప్పుట, ఉన్నత కులసంభవులగు నాయికా నాయకులు, వారి వివాహము ప్రధానమగు ఇతివృత్తము వారి మోహవిజృంభణములు, వివాహమును తప్పించుటకు శత్రువుల ప్రయత్నములు, అజ్ఞాతవేషములో నుండెడి అద్భుతవ్యక్తి తానెవరో తెలియకుండ అక్కడక్కడ పెక్కువేషములతో వచ్చి సమయమునకు సరియైనసాయము చేయుట, కథశుభాంతమై ముగియుట, నీతి బోధకత్వము, మొదలగు సాధారణలక్షణములన్నియు నున్నవి. దీనిని సాంఘికనవల యనుటకంటె సంఘవిషయమైన కథ యనిన బాగుండును. శైలి చక్కని, సులభమగు గ్రాంథికభాషలో నున్నది. కథాపఠనకుతూహలము గల యిప్పటి యువతీయువకు లెల్లరును దీనిని మెచ్చగలరని నమ్ముచున్నాము. గ. స.

---

# గ్రంథ స్వీకారము

## నారాయణవాచకములు

క్రౌను సైజు

| | | |
|---|---|---|
| మొదటివాచకము | పు. ౬౨ | వెల రు. ౦-౩-౦ |
| రెండవ ,, | ,, ౬౮ | ,, ౦-౩-౬ |
| మూడవ ,, | ,, ౭౭ | ,, ౦-౪-౦ |
| నాల్గవ ,, | ,, ౯౨ | ,, ౦-౫-౦ |
| మొదటి ఉపవాచకము | ,, ౩౨ | ,, ౦-౨-౦ |
| రెండవ ,, | ,, ౪౦ | ,, ౦-౨-౬ |
| మూడవ ,, | ,, ౪౮ | ,, ౦-౩-౦ |

గ్రంథకర్త: రూపనగుడి నారాయణరావుగారు,

### బళ్లారిజిల్లా చరిత్రము

క్రౌనుసైజు పు. ౪౫, వెల రు ౦-౬-౦

గ్రంథకర్త: ఏ. కే. బాలసుందరంగారు, బి. ఏ., యల్. టి.

పై ఎనిమిదిపుస్తకములకు ప్రకాశకులు: పి. ఉచ్చయ్యాసెట్టి అండు సన్, బళ్లారి.

ఉపవాచకములు పాఠ్యగ్రంథనిర్ణయసంఘము వారి అంగీకారముద్రను బడసినవి.

---

### బ్రాహ్మణగీత

కర్త: పండిత బులుసు రామజోగరావుగారు. కాలికోబైండు, చిన్నసైజున ౩౦ పుటలు, వెల ౧ అ.

---

### విభ్రమవివేకః

(సంస్కృతము) కర్త: మండనమిశ్రుడు, సంపాదకులు: మహామహోపాధ్యాయ, విద్యావాచస్పతి యస్. కుప్పుస్వామిశాస్త్రిగారు, వేదాంతాలంకార; టి. వి. రామచంద్రదీక్షితులుగారు.

ప్రకాశకులు: జర్నల్ ఆఫ్ ఓరియంటల్ రిసర్చి వారు, ౫, ఉత్తరమాడవీథి, మైలాపురము, మదరాసు.

డెమ్మీసైజు, ౩౫ పుటలు, వెల ౧౨ అ.

---

## ఆంధ్రవిజ్ఞానచంద్రిక

(ఒకటి, రెండు భాగములు)

రచయిత: విద్వాన్ ఇ. భావ్యకాచార్యులుగారు, ప్రకాశకులు: ఆర్. వి. నాథన్ బ్రదర్సు, తిరువల్లిక్కేణి మదరాసు. క్రౌన్‌సైజు, మొదటిభాగము ౨౪ అణాలు. రెండవభాగము ౧౦ అణాలు.

---

## ౧. పాండవాంకురము (నాటకము)

డెమ్మీ, ౧౩౨ పుటలు, వెల ౧ రూపాయి.

## ౨. మధుమురళి అను తేనెకిన్నర (ప్రథమభాగము)

వెల ఎనిమిదణాలు.

## 3. అంపశయ్య (నాటకము)

క్రౌను, పు. ౧౮౦, వెల రు. ౧-౦-౦.

పై మూడుగ్రంథములకు గ్రంథకర్త: అచ్యుతుని వేంకటాచలపతి రావుగారు, గుంటూరు.

---

## శ్రీ గోదావరీ పుష్కర మాహాత్మ్యము.

వెల రెండు అణాలు.

రాజమండ్రి ఆంధ్ర ప్రకటన సంఘమువారి తొలి ప్రచురణము.

గోదావరి పుష్కరమును గురించిన సకలవిషయములును ఇందు చక్కగ వివరింపబడినవి.

గ్రంథములు దొరకుచోటు: నాళము సోమరాజుగారు, ఆర్యాపురము, రాజమండ్రి.

---

## (i) దర్పదళనము

(తృతీయముద్రణము) క్షేమేంద్రునికృతికి తెనుగు. క్రౌనుసైజు, వెల ౧౨ అణాలు.

## (ii) సదుపదేశము

క్రౌను, పుటలు ౨౦౦, వెల ౧౨ అణాలు.

పైరెంటికిని కర్త: గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు, చిత్తూరు.

---

## జ్ఞానోదయము (ప్రథమభాగము)

క్రౌనుసైజు, ౨౬ పుటలు, వెల ౪ అణాలు.

కర్త: తెలికిచెర్ల సుబ్బారావు గారు, రాజమహేంద్రవరము.

---

## శ్రీరామపూజావిధానము

గ్రంథకర్త: హజారి (ఉత్పల) వేంకటరావుగారు భువనగిరి, నల్లగొండజిల్లా (నైజాం) వెల ౬ అణాలు.

---

## ధ్రువచరిత్రము

క్రౌను, ౨౭ పుటలు, వెల తెలియదు.

గ్రంథకర్త: గంధం వేంకట నరసింహాచార్యులు గారు, స్నేహలతాకవితాసంఘము, కొల్లాపురము (జటప్రోలు సంస్థానం.)

---

## దివ్యప్రబంధ మార్గప్రదీపిక

డెమ్మీసైజు, ౨౮౦ పుటలు, వెల తెలియదు. రచయిత: నిమిషకవి వెంకయ్యగారు, రిటైర్డు మేజస్ట్రేటు, మోడేకుర్రు, కొత్తపేటపోష్టు, (తూ. గోదావరి).

---

# మనవిమాటలు

## పాఠశాలలు : భావివిద్యావిధానము

పూర్వకాలమున విద్యార్థులు పిన్నవయసుననే విద్వాంసులచెంత జేరి వారిని గురువులుగ భావించి భక్తిశ్రద్ధలతో శుశ్రూషించుచు వారితోడ విద్యల నభ్యసించుచుండెడివారు. గురువులును వారిని శిష్యులనుగ స్వీకరించి వాత్సల్యముతో తమసర్వస్వమును వినియోగించి తమకన్నబిడ్డలవలె పోషించుచు విద్యను, సత్ప్రవర్తనమును నేర్పువారు. విద్యార్థులకు గురుశుశ్రూష, విద్యావ్యాసంగము తప్ప నితరకార్యము లేవియు లేవు. వారు నేర్చునవి సాహిత్యము, శాస్త్రములు, కళలు మున్నగునవి. అన్నియు దేశీయవిజ్ఞానసంపన్నములు; అన్నియు కంఠస్థములే. గురువు సకలకలాపారంగతుడు కాన అన్నిటి నొక్కడే నేర్పువాడు. షోడశవర్షప్రాయమునాటికి విద్యార్థుల కుత్తమవిద్యాసౌధనిర్మాణమునకు దృఢమగు మూలబంధము ఏర్పడునది. ఆకాలమున విద్వాంసులమందిరములన్నియు విద్యార్థిబృందములతో నిండియుండునవి. అవియే నాటికళాశాలలు; విశ్వవిద్యాలయములు. అవియే 'గురుకుల'ము లనుపేర వ్యవహృతము లయినవి. ప్రకృతిసంపదచే నింపారు గ్రామములే వాని కునికిపట్టులు. కావున విద్యార్థులకు విజ్ఞానసంపదతోపాటు ఆరోగ్యభాగ్యమును విస్తరిల్లుచుండెడిది. ఇట్టిగురుకులములు పెక్కులా కాలమున దేశమున నుండెడివి. ఇట్టివిమాత్రమే కావు. ఆకాలమున, ప్రభువులు మున్నగువారు పలువురు వివిధశాస్త్రాభ్యాసముకొఱకు విద్యాసంస్థల నెలకొలిపిరి. అధ్యాపకులకు, విద్యార్థులకు భోజనాదిసౌకర్యములను కల్పించిరి. తన్నిర్వహణార్థము అపారముగ భూసంపదను దానమొసంగి వానిని నిరంతరాయముగ పోషించుచుండిరి. మఱియు జైనబౌద్ధాదిమతములవారు నెలకొలిపిన విద్యాపీఠములును అనేకము లాకాలమున నుండినవి.* నాడు విద్యార్జనము జ్ఞానముకొఱకగుటచే నెల్లవిద్యలు తామరతంపరగా నభివృద్ధి నొందుచుండెడివి. ఆగురుకులములు, ఆ విద్యాభ్యాసవిధానము, ఆ విజ్ఞానసంపద నేడు మాయమయ్యెను.

ఇపుడు 'గురుకులము'లకుమారు 'కడుపుకూటి' పాఠశాలలు బయలుదేరినవి. వాని యందలి యుపాధ్యాయులకు శిష్యవాత్సల్యము లేదు; శిష్యులకు గురుభక్తి శూన్యము. ఉదరపోషణార్థ ముపాధ్యాయులు ధనమునకు

* శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రచియించిన 'అమరావతీస్తూపము, ఇతరవ్యాసములు' అను గ్రంథమున 'మన ప్రాచీనవిద్యాసంస్థలు' అనువ్యాసము గలదు. అందు ప్రాచీనవిద్యాసంస్థల వైభవమును, విద్యావిధానమునుగూర్చిన వివరములు గలవు. భావి విద్యావిధాననిర్ణయమునకు తదవగతి యుపకరింపగలదు.

విద్య నమ్ముచున్నారు. విద్యార్థులు సొమ్ము నిచ్చి కొనుచున్నారు. ధనములేకున్న విద్య లేదు. అదియు గ్రంథస్థముకాని కంఠస్థము కాదు. విద్యార్థులతోపా టుపాధ్యాయులును పుస్తకములకట్టలను పాఠశాలలకు మోచికొని పోవుచున్నారు. పుస్తకములపరోక్షమున గురుశిష్యుల జ్ఞాన మించుమించుగ సమానమే యనిన ఆశ్చర్యపడ నక్కరలేదు.

ఈ 'కడుపుకూటి' పాఠశాలలలో నేర్పబడునది ఆంగ్లభాష. దానికిగల ప్రాధాన్యము దేశభాషకు లేదు. ఆంగ్ల మారంభము మొదలుకొని సలక్షణముగ నేర్పబడుచున్నది; దేశభాషకు లక్షణము పాటింపబడకున్నది. ఆంగ్లమున వివిధశాఖలవిజ్ఞానమును చక్కగా వివరించుపుస్తకములు పెక్కులు గలవు. దేశభాషయం దొక్కశాఖయందలి విజ్ఞానమునయినను సరిగా వివరించుపుస్తకములు మృగ్యములు. ఆంగ్లగ్రంథములలో ననేకములు సమర్థులు రచియించినవి. దేశభాషాగ్రంథములలో నట్టివి చాలతక్కువ. ఆంగ్లగ్రంథములరచనము, అనుక్రమము ఆంగ్లభాషాభివృద్ధిని గలిగించునవి. దేశభాషాగ్రంథములు దేశభాషను కృశింపజేయునవి. ఆంగ్లగ్రంథములను బోధించువారలు బోధనవిధానమునసయితము సుశిక్షితులు; దేశభాషను బోధించువారు తామయినను సరిగా బోధనమును బడసినవారు కారు. బాలు రీపాఠశాలలయందు పదియేండ్లు చదివినపిదప, పదివాక్యము లాంగ్లమున నెట్లో వ్రాయగలిగినను దేశభాషయందు పది మాటలనైన సరిగ వ్రాయజాలరు. ఆంగ్లగ్రంథములు గుణబహుళములయ్యును దేశీయులకు దేశాభిమానమును, దేశీయవిజ్ఞానమును గలిగించునవి కావు. విషయసంగ్రహణమున దేశభాషాగ్రంథములు సయితము చాలవరకు నాంగ్లగ్రంథములకు నమూనాలే యగుట నవియు దేశాభిమానమును, దేశీయవిజ్ఞానమును గలిగింపజాలవు. ఇట్టులున్నది యిప్పటి విద్యాభ్యాసవిధాన సామగ్రి. ఉపలబ్ధములగు నల్పసంఖ్యాక దేశభాషాగ్రంథములలో నుత్తమము లనదగువానికయిన పాఠశాలలలో సులభప్రవేశమున కవకాశము లేదు. ప్రభుత్వవిద్యాప్రణాళిక నిబంధన లిందు కడ్డుతగులుచున్నవి. వాని ననుసరించి యేరుపడిన 'పాఠ్యగ్రంథనిర్ణాయకసంఘము' పఠనయోగ్యగ్రంథములను నిర్ణయించవలెను. అట్లునిర్ణీతములయిన గ్రంథములుమాత్రమే విద్యార్థులు చదువదగుదురు. ఆసంఘమున సభ్యులెల్లరు దేశీయులే! వారెల్లరును దేశభాషాప్రవీణులే, విద్యాభివృద్ధిమార్గములనెరిగినవారలే యని విధిగా తలపవలెను. వా రట్టివారయినను, కాకున్నను, విద్యాప్రణాళికనిబంధనలు వారిదృష్టికి విజాతీయతను ప్రసాదించుచున్నవి. ఇట్లు విజాతీయముగ మారినవారిదృష్టికి గ్రంథముల మంచిసెబ్బరలు తారుమారుగ కనుపట్టుచుండును. సహజము, స్వాతంత్ర్యము నగుదృష్టిని కోలుపోయినపు డిట్టివైపరీత్యము తప్పనిసరి యగుచున్నది. ఇటు లిన్నిముప్పులకు పాలయి నేటిచదువు గుంటపూవులు పూచుచున్నది.దీనికి

తోడుగ పాఠశాలలయందు ప్రకృతిసంపద దూరమయిపోయినది. కావున విద్యార్థులకు ఆరోగ్యము నంతకంటె దూరమున నిలిచి పోయినది. పాఠశాలలో నున్నంతవరకయినను విద్యార్థుల నైతికప్రవర్తనమును సరిదిద్దుబాధ్యత నుదరంభరు లగు నుపాధ్యాయులు వహింపదొరకొనమి వింతకాదు. బాలురకు ఐదేండ్లమొదలుకొని, పదునైదేండ్లవరకుగలకాలము విజ్ఞాన సౌధమునకు గట్టిపునాది ఏరుపడవలసినకాలము. ఈకాలమున, విద్య, ఆరోగ్యము, ప్రవర్తనము బాలురకొకదానినిమిగిలి యింకొక్కటిగ పెంపొందవలసినది. ఇట్టి యమూల్యకాలము పైని పేరుకొనినతీరున గడచుటచే బుద్ధికి, శరీరమునకు వైరూప్యము సంప్రాప్తమగుచున్నది. ఇక షోడశవర్షప్రాయమున బాలురకు చక్కనివిద్య, ఆరోగ్యము, ప్రవర్తనము నెట్లు సమకూరియుండగలవు? వా రెట్లు దేశభాషను రక్షించుకొన గలుగుదురు? దేశభాషకు మరి ప్రాపెక్కడ? ఈదుర్విధానమునకు ప్రతీకారము లేనియెడల క్రమముగ దేశభాష 'ఉళక్కి'యగుటకు సందియ మేమి కలదు? కావున దేశీయులు దేశభాషను కాపాడుకొనుటకయి విద్యాభ్యాసవిధానమును సత్వరముగ సరియగుమార్గమునకు త్రిప్పుకొనవలయును. అది యెట్లు సాధ్యము కాగల దనువిషయము నిపుడు పర్యాలోచింపవలెను. ఈవిధముగ నొక్కొక దేశభాషయు రక్షితము గావలెను.

ఆంధ్రదేశీయు లాంధ్రభాషాసంరక్షణార్థము దొరకొనవలెను, సంస్కృతాంధ్రాంగ్ల భాషాకోవిదులు, అనుభవజ్ఞులు, బాలకమనస్తత్వపరిశీలనదక్షులు, ఉపాధ్యాయులు నగు నాంధ్రభాషాభిమాను లిందుకు దగినవారు. కావున వార లాంధ్రభాష సర్వతోముఖాభివృద్ధిని గాంచి మనబాలురు విజ్ఞానసంపన్నులయి, దేశోద్ధారకులయి దేశమునకు ప్రతిష్ఠను గడింపగలవారయి యొప్పారుట కెట్టి విద్యావిధాన మవసరమో దానిని వారివారికి దోచినయట్లు భారతిద్వారమున నాంధ్రలోకమునకు వెల్లడింతురు గాక!

* * * *

## దేశచరిత్రము - పాఠశాలలు

దేశచరిత్రజ్ఞానము మానవునిభౌతికాభ్యుదయమునకు సాధనము. దేశచరిత్రజ్ఞానశూన్యుడు నిర్జీవప్రతిమ; దేశాభ్యున్నతిని కాపాడుకొనజాలనివాడు. కావున ప్రతివ్యక్తికిని దేశచరిత్రజ్ఞాన మావశ్యకము. అక్షరాభ్యాసారంభముతోపాటు చరిత్రపఠనారంభమును సాగవలెను. కాని ప్రకృతము పాఠశాలలయందు దేశచరిత్రమనుపేర నేర్పబడునది సరియయిన చరిత్రము కాదు.

పూర్వకాలమున హైందవులెవ్వరును చరిత్రవాఙ్మయమును సృష్టించినవారు కారు. కాని చరిత్ర లేకపోలేదు. దేశ మొక్కటి యున్న దానిచరిత్ర తనంత నదియే ఏర్పడుచున్నది. అందును-'రత్నగర్భ' యనబరగిన

హిందూదేశమునకు చరిత్ర లేకపోవునా? ఆ కాలమువారు తరములబడి తమపూర్వులచరిత్రమును తమజీవితములయందిముడ్చుకొని తరువాతితరములవారికి తామేచరిత్రలయి వెలయుచుండిరి. మఱియు ఆద్యములనబడు వేదములు, పురాణములు, ఇతిహాసములు, తరువాతి లౌకికవాఙ్మయము, తామ్రశిలాశాసనములు, దేశభాషావాఙ్మయములు, బౌద్ధజైనవాఙ్మయములు, ప్రాచీనసిర్మాణశిథిలావశేషములు, స్థానికచరిత్రములు మున్నగునవియు చరిత్రగర్భములయినవి. వానిని పరిశోధించి చరిత్రాంశములను వానినుండి విడదీసి ప్రత్యేకముగ చరిత్రమును నిర్మించినవారాకాలమున నెవ్వరును లేకపోయిరి. హిందువులకు పారమార్థికచింత ఎక్కువ. వారికి దైవశక్తియెడ గలవిశ్వాసము పౌరుషమున లేదు. భౌతికవిషయములయెడ నలక్ష్యభావ మధికము-తత్రాపి-దేశచరిత్రము విషయమున.

కాలదేశవిపరిణామకారణమున హిందూదేశము హైందవేతరులపాలయినది. వారెల్లరు కేవలము భౌతికవాంఛాపరులు, స్వలాభపరాయణులునయి హిందూదేశము పూర్వచరిత్రమును వెదకుకొనజొచ్చిరి. అప్పటి కప్పటికి వారువారికి స్థూలదృష్టికి దోచినచరిత్రవిషయముల తమతమ కనుకూలము లగువానిని కూర్చి చరిత్రములను నల్పమాత్రముగా రచియించిరి. వానియందు పాక్షికదృష్టితో కూర్పబడిన విపరీతకల్పనము లధికముగ నుండుటనవి నిక్కమగు దేశచరిత్రమును తెలుపునవి కాకున్నవి. తరువాత పందొమ్మిదవశతాబ్దియందు ఆంగ్లేయులు పెక్కురు తత్పూర్వచరిత్రకారుల రచనముల నాధారముగా గొని చరిత్రములను కొన్నిటిని రచియించిరి. అవి యుసంబద్ధము లయి సత్యదూరములుగ నేరుపడినవి. తత్కర్తలలో కొందఱు సత్యపరిశోధన సామర్థ్యము గలవారయ్యును జాత్యభిమానముచేత సత్యమును కప్పిపుచ్చి తమజాతి కనుకూలముగ చరిత్రములను వ్రాసిపెట్టిరి. అట్టి చరిత్రములయొక్క సంతానపరంపరయే నేడు పాఠశాలలలో మనబాలురు చదువునది. వానిని నేర్చువారికి దేశాభిమాన మెట్లు కలుగగలదు?

విదేశీయుల రచనముల జూచినతరువాత దేశీయులకును చరిత్రరచనమున నించుక యాసక్తి పొడమినది. కాని పరిశోధనమున శక్తిచాలమిని, విదేశీయులరచనలు విపరీతకల్పనములని తెలియమిని వారు విదేశీయులరచనములనే వెంటాడి 'పిల్లచరిత్రలను' పెక్కిటిని పుట్టించిరి. వీరిలో హైందవేతరులగు 'సింక్లగు'లు, 'మార్డ్సను'లు మున్నగువారలును గలరు. ఐదారుపదులవండ్లు కడచినను నిర్జీవములగు నీపిల్లచరిత్రములే ఇంకను ప్రచారమున నుండకతప్పినది కాదు.

పందొమ్మిదవశతాబ్ది ఉత్తరపాదమున విదేశీయ విరచితము లగు చరిత్రములతత్త్వమును దేశీయులు కొంతకొంత తెలిసికొనగలిగిరి. అంత గొందరు సమర్థులు చరిత్రపరిశోధ

నలకు గడగిరి. తత్ఫలముగ సత్యసంబద్ధమగు దేశచరిత్రము శకలశకలములుగ నుపలబ్ధము కాజొచ్చినది. కాని పరిశోధకులకు విదేశీయ చరిత్రకారులరచనములపయి గలవిశ్వాసము పూర్తిగా ఇంకను తొలగలేదు. పైశకలములు కొన్నిగ్రంథములుగను, కొన్ని వ్యాసములుగను వెలువడుచున్నవి. ఇట్లు చరిత్రపరిశోధన కార్యము బాల్యదశయందే నిలిచియున్నది. దేశీయులకెల్లరకు చరిత్రాభిమానము లేమియే ఇందులకు గారణము.

ఆంధ్రదేశమున చరిత్రపరిశోధకప్రముఖులగు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు రచియించి ప్రకటించిన యమూల్యవ్యాసములు కొన్ని నేడు 'అమరావతిస్తూపము - ఇతర వ్యాసములు'* అనుపేరున గ్రంథముగా వెలువడినవి. ఆగ్రంథము విశ్వవిద్యాలయపరీక్షలకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినది. దీని కొకింతసంతోషింపదగును; విశ్వవిద్యాలయములనుసైతము ఒకింత అభినందింపదగును. ఇది యటుండుగాక! నిక్కమయిన దేశచరిత్రజ్ఞానము ఇకముందయినను మనబాలురకు లభింపవలయు ననిన ఇటీవల కొన్నియేండ్లనుండి నాడునాట వెలువడుచున్న తమపరిశోధనల ననుసరించి పరిశోధకులు ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నతపాఠశాలలవిద్యార్థులకు సరియైన దేశచరిత్రజ్ఞానమును గలిగించు గ్రంథములను రచియించుచుండవలెను. వానిని పాఠశాలలలో నాయాతరగతుల విద్యార్థులచేత విధిగా చదివించు నేరుపాటు జరుగవలెను. మనతాతముత్తాతల కాలమునాడవతరించి నేటికిని బండలవలె విద్యార్థుల నెత్తిమీద కూర్చుండియున్న సింక్లరులయు, మార్‌స్డనులయు నమూనాలగు పిల్ల చరిత్రములను పాఠశాలలనుండి దూరముగా తరిమివేయవలెను. ఇట్టులగుటకయి దేశీయ ప్రముఖులు ప్రయత్నింతురుగాక!

* * * *

ఆంధ్రుల చరిత్ర

శ్రీవల్లూరు సూర్యనారాయణరావు పంతులుగారు "మన వీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్రకే అగ్రస్థాన మిచ్చుటకు ఈగ్రంథమును తిరిగి వెలువడజేయుచున్నారు గాని ఆంధ్రదేశచరిత్ర ప్రధానమైనదిగా ఎంచరు" అని వ్రాసిరి.* ఇచట 'ఆంధ్రులచరిత్ర'యనగా ఆంధ్రదేశమునందలి ప్రజల (భిన్నభిన్నకులములకు, సంఘములకు చెందినవారి) యొక్క చరిత్రమని యర్థము. ఆంధ్రదేశచరిత్రమును నిషేధించుటకు కారణముగా పంతులుగారు

ఇది విశ్వమానవకోటి సౌభ్రాతృత్వమునకు కొంతవర కాటంకమును కలిగించుటయే గాక, కులాభిమానము, కులాహంకారము, ప్రత్యేక వర్ణాభిమానము మొదలగు దుర్లక్షణములను పెంపొందచేయును. చరిత్ర మనలను జ్ఞానవంతులనుగ చేయునను సూత్రము ప్రపంచమునా

* ఈ సంచికయందలి 'విమర్శనము' భాగమున నీగ్రంథము ప్రాశస్త్యము, గ్రంథకర్త పరిశోధన సామర్థ్యము వివరింపబడినవి.

* ౧౯-౬-౧౯౩౭ నాటి ఆంధ్రదినపత్రిక పు. 4. చూడదగును.

యిదివరకు వెలువడిన నానాదేశ చరిత్రలు అవగింజంతయైనను మన కక్కరకు రాలేదు. తేదీలు, యుద్ధములు, కల్లోలములు, రాజులు మొదలగువానిని గురించి మనము తెలుసుకొనుటవలన మన ప్రస్తుత రాజకీయ, సాంఘికార్థిక విద్యావిషయిక సమస్యలను యెట్లు పరిష్కరించుకొన గలము?

అని పేర్కొనిరి. ప్రజలచరిత్ర మంచిదనుటకు ముఖ్యముగా వారుచూపిన కారణము

దేశచరిత్రలకంటె ప్రజల చరిత్రలను వ్రాసిన గాథల ఆయాజాతుల పరిణామమునుబట్టి భవిష్యద్వికాసమును మనము నిశ్చయించుకొనుటకును దాని కేవిధముగా మనము తోడ్పడవలెనో ఆలోచించుటకును మనకు కొంత ఉపయోగకరముగ నుండవచ్చును.

అని. ప్రజలచరిత్ర దేశచరిత్రలోని వివిధాంతర్భాగములలో నొకటి. దేశముయొక్క భౌతికస్వరూపము, రాజ్యములు, రాజులు, రాజ్యాంగవిధానము, కులములు, సంఘములు, తత్పరస్పరసంబంధ పరిణామములు, విద్యలు, కళలు, మతములు, సంపద, నాగరికత, ఇతర దేశములతోసంబంధానుబంధములు మున్నగు విషయముల వివరించునది దేశచరిత్ర యనదగినది.

పంతులుగారు సెలవిచ్చినట్లు ఇం దొక భాగమే దేశాభివృద్ధి కుపకరించు నెడల సమగ్ర దేశచరిత్రము తదభివృద్ధి కనంతగుణముగ నుపకరింపగలదగుటకు సంశయము లేదు. కావున దేశచరిత్రమనిన భీతిని జెందవలసిన పనిలేదు. తన దేశముయొక్క సమగ్ర చరిత్ర జ్ఞానము దేశమునందలి ప్రతి వ్యక్తికిని పరమావశ్యకము.

దేశచరిత్రమునగాని, ప్రజలచరిత్రమునగాని సంఘములపుట్టుపూర్వోత్తరములయొక్క చర్చ రాకతప్పదు. స్వప్రమాణముగ నిరూపితములైన చరిత్రాంశములను దురభిమానగ్రస్తములయి అన్యథాకరింపజూచు ప్రజాసంఘముల దూషణములకు ఉభయవిధ చరిత్రములును సమముగ నేపాత్రములగును. ఎట్లు చూచినను దేశాభివృద్ధికి సమగ్రదేశ చరిత్రము ముఖ్యము. ఆంధ్రదేశమున కిప్పటికి సమగ్రచరిత్రము లేదు. అట్టిదానినే ఆంధ్రులు కోరవలసినది. శ్రీవీరభద్రరావుగారు నిదివరకు రచియించిన 'ఆంధ్రులచరిత్ర'ను సమగ్రదేశచరిత్రను రచియించు తలంపుననే మొదలిడినది. దానినే వారిపుడు సంస్కరించి పెంచి దేశమున కందజేయవలసి యున్నారు.

జాతులయు, సంఘములయు, పూర్వోత్తరములనుగురించి యెల్లదేశములయందును అర్థశూన్యములగు పుక్కిటిపురాణములు -పరస్పరము వైషమ్యమును పెంచునవి- లెక్కకు మిక్కిలిగా కలవు. చరిత్రకారులు వానిని లెక్కింపక ప్రమాణబుద్ధితో చరిత్రను రచింపవలెను. మెప్పుకయి వ్రాయుచరిత్రలు చరిత్రలుకావు. సత్యమును బయలుపరచు చరిత్రకారులు ప్రజల నిగ్రహానుగ్రహములను పాటింపజనదు. ప్రజలు తమ యజ్ఞానము, దురభిమానము తొలగునట్లు స్వప్రమాణముగ నిజమయినచరిత్రము నెరిగించిన చరిత్రకారుల యెడ మిగుల కృతజ్ఞతతో ప్రవర్తించుట సముచితము.

అనంతకాలగర్భమున నణగిపోయిన చరిత్ర యథారూపమున నెన్నటికిని లభింపజాలదు. ధీమంతులగు చరిత్రకారులు సమబుద్ధితో లభించు నాధారములను సమన్వయించుకొని దేశచరిత్రను నిర్మించుట శ్రేయము. దానిని ప్రజ లామోదించి పురోభివృద్ధిమార్గముల నన్వేషించుకొనుట అంతకన్న శ్రేయము.

*　　*　　*　　*

అఋవ ద్దెళు జ్ఞాప మన్ధ్రము కాదా,
అది యాంధ్రము కాలేదా?

అను శీర్షికక్రింద శ్రీయుతులు చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు కొన్ని చారిత్రకవ్యాసములను భారతియందు ప్రకటింప నొసంగెదమని సెలవిచ్చిరి. వానిలో తొలివ్యాసము జూనునెలభారతియందు ప్రకటితమయినది.

ఇటీవల పంతులుగారు చిరకాలమునకు ముందు రచియించి ప్రచురించిన ఆంధ్రులచరిత్రమును పునర్ముద్రణము కావించుటకయి యొకసంఘ మేరుపడియుండుటను భారతిపాఠకు లెరుగుదురు. ఇపుడు పంతులుగారు దానిని ముద్రణార్థము సంఘమున కొసగుటకయి తదేకదీక్షతో తత్సంస్కరణకార్యమున నిమగ్నులయియున్నారు. వెనుకటి నాలుగు సంపుటములు నిపుడు పదిసంపుటములుగా పెరుగగలవు. ఆకార్యము ముగియుదనుక వా రితర కార్యములవంకకు తమదృష్టిని మరలుపజాలరు.

కావున పంతులుగారి వ్యాసములలో తరువాతివానిని కొన్నాళ్లవరకు భారతి ప్రకటింపజాలదు. ఆంధ్రులచరిత్రము క్రొత్తరూపమును దాల్చి లభింపనున్నదను నానందముతో నాంధ్రలోకము వ్యాసప్రకటనమునకగు కాలవిలంబమును దుస్సహాముగా భావింపకుండును గాక!

---

# నివేదన

శ్రీమతి చావలి బంగారమ్మగారు

## ౨

నాడుబోయితివయ్య నేడువచ్చితివి
నీజాడ లీలోన నేజూడలేదు
వేకువనె లేచేవు వేళకొచ్చేవు
వెళ్లివచ్చినపనుల్ ఏమిజేశేవు?

వాడవాడల తిరుగువాడవనిగాద
వేడితిని విభునిటకు తోడుకొనిరాగ!
ఏకడను జూచితివి, ఏమిచెప్పితివీ,
ఏచెవిని విన్నాడు, ఏమన్నాడు?

మరియాదగా నీతో మాటాడినాడ,
మఱువకను నామనవి మది నుంచుతాడ?
పాటించి నీమాట బాగుగా వినెనా?
బోసినోటిమాట తోసిరాజనెనా?

మతిజెడక మనవలెనె మసులుతున్నాడ,
స్థితిజెడక తనులేచి తిరుగుచున్నాడ?
మతిదిరిగి మనకొరకు మఱలివస్తాడ?
పతిజూచు భ్రమవీడి బ్రతుకమన్నాడ?

---

# "సువర్ణరేఖ"

కర్రా సూర్యనారాయణ గారు, బి. యే., బి. యల్.,

దేవదానవు లర్థి మథించువేళ
దిక్కులంగప్పు ధవళదీధితుల నడుమ
పాలమున్నీటితరగలపైని పొడమె
ప్రథమభాస్వరలక్ష్మిసువర్ణరేఖ.

తొలుత గనయు గాలుష్యంబు గలిగియున్న
మదిరినకొలంది యవగుణములను వీడి
స్వాదుమధురసభరితమా స్వాంత మరయ
ప్రబలుముఖమున రాగ సువర్ణరేఖ.

వేగునంతకు వెన్నెలవేడి కుడికి
చెట్లమాటున కొలనులో చింతగూర్చి
ముడిచికొనియున్న పొందమ్మిమోమువిచ్చు
పగిది ముద్దాడె నరుణ సువర్ణరేఖ.

మారుగతి లేక జీవనమధ్యమందు
కమలి పగలెఱుంగని తొగకన్నెమనసు
తమముతో విచ్చి రంజించు క్రమము తోచె
ప్రాగుదితచంద్రవదన సువర్ణరేఖ.

---




ప్రపంచపరిస్థితు లతిభయంకరముగ నున్నవి. సకలదేశములందును వివిధసంస్థలందును సంక్షోభదేవత తాండవమాడుచున్నది. నిరంకుశత్వమునకును, స్వాతంత్ర్యమునకును, విశ్వాసములకును, విజ్ఞానమునకును ప్రబలుచున్న ఘోరసంఘర్షణమునకు విశ్వవ్యాప్తములైన విషమపరిస్థితులు ప్రమాణములు. లెనోగ్రాడు నుండి నాంకిను వరకును గల రాజ్యముల వ్యవహారములందు విశ్వావృతమైన మహాపరివర్తనమును కన్నులు గలవారు చూచుచున్నారు. అహంకారమమకారాయత్తమైన అభిమానరాజ్యము ప్రపంచమునందు, సంకుచితావరణములను నిర్మించి మహాసంక్షోభమును గలుగజేసినది. ఈ యభిమానదేవతారాధనము నానాత్వమునందు విశ్వకల్యాణకరమైన ఏకత్వమును దుర్లభముచేసి దుఃఖప్రళయపరమైన భిన్నత్వమును సుస్థిరముచేసినది. అధికారాభిమానము, కులాభిమానము, మతాభిమానము, ధనాభిమానము, పాండిత్యాభిమానము, జాత్యభిమానము, వర్ణాభిమానము, జన్మాభిమానము, కర్మాభిమానమును ధర్మస్వరూప స్వభావములను నిరాధారముచేసి ధర్మసంగవ్యాజమునను స్వీయసంరక్షణార్థము గలుగజేయుచున్న మహాసంక్షోభము "కౌపీనసంరక్షణార్థ మయం పటాటోపః" అనెడి వేదాంతోపదేశమునకు మహావ్యాఖ్యానముగ నున్నది. విశ్వమునం దొక పరమాణువునైనను బోలని సామ్రాజ్యములును, వ్యవస్థలును, సంప్రదాయాచారములును, సిద్ధాంతములును, పరమార్థములై మహాప్రళయమునకు మూలము లగుచున్నవి. అతిసంకుచితమైన స్వప్రయోజనము పరమార్థమై మహాసంక్షోభమునకు మూల మగుచున్నది.

శ్లో. యత్తుకృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్,
అతత్త్వార్థవదల్పంచ తత్తామస ముదాహృతమ్.

శ్లో. అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్,
మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే.

శ్లో. అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసావృతా,
సర్వార్థాన్ విపరీతాం శ్చ బుద్ధిస్సా పార్థ తామసీ.

—భగవద్గీత.

తమోగుణావృతమైన ప్రపంచమునందు ధర్మసంస్థాపనమునకు మహాప్రళయ మాసన్నమగుచున్నది. స్వప్రయోజనపరాయణులు కాలప్రభావమును గ్రహింపక స్వాభిమాన

పరాయణులై మహాసంక్షోభమునకు బూనుకొనుట ప్రపంచావృతమైన దురదృష్టమునకు చిహ్నముగ నున్నది. స్వాభిమానపరాయణులు స్వార్థపరులై యవలంబించుచున్న కుతంత్రములు పరపీడనమునకు వలె నాత్మవినాశమునకును వినియోగపడుచున్న విధమును గతించిన మహాసంగ్రామమును, సంగ్రామానంతరవ్యవహారములును సువ్యక్తము చేయుచున్నను దురభిమానపరాయణులకు జ్ఞానోదయము గలుగకుండుట సంతాపకరము.

గతించిన మహాసంగ్రామము ప్రపంచము నావరించిన మహాసమ్మోహమునకు పదచ్యుతిని గలుగజేసినది. పరపీడనమునకును, నిరంతరసంక్షోభమునకును మూలములైన దురహంకార దురభిమానములకు పదచ్యుతి గలిగినది. ప్రపంచమునం దంతటను సకలవ్యవహారములందును మహాపరివర్తన ముదయించినది. రాజ్యాంగములందును, సాంఘికవ్యవస్థలందును, మతసిద్ధాంతములందును, ఆర్థికవ్యవహారములందును, కామారాధనమునందును, నిత్యజీవనమునందును సంప్రాప్త మగుచున్న మహాపరివర్తనము ప్రళయరూపమును దాల్చుచున్నను కన్నులను మూసికొని పూర్వవాసనల నాశ్రయించుట నిరర్థకము. నవనాగరికత కాధారభూతములైన వ్యవస్థలన్నియును కూలిపోవుచున్నను ప్రారబ్ధకర్మమును నాయకులు మరల్పజాలని విధమును నిత్యవ్యవహారములు విస్పష్టము చేయుచున్నవి. వర్తమానసమయమునందు సమరమునకు గల ప్రతిష్ఠ సమర్పణమునకు గలుగకున్నది. సమరమునందును బలసమరము దుస్తరమని గతసంగ్రామానుభవము మనోగతము చేసినను సంగ్రామవాసన ప్రపంచమును దహింపజేయుచున్నది.

* * * *

బలసమరము

సమరసన్నాహములు సమరమునకును, శాంతిసన్నాహములు శాంతికిని సాధనములగుట ప్రకృతిధర్మము. సమరసన్నాహములను శాంతి స్థాపనమునకు చేయుచున్నటులు నటించుట కేవలము కపటనాటకము. దారుణమైన ఐరోపా సంగ్రామము ముగిసి పదునాలుగేండ్లు గతించినను ప్రపంచమును సంగ్రామ విషమజ్వరము విడువలేదు.

నానాజాతిసమితి నిర్ణయించిన స్వాయంనిర్ణయసూత్రము, స్వారాజ్యసంరక్షణము, హిందూస్థాన స్వాతంత్ర్యము, శాంతిస్థాపనము, ప్రజాస్వామ్యము, సంగ్రామనివారణము మాటలందు పరిపాటియైనను కార్యములందు నిరర్థకములైనవి. నానాజాతిసమితికి లక్షలకొలది ధనమును హిందూస్థానమువంటి బీద దేశములు సమర్పించుచు పెద్దరాజ్యముల బలదర్పములను పోషించుచున్నవి. దారిద్ర్యగ్రస్తములయిన దేశము లధోగతిపా లగుచున్నవి. ప్రపంచమునందు సకలవ్యవస్థలందును మహాపరివర్తనము ప్రత్యక్షమగుచున్నది.

ఆయుధధారణమునం దహమహమిక నిరభ్యంతరముగా కొనసాగుచున్నది. ప్రజలన్నాతురులై హాహాకారములు చేయుచున్నారు. పరిశ్రమలు స్తంభించినవి. వ్యాపారము క్షీణించినది. ప్రజలు దుర్భరమైన పన్నులక్రింద నణగిపోవుచున్నారు. లక్షలకొలది ప్రజలు పనిపాటులు లేక కృశించుచున్నారు. బంగారునాణెముల చెలామణీ నిలుపబడుచున్నది. ధరలు పడిపోయినవి. ధనవంతులు నిర్ధను లగుచున్నారు. నిర్ధను లష్టకష్టముల ననుభవించుచున్నారు. ప్రపంచమునం దొకసంవత్సరమునందు యుద్ధసన్నాహములకు షుమారు రూ. 3౦౦౦ కోట్లు రూప్యములు వెచ్చింపబడుచున్నవి. ఈభయంకరస్థితి ప్రళయరూపమునుదాల్చుచున్న విధమును తత్త్వజ్ఞులు, అర్థశాస్త్రజ్ఞులు, ధర్మాత్ములు, స్వాతంత్ర్యప్రియులును ఘోషించుచున్నను ఆఘోష బధిరశంఖారావముగ నున్నది.

గతమాసమున జినీవాయం దాయుధవిసర్జనమునుగూర్చి యోజించుటకు గూడినసభ విఫలమైనది. ఆయుధవిసర్జనమునందు పెద్ద రాజ్యములు చిన్న రాజ్యములకు మార్గము చూపుట సమంజసము. ఏ పెద్ద రాజ్యమున శారాజ్యము మినహాయింపును జేసికొని చిన్న రాజ్యములయొక్క నిర్బంధనములకు బూనుకొనునపుడు ధర్మము నవలంబించెడివా రుండజాలరు. అందరును "నాకాయుష్యము, నాకారోగ్యము" అనునపుడు పసులయోగక్షేమములను తలపెట్టెడివా రుండజాలరు. ప్రపంచశాంతికిని, ఆయుధవిసర్జనమునకును త్యాగము సాధనము గాని, పరపీడనము సాధనముగాదు. ఈసందర్భమునందు హెచ్. జి. వెల్సుగారు, వారిప్రపంచచరిత్రయందు వ్రాసినటులు అశోకచక్రవర్తిచరిత్రము పరంజ్యోతివలెను ప్రకాశించుచున్నది. అశోకచక్రవర్తి కళింగవిజయానంతరము ౨౧౭౮ సంవత్సరములకు పూర్వము సంగ్రామసంక్షోభమును గ్రహించి సంగ్రామమును పరిత్యజించి స్థాపించిన ధర్మశాసనములు ప్రపంచచరిత్రయం దపూర్వములు, శాంతికాముల కీయపూర్వదృశ్యము కర్తవ్యమును బోధించుచున్నను దుఃఖానుభవ మనతిక్రమణీయమైనది.

మానవకల్యాణమునకు బుద్ధియందును, సంఘమునందును, ధర్మమునందును శరణమును బొందవలసిన పరమావసరము సంప్రాప్తమైనది. ఇట్టి పరమార్థమును లోకమున కనుగ్రహించుటకు సమకట్టిన గాంధి మహాత్మునిబోలిన ధర్మాత్ములు పరమద్రోహులుగా పరిగణింపబడుట పాశ్చాత్యసంస్కారఫలము. పాశ్చాత్యరాజ్యములు దుఃఖభూయిష్ఠమైన సంగ్రామసంస్కారఫలమును దారుణముగ ననుభవించుచున్నను ధర్మప్రవృత్తి గలుగకుండుట ఆసన్నమైన ప్రళయావస్థకు సూచకముగ నున్నది. పాశ్చాత్యసంస్కారపాశబద్ధములైన ప్రాచ్యదేశములకును ముఖ్యముగ హిందూస్థానమున కీదారుణదుఃఖానుభవ మనతిక్రమణీయము. బలసాధ్యమైన సమరసన్నాహమునకు శక్తిలేని పాశ్చాత్యరాజ్యములు

ధనసమరసన్నాహమునకు బూనుకొనుట బీభత్ససూచకముగ నున్నది.

*    *    *    *

ధ న స మ ర ము

ధనరహితములైన పాశ్చాత్యరాజ్యములు ధనసంచయమునకై శుల్కారోపణమునకుబూనుకొనుట కేవల మవివేకము. నిత్యజీవనమంతయును స్వయంపోషణములేక పరాయత్తమైన దేశములందు శుల్కారోపణము ప్రజలదుఃఖభారమును వృద్ధిచేయుటకు వినియోగపడునటులు సులభముచేయుటకు వినియోగపడదు. కాఫీ, తేయాకు, శర్కర, పొగాకు, ధాన్యములు, మాంసము, నూనెలు, మద్యములు, సుగంధములు, దూదిమొదలగు మూలపదార్థము లనేకములు పరదేశాగతములైనపుడు శుల్కారోపణము ప్రజాజీవనప్రవాహమునకే భంగమును గలిగించుట సహజము. దైవదత్తములైన సంపదలను ప్రజలయోగక్షేమములకు సులభముచేయుటకు బదులు దుర్లభముచేయుట సంత్రాసమునకు నిదర్శనముగాని వివేకమునకు నిదర్శనముగాదు. భయసంత్రాసదాయకములైన పరిస్థితులందు శాంతియును, ధర్మప్రతిపత్తియును దుర్లభములు. పాశ్చాత్యరాజ్యములు స్వదేశములందును, పరదేశములందును, నానాజాతిసమావేశమునందును, లాసేను సమావేశమునందును అవలంబించుచున్న రాజ్యనీతియును, ఆర్థికనీతియును ప్రపంచమునందు శాంతిస్థాపనమునకు గాక సంక్షోభమునకు వినియోగపడుచున్న విధమును ప్రపంచవ్యాప్తములైన భయంకరపరిస్థితులు విశదము చేయుచున్నవి.

*    *    *    *

లాసేనుసమావేశము - నష్టపరిహారములు

ధర్మనిర్ణయములు లేని లాసేను సమావేశము నిరర్థకమగుట సహజము. ఫ్రాన్సును జర్మనుభయ మావహించుచున్నది. జర్మనీదేశ మధోగతిపాలైనను సమరసన్నాహాభిమానమును విడువలేదు. ఋణదాతలైన రాజ్యములవారన్యోన్యవిశ్వాసములేనివారై పరస్పరవినాశనమును జేసికొనుచున్నారు. గ్రేటుబ్రిటనను రావలసినబాకీలు పోను అమెరికాకు 200 కోట్ల నవరనులు బాకీపడియున్నది. గ్రేటుబ్రిటనునకు సంప్రాప్తమయిన విషమావస్థయే యితరదేశములకును సంప్రాప్తమైనది. జర్మనురాజ్య మప్పులను తీర్చుటకు నిరాకరించినది. జర్మనుదేశము నష్టపరిహారరూపమునను గాక పునరుద్ధారణ నిధిరూపముననుకొంత ద్రవ్యము నిచ్చుట కంగీకరించినను ఫ్రాంసు దీని కంగీకరించుటలేదు. యూరపురాజ్యములందు నష్టపరిహార విషయములపట్ల సమాధానమును, ఆయుధవిసర్జన నిర్ణయమును గలుగనంతవరకును ప్రధానమైన ఋణదాతయైన అమెరికారాజ్యము నష్టపరిహారవిషయమును యోజించుటకు నిరాకరించుచున్నది. ఈదుర్వృత్తి చక్రమునకు దారంభమును నిర్ణయించుట దుష్కరము. మహాసామ్రాజ్య

ధురంధరులు కార్యక్రమమున కుపక్రమించి సామాన్యులకు మార్గదర్శకులగుట కార్య సాధనము. జర్మనురాజ్యము యూరపు పునర్నిర్మాణనిధికి ౨౦౦౦౦ లక్షలమార్కులను పత్రములరూపమున నిచ్చుటకును మూడేండ్ల వరకును అప్పులనాపుటకును పత్రముల నిర్మాణకాలమును అంతర్జాతీయనిధిసంఘ మేకగ్రీవముగ నంగీకరించిన సమ్మతించునటులును తెలియుచున్నది. ఈనిర్ణయమునకు ఫ్రాన్సు మనస్ఫూర్తిగ నంగీకరించి ప్రపంచ పునర్నిర్మాణమునకును శాంతికని దోడ్పడుట వివేకము, ధర్మము.

లాసేను సమావేశపు ప్రతిబింబము లండనునందు గూడనున్నది. లండనుసమావేశము నష్టపరిహారసమస్యను, ప్రపంచార్థిక సమస్యను నిర్ణయింపనున్నది. ధర్మావరణము లేని సమావేశములు ధర్మనిర్ణయమును చేయజాలవు. గతమాసమునందు గూడిన వివిధ సమావేశములకును మూలము స్వసంరక్షణముగాని పరశ్రేయస్సుగాదు. సమావేశములందు జరిగిన కార్యవిధానము మహాదుఃఖానుభవమునందును సామ్రాజ్యాభిమానులకు హృదయపరివర్తనము గలుగలేదని విస్పష్టము చేసినది. కాలయాపనము ప్రపంచపరిస్థితులను దుర్భరస్థితికి క్రమముగ నీడ్చుచున్నది. సమయము మించినతరువాత నెవరుచేయగలదియును నుండదు. ఈమహాపరివర్తనప్రవాహమునందు హిందూస్థానము బలవంతముగా కొట్టుకొనిపోవుచున్న విధమును దేశపరిస్థితులు వెల్లడిచేయుచున్నవి. హిందూస్థానమునందు వ్యాపనమునందున్న ప్రచండశాసన పరిపాలనము దుర్భరమైన దేశస్థితిని దుర్భరతరము చేయుచున్నది.

* * * *

## ప్రచండ శాసనములు

జీవజాలములయాశలు నిరాశ లగునపుడు ప్రవృత్తి నూతనమార్గము నవలంబించుచుండును. మానవప్రవృత్తిని స్తంభింపజేయుటకు జేసెడి ప్రయత్నము లన్నియును నిష్ఫలములుగాగలవిధమును ప్రపంచపరివర్తనములు విశదము చేయుచున్నవి. హిందూస్థానమునందు భూగోళమునందుగల ప్రజలలో అయిదవవంతు ప్రజలు గలరు. ఆప్రజలు నిర్వీర్యులును, భిన్నమతస్థులును, పరాధీనులును, నిరుపేదలును, నిరక్షరకుక్షులును నైనను గాఢమైన దేశభక్తిపరాయణులు. గాఢమైన దేశభక్తిని ప్రచండశాసనముల మూలమున నిర్మూలనము చేయుటకు బూనుకొనుట నిరర్థకమని నిత్యవ్యవహారములు వ్యక్తము చేయుచున్నవి. నిర్బంధశాసన ప్రయోగము లారంభమై ఆరుమాసములు గతించినవి. ఆరువారములలో నంతరింపజేయ దలపెట్టిన ప్రజోత్సాహము యథాప్రకారము సాగుచున్నది. అన్నిపక్షములవారును ప్రచండశాసనములను ఖండించుచున్నారు. ప్రచండశాసనపరిపాలన మశాస్త్రీయము, నధర్మము నని నాగరికప్రపంచ మంతయును ఘోషించుచున్నది. ప్రచండశాసనములు దుర్భరము లని

సర్ సామ్యూలు హోరుగారును అంగీకరించుచున్నారు. కానిమరల ప్రచండశాసనములనన్నిటిని నేకశాసనరూపమునను నిర్మించి పరిపాలనమును జేయుటకు బూనుకొనుచున్నారు. ప్రచండశాసనపరిపాలనము ప్రజాహృదయమునందు విశ్వాసావిశ్వాసములను గలుగజేసినది. ప్రభుత్వవిధానముపట్ల నసంతృప్తి దినదినాభివృద్ధిని బడయుచున్నది. మూలమూలలను నశాంతివ్యాపించుచున్నది. దుర్భర దారిద్ర్యసంజాతమైనయశాంతిని నిర్బంధవిధానము ప్రజ్వలింపజేయుచున్నది. మానసికనిర్బంధము, కార్యనిర్బంధము యథేచ్ఛగను విహరించుచున్నపుడు దేశమునందు శాంతి ఏవిధమునను నెలకొలుపబడునో నిరంకుశప్రభుత్వాధికారులు గ్రహింపగలరుగాని సామాన్యులు గ్రహింపజాలరు. ఒకహస్తమునందు దండనవిధానమును రెండవహస్తమునందు రాజ్యాంగసంస్కరణములను ప్రసాదించుచున్నటులు రాజ్యాధికారులు చాటుచున్నారు. ప్రజలు దండనవిధానఫలమును గతించిన పంద్రెండేండ్లయందును- ముఖ్యముగ నీయారుమాసములందును చక్కగ ననుభవించిరి. ప్రజ లనుభవించిన దండనవిధానఫల మాత్మవిశ్వాసమును గలుగజేసినది. షేక్స్పియరు మహాకవి తెలిపినటులు దుఃఖానుభవము తాత్కాలికముగ విషాదమునకు మూలమైనను కాలాంతరమున సమూల్యముగ నుండగలదు. కష్టపరంపరలందు భారతీయులు చూపుచున్న శాంతిత్యాగములు ధర్మవిజయమునకు లక్ష్యములు. రాజప్రతినిధియును హిందూదేశమంత్రియును నిటీవలను రాజ్యాంగముల విషయమై చేసిన ప్రకటనము ప్రజాహృదయమునందు నిరాశను గలుగజేసినను వివిధపక్షములవారికిని యథార్థస్థితిని వెల్లడి చేసినవి. కన్సర్వేటివుపక్షము జాతీయపక్షరూపమునను ప్రసాదింపనున్న స్వరాజ్యప్రణాళిక నచిరకాలముననే కాలము విశదముచేయగలదు. ఇపుడైనను శాంతికాములైన గాంధి మహాత్ముని, కాంగ్రెసునాయకులను విముక్తులను జేసి సంప్రతించుట శాంతికిని ధర్మసంస్థాపనమునకును సాధనము.

* * *

### ప్రభుత్వ ప్రకటనము

ప్రభుత్వప్రకటన మర్థశూన్యమైన మాటలకుప్పయని ధీమంతులు తలంచిరి. ఇర్విన్ప్రభువును, ప్రధానామాత్యుఁను సమావేశములను సంప్రతింపులను జేయుచు నిర్ధారణచేయను ప్రతిజ్ఞచేసిన రాజ్యాంగవిధానమును బ్రిటిష్ప్రభుత్వాధికారులు యథేష్టముగను సిద్ధముచేసిరి. బ్రిటీష్ప్రభుత్వము నియమించెడి పార్లమెంటు కమిటిమెదుటను కోరికగలవారు వారి యభిప్రాయములను తెలుపవచ్చును. ప్రభుత్వము తలపెట్టినవిధానము భారతీయాభిప్రాయములు నిరుపయోగములని విశదము చేయుచున్నది. రాజ్యాంగనిర్మాణము విషయమై "౧. ఒకే శాసనము నిర్మింపబడును, ౨. రాష్ట్రీయస్వపరిపాలన మేర్పరుపబడును, 3. ఫెడరేషనుభావిపరిస్థితులనుబట్టి యోచింపబడును" అని ప్రభుత్వప్రకటనము సూచించుచున్నది. ఈవిషయ

మును సైమనుసప్తకము చిరకాలము క్రితమె నిర్ధారణచేసియుండెను. రెండేండ్ల తర్వాతను, రెండు రౌండుటేబిలుసమావేశములైన తరువాతను తిరిగి మామూలుపాటను సర్ సామ్యుయల్ హోరుగారును, రాజప్రతినిధియును పాడుట పరమాసంతృప్తిని గలుగజేయుచున్నది. కేంద్రప్రభుత్వమునందు బాధ్యతలేని రాష్ట్రీయస్వపరిపాలనము నిరర్థకమని బాలిశులును గ్రహింపగలరు ఈప్రహసనమంతయును బహిరంగరహస్యము. నాలుగు మాసములకుపూర్వమె ఈ సంగతిని ప్రాజ్ఞులు గ్రహించియుండిరి. స్టేట్సుమనుపత్రిక మొదలగు ఆంగ్లోహైందవపత్రికలు గుణించిన జోస్యమె సార్థకమైనది. ఈ జోస్యమైనను కార్యరూపమును దాల్చునపు డేరూపమును దాల్చునో కాలగర్భమునందు గలదు. ప్రతిజ్ఞలు, ప్రతిజ్ఞాభంగములు హిందూస్థానమునకు పరిపాటియైన బ్రిటీషు రాజ్యనీతి. నేటికిని ఆపద్ధతినె బలీయమైన బ్రిటీషుజాతీయప్రభుత్వమవలంబించుటయందు విచిత్రము లేదు. దేశకాలపరిస్థితులను గ్రహించియైనను బ్రిటీషు ప్రభుత్వము తన రాజనీతిని మార్చుట పురుషార్థమునకు ప్రయోజనకరము. స్వదేశమునందు స్వేచ్ఛావ్యాపారమును విసర్జించి శుల్కవిధానము నవలంబించుచున్న కన్సర్వేటివుప్రభుత్వము హిందూస్థానముపట్ల విశాలహృదయమును జూపుట యసంభవము. కాంగ్రెసుపక్షమీ రహస్యమును చిరకాలము క్రితము గ్రహించినది. లిబరలుపక్షనాయకులును నీరహస్యము నిపుడు మెల్లగా గ్రహించుచున్నారు. గౌ. శ్రీనివాసశాస్త్రిగారు కన్సర్వేటివుకమిటి సభ్యత్వమునకు రాజీనామా నిచ్చినటులు తెలియుచున్నది. దేశావృతమైన విషమపరిస్థితులందులిబరలుపక్షనాయకులును, నితరనాయకులును దేశగౌరవమును, ఆత్మగౌరవమునుగాపాడుట పరమధర్మము. వర్తమాన విషమావస్థయందు సమగ్రదేశభక్తివలెను ప్రత్యేక పక్షాభిమానము, సంఘాభిమానము, మతాభిమానము, వ్యక్త్యభిమానము స్వప్రయోజనమునకైనను ప్రయోజనకరముగాదు. దేశావృతమైన మహాసంచలన మితర రాష్ట్రములందువలె నాంధ్రరాష్ట్రమునందును సంక్షోభమును గలుగజేయుచున్న విధమును దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి

*                    *                    *

## ఆంధ్రరాష్ట్రము

భాషాప్రయుక్తరాష్ట్రములు ప్రజాప్రబోధమునకు వినియోగపడగలవిధమును కేరళ కర్ణాటాంధ్రోత్కలదేశములందు ప్రజాహృదయక్షేత్రములందు విజృంభించుచున్న శక్తివిశ్వాసములు రుజువుచేయుచున్నవి. రాజ్యాంగములు, మతములు, సారస్వతములు, కళలు, వ్యవసాయవాణిజ్యములు, పరిశ్రమలు మొదలగు సకలసంస్థలును ప్రజలయోగక్షేమముల కేర్పడినవి. ప్రజాయోగక్షేమమున కేర్పడిన కర్మకలాపమంతయును, మానసికకర్మమైనను కాయికకర్మమైనను, జ్ఞానమునందు పరిసమా

ప్తిని బొందుచున్నది. ఆత్మజ్ఞానముతో నాత్మవిశ్వాసమును కర్మయోగాధికారమును గలుగుచున్నవి. ఆత్మజ్ఞానములేని కర్మయోగము విషాదావస్థయందు క్లైబ్యమును బొందుచు కార్యసిద్ధికి నిరుపయోగమగుచున్నది. ఆంగ్లవిద్యాసంస్కారులైనను, పూర్వ సంప్రదాయసంస్కారులైనను కతిపయపండితులు నాయకత్వమును వహించెడి యుగమంతరించుచున్నది. వర్తమానప్రజాస్వామ్యత్వ యుగమునందు సామాన్యప్రజావికాసము సర్వసామాన్యమైన యోగక్షేమమునకు మూలమై యున్నది. ముదుసలులు యువకులు, సంపన్నులు సామాన్యులు, విద్యావంతులు విద్యావిహీనులు, స్త్రీలు పురుషులు జాతిమతకులభేదములను విడిచి దేశసౌభాగ్యమున కాత్మార్పణమును జేయుచున్న విధము శుభసూచకమైన బ్రహ్మానందమును గలుగజేయుచున్నది. ఈ మహాసంచలనమునకాంధ్రోద్యమము బీజమైనను కాంగ్రెసు నిర్మించిన ఆంధ్రరాష్ట్రజాతీయోపసంఘము సాధనభూతమైన విధమును దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు మొదలగు నాయకులు ప్రారంభించిన భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణోద్యమమును సఫలము చేయవలసినతరుణ మాసన్నమైనది. దేశక్షేమపరాయణులందరును నీతరుణమును నప్రమత్తులై సార్థకముచేయుట పరమధర్మము.

* * * *

## ఫెడరేషను రాజ్యాంగము

హిందూస్థానమునకు ఫెడరేషను రాజ్యాంగమును బ్రిటీషుప్రభుత్వ మంగీకరించినటులు ప్రభుత్వప్రకటనము విస్పష్టము చేయుచున్నది. ఫెడరలు రాజ్యాంగమునందు సంస్థానములు చేరినను చేరకపోయినను బ్రిటీషు భాగములు చేరవలయునని ప్రభుత్వప్రకటనము తెలుపుచున్నది. లోథియనుకమిటి ౧౦౦ కి ౬౦ వంతునను, వోటరులసంఖ్యను నిర్ణయించినది. ఫెడరలు రాజ్యాంగవిధానము, సంకుచితమైనను విశాలమైనను, సార్థకము లగుటకు భాషాప్రయుక్తరాష్ట్రములు శరణ్యములని ప్రాజ్ఞులు భేదాభిప్రాయము లేక యంగీకరించుచున్నారు. ఉత్కళరాష్ట్రనిర్మాణము విషయమై ప్రయత్నములు జరుగుచున్నవి. ఉత్కళరాష్ట్రమునకు సరిహద్దులను నిర్ణయించుటయం దాంధ్రరాష్ట్రమునకు జరిగిన యన్యాయమును శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారి యధ్యక్షతక్రిందను జులై 3-వ తేదిని బ్రహ్మపురమునందు గూడిన సభావ్యవహారములు విస్పష్టము చేయుచున్నవి. ఆంధ్రులను సంప్రతించకుండ ఆంధ్రు లంగీకరించినటులూహించుట యసంగతము. రామదాసు పంతులుగారును, కోకా అప్పారావు నాయుడు గారును, సభాప్రతిపాదనములును సూచించినటులు భాషాప్రయుక్తరాష్ట్ర విభాగ సమస్యనంతయును సమగ్రముగను వెంటనే నిర్ణయించుట దేశక్షేమమునకును, ఫెడరేషను

రాజ్యాంగవిధానమునకును నత్యంతావశ్యకము.

జులైమాసముమధ్యను ఏలూరుపురమునందు గూడనున్న ప్రత్యేకాంధ్రమహాసభయును నీవిషయముపట్లను శ్రద్ధను వహించుట ప్రజాక్షేమమునకు పరమావసరము. భాషాప్రయుక్తరాష్ట్రముల యాధారముగల ప్రజాస్వామ్యము మహాఖండమైన హిందూస్థానమునందు ఫెడరేషను రాజ్యాంగవిధానమునకు హృదయముగ నున్నది. నవీనరాజ్యాంగవిధానముతోనే భాషాప్రయుక్తరాష్ట్ర విభాగముల నాచరణమునందు బెట్టుట కాంధ్రులు స్థలాభిమానమును, కులాభిమానమును, పక్షాభిమానమును, మతాభిమానమును విడిచి పాటుపడి చిరకాలముక్రితమారంభమైన యాంధ్రోద్యమమును సార్థకముచేసి ప్రజలశక్తివిశ్వాసములను సంవర్ధింతురుగాత!

* * * , *

ప్రజాశక్తివికాసములు

ప్రపంచావృతమైన విషాదావస్థ స్వావలంబనస్థితిలేని ఆంధ్రదేశమును సహజముగ నావరించి మహాసంక్షోభమును గలుగ జేయుచున్నది. వ్యాపారపరిశ్రమలులేని దేశమునందీసంక్షోభము పరమానర్థములకు మూలమగుచున్నది. ప్రధానమైన వ్యవసాయపరిశ్రమము సంకటముల పాలయినది. ధాన్యములధరలు పడిపోయినవి. ఈయేడు మృగశిర ఆరుద్ర కార్తెలు గతించి పునర్వసుప్రవేశించినను ఇంతవరకును వర్షపాతము గలుగలేదు. దేశమునందంతటను నిర్వ్యాపారత్వము, నిర్ధనత్వము, నిర్బంధత్వము ప్రబలుచున్నను నాంధ్రలోకము సహజోత్సాహముతో వివిధరంగములందును స్వధర్మనిర్వహణమును జేయుట ప్రశంసలకు పాత్రమగుచున్నది.

గౌతమీపుష్కరము

శుభగ్రహమైన బృహస్పతి సింహరాశిగతుడగుటచే గోదావరీపుష్కరయోగ మాంధ్రదేశమునకు సంప్రాప్తమైనది. ఈమహాపర్వసమయమునందు పవిత్రమైన గౌతమీతీరమునందు ప్రాచీనమైన ఆంధ్రదేశ హృదయ మైనను, రాజరాజనగరమునం దాంధ్రులు స్వదేశ, స్వభాషా, స్వధర్మదీక్షాపరాయణులై ఆత్మయోగారూఢులై మానవధర్మాభ్యుదయమునకు దోడ్పడుటకు భగవంతు డనుగ్రహించుగాత!

అనంతమైన విశ్వమునం దాత్మసామ్రాజ్యము నధిష్ఠించుట కవకాశములు సకలజనులకును గలవు. లబ్ధావకాశములను శ్రద్ధాపరాయణులై యారాధించుట యోగలక్షణము. యోగప్రభావము శ్రద్ధామయముగాని విషయమహత్త్వముగాదు. రాజమహేంద్రవరమునందు సమావేశమైన జననివహములు, చేయబడుచున్న తీర్థవిధులు, వస్తుప్రదర్శనములు, గానసభలు, కళాప్రదర్శనములు, శాస్త్రపరిషత్తులు, వైద్యసభలు సమ్మేళనములు ప్రదర్శనములు, సంకీర్తన

ములు, దానములు, ధర్మములు, సంబోధనలు, శ్రద్ధాపరాయణులైన మానవు లాత్మయోగారూఢులై స్వధర్మనిర్వహణమును చేయగల విధమును విశదము చేయుచున్నవి. అనంతమయిన ప్రవృత్తియందు హెచ్చుతగ్గులు పదవులందు గలదుగాని సంభావనమునందు లేదు. ప్రపంచమునందు మానవధర్మమును ప్రతిష్ఠించుటకు ప్రపంచము మహాదుఃఖవేదన ననుభవించుచున్నది. పుష్కరపర్వసమయమునందు త్యాగపరాయణులైన యాంధ్రులును దేశావృతమైన దుఃఖనివృత్తికి స్వకర్మారాధన నిరతులై పాటుపడగలవిధమును, గీతాముఖమునను చేయబడిన సంబోధన సర్వత్ర ప్రతిధ్వనించుచున్నది. ప్రజ లాసంబోధనమును పాలించి స్వధర్మనిర్వహణమునకు బూని చరితార్థు లగుదురు గాత!

శ్లో. స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి త చ్ఛృణు.

శ్లో. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ.

భగవద్గీత.

---

I rinted and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra PatrikaPress, No.7, ThambuChettySt., Madras
Edtor: G. Subbaramayya.


విషయసూచిక

## చిత్రములు

శకుంతల





"..........................

ఆసీద్వివృత్తవదనాచ విమోచయన్తీ
శాఖాసు వల్కలమసక్తమపి ద్రుమాణామ్."

—శాకున్తలమ్.

చిత్రకారుడు : శ్రీ యస్. వి. యస్. రామారావుగారు, ఆంధ్రజాతీయకళాశాల, మచిలీపట్టణము.